# M. HEMALATHA KATHALU

(anthology of short stories by **M. Hemalatha**)

*ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2000*



***Published by :***
*PRANAV PUBLICATIONS*
*Flat No. 202, Gayatri Apartments,*
*Road No 1, Banjara Hills,*
*Hyderabad - 500 034.*

*కవర్ డిజైన్ : 'నర్సిం' (వెన్నె)*

*ప్రతులకు :*

★ **విశాలాంధ్ర బుక్ హౌస్,** బ్యాంకుస్ట్రీట్, హైదరాబాద్, అన్ని బ్రాంచీలు.

★ **నవోదయ బుక్ హౌస్,** ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, బడే చౌడీ, హైదరాబాద్.

★ *ప్రణవ్ పబ్లికేషన్స్, # 202 గాయత్రీ అపార్ట్‌మెంట్స్, బంజారాహిల్స్, హైదరాబాద్ - 34.*

*కంపోజింగ్ :*

★ *కీర్తనా గ్రాఫిక్స్, 1-8-538, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20. ఫోన్ : 7605176*

*ప్రింటింగ్ :*

★ *గ్రాఫిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్. ఫోన్ : 7642196*

***వెల : రూ. 60/-***

---

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురణ.

తల్లిగ నన్ను గర్వపడేలా చేసిన
నా చిరంజీవులు -
డా. ఎమ్. రమణి,
డా. ఎమ్. ఉమ,
ఎమ్. అనిల్ రమేశ్ లకు

- ప్రేమతో .......

అమ్మ

# ఇదీ వరస ....



## కథలు



★

# ముందుగా మూడు మాటలు....

దాదాపు ముప్పై సంవత్సరాల నాడు ప్రారంభమైన నా రచనా వ్యాసంగ వాహిని మొదటి దశకంలో అతి వేగంగా సాగి, ఆపైన కొంచం మందకొడిగా ప్రవహించి రెండవ దశాబ్ది అంతానికి పూర్తిగా ఆగిపోయింది.

1971 నుండి 1981 వరకు గృహిణిగా, తల్లిగా, రచయిత్రిగా మూడు పాత్రలు పోషించిన నేను, తర్వాత దాదాపు పదేళ్లపాటు పూర్తిగా తల్లి బాధ్యతలకే పరిమితమయ్యాను. పిల్లల చదువులకి, వారి వివాహాలకి, వారి సంతానానికి ప్రాధాన్యత ఇచ్చి నా రచనా వ్యాసంగాన్ని పక్కకు పెట్టాను. పిల్లలు ముగ్గురూ విద్యాధికులే. అందులో అమ్మాయిలు ఇద్దరు డాక్టర్లు అబ్బాయి అసిస్టెంటు ప్రొఫెసర్. ఆ దశాబ్ది కాలంలో పుస్తకాలు చదవడంలోనే ఆనందాన్ని, తృప్తిని పొందిన నేను కొంత వెసలుబాటు రాగానే మళ్ళీ రచనా వ్యాసంగాన్ని చేబట్టాను. అలా వచ్చిన రచనలే 1993 తర్వాత వచ్చినవి.

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు సాహిత్యంలో ఎమ్.ఏ. చేసిన నాకు స్వతహాగా తెలుగు అభిమాన భాష నిజం చెప్పాలంటే - పుస్తకాలు చదవడం ఈనాటికీ నాకు అతి ఇష్టమయిన వ్యాపకం. కానీ నాలోని రచయిత్రిని మొట్టమొదట గుర్తించిన వ్యక్తి మా శ్రీవారు వివాహమయిన కొత్తల్లో ఆయనకు నేను రాసిన ఉత్తరాలలోని ఓ ఉత్తరాన్ని కొంత భాగం ఫేర్ చేసి, శీర్షిక పెట్టి ఆంధ్రపత్రిక, సచిత్రవారపత్రికకు పంపారు ఆ కథ 9-10-1957 సంచికలో "సుశిధ్యాస" అన్న పేరుతో ప్రచురింపబడింది. అచ్చయిన నా మొదటి కథ అదే ! నా కథ పడిన ఆంధ్రపత్రిక తిప్పుతూ ఆశ్చర్యపోయాను, "ఏవిటి ! నేను మావారికి రాసిన ఉత్తరం ఆంధ్రపత్రిక కార్యాలయానికి ఎలా చేరిందా ?" అని. మా వారు చెప్పగా తర్వాత తెలిసింది. ఆ కథకి అప్పట్లో నేను అందుకున్న పారితోషికం పదిహేను రూపాయలు. కానీ పొందిన ఆనందం అపారం. (కథ ప్రచురణ అయిన తేదీ డైరీలో వుండబట్టి దొరికింది. కాని కథ అలభ్యం.)

వృత్తిరీత్యా ఇంజనీరయిన మావారి ఉద్యోగ రీత్యా మేము నాగార్జున సాగర్ ప్రాజెక్ట్ హిల్ కాలనీలో ఏడేండ్లు గడిపాము, 1968 నుండి 1975 వరకు. నా రచనలు విరివిగా అప్పడే ప్రచురింపబడ్డాయి.

ఆనాటి సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు, శ్రీ విద్వాన్ విశ్వంగారు, శ్రీ వీరాజీగారు, శ్రీ చక్రపాణిగారు, శ్రీ రామవరపు వేణుగోపాలరావుగారు, శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు, శ్రీ కవులూరిగారు, శ్రీ బాసాని సుదర్శనరెడ్డిగారు, ఇలా ఎందరో సంపాదకులు నా కథలను వారి పత్రికల్లో ప్రచురించి నన్ను రచయిత్రిగా నిలబెట్టారు.

నాగార్జున సాగర్ లేడీస్ క్లబ్బు వారి కోసరమని నేను ప్రత్యేకంగా రాసిన హాస్య ప్రధాన నాటికలు అప్పట్లో ప్రముఖ వారపత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఓ హాస్యనాటిక (అయిందా పెళ్ళి ...?) ఫన్ డాక్టర్ స్వర్గీయ శ్రీ వి. చంద్రశేఖరంగారు తన సంపాదకత్వంలో వెలువడే "రంగజ్యోతి" మాసపత్రికలో ప్రచురించారు. "నా నాటికను పక్కన పెట్టి మీ నాటికను ప్రచురిస్తున్నానమ్మా - సంభాషణా - చతురత - నాటకాన్ని నడిపించిన తీరు నాకు బాగా నచ్చాయి" అంటూ నాకు లేఖ రాశారు శ్రీ చంద్రశేఖరం గారు. వారి సహృదయతకి నా జోహార్లు.

మానవ సంబంధాలలో క్రమంగా కల్గుతున్న పెనుమార్పులు, తరిగిపోతున్న మానవీయ విలువలు, చూచి చలించి కొన్ని కథలు రాసాను. వార్తాపత్రికల్లో ప్రచురింపబడే నిజ జీవితగాధలకు సృజనాత్మకతను జోడించి ఒకటి, రెండు కథలు రాసాను. వైద్య విజ్ఞానం, మనో విజ్ఞానం, పిల్లల మనస్తత్వాలు, ఇతివృత్తాలుగా స్వీకరించి కొన్ని కథలల్లాను. "అమ్మా ! ఎప్పుడూ సీరియస్ టాపిక్సేనా ? లైటర్ వీన్‌లో రాయకూడదా ...?" అన్న నా పిల్లల కోసరం కొన్ని కథలు రాసాను.

నా రచనలకి ప్రధమ పాఠకులు, విమర్శకులు అయిన మావారు శ్రీ ఎమ్.సి. ఆంజనేయులు గారు నా రచనా వ్యాసంగానికి అందించే సహకార ప్రోత్సాహాలు, కల్పించే అనుకూల వాతావరణం ఎనలేనివి. దాదాపు అరవై వరకు ప్రచురింపబడిన నా కథలు అలా ఫైళ్ళలో వుండిపోవడం చూచి బాధపడిన మావారి ప్రయత్నా ఫలితమే పుస్తకరూపంగా వెలుగు చూస్తున్న నా ఈ మొదటి కథా సంపుటం.

నా రచనలను గురించిన పాఠకుల, రచయితల స్పందన కూడ నాకు కొంతవరకు చేరింది.

యువలో ప్రచురింపబడిన "పూర్వజ" అనే నా వైజ్ఞానిక కథా విషయమై శ్రీ వేదగిరి రాంబాబు గారు నన్ను ప్రశంసిస్తూ ఓమారు ఫోన్ చేసారు, తానాకథను విద్యార్థిగా వున్నపుడు చదివి స్పందించానంటూ. అలాగే శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి గారు నా నవలలు - 'వేణుగానంలో మనోరవళి' - 'ఇద్దరమ్మాయిల కథ' (ఒకే సంపుటిలో అరుణా పబ్లిషింగ్ హౌస్ వారు ప్రచురించిన రెండు నవలలు) చదివి "మీ శైలి, కథా కథనం, నవలా నిర్మాణం చాలా బాగున్నాయి. మీ కలంలో పఠితను చివరి వరకు చదివించే శక్తి వుందం"టూ లేఖ వ్రాసారు. ఏదో స్తోత్కర్ష అని కాదుకానీ కొంతలో కొంత ప్రయోజనమున్న, విజ్ఞుల అభిమానాన్ని చూరగొన్న రచనలు చేసానని సవినయంగా మనవి చేస్తున్నాను.

మంచి కథలు, నవలలు గుర్తించి, ఒక్క ఫోన్‌కాలో, కార్డుమీద ఒక లైనో 'బాగుందంటూ' రాస్తే అది ఆ రచయితలకు వేయి ఏనుగుల బలం .... ఏమంటారు ..... ?

నూతనత్వాన్ని, వైవిధ్యమున్న ఇతివృత్తాన్ని ఎన్నుకొని రచనలు చేస్తే తప్పక ప్రచురించి ప్రోత్సహిస్తారు సంపాదకులు అని చెప్పేందుకు ఇండియా-టుడే కన్సల్టింగ్ ఎడిటర్ శ్రీ ఎం. రాజేంద్రగారు విపుల సంపాదకులు శ్రీ చలసాని ప్రసాదరావుగారు, 'రచన' శ్రీ శాయిగారు నిదర్శనం. వారు ప్రచురించే కథల్లో ఎంతో కొంత వస్తు ప్రాధాన్యత, ప్రయోజనం వుండడం గమనార్హం.

ఈ కథా సంపుటం ప్రచురణ తలపెట్టినప్పడు "ముందుమాట" ఎవరి దగ్గర రాయించాలి అని అనుకోగానే ఇరువురు సోదరీమణులు నా మదిలో మెదిలారు. వారు-శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు, శ్రీమతి వి. గాయత్రి రామారావు.

పరిచయం అవసరం లేని ప్రముఖ రచయిత్రి, సాహితీవేత్త, సంపాదకులు, కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యురాలు, అన్నింటినీ మించి అత్యంత మృదు స్వభావి, స్నేహశీలి శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు.

నా కళాశాల సహాధ్యాయిని, ఆప్తురాలు, రచయిత్రి, గాయని, విద్వత్ కుటుంబానికి చెందిన శ్రీమతి గాయత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చీఫ్

సెక్రటరీగా పనిచేసి ఉద్యోగ విరమణ చేసిన శ్రీ వి.పి. రామారావు గారి సతీమణి. విఖ్యాత భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్త, విమర్శకులు, సంపాదకులు స్వర్గీయ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారి కుమార్తె.

అడిగిందే తడవుగా తమ కార్యభారాన్ని కూడ లెక్క చేయకుండా ఎంతో అభిమానంతో నా కథలన్నీ ఆసాంతం చదివి తమ 'అభినందన', 'స్నేహ మధురిమ' రాసి ఇచ్చిన ఈ సోదరీమణులకు నా కృతజ్ఞతా అభివందన చందనాలు.

- ఈ కథలను ముందుగా పత్రికల్లో ప్రచురించిన సంపాదకులకు, సంపాదక వర్గానికి,
- పత్రికల్లో వచ్చిన కథలకు చక్కని చిత్రాలు గీసిన చిత్రకారులకు,
- ఆకట్టుకునే అందమైన కవర్ డిజైను చేసిన ప్రముఖ చిత్రకారులు శ్రీ 'నర్సిం' గార్కి, ఇండియా టుడే కన్సల్టింగ్ ఎడిటర్ శ్రీ ఎం. రాజేంద్ర గార్కి,
- అందంగా కంపోజింగ్ చేసిన కీర్తనా గ్రాఫిక్స్ అధినేత శ్రీ యు. రఘురాం గార్కి మరియు వారి సిబ్బందికి,
- ముద్రణలో ఎంతో శ్రద్ధ తీసుకొని అనుకున్న సమయానికి పుస్తకాన్ని అందించిన గ్రాఫిక్ పబ్లికేషన్స్ అధినేత శ్రీ కె. రామకృష్ణ గార్కి మరియు వారి సిబ్బందికి,
- ఈ గ్రంథ ముద్రణకు కొంత ఆర్థిక సహకారం అందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి ...... అందరికీ పేరు పేరున నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

హైదరాబాదు,
ఫిబ్రవరి, ౨౦౦౦.

**ఎమ్. హేమలత**

# అభినందన

శ్రీమతి హేమలత గారు గత మూడు దశాబ్దాలుగా ఎక్కువ కథలు రాస్తున్నారు. ఇది ఈమె తొలి కథా సంపుటం. నేను ఇది వరకు కొన్ని కథలు చదివాను. హేమలత గారు ముందుగా నాకు 'సఖ్య సాహితి – తెలుగు రచయిత్రుల సమాఖ్య' ద్వారా సాహితీ సమావేశాల్లో పరిచయమయ్యారు. మా ఆడబడుచు సుజాతా మూర్తి ద్వారా మరింత సన్నిహితులయ్యారు.

ఈమె కథలు ఈమెకున్న విస్తృతమైన లోక జ్ఞానాన్ని వెల్లడిస్తున్నాయి. కుటుంబాల్లోని వ్యక్తుల మధ్య సంబంధాలు, పిల్లల పెంపకం, పిల్లల మనస్తత్వాలు, పాశ్చాత్య ప్రభావాలూ మొదలైన వర్తమాన విషయాల గురించి ఆధునిక దృక్పథంతో, వివిధ సమస్యల పట్ల అవగాహనతో, ఆదర్శ భావాలతో రాసిన కథలు ఈమెవి.

ఈసంపుటంలో ఉన్న *28* కథల్లోనూ, *13* కథలు *'70*లలో రాసినవి, *3* కథలు *' 80*లలోనూ *12* కథలు *'90*లలోనూ రాసినవి. *1971*తో మొదలు పెట్టి *1999* వరకూ ఆంధ్ర సచిత్ర వార పత్రిక మొదలుకుని ఇండియా టుడే వరకూ వివిధ పత్రికలలో వచ్చిన కథలు ఇవి.

సంప్రదాయాలకూ ఆధునికతకీ సమన్వయం సాధించిన రచయిత్రి హేమలత గారు. పూజా పునస్కారాలకు ప్రాధాన్యాన్నిస్తూనే, కొన్ని మూఢాచారాలను నిరసిస్తారు. కొన్ని సంప్రదాయాలను గౌరవిస్తూనే పాశ్చాత్య సంస్కృతిని గుడ్డిగా అనుకరించడాన్ని వ్యతిరేకిస్తారు. తమ అభిప్రాయాలను పాత్రల సంభాషణల ద్వారా, ప్రవర్తన ద్వారా ప్రకటించారు. ఈనాడు కుటుంబాల్లోనూ, సమాజంలోనూ ఎదురవుతున్న అనేక సమస్యలకు స్పష్టమైన పరిష్కారాలను చాలావరకు సూచించారు కథల ముగింపులో.

ఒక వైపు భారతీయ సంస్కృతికి విదేశీయులు ఆకర్షితులవుతూంటే, మరో వైపు మనవాళ్ళు పాశ్చాత్య నాగరికతని అనుకరించడం ఆధునికతకి చిహ్నం అనుకుంటున్నారని చెప్పడానికి రాసిన కథ 'సారా విలియమ్స్'– తెలుగు వారివేష భాషలకూ, ఆహార వ్యవహారాలకు ఆకర్షితురాలైన ఒక అమెరికన్ అమ్మాయి మద్రాసులోని ఒక తెలుగు కుటుంబానికి అతిథిగా వచ్చి ఆ కుటుంబ సభ్యుల్ని ఎలా ప్రభావితం చేస్తుందో, వారికి ఎలా ఆత్మీయురాలవుతుందో చెప్పేకథ.

దాదాపు ఇటువంటిదే 'పట్టులంగా బుట్ట బొమ్మ' - అమెరికా వెళ్ళాక మన వాళ్ళకి కొందరికి మనవేష భాషల మీదా,ఆచార వ్యవహారాల మీదా మోజు పెరుగుతుంది; ఇక్కడి వాళ్ళు మాత్రం పాశ్చాత్యుల్ని అనుకరిస్తూ ఉంటారు! ఇంకొక కథ – 'మా స్వర్గధామమిదే' -అమెరికాలో లభ్యమయ్యే సుఖాలను ఇక్కడ మన పల్లెటూళ్ళలో కూడా సృష్టించు కోవచ్చుననీ, జన్మభూమిని విడిచి వెళ్ళక్కర్లేదనీ చెప్పే కథ. అమెరికాకి సంబంధించినదే, ఒక కఠోర 'సత్యా'న్ని వెల్లడించే కథ ' ఆ + అమ్మ= ఆయమ్మ' - అమెరికాలో ఉన్న కన్న కొడుకు ఛేత నిర్లక్ష్యం చేయబడిన తల్లి అక్కడే మరో ఇంట్లో 'ఆయా'గా మన్నన లందు కోవడం!

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం కూడా ఎక్కువగా విదేశాల నుంచి వచ్చినదే. అందులో కృత్రిమ గర్భధారణ పద్ధతి ఒకటి. 'టెస్ట్ ట్యూబ్ బేబీసూ', సర్రోగేట్ మదర్సూ'– వైద్యరంగంలో

వచ్చిన సాంకేతిక వికాస ఫలితమే. ఒకరి మనస్సుకి ఆనందం కలిగించేదే మరొకరి మనస్సుని చిత్రహింసకి గురి చేయడాన్ని చిత్రించిన కథ 'కన్నతల్లి'.

హేమలత గారు పిల్లల మనస్తత్వాలనూ, పిల్లల పెంపకాన్నీ చిత్రిస్తూ చాలా కథలు రాశారు. వాటిలో – 'పసి హృదయం', 'మాలిన్యం అంటని మనస్సు', 'పూర్వజ', 'విలువ కట్టలేనిది', 'నాదే అదృష్టం' మొదలైనవి ఉన్నాయి. దంపతుల అన్యోన్యతకి పిల్లలు ఎలా ప్రతిబంధకమవుతారో సరదాగా చిత్రించిన కథ ' స్వీట్ హోమ్‌లో స్పీడ్ బ్రేకర్స్'. పిల్లల పెంపకానికి సంబంధించిన మరో కథ 'రానీ – ఆ రాస్కెల్'.

పిల్లలు వికలాంగులుగా పుడితే, విచారిస్తూ కూర్చోకుండా ఉన్నంతలో వారి భవిష్యత్తుని తీర్చి దిద్దాలని చెప్పే కథ 'భవిష్యత్తుకో బంగారు బాట'.

యువతీ యువకుల మనస్తత్వాలనీ, నేటి యువతరంలో వస్తున్న మార్పుల్నీ వస్తువులుగా తీసుకున్న కథల్లో ఒకటి – 'తమ్ముడూ తగుల బెట్టకు' (సమ్మెలూ, బస్సులూ, రైళ్ళూ తగల బెట్టడాలూ); మరోటి 'న్యూవేవ్' (హిప్పీ కల్చర్‌కి ఆకర్షితులవడం గురించి రాసిన కథ).

అత్తా కోడళ్ళ సంబంధాలను ఆదర్శప్రాయంగా ఎలా మలచుకోవచ్చునో తెలుపుతూ వైవిధ్యంతో రాసిన కథలు – 'డాటర్ –ఇన్‌లా', 'ఇచటనే వుండిపోనా', 'ప్రతిబింబం'.

మూఢ విశ్వాసాలతో స్త్రీలను అవమానపరిచే ఆచారాలనూ అలవాట్లనూ విమర్శిస్తూ రాసిన కథలు – 'పునిస్త్రీ', 'గొడ్రాలు'.

ఈనాడు పెళ్ళి చేసుకోకుండానే 'తల్లి' అవాలనుకుంటున్నారు కొందరు యువతులు ధైర్యంగా. సంప్రదాయం పేరుతో ఇంకా తమ సంకుచితత్వాన్ని వదలని పురుషులకు గుణపాఠం- 'ఒంటరి తల్లి' కథ.

తీరికా, ఓపికా, సదుపాయాలూ ఉన్న గృహిణులు పేకాటా, సౌందర్య పోషణా మొదలైనవాటితో కాలం వృధా చెయ్యకుండా, సంఘసేవ చెయ్యాలని ఉద్బోధించే కథ – 'హాయ్ మమ్మీ' !

ఏ సమస్యకైనా 'చావు' పరిష్కారం కాదు అంటూ తెలిపే ఆర్ధ్ర పూరితమైన కథలో మానసిక బలహీనతకి గురైన భర్తకి ధైర్యం చెబుతుంది భార్య – ' ఆక్షణం'లో.

సంసార జీవితం పట్లా, మన సంస్కృతి పట్లా తమకున్నా అభిప్రాయాలనూ అభిరుచులనూ ఈ కథల్లో ప్రదర్శించారు రచయిత్రి. అన్నీ స్పష్టంగా వివరంగా చెప్పాలనే ఆత్రుత ఎక్కువగా కనిపిస్తుంది ఈమె కథా రచనలో. కొన్ని కథల్లో రచయిత్రి చెప్పదలచుకున్న దేమిటో ముందుగానే పాఠకులు ఊహించుకో గలిగినా, చివరి వరకు చదివించే గుణం ఉంది ఈమె కథనానికి.

ఈ కథలన్నిటినీ ఒక సంపుటంగా తీసుకు రావడం వల్ల హేమలత గారి ప్రతిభ మరింతగా వెలుగులోకి వస్తుందనడంలో సందేహం లేదు. ఇంకా ఎంతో మారవలసిన మన సమాజానికి హేమలత గారి కథలు స్ఫూర్తి దాయకంగా ఉంటాయి. ఈమెకి నా అభినందనలు.

హైదరాబాద్, **అబ్బూరి ఛాయాదేవి**

జనవరి, 2000.

# స్నేహ మధురిమ

"నా కథా సంపుటికి నీవు ముందుమాట రాయాలి గాయత్రీ" అంది హేమ.

"నా సహాధ్యాయినివీ, నా ప్రాణ స్నేహితురాలివీ, నీ కథల గురించి నేను వ్రాస్తే బాగుంటుందా?" అన్నాను నేను.

"స్నేహితురాలి కథలనుకుని రాయకు. ఒక రచయిత్రి కథలపై నిర్మొహమాటంగా నీ అభిప్రాయం రాయి - " అన్నది హేమ.

అది ఫోర్త్ ఆనర్స్ క్లాసు. 1955-'56 సంవత్సరం. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజి తెలుగు డిపార్టుమెంటు. పి.ఎస్.ఆర్. అప్పారావుగారు క్లాసు తీసుకుంటున్నారు. కొంచం పొట్టిగా, బొద్దుగా, తెల్లగా, పెద్ద జడతో ఓ క్రొత్తమ్మాయి వచ్చి నా ప్రక్కన కూచుంది. మాటలు కలపాలన్న ఆతురత ఆపుకోలేక - మెల్లిగా నోట్ బుక్కులో "మీ పేరు బంగారమ్మా ?" అని వ్రాసి తనవైపు నెట్టాను. "కాదు. హేమలత..." తను వ్రాసింది. "లతా!" అని వ్రాసాను. "మీరు హేమ అని పిలవండి చాలు" అని మళ్ళీ వ్రాసింది. 43 సంవత్సరాల ఆనాటి మా స్నేహం ఇప్పటికీ హృదయాహ్లాదకరంగా పరిమళిస్తూనే వుంది.

1956-'57లలో మేము తెలుగు ఏమ్.ఏ. చదివే రోజుల్లో ట్రిప్లికేన్ రామువిలాస్ హోటల్ సర్వర్ - గజం, అరగజం పొడుగు కాఫీల గురించీ, "ఎడమిల్లే" అంటూ మెరుపు మెరిసిపోయే బస్సు కండక్టరు భరతనాట్య భంగిమల గురించీ, అంతర్ కళాశాల వక్తృత్వపు పోటీలలో మాట్లాడవలసిన విషయం మరచి, భయంతో, గుర్తు వచ్చిన అప్రస్తుతపు విషయాలను మాట్లాడిన మిత్రురాలి ప్రసంగం గురించీ, సభా పిరికితనం వలన పది నిమిషాల కొక వాక్యం మాట్లాడుతూ న్యాయ నిర్ణేత గిడుగు సీతాపతిగారి వేళ్ళు లెక్కపెట్టిన మరొక స్నేహితురాలి ప్రసంగం గురించీ, విషయమూ, భాషా అర్థం కాకున్నా తోడు వచ్చిన తమిళ నెచ్చెలి "పాపం బాగా మాట్లాడింది కానీ, ప్రైజు రాలేదు" అని సానుభూతి చూపిన వైనం గురించీ, వర్ణిస్తూ, చిన్న చిన్న గల్పికలు వ్రాసేది హేమలత. అవి చదివి కడుపుబ్బ నవ్వుకునే వాళ్ళం మేము.

సుమారు ముప్పై సంవత్సరాలుగా హేమలత, కథారచన, నవలా రచనా, నాటికా రచన (నాగార్జున సాగర్‌లో పనిచేసిన ఉద్యోగుల కుటుంబాలకు అక్కడ ప్రదర్శించిన ఆమె నాటికలు గుర్తుండి వుంటాయి.) చేపట్టి వ్రాస్తూంది. కానీ, ఇదే ఆమె తొలి కథా సంపుటం.

కావ్యం కాంత వలె కర్తవ్య బోధ చెయ్యాలని మనవారి సిద్ధాంతం. 'కథ' అనే ప్రక్రియ ఇంకా చల్లగా కర్తవ్య బోధ చెయ్యాలి. కాలంతోబాటు ఎప్పటికప్పుడు సమాజం మారుతూనే వుంటుంది. సాంఘిక సమస్యలూ - క్రొత్తవి - పుట్టుకొస్తూనే ఉంటాయి. ఇరవై శతాబ్దపు ఉత్తరార్థంలోని సాంఘిక

సమస్యలూ, వాటి పరిష్కారాలు కూడా హేమలత కథలలో ద్యోతకమవుతున్నాయి. తాను సూచిస్తున్నట్లు కాక కథ ద్వారా అంతర్లీనంగా పరిష్కారం అందచేయడం ఈ రచయిత్రి ప్రత్యేకత.

పశ్చిమ దేశ సంబంధాల వలన విదేశీయుల మాటా, బాటా వస్త్రధారణే నాగరికతా లక్షణాలన్న అభిప్రాయంతో మన అలవాట్లూ, కట్టూ-బొట్టూ ఈసడించుకునే వారి వెన్నుమీద చిరు చరుపులు "సారా విలియమ్స్", "పెట్టులంగా బుట్టబొమ్మ", "మా స్వర్గధామమిదే", అనే కథలు. వయస్సులో విలాస జీవితాలతో కాలక్షేపం చేసేసి, సంఘసేవ తలనొప్పి అనుకొనే ఆమె విదేశాలలో వున్న పిల్లల అలక్ష్యం వల్ల వృద్ధాశ్రమం పాలైన ఓ వృద్ధ స్త్రీ కథ 'హాయ్ మమ్మీ!'

బీదపిల్ల మురికి బట్టలను చూసి తన పిల్లలను వారితో కలవనీయని ఓ ఆధునిక ఇల్లాలికి స్విమ్మింగ్ పూల్‌లో పడిన తన కొడుకుని రక్షించిన పాప నిర్మల హృదయం గోచరమవుతుంది, 'మాలిన్యం అంటని మనస్సు' కథలో. ఆ పాప మురికితనము మరచిపోయి తన బిడ్డతోపాటూ ఆ బాలికను హృదయానికి హత్తుకున్న సన్నివేశం చదువుతుంటే మన కళ్ళు ఆర్ద్రమైపోతాయి.

పెద్ద భవనమూ, కారూ, కార్పెట్లూ, ఆయాలూ గల కలవారి సహాధ్యాయిని ఎంత అదృష్టవంతురాలు అనుకుంటుంది అనుపమ అనే పేద బాలిక. కానీ జ్వరంతో మంచం పట్టి ఆయా ఈసడింపులతో నీరసపడిపోయి, ఎటో వెళ్ళి ఎంతకూరాని తల్లికోసం ఒంటరిగా ఎదురుచూస్తున్న ఆ పాపతో తనను పోల్చుకొని, తనకు జ్వరం వచ్చినప్పుడు తన తల్లితండ్రులందించిన సేవలను, ఆప్యాయత అనురాగాలను గుర్తుకు తెచ్చుకొని 'నాదే అదృష్టం' అనుకుంటుంది అనుపమ, అదే పేరుకల కథలో.

ఆప్యాయతా అనురాగాలకు వెలకట్టలేమనీ, బదులుగా డబ్బు ఇవ్వబోవడము అహంకారమే అవుతుందని తేల్చి చెప్పే కథ, 'విలువ కట్టలేనిది'. కలవారికి, లేనివారికి బంధుత్వాలలో, స్నేహ బంధాలలో ఉండవలసింది ఆప్యాయతే కానీ డబ్బు, హోదా కాదని హృద్యంగా చూపిస్తుంది రచయిత్రి ఈ తరహా కథల్లో.

హేమలత కథల్లో పెద్ద పెద్ద దేశ సమస్యలూ, విప్లవాలూ, వాటి పరిష్కారాలు, సంఘ సంస్కరణలూ కనిపించవు. డిటెక్టివ్ కథలలో లాగ హత్యలుకాని, శృంగార వర్ణనలు కాని ఉండవు. ఈమె కథలలో భార్యా భర్తలు పరస్పర అనురాగ బద్ధులు, ఏ లోటూ లేని చల్లనీ చక్కనీ సంసారం; రత్నాలవంటి బుద్ధిమంతులైన బిడ్డలు - ఇక కథ ఏముంటుంది - అనుకుంటాం. కానీ, మనందరి దృష్టికి రాని, మనం చేస్తున్న చిన్న చిన్న 'పొరపాట్ల'ను మరొక కోణం నుండి ఆమె చూపిస్తుంది, ఆమె కథల్లో.

పునిస్త్రీగా చనిపోవడం అదృష్టంగా భావించే మన సమాజంలో మంచం పట్టిన రోగిష్టి భర్త మరణం తర్వాతే తనకు మరణం ప్రసాదించమని భగవంతుడిని ప్రార్థిస్తుంది 'పునిస్త్రీ' కథలో

రాజ్యలక్ష్మమ్మ. ఆ పరిస్థితుల్లో మనం కూడా 'నిజమే కదా!' అనుకొంటాము. పిల్లలందరినీ సమానంగా ప్రేమించవలసిన తల్లిదండ్రులు పసిపిల్లను గారాం చేస్తూ ఎడపిల్లను విదిలించడం ఆ పసిమనస్సును ఎంత గాయపరుస్తుందో సున్నితంగా సూచిస్తుంది, 'పసి హృదయం' అనే కథలో. మూగపిల్లవాడిని తల్లి తన రెక్కల క్రింద దాచుకోవడం కాదు చెయ్యవలసిన పని, వాడు లోకంలో స్వతంత్రంగా బ్రతకగలిగే మార్గంలో ప్రవేశపెట్టడం, తాత్కాలికంగా అది కష్టతరమైనప్పటికీ, చెయ్యవలసిన విధి అదే-అని గట్టిగా నిర్దేశిస్తుంది, 'భవిష్యత్తు కో బంగారు బాట' అనే కథలో. ఇటువంటి సమస్యలు మనం గుర్తించను కూడా గుర్తించము. ఎందుకంటే పైకి ఆయా పరిస్థితులు ప్రేమ పూరితంగా నిండుగా కనిపిస్తాయి. మరొక దృష్టితో లోపలికి వెళ్ళినప్పుడే సమస్య గోచరమౌతుంది.

ఇక 'స్వీట్ హోంలో స్పీడ్ బ్రేకర్స్', 'రానీ ఆ రాస్కెల్' అనే కథలు హాస్య ప్రధానంగా అమరిన కొని మెరుపు ఝళిపింపులు. ఈ శతాబ్దంలో స్త్రీ విద్యావంతురాలు అవుతోంది. ఆర్థికంగా స్వాతంత్ర్యురాలు అవుతోంది. కాని క్రొత్త క్రొత్త సమస్యలు ఆమెను వెన్నంటే ఉన్నాయి. విద్యావంతురాలైన యువతి ఒక్కొక్కప్పుడు, వృద్ధ కన్యగా మిగిలిపోతోంది. తన బిడ్డతో పాటు ద్వితీయ వివాహానికి సిద్ధపడిన ఓ 'ఆదర్శ' యువకునికి ఆమె పెంచుకొనిన (అనాథ శిశువు అని తెలిసి కూడా) పాపతో పాటు ఆమెను స్వీకరించే స్థైర్యం, ధైర్యం లేకపోవడాన్ని 'ఒంటరి తల్లి' కథలో నిశిత దృష్టితో చిత్రీకరిస్తుంది రచయిత్రి.

వృద్ధురాలైన తల్లిని చూసుకోవలసినది ఓ అతిథివలె కాదు, 'ఇంటిపెద్ద' వలె. మనతో పాటూ, మన పిల్లల ఆప్యాయిత ప్రేమ వగైరాలతో - అని తెలియచెప్పే కథ 'ఇచట నేవుండిపోనా.'

ఈ కథలలోని సంఘటనలు ఎక్కడో జరిగినట్లుండవు. మన ఇళ్ళలో, మన ప్రక్క ఇళ్ళలో కన్పిస్తున్నట్లే తోస్తాయి. ఇవి సమస్యలు కావు. పొరపాట్లు; దిద్దుకో గలిగిన చిన్న పొరపాట్లు.

'ఆ క్షణం' అనేది సందేశాత్మకమైన కథానిక. చావే సమస్యలకు పరిష్కారం అని భావించి ఒకానొక బలహీన క్షణంలో ఆత్మహత్యలకు పాల్పడిన, తలబడుతున్న అభాగ్యులు ఎందరో ఈ ఆధునిక యుగంలో ! ఆ ఒక్కక్షణం ఎంత భయంకరమైనది! అది తప్పించగల్గిన వాళ్ళుంటే, ఆ పని ఎంత హేయమైనదో, దాని పర్యవసానం ఏమిటో, వాళ్ళే గ్రహిస్తారని రచయిత్రి అభిప్రాయం. నిజమే కదా!

విప్లవ కారుల మనుకొని స్టేషను తగులబెట్టడానికి వెళ్ళిన అన్నను చూసి, చిట్టి తమ్ముడు ఇంట్లోని వస్తువులూ, బట్టలూ తగులబెట్టి ఆనందిస్తాడు. 'అదేం' అనిన అన్నతో మరి మీరు తగుల బెట్టినవి 'మనవి' కాదా అని అమాయకంగా (అర్థవంతంగా!) అడుగుతాడు, 'తమ్ముడూ తగుల బెట్టకు' అనే కథలో.

సమకాలీన సమస్యలే కాక వైద్య విజ్ఞానిక సమస్యలు, మనస్తత్త్వ శాస్త్ర సంబంధమైన సమస్యలను కూడా తీసికొని కథల్లో మలచి చక్కని పరిష్కారాలు చూపించింది ఈ రచయిత్రి. చెట్టు మోడైపోతే ఎవరికీ పనికిరాదని కొట్టేస్తున్నాము. కానీ రోగిష్టి ముసలమ్మను ఈసడించుకొంటూ అలక్ష్యం చేస్తున్నాము. ఆ ముసలమ్మ బాధ చూడలేని యువతి ఆ చెట్టూ ఆమె ఒకటే కదా అంటే "అదెట్లా? చెట్టు మనం వేసి పెంచినదీ, మనుష్యులు దేవుని సృష్టి" అని తోటమాలి తనకు తెలిసిన సత్యం చెప్తాడు, 'ఇది న్యాయం అది నేరం' అనే కథలో. 'మెర్సీ కిల్లింగ్' కథాంశముగా రూపుదిద్దుకున్నదనిపిస్తుంది ఈ కథ.

ఈ తరంలో వృద్ధులకు ఆదరణ తగ్గింది. అంతిమ దశలో వారికి కాసంత కరుణ, అనురాగం అందించవలసిన బాధ్యత ప్రస్తుత తరం మరచిపోతున్నది. అట్టి వృద్ధులపట్ల రచయిత్రి స్పందనే 'హాయ్ మమ్మీ!', 'ఆ+అమ్మ=ఆయమ్మ', 'ప్రతిబింబం' మొదలైన కథానికలు. రచయిత్రి కథలలో పాత్ర లెవ్వరూ చెడ్డవారు కాదు. కానీ ఇతరుల పట్ల వారివారి ప్రవర్తనలో చిన్నచిన్న పొరపాట్లు చేస్తుంటారు. అట్టి పొరపాట్లు చూపించి దిద్దుకునే మార్గం సూచిస్తుంది - కాదుకాదు- మనకే స్ఫురింప జేస్తుంది, రచయిత్రి.

బిడ్డలు డాక్టర్లు అవడం వల్లనో, లేక స్వతహా ఆమెలో అంతర్లీనంగా ఉన్న కుతూహలం వల్లనో ఈమె వైద్య విజ్ఞాన సమస్యల (మెడికల్) పట్ల కూడా ఆకర్షితురాలై చక్కటి సైన్స్ ఫిక్షన్ కథలు వ్రాసింది. మన కాల్పనిక సాహిత్యంలో రచయితల్లో, రచయిత్రుల్లో పలు వైద్యులున్నారు. కానీ సమకాలీకంగా సంభవిస్తున్న వైద్యపరమైన సమస్యల గురించి కానీ, వాటి పరిష్కారం గురించి కానీ కథలల్లినవారు చాలా తక్కువ. Rh+, Rh- రక్త వైరుధ్యాల పర్యవసానంగా మొదటి కాన్పు తర్వాత పుట్టిన బిడ్డలు మరణించడమూ, ఆ తప్పు ఆ "పూర్వజ"దే అని నిర్ధారించి ఈసడించుకోవడం, మా చిన్ననాడు మాకు అనుభవైకవేద్యమే! అలాంటి అమ్మమ్మలకు, నాయనమ్మలకు కనువిప్పు 'పూర్వజ' కథ, స్త్రీ గొడ్రాలు కావడానికి స్త్రీయే కారణమా! అన్న మూఢ నమ్మకాన్ని రూపుమాపే పరమసత్యం 'గొడ్రాలు' కథ.

సర్రొగేట్ మదర్స్ కథా వస్తువుగా 'కన్నతల్లి' అనే కథను వ్రాసింది హేమలత.

పై కథాంశాలపై కథలు అల్లాలన్న ఉద్దేశ్యం ముప్పై ఏళ్ళ క్రితమే కలగడం రచయిత్రి పురోగామి భావాలకు నిదర్శనం.

ఇక 'ప్రతి బింబం' కథ. ఇది ఈ మధ్య వ్రాసిన మనో వైజ్ఞానిక కథ. చిన్న వయస్సులోనే భర్తను పోగొట్టుకున్న ఆమె, తండ్రిలేని లోటు తెలియనీయకుండా ప్రాణంగా పెంచి పెళ్ళి చేసింది కొడుక్కి. కొడుకు కోడలూ చిలుకా గోరింకల్లాగ కాపురం చేస్తూ ఉంటే చూసి మురిసి పోదామనుకున్నది. కానీ, ఫిట్సుతో తానుబాధపడి ఆ ఇద్దరినీ బాధపెట్టింది. ఎందుకు !? "నిన్నే కేంద్ర బిందువుగా చేసికొని నీ చుట్టూ తన జీవితాన్ని మలచుకొన్నది ఆమె. ఇప్పుడు ఆమెతో

పంచుకోజాలని ఆంతరంగిక జీవితం నీకంటూ ఏర్పడింది. ఆమెకో ? స్వతహా మంచి మనిషి కావడం వల్ల దుష్ట కోరికలకు దాసోహ మనక మానసిక సంఘర్షణకు లోనౌతోంది. తనలో ఏమాత్రం మంచి లోపించినా ఆరళ్ళు పెట్టే అత్త చందాన మీ మధ్య పొరపొచ్చాలు పెట్టి తాను శాంతిని పొంది వుండేది. ఆమె 'మంచే ' అమెకు తీరని శాపమై అశాంతికీ అలజడికీ గురిచేసింది" అంటాడు మానసిక శాస్త్రవేత్త, వినోద్.

"తల్లిపాలకు నోచుకొనని మనవడిని చేతుల్లో తీసికొని వాడిలో తన కొడుకు ప్రతిబింబాన్ని చూసుకొంటూ అహర్నిశలూ వాడిసేవ, ముద్దు ముచ్చట్లలో మునిగి పోయిన శాంతమ్మకు ఆ తర్వాత కొడుకు కోడళ్ళను గురించిన చింతనకు సమయం లేదు. ఆమెకు మళ్ళీ ఫిట్స్ ఇక రాలేదు."

ఇట్టి సమస్యలనూ, పరిష్కారాలనూ సాహిత్యంలో ఇమిడ్చిన నేర్పు, హృద్యంగా కథ చెప్పే తీరు రచయిత్రికి వెన్నతో పెట్టిన విద్యలు.

ఈమె కథలలో ఏవీ విషాదాంతాలు లేవు. ఒక్క 'ప్రభ' అనే కథ తప్ప. "సైమన్ స్మిత్ అనే ఏడేండ్ల కుర్రవాడు ఆడుకొంటూ గులాబీల పొదలపై బడి ముళ్ళు నోట్లో, గొంతులో చొచ్చుక పోయిన కారణంగా మెదడులో రక్తనాళాలు గూడు కట్టుకుని పోయి మరణించిన" వార్త విని స్పందించి ఆ చిట్టితమ్ముడికి అశ్రుతర్పణంగా ఈ కథను రచించింది హేమలత.

సాధారణంగా హిప్పీలలో చేరినవారు వెనక్కి మరలిన సంఘటనలు అరుదు. కానీ రచయిత్రి అక్కడ కూడా ఆశాజనకమైన ముగింపు నిచ్చింది 'న్యూవేవ్' అనే కథలో. మనిషి జీవితాన్ని ముఖ్యంగా నడిపించేవి ఆత్మ విశ్వాసం, ఆశావాదం, దృఢ సంకల్పం. వీటిని పుష్కలంగా పండిస్తుంది ఈ రచయిత్రి తన కథల్లో.

హేమలత భాష పదాడంబం లేకుండా చల్లగా ప్రవాహాగతిని సాగిపోతుంది. కథలకు శీర్షికలు ఎంపిక చేయడంలో కూడా ఈమె నేర్పరి.

ఈమె సృష్టించిన స్త్రీ పాత్రలు అల్లే పూలమాలల వలె, ఈమె కథలు ఆహ్లాదకరమైనవి. వేసవి ఉషః కాలపు చల్లని పిల్ల తెమ్మెరలు. వసంత కాలపు మునిమాపు వేళ అలము కొన్న వేపపూత సుగంధాలు-సన్న జాజి పరిమళాలు.

**వి. గాయత్రి రామారావు**

హైదరాబాద్,
జనవరి, 2000.

# భవిష్యత్తుకో బంగారుబాట

"సుజా ! బాబు బూట్లు ఎక్కడ పెట్టావ్ ?" అంటూ లోపలికి వచ్చిన మధుమూర్తి అలాగే నిలబడిపోయాడు. సుజాత బాబు బట్టలు కుప్పలాగ ముందేసుకుని కూచుంది. తెరచిన పెట్టె తెరచినట్లే ఉంది. మధుమూర్తి మాటలకు ఉలిక్కిపడి తలెత్తి చూచింది సుజాత. ఎప్పటినుండి అలా కూచుని కన్నీళ్లు కారుస్తూందో ! మొహం అంతా వాచి ఉంది. మధు నెమ్మదిగా భార్య దగ్గరికి వచ్చి కూచున్నాడు. "ఏమిటి సుజా ! మరీ చంటిపిల్లలాగ ! లే. నువ్విలా ఏడుస్తూ కూచుంటే ఎలాగ?" "నా మనస్సు ఏమీ బాగాలేదండీ. చిన్న సన్నాసివాడు ఒక్క క్షణం నన్ను విడిచి ఉండలేడు. అటువంటిది రోజులకు రోజులు, నెలలకు నెలలు నన్ను విడిచి ఉంటాడా?" భార్య సందేహాలకి మధుకి కోపమొచ్చింది. "మళ్లీ మొదటికి వచ్చావా" అన్నట్లు కొంచెం కోపంగా చూశాడు.

"పోనీ నన్ను మద్రాసువరకైనా రానివ్వండి" అంటూ ప్రాధేయపడసాగింది సుజాత క.

"సరేలే. నువ్వు కూడా ప్రయాణంకా మరి" అంటూ లేచాడు మధు.

"మరి ఉష, రవి ఎలాగండి?"

"వాళ్లని మా ఫ్రెండు రామ్మూర్తిగారింట్లో ఉంచేసి వెడదాంలే" అంటూ ప్రయాణ సన్నాహాలు చేయటానికి వెళ్లిపోయాడు మధుమూర్తి.

మధు - సుజాతల ద్వితీయ సంతానం రాంబాబు. ఉష తర్వాతవాడు. మగ సంతానం అని కాస్త ముద్దు. ఒత్తుగ ఉంగరాల జుట్టుతో, చక్రాల్లాంటి కండ్లతో ముద్దొస్తూ ఉండేవాడు. బాబును చూసి ఎంతో మురిసిపోయారు దంపతులిద్దరు. ఏడాది నిండుతున్నా "అమ్మా, అత్తా" అనే మాటలు కూడా అనకపోవడంతో కొంత ఆశ్చర్యపోయారు. కానీ, వాళ్లు, వీళ్లు, 'ఆడపిల్లలకన్నా మగపిల్లలకి మాటలు రావడం కాస్త ఆలస్యం కావచ్చు' అంటే కాబోలనుకున్నారు. కాని బాబు అస్తమానం నిద్రపోవడం. ఎంత పెద్ద చప్పుడయినా ఉలిక్కిపడి ఏడవటం ఎంటివి చేయకపోవడంతో కొంత అనుమానపడ్డారు. ఇంతలోకి సుజాతకి గర్భం రావటం రవిపుట్టడం, పిల్లలు ఎద్దని ఆపరేషను చేసికోవడం ఎంటి గొడవల్లో బాబు సంగతిని కొంచెం వెనక్కి నెట్టడం జరిగింది. రవి ఏడాది పిల్లవాడుగా ఉన్నప్పుడే మాటలు చెప్పడం మొదలెట్టాడు. మూడేళ్లు నిండుతున్న బాబు మాత్రం మూగగా ఉండడంతో ఇక దంపతులిద్దరికి భయం పట్టుకుంది. ఆ ఊరిలోనే ఉండే డాక్టరుకి చూపారు. ఆయన బాబును ఎగ్జామిన్ చేసి, ఇ.ఎన్.టి. స్పెషలిస్టుకి చూపితే మంచిదేమో అని సూచించారు. అదృష్టవశాత్తు మధుకి హైదరాబాద్ ట్రాన్స్ఫర్ అవడంతో, వారికి సగం బాధ తీరినట్లు అయింది. ఇక హైదరాబాద్‌లో చూపించని డాక్టరు లేడు. తిరగని హాస్పిటల్ లేదు. కాని ఫలితం శూన్యం. బాబు పుట్టు మూగ, చెవిటి అన్నది స్థిరమైంది. సుజాత, మధుల హృదయాలు బాధతో ఆక్రోశించాయి. ఆ అమాయిక బాలుడిని చూస్తుంటే వారి గుండెలు చెరువులయ్యాయి. కాని దుఃఖించి ప్రయోజనమేమిటి ? మగవాడు కాబట్టి మధుమూర్తి ముందుగా తేరుకున్నాడు. ముమ్మందు చేయవలసిన దానిని గూర్చి ఆలోచించడం మొదలెట్టాడు.

కాని, సుజాత మాత్రం పిచ్చిదానిలా బాబును తన హృదయంలో దాచుకుంది. మాతృ హృదయం కదా ఎంతైనా ! కన్న కడుపు తీపి, ఆ అంగవిహీన బాలుని మీది జాలితో మరీ ఎక్కువయి పోయింది. ఉష, రవిలకన్న, రాంబాబు మీద శ్రద్ధ ఎక్కువయింది. ఇలా మూడేళ్లు గిర్రున తిరగాయి. ఈ మూడు సంవత్సరాలలో రాంబాబుకి హోమియోపతి ఇత్యాదులు కూడా వాడి విఫలులవడం జరిగింది.

నాలుగేండ్లు నిండిన రవి కాన్వెంటు కెళ్లేవాడు. ఎనిమిదేళ్ల ఉష మూడవతరగతి చదివేది. ఎటొచ్చీ రాంబాబు అమ్మ కొంగు పట్టుక తిరిగేవాడు. సుజాత వల్లమాలిన గారాం చేసిందేమో, ఒట్టి మొండివాడుగా తయారయ్యాడు. ప్రతీదానికి మంకుపట్టుపట్టేవాడు. తను ఎంతచేస్తే అంత అన్నట్లు వ్యవహరించేవాడు. ఉషకి కొంచెం ఊహ వచ్చింది కాబట్టి సర్దుకపోయేది. కాని చిన్నవాడు

రవి. వాడికి రాంబాబుకి ఒక్క నిమిషం పడేదికాదు. రాంబాబు మీద ఈగ వాలనిచ్చేది కాదు సుజాత. అమ్మ ఎంత సేపు అన్నయ్యనే ముద్దుచేయడం వాడికి నచ్చేది కాదు. ఎవ్వరూ చూడనప్పుడు, కొట్టేసి పరుగెత్తేవాడు. లేకుంటే వెక్కిరించేవాడు. సుజాత చూస్తే రవినే కొట్టేది. మధుకి ఇవన్నీ గమనిస్తూంటే కష్టం వేయడం మొదలెట్టింది.

రాంబాబు మూగవాడుగ పుట్టడం నిజంగా దురదృష్టమే. కాని మానవులమయిన మనము ఆ దురదృష్టాన్ని మార్చలేనపుడు ఇక దానిని మన జీవితంలో సమన్వయపరచుకొని పోవడమేకదా ఉత్తమమైన మార్గం. భగవంతుడు రాంబాబుకి ఇచ్చిన జీవితమే మూగది. ఇక దానినే చక్కదిద్దుకొని బ్రతుకును సాగించుకోవాలి. ఆ పసిబాలుని జీవిత బాటలకు దారి చూపించవలసినది తల్లితండ్రులే! తల్లి అయిన సుజాత, కన్న ప్రేమ అనే భ్రమలో ఉంది. కాని మధు మాత్రం రాంబాబుకి చదువు ఏర్పాటు చేయాలి అని ఒక దృఢ నిశ్చయానికొచ్చాడు.

వారిని, వీరిని వాకబు చేయగ మలక్‌పేటలో ఒక చెవిటి, మూగ పాఠశాల ఉన్నట్లు తెలిసింది. కాని ఉన్న ఊర్లోనే అయితే రోజుకొక్క సారు కొడుకు దగ్గరికి ప్రయాణం కడ్తుంది సుజాత. ఇది లాభం లేదనుకున్నాడు మధు. మద్రాసు వాహినీ స్టూడియోలో ఉండే తన బాబాయి కొడుకు కృష్ణమూర్తి గారికి ఉత్తరం వ్రాశాడు మధు. కృష్ణమూర్తి వెంటనే జవాబు వ్రాశాడు, బాబును తీసికొని బయల్దేరి రమ్మని. సుజాతకీ విషయం చెప్తే ఎన్నెన్నో సందేహాలు చూపింది. ఎంతో కలవరపడింది. కాని మధు మాత్రం తన నిశ్చయాన్ని మార్చుకోదలచుకోలేదు. ముందు సుజాతను కూడా మద్రాస్ తీసికెళ్లకూడదని మధు భావించాడు. కాని, సుజాత దుఃఖం చూడలేక అంగీకరించాడు.

ఉషను, రవిని రామ్మూర్తిగారింట్లో వదిలి వస్తూంటే రవి "నానారా నేనూ వస్తాను ఊరికి" అంటూ గోలకెత్తాడు. మధుదగ్గర బాగా చనువు వాడికి. ఎలాగో నచ్చచెప్పి నెమ్మదిగా వదిలించుకున్నాడు. ఉష మాత్రం "నాన్నారూ ! బాబును అక్కడే వదలివస్తారా? మరి వాడికి మాటలు రావు కదా ! అన్నము పెట్టమని ఎవ్వరిని, ఎలా అడుగుతాడు ? అని అమాయికంగా ప్రశ్నిస్తూంటే మధుమూర్తి పితృహృదయం బాధతో సుళ్లు తిరిగింది. తమ్ముడిని జాగ్రత్తగా చూసుకోమని ఉషకి, రవిని అప్పచెప్పి గబగబ బయటికి వచ్చేశాడు మధు. ఇంకాసేపు అక్కడే ఉంటే తన కన్నీళ్లు కూతురు ఎక్కడ చూస్తుందో అని.

ట్రెయిన్ ఎక్కిన సంతోషంలో బాబు ఉషారుగా ఉన్నాడు. కిటికీలోనుండి తొంగి చూస్తూ తనకేదైనా క్రొత్తగా కనిపిస్తే సుజాత గడ్డం పట్టుకుని త్రిప్పి చూపించి "అదేంటి?" అని సైగలతో అడగడం మొదలెట్టాడు. సుజాత కూడా సైగలతోనే అది "చెట్టని, పక్షి అని, గూడ్సుబండి" అని చెబుతూండడం గమనించి ప్రక్కనే ఉన్న ఒక ముసలమ్మ "ఏమ్మా ! బాబుకు మాటలు రావా?" అని ఎంతో సానుభూతిగా ప్రశ్నించింది. "రావు" అన్నట్లు తలను అడ్డంగా తిప్పింది సుజాత.

అటువేపు కూచున్న కళ్లజోడు పెద్దమనిషి "వేలూరులో చూపించకూడదటండీ!" అని ఒక ఉచిత సలహా పారవేశాడు. "అవన్నీ పూర్తి అయ్యాయి." అని నిర్లిప్తంగా జవాబిచ్చాడు మధు. "అయ్యో పాపం మూగవాడట ! ఎంచక్కా ఉన్నాడు పిల్లవాడు ముద్దొస్తూ ! ఎంత బ్రతుకు బ్రతకాలి

ముందు ముందు ! చదువు సంధ్యలు ఎలాగ ?" ఇలా సాగుతున్నాయి ప్రయాణీకుల సంభాషణలు, మూగబాలుడైన రాంబాబును గురించి. అదృష్టవంతుడు బాబు. వాళ్ళ మాటలు అతనికి వినిపించవుగా ! చిరునవ్వులు చిందిస్తూనే ఉన్నాడు. సుజాతమాత్రం వాళ్ల సానుభూతి వాక్యాలు వినలేకపోయింది. అనునయంగా తనవేపే చూస్తున్న భర్త నుండి దృష్టి మరల్చుకొని కిటికిలోనుండి బయటికి చూడ్డం మొదలెట్టింది. కాని ఆమె అశ్రుధారమాత్రం కిటికీని తడిపివేయడం మానలేదు. అమ్మ ఎందుకో ఏడుస్తూంది అని బాబు కూడా బిక్కమొహం పెట్టాడు. మధుకి తోటి ప్రయాణీకులమీద చెప్పలేనంత చిరాకు వేసింది. మూగవాడని స్పష్టంగా కనిపిస్తూనే ఉంది కదా, మళ్లీ అడగడం ఎందుకో. మూగవాడయితే మాత్రం బ్రతకడానికి అనర్హుడా. ఎందుకీ అర్థంలేని 'జాలి' కబుర్లు. ఆర్చేవా ? తీర్చేవా ? పాపం ! అన్నంత మాత్రాన ఆపద ఆవలికి పోదుకదా ! కాని లోక రీతియే అంతేనేమో ! వాళ్లకి అనుభవంకాని బాధ కాబట్టి సానుభూతి ఒలకపోస్తున్నారు. మధుమూర్తి అలా బాధతో కళ్లుమూసుకుని సీటు వెనుక్కు చేరగిలబడ్డాడు. కనీసం తాను నిద్రపోతున్నాననయినా వాళ్లు సంభాషణ మానుకుంటారు కదా అని.

**క్రొత్తచోటు**, క్రొత్తస్థలం. అమ్మ నాన్నగారు కూడానే ఉన్నారు - అన్న ఆనందంలో గెంతులు **వేస్తున్నాడు** రాంబాబు. త్యాగరాయనగర్‌లో ఉండే కృష్ణమూర్తి గారింటి నుండి "జెమినీ స్టూడియో" ప్రక్కన ఉండే చెవిటి, మూగ, అంధ పాఠశాలకి టాక్సీలో వెళ్లారు మధుమూర్తి దంపతులు. కారులో కూచుని వెళుతూంటే ఎంతో సంబరపడి పోతున్నాడు రాంబాబు. సుజాత బాధ చెప్పనలవి కాదు. ఈ అమాయక మూగ ప్రాణిని అక్కడ అంతమంది క్రొత్తవారిలో విడిచిపెట్టి రావడం అన్నది తలచుకుంటేనే గుండె వ్రక్కలవుతూంది సుజాతకు. మధుమూర్తికి కూడా చాలా కష్టంగానే ఉంది. కాని కర్తవ్య నిర్వహణ కొంత కఠినత్వాన్ని ఇచ్చింది. ముందు దినమే స్కూలుకి వెళ్లి అన్నీ కనుక్కొని వచ్చాడు మధు. మరుసటి దినం వచ్చి జాయిన్ చేసి వెళ్లమని చెప్పారు స్కూలు అధికారులు.

స్కూలు గోడలు బాగా ఎత్తుగా ఉండి లోపలి ఆవరణ చాలా విశాలంగా ఉంది. లోపల కొద్ది దూరం నడిచాక కాని స్కూలు బిల్డింగ్ కనిపించలేదు. టాక్సీలుకాని, సొంత కారులు కాని లోపల ప్రవేశించడానికి వీలు లేదు ; అన్నీ రోడ్డుమీదే ఆగిపోవాలి. స్కూలు కాంపౌండులో పిల్లలు గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. వాళ్ల వదనాలు కళకళలాడుతున్నవి. కొంతమంది క్రొత్తపిల్లలు మాత్రం బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు. వారి వెంబడి ఆయాలు, కొంచెం వయస్సులో పెద్దవారైన పిల్లలు ఉన్నారు. మధుమూర్తి కుటుంబాన్ని చూడగానే, ఎవరో క్రొత్తవారు అన్నట్లు సైగలు చేసికొని చెప్పుకుంటున్నారు పిల్లలు. మధుమూర్తి సరాసరి స్కూలు అధికారిణి దగ్గరికి వెళ్లాడు. రాంబాబు సూటుకేసు పట్టుకొని ఒక పనివాడు వచ్చాడు. రాంబాబు క్లాసు దగ్గరికి వెళ్లారు మధు, సుజాత, స్కూలు అధికారిణి వెంటరాగా. రాంబాబుకి ఇదంతా చాలా

క్రొత్తగా ఉంది. "తన సూటుకేసు ఇక్కడికెందుకు ? అని సుజాతను మూగప్రశ్నలతో వేధించడం మొదలెట్టాడు. స్కూలు అధికారిణి రాంబాబు సైగలను అర్థం చేసికొని బాబు సూటుకేసును హాస్టలుకి తీసికెళ్లవలసిందిగా చెప్పింది.

రాంబాబు క్లాసులో అందరు చిన్న చిన్న పిల్లలు ఆడ, మగ కలిసిఉన్నారు. కొందరు కొచ్చిన్ నుండి, విశాఖనుండి, మధుర నుండి - ఇలా చాలా చోట్ల నుండి వచ్చారని చెప్పింది స్కూలు అధికారిణి, శ్రీమతి గౌరి రామన్. ఒక చిన్నపాప తెల్లగ, రబ్బరు బంతి లాగుంది. గంతులేసురుంటూ వచ్చి, శ్రీమతి గౌరి రామన్ చేయి పట్టుకుంది. మధుకి ఆ పాపను చూస్తూంటే, సృష్టికర్త ఎంత కఠినాత్ముడా ! అనిపించింది. ఈ పసిడిబొమ్మ ఏమి అపకారం చేసిందని మూగవీణగా చేశాడో!

గౌరీ రామన్ చెప్తున్నారు. "ఈ పాప పేరు సుధ. ఇక్కడికి వచ్చిన క్రొత్తల్లో ఎంతో అల్లరి చేసింది ! అన్నము తినకుండా గోల చేస్తూంటే నేనే స్వయంగా దగ్గరుండి తినిపించేదాన్ని. ఇప్పుడు నా దగ్గర బాగా అలవాటయింది. ఇంటిదగ్గర బాగా గారాబంగా ఉంటారండి ఈ పిల్లలు. ఇక్కడికొచ్చాక కూడా అలాగే సాగాలి అని భావిస్తారు. వాళ్ల మనస్తత్వాలని బట్టి వాళ్లని మనం క్రమశిక్షణలో పెట్టాలి. కొంతమంది అజ్ఞానులైన తల్లిదండ్రులు ఎందుకొచ్చిన మూగపిల్లలురా బాబూ? అని నిర్లక్ష్యం చేస్తారు. వాళ్లుకూడా మొండిగానే తయారవుతారు. ఆ బాలలు ఇక్కడికొచ్చాక ఎంతో సంతోషంగా ఉంటారు" అని సుజాతను ఉద్దేశించి చెప్పింది. అవిడకి తల్లుల మనస్సు బాగా తెలుసు. తమ కన్నపిల్లల్ని ఇక్కడ విడిచివెళ్లటానికి వాళ్లు పడే బాధ ఆవిడ ప్రతినిత్యం చూచి తెలుసుకొన్న విషయమే !

సుజాత మాత్రం ఆ మూగపిల్లల్ని చూచి మరింత ఆందోళన చెందింది. తనలాంటి దౌర్భాగ్యపు తల్లులెందరో అని విచారించింది. రాంబాబు అమ్మచెయ్యి గట్టిగా పట్టుకొన్నాడు. తన చక్రాల్లాంటి కళ్లను అటూ ఇటూ తిప్పి భయం భయంగా చూస్తున్నాడు. వాడి బుల్లిబుర్రకి ఇప్పుడిప్పుడే కొంత అర్థం కావడం మొదలెట్టింది.

"అమ్మ ఎందుకో కొన్ని రోజులుగా ఏడుస్తూంది."

"తనని మాత్రం ఇక్కడికి తీసుకొచ్చారు. అక్కను, తమ్ముడిని తీసుకురాలేదు."

"తన బట్టల సూటుకేసు కూడా ఇక్కడికి తెచ్చారు."

"తనని ఇక్కడే ఉంచేసే ప్రయత్నంలో ఉన్నట్లున్నారు."

"అమ్మ మాత్రం తనని వదిలిపెట్టదు."

"ఈ నాన్న చెడ్డవాడు. ఏదో చేస్తున్నాడు" అన్నట్లు మధువేపు కోపంగా చూసి సుజాత వెనక దాక్కున్నాడు.

ఇంతలో, ఒక ఏడేండ్ల బాబులేచి టీచరు దగ్గరకి వచ్చి "మానాన్నగారు వచ్చారు నన్ను చూడటానికి నేను వెళ్తాను" అన్నట్లు సైగలు చేసి చూపాడు. "నీకెలా తెలుసు ?" అని అడిగితే

ప్రక్కపిల్లవాడిని చూసాడు. వాడు ఇంకొకడిని... ఇలా చూపుతూ వెళ్లారు. ఆఖరికి ఒక పిల్లవాడు తనే చూసి ఎచ్చి చెప్పినట్లు చెప్పాడు. నోటిమాటల కన్న వేగంగా సాగిన, ఈ సైగల పరంపర వాళ్లు అర్థం చేసికొని, బదులు సైగలు చేయడం మధుమూర్తి విస్మయంతో చూస్తూ నిలబడిపోయాడు. గౌరీ రామన్ చిరునవ్వుతో మధును పల్కరించింది. "ఆశ్చర్యపోతున్నారు కదూ మీరు ! కాని మాకది సహజమే. ఎందుకంటారా ? ఈ మూగ బాలల్లో సూక్ష్మ గ్రాహిత్వం ఎక్కువగా ఉంటుంది. పంచేంద్రియాల్లో రెండిటికి స్తబ్ధత ఏర్పడిన కారణంగా, మిగిలిన మూడు ఇంద్రియాలు చాలా చురుకుగా ఉంటాయి. మూగ, చెవిటి, గ్రుడ్డి అయిన 'హెలెన్ కెల్లర్' స్వయంకృషి చేత పట్టభద్రురాలయిన విషయం మీకు ప్రత్యేకించి చెప్పనక్కరలేదనుకుంటాను. ఒకమారు చూచిన విషయాన్ని వాళ్లు ఎప్పటికీ మరచిపోరు. మనుష్యులను తేలికగా గుర్తుపడ్తారు. ఒకరి భావాన్ని ఒకరు గ్రహించడంలో అసమాన ప్రతిభ చూపిస్తారు."

"చూశావా?" అన్నట్లు చూశాడు మధు, సుజాత వేపు. కానీ, ఆవిడకి అవేమి పట్టడం లేదు. రాంబాబును దగ్గరికి తీసుకుని నిల్చుంది. వాడు కూడా ఆవిడని వాటేసుకుని మొహాన్ని పూర్తిగా ఆవిడ కుచ్చెళ్లలో దాచేసుకొన్నాడు.

గౌరీ రామన్ మధుమూర్తిని ఆవలికి పిలిచి "ఇలా ఎంతసేపైనా ఆ తల్లీకొడుకులు ఉండిపోతారు. నేను బాబుని తీసుకెళ్తాను. మీరు ఆవిడని తీసికెళ్లండి. నిజమే ! మొదట్లో చాలా కష్టంగా ఉంటుంది. కాని ఇది తప్పనిసరి కదా ? మీరు మాత్రం, ఆవిడ బాధపడుతుంది, బాబును చూడాలంటుంది, అని తీసుకురాకండి. ఒకటి రెండురోజులు బాబు తప్పక ఏడుస్తాడు. అన్నము తిననని మొరాయిస్తాడు. తర్వాత వాడే సర్దుకుంటాడు. వాడిని తోటి బాలలే దారిలోకి తెస్తారు. నేను వారానికి రెండు జాబులు వ్రాస్తాను. రోజూ ప్రత్యేకంగా గ్రుడ్లు, పాలు మీరు ఇమ్మన్నారు కనుక, అదనంగా అయ్యే ఖర్చును భరిస్తారు కనుక, అలాగే ఇస్తాను. మీరు మళ్లీ క్రిస్‌మస్ సెలవులకి వచ్చి తీసికెళ్లండి" అంటూ సుజాత దగ్గరికి వచ్చింది. ఆవిడని చూడగానే సుజాతకి దుఃఖం ముంచుకొచ్చింది. రాంబాబు మాత్రం తల ఎత్తకుండా అలాగే నిల్చున్నాడు. బాబును నెమ్మదిగా లాక్కుంది గౌరీ రామన్. సుజాత చీరకుచ్చెళ్లు గట్టిగా పట్టుకున్న రాంబాబు పెద్దగా ఏడవడం మొదలెట్టాడు. సుజాత రాంబాబును దగ్గరికి తీసుకోబోయింది. కాని మధు కొంచెం కోపంగా "మరీ సిల్లీగా ప్రవర్తించకు" అని అనగానే, అయిష్టంగా వాడిని వదిలేసింది. రాంబాబు మాత్రం తల్లిని గట్టిగా పట్టుకున్నాడు. గౌరీ రామన్ వెంటవచ్చిన ఆయా, వాడిని బలవంతంగా లాక్కుని భుజంమీద వేసుకుంది. ఆయా తీసికెళ్లిపోతుంటే బాబు గోలకెత్తేసి ఆయా జుట్టు పీకడం మొదలెట్టాడు. సుజాత ఇంతసేపూ నిగ్రహించుకుందేమో, ఇక వెక్కిళ్లు పెట్టి ఏడవడం మొదలెట్టింది. మధు, భార్య భుజాలచుట్టూ చేతులు వేసి నెమ్మదిగా వెనక్కి మరలించబోయాడు. కాని ఆవిడ అతని చేతులు విదిలించుకొని అలాగే నిల్చుండి పోయింది. కొంచెం దూరం ఆయా భుజాలమీద పెనుగులాడిన బాబు, ఒక్క పట్టున వదిలించుకొని సుజాత వేపు పరుగు తీశాడు. సుజాత కూడా సర్వం మరచి "బాబూ!" అంటూ పరుగెత్తి వాడిని ఎత్తుకుంది. మధుమూర్తి హతాశుడయ్యాడు.

గౌరీ రామన్ ఆయాను కేకలు వేసింది. కాని పాపం ! ఆయా మాత్రం ఏం చేస్తుంది ? కండలు ఊడి వచ్చేలా ఆయా భుజం కొరికి మరీ వచ్చాడు బాబు.

ఈ తడవ మధుమూర్తి తానే రాంబాబును ఎత్తు కొని హాస్టలులో ఆయాకు అందించి వచ్చాడు. అక్కడే వున్న సిమెంటు బెంచీ మీద కూచుని హృదయవిదారకంగా ఏడుస్తున్న సుజాతను ఇంటికి చేర్చేటప్పటికి మధుకి తలప్రాణం తోకకొచ్చింది. ఇంటికొచ్చిందే కానీ అన్నం తిననని భీష్మించుకు కూచుంది సుజాత. మధు నచ్చ చెప్పబోతే మధుమీద ఇంతెత్తున లేచింది. " మీరే రాంబాబుకి శత్రువు. వాడిని నా కండ్లముందర లేకుండాచేశారు. బెంగతో ఏమవుతాడో ఏమో."

మధుకి చాలా బాధ అనిపించింది. "సుజా! వాడు నీకేకాని నాకు కొడుకు కాడా? నాకేమైనా వాడిమీద విరోధమా? వాడి భవిష్యత్తును మనస్సులో పెట్టుకుని నే నెంత మనోవ్యధకు లోనై ఈ నిశ్చయానికి వచ్చానో నీకేంతెలుసు? అంతమంది బాలలు వున్నారు ఆ స్కూల్లో. వాళ్ళందరి తల్లిదండ్రులు కరినత్ములేనా నీదృష్టిలో! ఆవేశాన్ని అణుచుకొని వివేకంతో ఆలోచన చేయి. నిన్ను బాధపెట్టటం నా అభిమతంకాదు. నువ్వు మనస్ఫూర్తిగా చెప్పు, వాడికి చదువు సంధ్యలు ఏమీ వొద్దు తీసుకరమ్మని. తెచ్చి నీ కప్పగిస్తాను. కాని తర్వాత వాడి బాగోగుల బాధ్యతలు మాత్రం నీవే అవుతాయ్. వాడిని భగవంతుడు ఎలాగూ మూగ వాడిగా చేశాడు. కన్నతల్లివి నీవు వాడిని నిష్ప్రయోజకునిగా కూడా చేస్తానంటే ఇక తరువాత నీ ఇష్టం." - ఇన్నాళ్ళుగాలేని భర్త గంభీరవదనాన్ని చూచి సుజాత జంకింది. నిజమే. భర్తకు మాత్రం కష్టంగా వుండదూ? కన్న తండ్రికి ప్రేమలేకుండా వుంటుందా? వివేకం పనిచేసింది. నెమ్మదిగలేచి మొహం కడుక్కుని అన్నము తినటానికి వచ్చింది. మధుకూడ ఆ విషయాన్ని విస్మరించినట్లు వ్యవహరించాడు.

మద్రాసు చూద్దాం, నాలుగు రోజులు వుందాం అనుకున్న మధు మరుసటిరోజే ప్రయాణం కట్టాడు, సుజాత మళ్ళీ మనస్సు ఎక్కడ మార్చుకొని బాబు దగ్గరికి పదమంటుందో అని.

మరుసటిరోజు ప్రొద్దున్నే గౌరీ రామన్‌కి మధుఫోన్ చేసాడు. ఆమె, "రాంబాబు రాత్రంతా ఏడిచాడనీ, ఎవ్వరినీ దగ్గరికి రానివ్వలేదని, ఇప్పుడే బలవంతంగ మొహం కడిగించి పాలు ఇచ్చామనీ, బాబును గురించి ఏమీబాధపడవద్దని, తల్లిని మాత్రం ఇక్కడికి తీసుకురా వద్దనీ" మరీ మరి చెప్పింది. ఫోనులో మాట్లాడిన సంగతి సుజాతకి చెప్పాడు మధు.

"దూరం నుండి చూసివస్తామండీ" అని సుజాత మొదలెట్టింది. కాని ససేమిరా మధు వినకుండ హైదరాబాదుకి ప్రయాణం కట్టాడు.

  

ప్రొద్దుటనుండి హడావిడి పడిపోతూంది సుజాత. రాంబాబు ఈ రోజే వస్తాడు. ఆరునెలలయింది వాడిని చూసి. ఆరు యుగాలుగా వుంది సుజాత ప్రాణానికి. వాడికి ఇష్టమని జంతికలు, కజ్జికాయలు చేసింది. నిమిష నిమిషానికి గడియారం చూస్తూంది. ఎంతకీ టైము

గడవడం లేదు. ఎలా వున్నాడో ఏమో! "బాబు బాగానే వున్నాడు, దారిలో పడ్డాడు" అని వారానికి రెండు జాబులు వ్రాసేది గౌరి రామన్. ఆ ఉత్తరాలు చదివిన తరువాతనే సుజాత ప్రాణం కుదుటపడేది. రాంబాబు చేత "బాతు" బొమ్మ, "కారు" బొమ్మలాంటివి వేయించి పంపేవారు. అవి చూసుకొని తెగ మురిసిపోయేది సుజాత. ఉష, రవి కూడ "బాబు వేసాడు, బాబు వేసాడు" అంటూ గంతులేసేవారు. రవి అయితే, అమాయకంగా "అమ్మా! అన్నయ్య ఇప్పుడు మాట్లాడుతూ వుంటాడా?" అని ప్రశ్నించేవాడు. సుజాత వదనం చిన్నబోయేది ఆ ప్రశ్నకి. "మాటలు రావు, కాని చదువుతూంటాడు" అని తప్పించుకొనేది.

టాక్సీలో నుండి దిగి లోపలికి పరుగెట్టుకొచ్చిన బాబు, సుజాతను అమాంతం చుట్టేసాడు. సుజాత కూడ కండ్లనీళ్ళు కారిపోతుండగ, బాబును చేతుల్లోకి తీసుకొని ముద్దు పెట్టుకొంది. సిగ్గుతో బాబు ఆమె గుండెల్లో తల దాచేసుకున్నాడు. టాక్సీ వాడికి డబ్బులిచ్చేసి బాబు సూటుకేసు పట్టుకొని లోపలికి వస్తున్న మధుకీ దృశ్యం చూడగానే అప్రయత్నంగా కండ్లు చమర్చాయి.... వెంటనే తేరుకొని "ఊఁ... ఊఁ... లోపలికి పదండి. ఇక్కడే నేంటి మీ మురిపాలు" అంటూ లోపలికి వెళ్ళాడు.

రాత్రి పడుకున్నంతవరకు రాంబాబు కూడా కూడా తిరిగారు, ఉష, రవి. బాబయితే సుజాతని ఒక్క నిమిషం వదలటంలేదు. ఉష, రవి, బాబుకి తమ క్రొత్త బొమ్మలు చూపారు. రవి తనకి ఆటల్లో వచ్చిన ప్రయిజులు చూపించాడు. "కావాలంటే బొమ్మలు నువ్వే వుంచేసుకో" అని కూడ అనేశాడు రవి. ఒక్క నిముషం అన్నతమ్ములకి పడేదికాదు. అటువంటిది రవి, బాబంటే ఎంతో అభిమానం చూపిస్తున్నాడు. బాబు తన పెట్టె తెరచి తను మద్రాసులో కొన్న స్కిప్పింగ్ రోప్ ఉషకిచ్చాడు. ఎగ్జిబిషన్‌కి తీసికెళ్ళినట్లు గౌరీ రామన్ వ్రాశారు. బహుశా అక్కడే కొనివుంటాడు అనుకొంది సుజాత. వాళ్ళ నాన్నగారు హిగిన్ బాదమ్స్‌లో కొనిచ్చిన రంగు రంగుల బొమ్మల పుస్తకం రవికిచ్చాడు. అమాయకంగా వుండే తన బాబుకి ఎన్ని ఆలోచనలు. ఎప్పుడో ఉష స్కిప్పింగ్‌రోప్ కొనమని పేచీ పెట్టింది. అప్పుడు బాబుకూడా వున్నాడు. ఇక్కడే కొందాంలే అని అశ్రద్ధ చేశారు. ఎంత బాగా గుర్తు పెట్టుకొని తెచ్చాడు బాబు. సుజాతకి ఒక వేపు ఆశ్చర్యము, ఇంకొక ప్రక్క సంభ్రమము.

క్రిస్‌మస్ సెలవులు సరదాగా గడిచాయి. బాబు ఎంతో హుషారుగా వున్నాడు. ముందులాగ మందకొడితనం, మంకుతనం మచ్చుకైన లేవు. ఈ కొద్ది కాలంలోనే ఏ, బి, సీ, డీ లు నేర్చుకున్నాడు. 1, 2 పలకమీద వ్రాసి చూపాడు. వేళ్ళతో చూపించాడు. బొమ్మలు చక్కగ గీస్తున్నాడు. బొమ్మలు వేయటంలో బాబు ఇంత నేర్పు చూపడం తల్లిదండ్రులకి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. బాబులోని ఈ కళానైపుణ్యాన్ని వెలుగులోకి తెచ్చి ప్రోత్సహించే- గౌరీ రామన్‌కి మధు మనస్సులోనే అభినందనలు తెలుపుకున్నాడు.

నాలుగురోజుల క్రితం నుండి ఉష, రవి బడికి వెళ్తున్నారు. సాయంత్రం అయితే హోమ్‌వర్క్ అంటూ పుస్తకాలు ముందేసుకొని కూచుంటున్నారు. బాబుకి ఏమీ తోచటంలేదు. కూచుని అక్షరాలు

వ్రాసేవాడు. అయినా వాడికి తృప్తిగా లేదు. వాడికి వాడి సహాధ్యాయులపై ద మనస్సు పోతున్నట్లు మధు గ్రహించాడు. స్కూలునుండి వచ్చిన క్రొత్తలో "మళ్ళీ నువ్వు స్కూలుకి వెళ్ళాలి" అన్నట్లు సైగచేస్తే కోపంగా చూసేవాడు బాబు. కాని వాడికి•ఇప్పుడిప్పుడు ఇక్కడికన్న అక్కడే బాగుంది అని తోచటం మొదలెట్టింది. తనకు చేతకాని, తనకు అర్థంకాని భాషలో వీళ్ళేదో చెప్పేసుకుంటున్నారు. తను ఇక్కడ ఒక్కడే - ఇలా మాటలు రానివాడు. అక్కడ అందరూ తనలాగే చక్కగ చేతులతో అర్థం చెప్పే భాషలో మాట్లాడేసుకుంటారు. ఛీ, ఛీ వీళ్ళకి అసలేం తెలీదు. తన ప్రక్కన కూచుండే పొడుగాటి చంద్రం వాడు ఎంచక్కా కాకి కథ చెప్పాడు సైగలతోనే. ఇక్కడి వాళ్ళకి కాకి కథ కాదు కదా, మాటలు చెప్పడమే రాదు. పోనీ వెళ్ళిపోదామా అంటే అమ్మో! అమ్మను విడచి వెళ్ళడమే'- ఇలా సందిగ్ధావస్థలో వున్న బాబు ఒక రోజు ప్రొద్దున అమ్మ తన సూట్‌కేస్ సర్దుతూంటే తెలుసుకున్నాడు. తన్ను మళ్ళీ మద్రాసుకు పంపేందుకు ప్రయత్నాలు చేస్తున్నారని, "వెళ్ళను అమ్మా" అంటూ సుజాత ఒడిలోకి చేరాడు. కాని సుజాత వాడిని దగ్గరకు తీసుకొని "కాదు బాబూ నువ్వు వెళ్ళి బాగా చదువుకోవాలి. మళ్ళీ కొద్ది రోజులలో ఇక్కడకు వస్తావు కదా, అప్పుడు అక్కయ్యలాగా ఎంచక్కా పుస్తకాలు - అవీ చదవచ్చు...." అవీ, ఇవీ చెప్పి బాబుని సమాధాన పరచ ప్రయత్నించింది సుజాత.

తీరా ప్రయాణమై మధు, "రా బాబూ" అనగానే "ఊహుఁ రాను" అన్నట్లు తలవూపి సుజాతను పట్టుకున్నాడు. కానీ.. సుజాత "తప్పుబాబూ, వెళ్ళాలి" అని గట్టిగానే చెప్పి మధుకి అప్పచెప్పింది. అమ్మ కూడా వెళ్ళమంటూంది అనుకున్నాడో... ఇక వెళ్ళక తప్పదు అనుకున్నాడో... వెళ్తేనే బాగుంటుంది అనుకున్నాడో... ఒక్క విసురున తల్లిని వదలి టాక్సీ ఎక్కి కూర్చున్నాడు రాంబాబు.

సుజాత టాక్సీ కనుమరుగయ్యే వరకు చూసి భారంగా లోపలికి నడిచింది. పిల్లలిద్దరు స్కూలు నుండి ఇంకా రాలేదు. ఇల్లంతా బోసిపోయినట్లయి సుజాతకి ప్రాణం బేజారనిపించింది.

నెమ్మదిగా రేడియో ట్యూన్ చేసింది. ప్రాంతీయ వార్తలు రాబోలు వినవస్తున్నాయి. ఈమధ్య క్రొత్తగా పట్టభద్రులయిన విద్యార్థులలో, మూగ చెవిటి విద్యార్థులను గురించి చెపుతూ, అనౌన్సరు, ఇటువంటి విద్యార్థులు కాలేజీలలో ట్యూటర్లుగను, మూగ, చెవిటి పాఠశాలలలో, అధ్యాపకులుగా పనిచేస్తారని తెలియబరిచాడు. ఈ వార్త విన్న సుజాత మనస్సు వుప్పొంగింది. ఔను తన బాబుకూడా చదువుకుంటాడు. మంచి 'డిజైనరో' 'చిత్రకారుడో' 'స్టెనో' అవుతాడు. తప్పక అవుతాడు. తానెంత మంచిపని చేసింది ! తన భర్త తనకెంత మేలు చేశాడు! అవివేకంతో ఆలోచనా రహితంగా ప్రవర్తించి బాబును తమ దగ్గరే వుంచేసుకుంటే ఎలా బ్రతికేవాడు? తల్లి తండ్రులు శాశ్వతము కాదుకదా! తన భర్త, రాంబాబు భవిష్యత్తుకు బంగారుబాట వేసారు. ఔను... నిజంగానే... బంగారు బాటలు వేశాడు.

***(ప్రగతి సచిత్ర వారపత్రిక, 19-2-1971)***

# పసి హృదయం

బడికి టైమవుతుందని చకచకా తయారవుతూంది వసంత. ఇంక పది నిమిషాలు కూడా లేదు. లేటుగ వెళ్తే టీచరు బయట నిలబడమంటుంది. ఎండలో నిల్చోవడం తనకేం కష్టంకాదు. కాని పిల్లలందరు తన వేపు చూస్తే మాత్రం తనకి చచ్చే సిగ్గేస్తుంది. అదిగో బాబ్జీ వస్తున్నాడు. 'తొందరగా రారా టైమైంది' అంటూ వాడిని కొంచెం గట్టిగా లాగింది. అంతే వాడు ఆరున్నొక్కరాగం యెత్తుకున్నాడు. లోపలినుండి కమల వస్తూనే కేకలు వేయడం మొదలెట్టింది. "వసూ ! ఎందుకే వాడినట్లా కొట్టావ్ ? చిన్న సన్నాసి, నెమ్మదిగా బుజ్జగించి తీసికెళ్లలేవూ ? ఎంత విసురే అమ్మా నీకు ? కాస్త నెమ్మది నేర్చుకో తల్లీ" అంటూ.

వసంత వచ్చిన కోపాన్ని దిగమింగుకొని బాబ్జీని తీసికెళ్లింది. వసంతకన్న రెండేళ్లే చిన్న అయిన ప్రమీల సంచి ఊపుకుంటూ ముందు దర్జాగా నడుస్తూంది. వసూకి ప్రమీలని చూస్తే ఒళ్లు మండింది. ఎంతసేపు తనకే అంటగట్టారీ వెధవని ! ఏం ప్రమీ తీసికెళ్లకూడదూ ? ఏమయినా అంటే అమ్మ అది చిన్నది, నువ్వు పెద్ద దానివి అంటుంది. ఎంత పెద్దాన్నో మరి ! స్కూలు గేటు కనిపించగానే తమ్ముడి చేయి వదిలిపెట్టి క్లాసులోకి వెళ్లింది వసంత.

"నాన్నగారు ఆఫీసునుండి వచ్చినట్లున్నారు" అనుకుంటూ హోమ్‌వర్క్ చేసుకుంటున్న వసంత, నాన్నగారి కేకలకి ఉలిక్కిపడి తలెత్తి చూసింది. "వసూ ! బాబ్జీ మోకాలు చూడు యెంతలా కొట్టుకుపోయిందో ! వాడిని కొంచెం చూసుకోమని నీ కెన్నిమార్లు చెప్పాను. వాడేం నీ తమ్ముడు కాడా ? నన్ను కాదన్నట్లు ఉంటావేం?" కళ్లెర్ర చేసి తనవేపు చూస్తూన్న తండ్రిని చూసి బెదిరిపోయింది వసంత. ఎప్పుడు పడ్డాడో వసంతకి అసలు తెలీదు. తను స్కూలు నుండి బయటికి వచ్చేటప్పటికే ప్రమీల, బాబ్జీ బయలుదేరి వచ్చేసినట్లున్నారు. తనకు కనిపించలేదు. ఇంటికి వచ్చాక కూడా తన చదువుగొడవలో పడిపోయి, తమ్ముణ్ణి చూడలేదు. తప్పంతా తనదే అన్నట్లు తండ్రి అంటూంటే వసంతకి దుఃఖం ఆగలేదు. తనలో తనే వెక్కుతూ ఉంటే తల్లి వచ్చి "ఊ ...... చాల్లే. ఏమైనా అంటే చాలు నెత్తిమీద ఉంటుంది నీళ్లకుండ. ఆ డెట్టాల్ యెక్కడుందో ఇలా ఇవ్వు. కాస్త కడిగి నెబాసల్ఫ్ పౌడర్ వేస్తాను. పని హడావిడిలో ఉండి నేను కూడా గమనించలేదు" అంది. తల్లికి అవన్నీ అందించి మళ్లీ పుస్తకాలు ముందేసుకుని కూచుంది వసంత.

అన్నాలవేళ అయింది. కంచాలు టేబిల్‌మీద సర్దలేదని అమ్మ యెక్కడ కేకలు వేస్తుందో అని వసంత గబగబా అన్నము గిన్నెలూ అన్నీ పెడుతూంటే ప్రమీల వచ్చి తన కంచం దగ్గరకు లాక్కుని కూచుంది. ఆ విసురుకి మంచినీళ్ల గ్లాసు ఒలికి టేబిల్ అంతా నీళ్లమయమయింది. అన్నాలు పెడదామని లోపలికి వస్తున్న కమల తప్పెవరిది ? అన్న ప్రశ్నకి తావివ్వకుండా అపరాధిలా నిలబడ్డ వసంత వీపుని విమానపుమోత మ్రోగించింది. ఏడుస్తూ అవతలకి వెళ్లిన వసంత తన మంచం చేరింది.

ప్రొద్దుటినుండి అకారణ ఆగ్రహావేశాలకి గురి అయిందేమో పాపం, వసంత పసిమనస్సు

పూర్తిగా గాయపడింది. నిండా పదేండ్లు నిండని వసంత మనస్సు పరిపరి విధాల పరుగెత్తింది. "ఛీ... తనంటే అందరికీ కోపం. చెల్లాయి అంటే ముద్దు. తమ్ముడంటే గారాం. నేనే ఎవ్వరికీ అక్కరలేదు. ఎందుకు నేనంటే వాళ్లకంత కోపం ? పెద్ద దాన్ననా ? కాదు, కాదు ! మొన్న అమ్మ ప్రక్కింటి అత్తయ్యతో చెబుతూంది. 'ఈ వసంత మాకు పెండ్లయి సంవత్సరమైనా కాకుండా పుట్టిందండీ! నాకే సరదా తీరలేదు. పెండ్లయిన మూడు సంవత్సరాలయినా హాయిగా ఉండాలండీ' అంటూ. అమ్మకి ఇష్టం లేనపుడు పుట్టాను కదూ, అందుకే నేనంటే కోపం. నేను వాళ్లకి అవసరం లేదు. ఉన్నారుగా ప్రమీల, బాబ్జీ" ఇలా అనుకుంటూనే వసంత నిద్రపోయింది.

తల్లి కాబోలు తట్టి లేపుతూంది. "నాకు అన్నము వొద్దమ్మా" అంది నిద్ర మత్తులో వసంత. "ఏంవమ్మా తల్లీ! ఇదంతా కోపమే ! ఊం.... లే .... లే.... అన్నం తిందువుకాని. మళ్లీ నేను గదీ అదీ కడుక్కోవాలి." "ఎందుకే దాన్నంత బ్రతిమిలాడుతావు? ఒక్కరోజు అన్నము తినకపోతే అదేమీ అయిపోదులే ! ఒక పూట భోజనం మానేస్తే ఒంటికి మంచిది కూడా " సగం హాస్యంగా, సగం నిజంగా అంటున్న నాన్నగారి మాటలకు వసంతకి పూర్తిగా మెలకువ వచ్చింది. "హు... నాన్నగారికి నా మీద యెంత కోపం ? ఔను నేనేమీ అయిపోను. దేవుడా ! నాకు జ్వరం వస్తే యెంత బాగుండును! ఫ్లూ జ్వరం వచ్చి ప్రక్కింటి మామ్మగారిలాగ చచ్చిపోతే అప్పుడు తెలుస్తుంది వీళ్లసని. అప్పుడయినా పోతేపోయిందిలే అనుకుంటారేమో" తలగడ వసంత కన్నీళ్లతో తడిసిపోతుంటే ఎప్పుడో నిద్రపోయింది.

"వసూ ! ఇంకా లేవలేదటే" అంటూ వచ్చిన కమల, వసంత ముఖంచూసి ఒంటిమీద చేయివేసింది. వసంత శరీరం పేలిపోతూంది జ్వరంతో. చలికి గడగడ వణుకుతూంది. "అమ్మయ్యో! పిల్లకి జ్వరం వచ్చిందండీ !" అంటూ కమల వేసిన కేకలకి ఆనందరావు వసంత దగ్గరికి వచ్చాడు. నుదుటిమీద చేయివేసి చూసి "ఔను కమలా ! జ్వరం బాగా ఉన్నట్లుంది. చూడు నువ్వు వెళ్లి కాఫీ తీసుకురా. నేను ముఖం కడిగిస్తాను. లేమ్మా వసూ ముఖం కడుక్కుందువు గాని" అంటూ బుజ్జగిస్తున్న నాన్నగారి మాటలకు ఫులిక్కిపడ్డట్లయి విస్తుపోతూ, ఆనందరావుని చూసింది వసంత. "ఎంత ప్రేమగా మాట్లాడుతున్నారు నాన్న! తొందరగా నయమయిపోతే మళ్లీ అడ్డమైన పనులకి తయారవ్వాలి కాబోలు, అందుకే ఈ బాధంత!" కోపంగానే లేచింది వసంత. కాఫీ త్రాగి పడుకుంది. ఆనందరావు డాక్టరు కోసరం వెళ్లారు.

ప్రమీల, వసంత దగ్గరికి రాబోతూంది కాబోలు కమల కేకలు వేసింది, దాన్ని లేపవద్దని. తల్లి కేకలు వింటూనే మగతగ కళ్లు మూసుకుంది. జ్వరం రావాలనుకుంది. జ్వరం వచ్చింది. తరువాత ఏమవుతుందో ! "పోనీ చచ్చిపోతాను. అంతేగా" అటుతిరిగి పడుకుంది వసంత.

ఫ్లూ అనుకున్న జ్వరం టైఫాయిడ్‌లోకి దిగింది. జ్వర తీవ్రతలో ఒళ్లు తెలియకుండా పడి ఉంది వసంత. కమల, ఆనందరావు అన్నాహారాలు మాని వసంత మంచం దగ్గరే కూలబడ్డారు. ప్రమీల, బాబ్జీ, బిక్కుబిక్కు మంటూ అక్కయ్య వంకే చూస్తూ కూచున్నారు. డాక్టరు ఏమీ భయంలేదని చెప్పారు. కాని ఆనందరావు దంపతులు చాలా బెంగపడిపోయారు.

ఆ రాత్రి మరీ ఎక్కువగా ఉంది, వసంత ప్రేలాపన. తడిగుడ్డ తడిపి వేస్తూ ఉంది కమల. "అమ్మా ! నేనంటే నీ కిష్టంలేదు. నాన్నకి కూడ అంతే ! నేనేమయి పోయినా ఫరావాలేదు. ఎప్పుడూ నన్నే తిడతారు" అంటూ పలవరిస్తూంది వసంత. కమల దుఃఖంతో ఆనందరావు వంక చూసింది. నిండా పదేండ్లు నిండని పసిపిల్ల మాటలా ఇవి !

ఆనందరావు ఒక్క వుదుట లేచి కూతురి మంచంమీద కూచున్నాడు. "వసూ ! ఎవరు చెప్పారమ్మా నీవంటే కోపం అని ? నువ్వేనమ్మా మా ప్రాణం. ఏదో కోపంలో మిగతా వారిద్దరి కన్న పెద్దదానివి కదా అని నిన్ను కోప్పడ్డ మాట నిజమేనమ్మా. కాని అలా అనుకోకు తల్లీ. నువ్వు మా బంగారు తల్లివి." ఆనందరావు కన్నీరు వసంత ముఖంమీద జలజలా రాలుతూంది. నాన్నగారి మాటలు వింటున్న వసంత ఆశ్చర్యపోయింది. నాన్నగారికి తనంటే ఇంత ప్రేమా ? అరే ఎలా ఏడుస్తున్నారు ? అమ్మ కూడా బాగా ఏడుస్తూంది. మరి తనలా ఎందుకు అనుకుంది? నాన్నగారి దగ్గరకు రాబోతున్న బాబ్జీని ఒక్కలాగు లాగింది కమల. "ప్రమీ! ఈశని వెధవని అలా బయటికి తీసికెళ్లు. మరీ గొడవ చేసేస్తున్నాడు ; అక్కయ్యకి ఇప్పుడే నిద్రపట్టూంది. తన చెవులని తనే నమ్మలేకపోయింది వసంత. అంత గారాబంగ చూసుకునే తమ్ముడిని యెంతలా కేకలు వేస్తూంది అమ్మ. అమ్మ, నాన్న నిజంగానే బాధపడుతున్నారు. తనంటే వీళ్లకి ఇష్టమే. అట్లాగయితే తనే తప్పుగా అనుకుందా? "అమ్మా!" అంది వసంత. ఇక్కడే ఉన్నాను తల్లీ" అంటూ దగ్గరికి వచ్చింది కమల. "అమ్మా! నేను జ్వరం వస్తే బాగుండును. చచ్చిపోవచ్చును అని దేవుణ్ణి ప్రార్థించాను. జ్వరం వచ్చేసింది. చచ్చిపోతానేమో ! ఇప్పుడెలాగమ్మా. నిజంగానే మిమ్మల్ని వదిలి పెట్టి వెళ్తానేమో అమ్మా" అంటూ వసంత బావురుమంది. వసంత మాటలకి వులిక్కిపడ్డారు భార్యాభర్తలిద్దరూ. కమల వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది.

ఆనందరావు కొంత తేరుకొని "చూడమ్మా వసూ ! నువ్వేదో తెలీక కోరుకున్నావు. నేను లేకుంటే మా అమ్మా నాన్న కూడా ఉండరు. కాబట్టి నన్ను కాపాడు దేముడూ అంటూ ప్రార్థించమ్మ. నీ కోరిక దేవుడు తప్పక వింటాడు." అంటూ కూతురి చేతిలో వెంకటేశ్వర స్వామి పటం పెట్టాడు. తండ్రి చెప్పిన ప్రకారమే తండ్రి ఒడిలో కూచుని దేవుణ్ణి ప్రార్థించి, నిశ్చింతగా పడుకుంది వసంత.

నిద్రపోతున్న కూతురి అమాయక వదనాన్ని చూస్తూ ఆనందరావు, "చూశావా ! కమలా! మన తెలివి తక్కువతనం, అర్థంలేని తొందరపాటు, నిర్లక్ష్యత ఒక పసి మనస్సుని ఎంత గాయపరచిందో ! ఇకనైనా బుద్ధి తెచ్చుకొని పిల్లలు ముగ్గురినీ సమానప్రేమతో చూడడమే మన బాధ్యత అన్నది గుర్తుంచుకోవాలి." భర్త మాటలు వింటూ కమల, వసంత తలనిమురుతూ ఉండిపోయింది.

ఆనాటి నుండి వసంతకు జ్వరం దిగజారింది. క్రమేణ మనుష్యుల్లోకి పడింది. వసంత ఇప్పుడు యెప్పటిలా చలాకీగా ఉంటుంది. మరింత ఉషారుగా కూడా ఉంటుంది. అమ్మా, నాన్నగారు తమ్ముణ్ణీ, చెల్లెల్ని కోప్పడితే వాళ్లని ఆవలికి తీసుకెళ్లి ఓదార్చి తనూ వాళ్లతో కలిసి, ఆడుకుంటుంది.

■

***(యువ మాసపత్రిక, డిసెంబరు 1971)***

# సారా విలియమ్స్

"అమ్మా ! నాన్నగారు వచ్చారు ఆఫీసు నుంచి" అంటూ కవిత సోమసుందరానికి ఎదురేగింది. చేతిలోని బ్రీఫ్‌కేసుని టీపాయ్ మీదికి విసిరేసి, టై లూజ్ చేసుకుంటూ సోఫాలో చేరగిలబడ్డాడు సోమసుందరం. ఫాన్ ఆన్ చేస్తున్న కూతురు కవితను ఉద్దేశించి, "కవితా ! లెటర్సు ఏమైనా వచ్చాయా?" అంటూ ప్రశ్నించాడు. వంటింట్లోంచి చెంబుడు కాఫీ కప్పుతో ప్రత్యక్షమయింది సతీదేవి, సరస్వతి. కూతురు జవాబిచ్చేలోగా, "ఆఁ వచ్చాయండి. కవితా, డ్రాయరు సొరుగులో ఉంచాను, వెళ్లి పట్రా అమ్మా" అంటూ సరస్వతి కాఫీ సేవిస్తున్న భర్త ముఖంకేసి చూసింది. ఆవిడకి బోలెడన్ని పనులు. అందులోనూ మరునాడు శ్రావణ శుక్రవారం. ఇంట్లో కావలసినవన్నీ సమకూర్చుకోవాలి. కాఫీ త్రాగుతూనే లెటర్సు చింపాడు సుందరం. ఒకటి తమ్ముడి దగ్గరనుండి. విశేషాలు చెపుతూనే తిరగేశాడు ఉత్తరాన్ని. ఖాళీ కప్పుని పట్టుకొని పోబోతున్న సరస్వతిని, "ఆగు" అంటూ సైగచేసి, "కవితా! ఓ స్వీట్ న్యూస్" అంటూ కేకేశాడు.

"ఏమిటి, నాన్నా?" అంటూ పరుగున వచ్చింది కవిత. "సబితను కూడా పిలువు" అన్న నాన్నగారి కేకకి జవాబా అన్నట్లు కవిత చెల్లెలు కూడా వచ్చి నాన్నగారి సోఫా మీద కూర్చుంది.

"నేను ఆ మధ్య చెప్పాను గుర్తుందా - అమెరికన్ యూనివర్సిటీ నుంచి విద్యార్థినుల బృందమొకటి మద్రాసు రానున్నట్లు ? దానికి సంబంధించిందీ ఉత్తరం. వచ్చేవారంతా టీనేజ్ గర్ల్సే. ఒక్కొక్క విద్యార్థిని, ఒక్కొక్క ఫామిలీతో ఓ నెలరోజులు గడిపి మన జీవన విధానాన్ని గురించి తెలుసుకుంటారు. అలా ఆతిథ్యమిచ్చే ఫామిలీస్‌లో మనదీ ఒకటి. మన అతిథి పేరు మిస్ సారా విలియమ్స్. ఈ అమ్మాయి మిచిగాన్ యూనివర్సిటీలో, సోషియాలజీలో డిప్లొమాకు చదువుతోందట. వచ్చే గురువారం ఈ పాటికి సారా మన ఇంట్లో ఉంటుంది. మనకంతా ఓ సరికొత్త స్నేహితురాలు..." కూతుళ్లతో చెబుతూ భార్యవేపు చూశాడు సుందరం.

"అలాగా" అన్నట్లు చూసి, సరస్వతి తన పనిలోకి వెళ్లిపోయింది. "హేయ్, హేయ్" అంటూ గంతులేశారు అక్కాచెల్లెళ్లిద్దరు. "నాన్నగారూ! తనొక్కతే మన ఇంట్లో ఉంటుందా ?" అంది ఆశ్చర్యంగా పన్నెండేళ్ల సబిత. "ఔనమ్మా" అన్నాడు సుందరం. "నాన్నగారూ, స్టేట్సు నుండి వచ్చే అమ్మాయి కదా, ఎంత స్టైల్‌గా ఉంటుందో!" అంటూ కవిత తన లంగా, ఓణీల వంక అయిష్టంగా చూసుకుంది. "మన ఇండియాలోనే అందరూ బెల్‌బాటమ్స్, స్ట్రెచ్ పాంట్సు వేసుకుంటారు. అమ్మే ఎప్పుడూ ఈ లంగాలు కుట్టిస్తుంది. నాన్నగారూ, మమ్మల్ని చూసి ఆ అమ్మాయి నవ్వదూ?" పదహారేళ్ల కవిత ఆరోపణలో సోమసుందరానికి కొంచెం సత్యం కనిపించింది. నిజమే, ఎన్నో రకరకాల కొత్త డ్రెస్సులతో, డిజైన్లతో నేటి కాలపు బాలికలు నయనానందకరంగా కనిపిస్తున్నారు. కాని, ఈ సరస్వతిదంతా చాదస్తం. ఆడపిల్లలకి లంగా, ఓణీలే అందం అని వాదిస్తుంది. పైగా తన మాటే నెగ్గించుకుంటుంది.

"కవితా ! మీ అమ్మ మాటలకేంగాని, నేను మిమ్మల్నిద్దరిని రేపు చెల్లారామ్‌కి తీసుకెడతాను. సరికొత్త డ్రెస్సులు కొనుక్కుందురుగాని. కనీసం పైవాళ్లు వచ్చినప్పుడన్నా మనం కొంచెం నాగరీకంగా కనిపించద్దూ ? అయినా, యూరపియన్ కాన్వెంట్‌లో చదివే మీరు అమ్మమ్మల్లా డ్రెస్ చేసుకుంటే, స్టేట్సు అమ్మాయి నవ్విపోదూ !" తండ్రి ఏకాల్తాకి సంబరపడిపోయారు కూతుళ్లిద్దరూ. అప్పుడే లంగా, ఓణీలను విప్పి పారేసి, టైట్ పాంట్సు, స్లాక్సులోకి వెళ్లిపోయినట్లు ఊహించుకొని సంబరపడిపోయారు.

"నాన్నా!" అంటూ చెంగున ఒడిలోకి దూకాడు, ఎనిమిదేళ్ల ప్రభు. ఉలిక్కిపడ్డారు ముగ్గురూ. "ఒరేయ్ ! ఇంతసేపూ ఎక్కడున్నావ్?" అంటూ కొడుకును దగ్గరకి తీసుకున్నాడు సుందరం.

"ప్రభూ ! చూడు, ఇకమీదట నాన్నగారిని 'డాడీ' అనాలి, తెలుసా ? నాన్న - బోన్న అనకూడదు. అలాగే అమ్మని 'మమ్మీ' అనాలి" అంది కవిత, పాఠం నేర్పిస్తున్నట్లు.

"ఏం, ఎందుకూ ?" అంటూ రెట్టించాడు పసివాడు. "కవితా ! నేను చిన్నప్పుడే మీకు మమ్మీ, డాడీ అని నేర్ప ప్రయత్నించానమ్మా. కాని, మీ అమ్మే శుభ్రంగా తల్లిని, అమ్మా ! అని నోరారా పిలవకుండా, మమ్మీ ఏమిటి మేకలాగ మేమ్మే అంటూ కొట్టేసింది. పోనీ, నన్నైనా డాడీ అని పిలవనీనే, సరూ, అంటే - డాడీ వద్దూ బోడీ వద్దూ, డాడీ కాస్తా 'దాడీ' అయి కూచుంటుంది అంటూ నా ప్రయత్నాన్ని విఫలం చేసింది. చూశావా, ఇప్పుడు, ఈ గుంట వెధవ 'ఎందుకూ?' అంటున్నాడు!" సోమసుందరం (పాపం) వాపోయాడు. అతనికి చిన్నప్పటి నుండి విదేశ నాగరికతా వ్యామోహం ఎక్కువ. ఏరి కోరి విద్యాధికురాలిని, గ్రాడ్యుయేటు సరస్వతిని చేసుకున్నాడు. కాని, అదేమిటో ఖర్మ, సరస్వతి మొదటి నుండి సుందరం వెర్రిపోకడలకి వంత పాడక, ఒకే మారు మంగళహారతి పాడేసింది. తను నమ్మిన హైందవ సంప్రదాయాలనే ఇంట ప్రవేశపెట్టి, అమలు పెట్టింది. కాని, ఇప్పుడు ఒక విదేశీయ బాలిక ఇంట అడుగు పెట్టుతున్నది అనగానే సుందరంలో ఇన్నాళ్లూ అణగారిపోయిన విదేశ నాగరికతా వ్యామోహం వేయితలలు దాల్చింది. దానికితోడు కుమార్తెల ప్రోత్సాహము.

సారా రాబోయే రోజును తలచుకొని సుందరం, కవితా సబితలు ఎన్నో కలలు కన్నారు. ఇంటిలో చాలా మార్పులు తెచ్చారు. చాలా వాటిని సరస్వతి ఆమోదించలేదు. కాని, బలం అవతలి పక్షం వారిది కావడం మూలాన మౌనంగా ఉండిపోయింది. "ఏమర్రా, నా వంటింటిని, పూజా గదిని మాత్రం వదిలి, మిగతా గదులను మీ ఇష్టమొచ్చినట్లు మార్చుకోండి. ఈ అలంకరణలు, అనవసరమైన వ్యయప్రయాసలు!" తన అభిప్రాయం వెలిబుచ్చింది సరస్వతి. 'మొహంజదారో నాటి ఆడమనిషిరా, భగవాన్!' అనుకున్నాడు సుందరం.

ఖరీదైన తివాసీ డ్రాయింగురూమును అలంకరించింది. ఎనిమిది వందలు పెట్టి కొన్న ఓ డైనింగ్ టేబిల్ వంటింటి నానుకొని ఉన్న వరండాలో వెలిసింది--టేబిల్‌కి తగ్గ కుర్చీలతో సహా. ప్రతి గుమ్మానికి అందమైన కర్టెన్లు, గోడలకి వాల్ హాంగింగ్స్ వేలాడగట్టారు. పింగాణి క్రాకరీ సెట్టు, టీ సెట్టు, ఫోర్కు్స్, స్పూన్లు మీట్ షెల్ఫ్‌లో అందంగా అమర్చారు. బాత్‌రూములో టబ్ కూడా పెట్టితే బాగుంటుందని అనుకున్నాడు సుందరం, కాని బడ్జెట్ అంగీకరించలేదేమో, ఆ ప్రయత్నాన్ని విరమించాడు. ఈ ఏర్పాట్లన్నీ చూస్తూ సరస్వతి నవ్వుకుంది. 'హిందూదేశ సంప్రదాయాలని, అలవాట్లని, జీవిత పద్ధతులని చూడడానికి రాబోతున్న విదేశ వనితలకి వీళ్లు చూపించబోతున్నదేమిటి - ప్చ్! వీళ్ల పిచ్చే వీళ్లకానందం'. నిట్టూర్చింది సరస్వతి.

ఇంటిల్లిపాదికి బాత్‌రూమ్ శాండల్సు, పిల్లలకి నైట్ గౌనులతో సహా తెచ్చాడు సుందరం. ప్రభుకి సాక్సు, బూట్సు, డ్రెస్సులు అన్నీ సరికొత్తవి కొన్నాడు. వాడు అవన్నీ చూసుకొని మురిసిపోయి, సరస్వతిని మమ్మీ అని, సుందరాన్ని డాడీ అని పిలవడం మొదలెట్టాడు. కవితా, సబితా రోజుకొక్క డ్రెస్సు చొప్పున వేసుకొని ప్రాక్టీసు చేసుకుంటున్నారు. వాళ్ల అవతారాలను చూచి, ఒకందుకుమాత్రం సంతోషించింది సరస్వతి, రక్షించి జడలు కత్తిరించి బాబ్ చేసుకోలేదులెమ్మని.

అనుకున్న గురువారం రానే వచ్చింది. ఉదయం నుండి కవితా సబితలు నిరీక్షిస్తూ కూచున్నారు సారా కోసం. సుందరం కాన్సలేట్‌కి ఫోన్‌చేసి సారా సాయంత్రం నాలుగు గంటలకు రానున్నట్లు తెలుసుకున్నాడు. నాలుగున్నరయినా రాకపోవడంతో, "ఏమా?" అంటూ వీధి గుమ్మం కేసి నడిచాడు సుందరం. ఇంతలో డ్రాయింగ్‌రూమ్‌లో 'ట్రింగు, ట్రింగు' మంటూ ఫోను మోగింది. ఫోన్ రిసీవ్ చేసుకున్న సరస్వతి 'సారా' ఆ సాయంత్రం కాన్సలేట్‌లోనే ఉండిపోతున్నట్లు, మరునాడు అంటే శుక్రవారం ఉదయమే కార్లో వాళ్ల ఇంటికి వస్తున్నట్లు చెప్పడంతో సుందరం చప్పబడిపోయాడు. స్ట్రెచ్ పాంట్లలో ఇరుక్కుపోయి నిరీక్షిస్తున్న కవితా సబితలు నిస్పృహలతో లోనికి నడిచారు.

శ్రావణ శుక్రవారం పూజ హడావిడిలో మునిగి తేలుతూంది సరస్వతి. కవితా సబితలు వెంట రాగా బయటకు నడిచాడు సుందరం. "సరూ, మేము తిరిగి వచ్చేటప్పటికి నువ్వు కూడా ఫారిన్ జార్జెట్ చీర కట్టుకొని రెడీగా ఉండు. మరీ ఏబ్రాసిలా, ముసలి ముత్తయిదువు లాగ చింకి చీరలో సాక్షాత్కరించకు. నేనూ, అమ్మాయిలూ స్వయంగా వెళ్లి సారాను పిలుచుకు వస్తాము." కారులో వెళుతూ సరస్వతికి లాస్ట్ మినిట్ ఇన్‌స్ట్రక్షన్స్ జారీ చేశాడు సుందరం.

పోర్టికోలో కారు ఆగిన చప్పుడు వినవచ్చింది. అటెన్షన్‌లో నిలబడి ఉన్న నౌకరు కుర్రవాడు రంగడు పరుగున వెళ్ళి కారు తలుపులు తెరిచాడు. సుందరమే ముందుగా దిగి, సారా కేసి చూస్తూ, "ఎస్, కమిన్ ప్లీజ్. హార్టీ వెల్‌కమ్ టు అవర్ స్వీట్ హోమ్!" అంటూ స్వాగత వచనాలు పలికాడు. సవితా, సబితా చిరునవ్వులతో ముందు నడుస్తూంటే, సారా మందహాస వదనంతో ఇంట్లోకి అడుగుపెట్టింది.

ఇంటి ముంగిట ఉన్న బృందావనంలోని తులసి మొక్కకి నీళ్లు పోయడానికి రాగి చెంబుతో వస్తూ వచ్చిన సరస్వతి సారాని చూచి, "రా అమ్మా, రా!" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది. 'ఇదేమిటి - ఇంత చెప్పినా ఇలా ఉన్నావ్' అన్నట్లు కోపంగా చూశాడు సుందరం భార్యకేసి. తలంటి పోసుకున్న కురులు తడి తడిగా నుదురు కంటుకుపోయి ఉన్నాయి. పూజా పుష్పాలు కొన్ని సరస్వతి ముడిలో నుండి తొంగిచూస్తున్నాయి. ముఖం నిండా పచ్చటి పసుపు, నుదుటి మీద ఎర్రటి పెద్ద కుంకుమ బొట్టు. కట్టుకున్నది పాత పట్టుచీర, ఒక చేతిలో రాగి నీళ్లచెంబు, ఇంకొక చేతిలో రాగి పళ్లెంలో పూలు, పండ్లు, అగరువత్తులు - ఏమిటా ఇవన్నీ అన్నట్లు సరస్వతి వంక చూస్తున్న సారాను ఉద్దేశించి, "షి ఈజ్ మై వైఫ్ - సరస్వతి" అన్నాడు సుందరం. "అవర్ గెస్ట్ ఫ్రమ్ ద స్టేట్స్ మిస్ సారా విలియమ్స్." కంఠంలో కొంచెం కోపం పలికిస్తూ భార్య ముఖంలోకి చూశాడు సుందరం.

"అదేమిటండీ ! వచ్చినప్పటి నుండి మీరు ఇంగ్లీషులో మాట్లాడుతున్నారు. నాకు తెలుగు వచ్చు. నేర్చుకున్నాను ఇక్కడికి వచ్చే ముందు" అంటూ స్వచ్ఛమైన తెలుగులో జవాబు ఇచ్చింది, ఆ అమ్మాయి. సారా తెలుగు ఉచ్చారణకి మెచ్చుకోకుండా ఉండలేకపోయింది సరస్వతి. రెండు మూడేండ్లు విదేశాలలో గడిపి వచ్చే తెలుగు వారికి పూర్తిగా ఉచ్చారణలో ఇంగ్లీషు యాక్సెంటు వచ్చేస్తుంది. కొంతమంది అయితే పూర్తిగా తెలుగు మరిచిపోతారు (మరిచిపోయినట్లు నటిస్తారు). అలాంటిది ఈ అమ్మాయి తెలుగు పలుకులు విని ఎంతో సంబరపడిపోయింది సరస్వతి.

'వెళ్లమ్మా లోపలికి ... ఇదో, నేనిప్పుడే వచ్చేస్తాను. కవితా, అమ్మాయికి స్నానం అదీ చూడు" అంటూ తులసమ్మ దగ్గరికి సాగిపోయింది, సరస్వతి. సుందరం తన గదిలోకి వెళ్లిపోయాడు. కించిత్ అసంతృప్తి అతని మనస్సులో చోటు చేసుకుంది.

సరస్వతి బ్రెడ్ టోస్టు చేసి ఇస్తుంటే సబిత అవన్నీ టేబిల్ మీద అమరుస్తూ ఉంది. సారా, సవితా కబుర్లు చెప్పుకుంటూ వచ్చి, టేబిల్ ముందు కూచున్నారు. సుందరం అప్పటికే టిఫిన్ తింటున్నాడు. అతనికి తొమ్మిది గంటలకే ఫ్యాక్టరీ. రఘు ఎనిమిది గంటలకే కాన్వెంటు కెళ్లాడు. అందరికి బ్రెడ్ కాల్చడం, అయ్యాక, సరస్వతి కూడా వచ్చి టేబిల్ ముందు కూచుంది. "మీరు ఏమీ తినరా ?" అంటూ ప్రశ్నించింది సారా. "ఎందుకు తిననమ్మా - తింటాను. మీ టిఫిన్ కానివ్వండి. నా దేముందిలే" అంది సరస్వతి. "ఉహుఁ అలాగ కాదు. మీరు కూడా తినాలి" అంటూ తన ఆమ్లెట్ ప్లేటును, బ్రెడ్‌టోస్టును సరస్వతి దగ్గరికి తోసింది సారా. ఇక ఊరుకుంటే లాభం లేదని, "ఈరోజు శుక్రవారం కదా ? నేను నాన్-వెజిటేరియన్ ఫుడ్ తినను" అంది.

"అలాగా !" అంటూ కొంచెం ఆశ్చర్యపోయింది. 'వై సో ? ఒక్క ఫ్రైడే ఎందుకు సెలెక్టు చేసుకున్నారు?" అంది. సరస్వతి నవ్వేసి, "ఈ శుక్రవారాలు పూజలు చేసి, దేవుణ్ణి ప్రార్థించి, ఇలా ఒక్క పొద్దులుంటే, భర్త ఆయుష్షు పెరుగుతుందని మాలో ఒక నమ్మకం. అంతే" అంది.

"అయితే మీరేం తింటారు?"

"దేవుడికి నైవేద్యం పెట్టిందే!"

"నైవేద్యం అంటే !"

"పాలతో, సగ్గుబియ్యాలతో పరమాన్నం చేస్తాం. అదో ..... ఇంకేదైనా దేవుడికని శుచిగా, ప్రత్యేకంగా చేస్తాం. ఈరోజు కొద్దిగా చక్కెర పొంగలి చేశాను."

"సక్కెర పొంగలా! అదెలా ఉంటుందండీ ?" ఆసక్తిగా అడిగింది సారా. సరస్వతి చక్కెర పొంగలి తేవడానికి లేచి వెళ్లింది.

"కవితా ! వాట్ డు యు కాల్ యువర్ మదర్ ? ఐ టూ వాంట్ టు కాల్ హర్ లైక్ దట్" అంది సారా బ్రెడ్ టోస్ట్ తింటున్న కవితకేసి చూస్తూ.

"సింపిల్. ఉయ్ కాల్ హర్ అమ్మా" అంది కవిత.

"వాట్ ! మేము మమ్మా అంటాము. మీరూ అలాగే పిలుస్తారా ? మీ భాషలో తల్లీ అంటారు కదా ?" ఆశ్చర్యపోయింది సారా. సుందరానికి సిగ్గుతో తలభూమిలోకి పోతుందేమో అనిపించింది.

"ఎక్స్‌క్యూజ్‌మీ. నాకు ఆఫీసుటయిమయింది" అంటూ లేచిపోయాడు.

వాళ్ల సంభాషణ వింటూ వచ్చిన సరస్వతి, "ఏముంది, ఇక్కడి పిల్లలు తల్లిని అమ్మా ! అని పిలుస్తారు" అంటూ కూతుళ్ల సంకటావస్థను తప్పించింది.

"అమ్మ....అమ్మా! హౌ స్వీట్! మీ కేమి అబ్జెక్షన్ లేకుంటే, నేను కూడా మిమ్మల్ని అమ్మా అంటాను. ఏమమ్మా!" అంది, ఎంతో సంబరంగా సారా. తన కూతురే ఇంకో రూపంలో సాక్షాత్కరించిందా అన్నంత ఆనందం కలిగింది సరస్వతికి. "అలాగె పిలు, సారా" అంటూ చక్కెర పొంగలి ఆ పిల్ల ప్లేట్లో వడ్డించింది. తనూ ఒక ప్లేట్లో పొంగలి తెచ్చుకొని, పీట వాల్చుకొని కూర్చుంది సరస్వతి.

"హౌ స్వీట్ ! కస్టర్డ్ కన్నా కూడా చాలా నైస్‌గా ఉంది. అమ్మా ! ఇదెలా చేస్తారో నాకు నేర్పించరూ ! ఈ న్యూడిష్‌ని చేసి మా దేశంలో మా ఫ్రెండ్సుకి తినిపిస్తాను." లొట్టలు వేసుకుంటూ చక్కెర పొంగలిని తింటున్న సారాని, బ్రెడ్ టోస్టుని స్టైల్‌గా ఫోర్కు, స్పూన్లతో తింటున్న కూతుళ్లని మార్చి మార్చి చూసి, మనస్సులోనే నవ్వుకుంది సరస్వతి.

స్కూలుకి టైమయిందని కవితా సబితలు వెళ్లిపోయారు. ఇక సరస్వతి వెంబడి తిరుగుతూ బోలెడు ప్రశ్నలతో తన సందేహాలని తీర్చుకోసాగింది సారా. "అమ్మా ! ఇక్కడ ఏమి పెయింట్

వేశారు'' అంటూ గుమ్మాలు చూపించింది. అది పసుపు కుంకుమ అని, ప్రతి శుక్రవారం అలా పెట్టడం రివాజు అని బోధపరిచింది సరస్వతి. వాకిట్లో పెట్టిన ముగ్గులను చూసి, "అబ్బ ! ఎంత ఆర్టిస్టిక్‌గా ఉన్నాయి!'' అంటూ మురిసిపోయింది, సారా. ప్రతిదీ 'నాకు నేర్పవూ' అంటూ అడగడం సరస్వతికి ముచ్చటేసింది. ఎంతసేపూ చదువులూ, కాకుంటే సినిమాలూ, స్నేహితులే తప్ప మరో ప్రపంచంతో నిమిత్తం లేనట్లు వ్యవహరించే పుత్రికారత్నాలని తలుచుకుని కాసింత నిట్టూర్చింది సరస్వతి.

నుంచి సుందరం వచ్చాక సినిమా, సినిమా అంటూ పిల్లలు గొడవ చేయసాగారు. ఎస్, ఉయ్ షెల్ గో టు ఆనంద్! మాంచి ఇంగ్లీషు పిక్చర్ ఆడుతోంది ఆ థియేటర్‌లో'' అన్నాడు సుందరం. "పిక్చరా ! వై నాట్ టు సమ్ డాన్స్ పర్‌ఫార్‌మెన్స్!'' అంది సారా. కవిత ఆ దినం పేపరు తెచ్చి తిప్పి అన్నామలై మన్రమ్‌లో శ్రీమతి వసంతలక్ష్మి నరసింహాచారి కూచిపూడి నృత్య ప్రదర్శన ఉందంటూ అనౌన్సు చేసింది. ఓకే వెళదామనుకున్నారు అందరూ.

కవిత, ఫ్లోరల్ డిజైను ఉన్న లుంగీని చుట్టి, పైన జుబ్బా లాంటిది ధరించి ఒయ్యారంగా నడిచి వచ్చింది. సబిత బెల్‌బాటమ్స్, స్లీవ్‌లెస్ స్లాకు ధరించి నాన్నగారి చెంత సాక్షాత్కరించింది. ప్రభు టిప్‌టాప్‌గా తయారై వచ్చాడు. ఇక సారాదే ఆలస్యం. "మీ అమ్మ ఏదర్రా?'' అన్నాడు సుందరం. "ఇదుగో, వస్తున్నానండి'' అంటూ సారా గదిలో నుండి జవాబిచ్చింది సరస్వతి. కాస్సేపటికి ముస్తాబు మూటగట్టే అందాల సారాతో సహా ఇతలకి వచ్చింది సరస్వతి. కవితా సబితలు సారాని చూసి విస్తుపోయారు. సుందరం అయితే నిశ్చేష్టుడే అయ్యాడు. "ఏమ్ ఐ లుకింగ్ ఫ్రెయిల్!'' అంది నవ్వుతూ సారా. కవిత కంచిపట్టు లంగా, ముదురు నీలం రంగుది, కట్టుకొంది సారా. ఊదారంగయిన బ్లూ చోళీ వేసి, మాచింగ్‌గా లైట్ ఎల్లో ఓణీ వేసింది. మెడలో ముత్యాల దండ, చేతులనిండా గాజులు (చెవిలో కూడా ఏమైనా వేసుకోవాలని సంబరపడింది కాని, కన్నాలుంటేగా? అందుకని వీలుపడలేదు). పద్దెనిమిదేళ్ల సారా ఆ డ్రెస్‌లో పధ్నాలుగేళ్ల పిల్లలాగా ఉండి, అసలు హిందూ కన్యలాగా కనిపించింది. పెద్దగా అలవాటు లేని డ్రెస్సులో పిల్లలందరూ తడబడుతుండగా, సరస్వతి గ్రహించినదై, "సారాకి ఓ ఫోటో తీద్దామర్రా. ఎంత చక్కగా ఉందో ఈ డ్రెస్సులో!'' అంటూ హాస్యమాడేసింది.

అన్నామలై మన్రంలో నర్తకీమణి కూచిపూడి నృత్య ప్రదర్శనను చూచి సరస్వతీ, సారాలు చాలా ఆనందించారు. సోమసుందరానికి ఇటువంటివి ఎప్పుడూ ఇష్టం ఉండవు. పాపం, ఏదో కంపెనీ కోసమని రాక తప్పింది కాదా మానవుడికి. ఇక కవితా సబితలా ? పెద్ద అయిష్టం కాకపోయినా, అలవాటు లేని బట్టలలో ఇరుక్కొని, స్వేచ్ఛగా లంగాలో మసిలే సారాని ఎన్వీ చేస్తూ గడిపేశారు. పైగా వచ్చిన వారందరు సారాని ఆ డ్రెస్సులో లైక్ చేస్తూ, తమని జుగుప్సగా చూసినట్లు కూడా ఫీల్ అయ్యారు.

ఆ రోజుకి సారా వాళ్లు వచ్చి సరిగా పదిహేను రోజులయింది. అమ్మాయిలందరూ కలిసి (అమెరికన్) మెరీనాకు ఎదురుగా ఉన్న యూనివర్సిటీ హాల్లో ఆ మధ్యాహ్నం ఓ చిన్న కల్చరల్ ప్రోగ్రామ్ ఇస్తున్నారు. ఆహ్వానితులు ముఖ్యంగా అమెరికన్ కాన్సులేట్‌లో పనిచేసేవారు. సారా - కవిత, సబితలను తనతో తీసుకువెళ్లేందుకు సరస్వతి అనుమతి తీసుకుంది. "మీరూ రాకూడదా, అమ్మా!" అంటూ సారా సరస్వతిని ఆహ్వానించింది. "అలా కాదు కాని, సారా, ఒకటి చేయి. మీ ఫ్రెండ్సు నందరినీ మనింటికి తీసుకురా, ప్రోగ్రామ్ అయ్యాక" అంది సరస్వతి. "ఓకే" అంటూ పాలోమని బయటకు దూకారు అమ్మాయిలు ముగ్గురూ. ప్రత్యేకంగా వచ్చిన బస్సులో ఎక్కి కూర్చుంటూ సారా, "అమ్మా" అంటూ సరస్వతిని కేకేసింది. బయటకు పరుగున వచ్చిన సరస్వతి ముఖంలోకి సవినయంగా చూస్తూ, "సక్కెర పొంగలి, ఇఫ్ యు డోంట్ మైండ్" అంది. "భలేదానివే.... తప్పకుండా" అంటూ లోనికి వెళ్లిపోయింది సరస్వతి.

బిలబిలలాడుతూ గలగలా గదిలోకి ప్రవేశించారు పదిమంది ఆడపిల్లలు. ఏర్పాట్ల కోసమని ముందుగానే వచ్చిన కవితా, సబితలు ఎదురేగి వాళ్లని ఆహ్వానించారు. ఇంతలో సరస్వతి కూడా వచ్చింది. వచ్చిన అమ్మాయిల నందరిని సరస్వతికి పరిచయం చేసింది సారా.

"మిస్ విన్నీ, మిస్ వందా, మిస్ జోనా, మిస్ సిస్సీ, మిస్ పమేల, మిస్ జమీన, మిస్ కమిల్లా, మిస్ తెరేషా, మిస్ జెన్నిఫర్....

మై హోస్టెస్ మిసెస్ సరస్వతి, బి.ఎ."

పరిచయాలయ్యాక అందరూ సోఫాలలో కూచున్నారు. ఒక పిల్లకండ్లు, ఆకుపచ్చ రంగులో మిలమిలా మెరిసిపోతుంటే, ఇంకొక అమ్మాయి జుట్టు తేనె వర్ణంలో ధగధగ మంటూంది. అన్నెము, పున్నెము ఎరగని కన్నెపిల్లలు. ఏ ఊరు అయితే నేమి, ఏ దేశమయితే నేమి ? వారి ఉత్సాహము, హుషారు చూస్తే సరస్వతికి పట్టరానంత ఆనందం కలిగింది. కన్న తల్లితండ్రులను వదిలి పరాయి దేశానికి వచ్చిన వీళ్లకి ఆదరణలో ఏ లోటూ రాకూడదు.

ఇక వాళ్లు ఉన్నది ఒక్క పూటే అయినా, సరస్వతికి ఊపిరాడనంత పని. గలగల ప్రవహించే సెలయేరు కయినా కొంత నిశ్చలత ఉంటుందేమో కానీ, ఈ పరవళ్లు తొక్కే కన్నె పరువానికి ఉండదేమో ! అందులో ప్రతిదీ తెలుసుకోవాలన్న ఉత్సుకత వారిలో ఉట్టిపడుతూంది. వాళ్ల వాళ్ల హోస్టెసెస్‌ని గురించి ఎంతో గొప్పగా చెప్పుకున్నారు. ఒక అమ్మాయి అయితే, వాళ్ల హోస్టెస్‌ది పట్టుచీర సింగారించుకొని వచ్చింది. అక్కడ ఆవిడ కుదురుగానే కట్టి పంపింది. కాని, ఇక్కడ ఆ అమ్మాయి ఏమిట సవరించడం సరస్వతి డ్యూటీ అయి కూచుంది.

ఇల్లంతా కలియ తిరిగారు. ఆఖరికి పూజా మందిరంలోకి కూడా ప్రవేశించి, పూజా విగ్రహాలని ఎంతో భక్తి శ్రద్ధలతో చూసి, 'ఆర్టిస్టిక్‌గా ఎంచక్కా అరేంజ్ చేశారు' అంటూ మెచ్చుకున్నారు. ఇక బీరువాలోని చీరెలన్నీ కలగాపులగం చేసేసి, వాళ్ల వాళ్ల దేశాలకు వెళ్లే ముందు కొనవలసిన చీరల

జాబితాలను ఏకరువు పెట్టారు. అందులో ఒక అమ్మాయి - "ఆంటీ ! మీ ముక్కుకి ఉన్నదే ... అదేమిటి ?" అంటూ సరస్వతి ముక్కుపుడక మీద పట్టించింది. సీల తిప్పి, తీసి చూపింది సరస్వతి. "మార్వెలస్, వండర్‌ఫుల్..." అంటూ దాన్ని ముక్కుకి పెట్టుకొని అద్దంలో చూసుకుంటూ సంబరపడిపోయారు. ముక్కులు కుట్టి ఉన్నా, కన్నాలు కనపడేటట్లు ముక్కుపుడకలు తీసేసి బోసి ముక్కులతో తిరిగే మన దేశపు స్త్రీలు ఎందరో సరస్వతి కండ్లముందు సాక్షాత్కరించారు.

"రండమ్మా, టిఫిన్ తిందురుకాని." ఆహ్వానించింది సరస్వతి. డైనింగ్ టేబిలు మీద పెద్ద పెద్ద పళ్లెరాల్లో ఆవడలు, చక్కెర పొంగలి, కట్లెట్స్ కనిపిస్తున్నాయి. సారా చక్కెర పొంగలిని అందరి ప్లేట్లలోకి వేస్తూ, "ఐ లైక్ ఇట్ వెరీ మచ్...." అంటూ ఆప్యాయంగా సరస్వతి ముఖం వంక చూసింది. "ఇవి కూడా వడ్డించమ్మా" అంది సరస్వతి, ఆ వడలకేసి చూపుతూ.

"ఈ వడలు ఇంత గుండ్రంగా ఎలా వచ్చాయబ్బా ! మధ్యలో కన్నం ఎలా వచ్చింది..." ఆవడలు తింటూ అమెరికన్ అమ్మాయిలు సందేహాలు వెలిబుచ్చారు. టిఫిన్లు తిని చాకలేటు టీ త్రాగి మళ్లీ బిలబిలా పరుగెత్తారు డ్రాయింగ్ రూమువేపు, చూస్తూ చూస్తూ వదిలి వచ్చిన ఆల్‌బమ్ కోసం. ఆల్‌బమ్ పేజీలు తిప్పుతూ ఒక చోట ఆగిపోయింది ఓ అమ్మాయి. "ఆంటీ! ఇలా కాలివేళ్లకి వైట్ రింగ్స్ ఎందుకు వేసుకుంటారు ?" ఆశ్చర్యంగా అడిగింది. "వాటిని మట్టెలంటారమ్మా! పెళ్లి అయిన వాళ్లే వేసుకుంటారు" అంది సరస్వతి. "మరి పెళ్లయిన మా హోస్టెస్ మిసెస్ సుభద్ర వేసుకోలేదేం!" అలాస్కా అమ్మాయి మిస్ కమిల్లా సందేహం వెలిబుచ్చింది.

"వేసుకోకపోవడం ఫాషన్ కాబోలు!" అంది సరస్వతి, ఏమనాలో తోచక. "కాలికి ఉండేవే కదా .... ఫాషన్‌కి ఎలా అడ్డువస్తాయి ? అవి వేళ్లకీ ఎంత అందంగా ఉన్నాయో!" అంది టెక్సాస్ యువతి మిస్ జోనా.

"ఆంటీ, ఈవిడ ఎవరు?" అంటూ ఓ ఫోటో చూపించింది మిస్ పమేలా. "అదా! ఆవిడ మా హస్బెండ్ చెల్లెలికి మదర్-ఇన్-లాకి చెల్లెలు కూతురు" అంది సరస్వతి. ఆ తిరుగుడు వ్యవహారం బోధపడని మిస్ పమేలా, "ఓ గాడ్ ... అంత దూరపు బంధువుని మీరు గుర్తు పెట్టుకుంటారా ! మాకయితే ఒక్క తల్లి, తండ్రి తప్ప ఇంకెవరితో పరిచయమే ఉండదు" అంది. "మా కలా కాదమ్మా. మా దేశంలో బంధుప్రేమలు ఎక్కువ" అంది సరస్వతి. "మీరెలాగయినా చాలా అఫెక్షనేట్ పీపుల్" అంది సారా మెచ్చుకోలుగా.

సాయంత్రం ఆరు కావచ్చింది. అమ్మాయిలందరూ తోటలోకి జొరబడ్డారు విరిబాలల్లాగ. సన్నజాజులు, విరజాజులు, కనకాంబరాలు గుంపులు పోసి చుట్టూ కూచున్నారు. "అబ్బ ! ఈ ఫ్లవర్స్‌కి ఎంత స్వీట్ స్మెల్ ! అందుకే మీరు జడ వేసుకొని పువ్వులు పెట్టుకుంటారు, అందంగా" అంది సారా, కవిత కేసి చూస్తూ. మాల కడుతున్న సరస్వతిని కన్నార్పకుండా చూశారు పిల్లలు. "అరెరే... ! ఎలా వేస్తారు నాట్ ? మాకు నేర్పండి" అంటూ గోల. నేను వేస్తానని చేతికి తీసుకుని పూలని నడిమికి తెంపేశారు. "వద్దు, వద్దు. ఆంటీ కడుతుంటే చూద్దాము" అంటూ మేజిక్ చూస్తున్నంత ఉత్సుకతతో చూశారు. పిల్లలందరూ మొహాలు కడుకున్నాక, వాళ్లకి రకరకాల

బొట్లు పెట్టి, రిబ్బనుతో జుట్లు కట్టి, పువ్వులు పెట్టింది సరస్వతి. 'హౌ నైస్ !' అనుకుంటూ ఆనందపడిపోయారు అమాయిక బాలికలు.

'మనం వెళ్లేలోగా ఇంకొక రోజు ఆంటీతో స్పెండ్ చేయాలి' అనుకుంటూ వీడ్కోలు తీసుకొని సాగిపోయారు మిగతా పిల్లలందరూ. సారా మాత్రం ఉండిపోయింది.

"కవితా ! ఈరోజే కదూ సాంబశివరావుగారి అమ్మాయి పెండ్లి?" అంటూ వచ్చింది, కవితా వాళ్ల గదిలోకి సరస్వతి. కవిత లేచి పక్క సర్దుతూంది. సారా లేచి కండ్లు తెరిచి సరస్వతిని చూచి, "గుడ్ మార్నింగ్"! అని నవ్వింది.

ఇంతలో కవిత - "ఎస్... ఎస్... మరిచాను. ఈవేళే. పది గంటలకు" అంది. "మరి నువ్వూ, సబితా వెళతారా ? మీ నాన్నగారికి అనుకోకుండా ఫ్యాక్టరీ నుండి ఎవరో విజిటర్స్ వచ్చారంటూ ఫోన్ కాల్ వచ్చింది. వారు వెళ్లారు" అంది సరస్వతి. "మరి నువ్వు రావా ?" అంది కవిత, బ్రష్ మీద పేస్టు వేసుకుంటూ. "నాకెలా తీరుతుంది.... మీ నాన్నగారు భోజనానికి ఎన్ని గంటలకు వస్తారో ? మీరిద్దరూ వెళ్లి రండి. అన్నట్లు సారాను కూడా తీసుకెళితే ? ఏమ్మా, సారా, వెళతావా ?" అంది సరస్వతి. ఒక్క గెంతు గెంతింది సారా పక్కమీది నుండి. "హౌ స్వీట్ ! నేను ఎన్నిదినాల నుండో అనుకుంటున్నాను, హిందూ మేరేజి చూడాలని. ఇదో ఒన్ మినిట్" అంటూ బాత్‌రూము వేపు దూసుకుపోయింది సారా. సారా చిలిపిచేష్టలకు నవ్వుకుంటూ సరస్వతి వంటగదికేసి నడిచింది.

టాక్సీ హబీబుల్లా రోడ్డు మలుపు తిరిగి, ఎస్.జి.ఎస్. సభ వద్ద ఆగింది. సారా, కవితా, సబితా టాక్సీలోంచి దిగారు. భాగ్యవంతుల పెండ్లి కాబోలు చెప్పలేనంత ఆర్భాటం. బాండ్ మేళం, ప్రఖ్యాత వాద్యకారుని సన్నాయి ఆహూతులను ఆకర్షిస్తున్నాయి. కవిత సారాకేసి చూస్తూ, "ఇదుగో- ఈ ఎదురుగా ఉన్న బిల్డింగ్ లేదూ? అది ప్రఖ్యాత సినీ నటులు రంగారావుగారి ఇల్లు" అంది. "ఆహా..." నొసలు ఎగరేస్తూ అంది సారా. ఇంతలో చక్కగా ముస్తాబయిన ముగ్గురు వనితలు వచ్చి ఈ ముగ్గురమ్మాయిలను లోనికి తీసుకువెళ్లారు. పెండ్లి మండపం ద్వారం వద్ద నిలబడి ఉన్న కొందరు సుందరాంగులు, వచ్చిన ఆడవారికి గంధం పూస్తూ, ఒంటిపై పన్నీరు చల్లుతూ, పువ్వుల బుకేలు చేతి కందిస్తున్నారు. కవితా, సబితలతోపాటూ సారాను కూడా లోనికాహ్వానించారు పెండ్లి పెద్దలు. పెండ్లికొడుకు కాశీయాత్రకు కాబోలు వెళుతున్నాడు. చేతిలో గొడుగు, కాళ్లకి కాశీ చెప్పులు, భుజానికి ఎర్రటి గుడ్డతో జోలె. పెండ్లికొడుకుని ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయింది సారా. "అదేమిటి, అతనే గదా పెండ్లి కొడుకు ? మరి వెళ్లిపోతున్నాడేం?" అంటూ కవితను ప్రశ్నించింది. కవితకి కూడా కొంత అయోమయంగా ఉండి, ఏమీ సమాధానం చెప్పలేకపోయింది. పక్కనే ఉన్న ఓ ముసలావిడ, పెండ్లి కొడుకు కాశీయాత్రా ప్రయాణం పెండ్లిలో అవలంబించబడే సంప్రదాయం మాత్రమే అని, పెండ్లికొడుకు నాలుగు అడుగులు కూడా వేయడని, పెండ్లి కుమార్తె అన్న పెండ్లికొడుకు కాళ్లు కడిగి, ఎలాగూ వేదిక పైకి తీసుకువస్తాడని చెప్పింది. సారాకి వింతగా, చాలా తమాషాగా అనిపించింది. పెండ్లి క్రమాన్ని జాగ్రత్తగా గమనించసాగింది. మాంగల్యధారణ

అప్పుడు పెండ్లికూతురు సిగ్గుతో తలవాల్చడం, పెండ్లికొడుకు వంగి మంగళసూత్రం మూడుమార్లు ముడివేయడం - అంతా చాలా గమ్మత్తుగా అనిపించినా, ఆ ఘట్టం సారా కన్నె హృదయంలో ఏదో చెప్పలేని పవిత్రతని కలిగించింది. ఇక తలంబ్రాలు పోసుకోవడం మొదలయింది.

సారాకి ఈ తతంగం మాత్రం ఎందుకో నచ్చలేదు. "ఎందుకిలా రైస్ వేస్టు చేస్తున్నారో!" ఉండబట్టలేక పక్కనున్న ముసలావిడని అడిగింది. ఆవిడకి ఈ పిల్ల వాలకం కొంచెం కోపం కలిగించింది. "అది శుభసూచకం. పసుపు కలిపిన బియ్యం కలబోసుకుని ఒకరి నెత్తిమీద ఒకరు పోసుకున్నట్లే, వాళ్ల జీవితాల్లో రాబోవు కష్ట సుఖాలని కూడా ఇద్దరూ కలిసే అనుభవిస్తారు" అంది ముసలావిడ. సారాకి సగం అర్థమయింది. సగం అర్థం కాలేదు. "అయినా ఇది చాలా వేస్టు కదూ, కవితా" అంది సారా. "దీనికే నువ్వు వేస్టు అంటున్నావు. ఇక్కడ ఉన్న డెకొరేషన్సుకి, ఈ సత్రం అద్దెకి, ఈ రోజు పెండ్లిఖర్చుకి కలిసి కనీసం పదివేలయినా అయి ఉంటుంది. మళ్లీ సాయంత్రం రిసెప్షన్, డిన్నరు - వాటికి బోలెడు ఖర్చు. ఒక్క గర్ల్‌కి పెండ్లి అంటే, ఇక్కడ ముప్ఫై, నలభై వేలు ఖర్చు. ఉన్నవాళ్లకే అనుకో!" అంది కవిత. "మైగాడ్! వాట్ అట్టర్ వేస్ట్ ! నేనింకా ఇది ఏ కమ్యూనిటీ హాలో అనుకున్నాను. మాలో అయితే ఇలా వేస్టు చేయం" అంది సారా. నిజమే కావచ్చునన్నట్లు తల ఊపింది కవిత. భోజనానికి పిలుపు రావడంతో భోజనాల హాలుకేసి నడిచారు అందరూ.

వరసగా టేబిల్స్ వేసి కుర్చీలు వేశారు. వంటవాళ్లు చకచకా వడ్డించేస్తున్నారు. తిన్నవాళ్లు తిన్నంత తింటున్నారు. మిగతాది ఆకుల్లో వదిలేసి లేస్తున్నారు. అక్కరలేని దాన్ని అలా వదిలేయడం చూసి సారా విస్తుపోయింది. వద్దని చెప్పడానికి బద్ధకమో, నామోషీయో అర్థంకాలేదు సారాకి. కవితకూడా చాలా వంటకాలు వదిలేసి స్టైలుగా తిని లేచింది. సారాకి చాలా బాధవేసింది. మిగిలిపోయిన తినుబండారాలతో కూడిన ఆకులు చుట్టచుట్టి చెత్తబుట్టలో పనివాళ్లు పడవేయడం సారా చూడలేకపోయింది. 'అంతా క్రిమినల్ వేస్టు. హిందూ దేశంలో దారిద్ర్యం అంటారు. కాని, ఇలా అర్థం లేని ఖర్చులు చేయడమే అందుకు కారణమా ? ఎందుకు కాకూడదు ?' మనస్సులోనే నిట్టూర్చింది. పెండ్లికి వెళ్లినంత ఉత్సాహం, తిరిగి వచ్చిన సారాలో లేకపోవడం సరస్వతి గమనించింది. కాని, తరిచి ఏమీ అడగలేదు. 'ఎవరి పద్ధతులు వాళ్లవి. విమర్శించే హక్కు నాకెక్కడిది?' అని సారా కూడా మౌనంగా ఉండిపోయింది.

ఆ రోజే సారా వెళ్లే రోజు. మధ్యాహ్నం 12 గంటలకి ప్లేన్ డిపార్చర్. ముందు దినమే కాన్సలేట్‌కి వెళ్లిపోతానంది సారా. కాని, సరస్వతి సారాని వెళ్లనివ్వక రాత్రి ఇంట్లోనే ఉంచేసింది. రాత్రి పన్నెండు గంటలయినా సారా సరస్వతితో కబుర్లు చెబుతూ కూచుంది. పది గంటల వరకూ కూచున్న కవితా సబితలు వెళ్లి పడుకున్నారు - ప్రొద్దుటే లేచి చదువుకోవాలంటూ. సారా సరస్వతి నడిగి ఓ ఫామిలీ ఫోటో తీసుకుంది. తన అడ్రెసున్న కార్డు ఇచ్చింది. ఎన్నో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారిద్దరూ. "ఇండియాను గురించిన విషయాలు మీ ద్వారానే ఎక్కువ తెలుసుకున్నానమ్మా!" అంటూ సారా సరస్వతి ఒళ్లో పడుకుంది. ఎంతో ఆత్మీయంగా.

అమాయకంగా తన ఒళ్లో పడుకొని కబుర్లు చెబుతున్న సారాని చూసి సరస్వతి మాత్ర హృదయం ఆ విదేశీయ బాలికపట్ల అనురాగంతో నిండిపోయింది. "పదమ్మా, పడుకుందువు కాని" అంటూ బలవంతంగానే కవితా వాళ్ల గదిలోకి పంపి, తాను తన గదిలోకి నడిచింది సరస్వతి.

ప్రొద్దున యథాప్రకారం ఫ్యాక్టరీకి బయలుదేరుతున్న సుందరాన్ని చూచి ఆశ్చర్యపోయింది సరస్వతి. "అదేమిటండీ! సారా వెళుతున్నది ఈరోజే. పిల్లలంటే మంత్లీ ఎగ్జామ్స్ అంటూ వెళ్లిపోయారు. మరి మీరూ అలా వెళితే ఏం మర్యాద ? ఆ పిల్లని ఏరోడ్రోమ్‌లో ఎవరు దిగబెడతారు?" అంది సరస్వతి.

"బాగుంది ! నాకేం పనుల్లేవా ఏమిటి ! వెళ్లి కారు పంపిస్తాలే. డ్రైవర్ దింపుతాడు." ముభావంగా ఉంది సుందరం గొంతు.

"భలే వారే ! మంచి మర్యాదస్తులే! ఆ పిల్లని ఎంత ఆదరంగా ఈ ఇంట్లోకి తీసుకొచ్చారో అంత ఆప్యాయంగానే సాగనంపాలి." సరస్వతి కంఠంలోని గంభీరతని గమనించి సుందరం కొంచెం జంకాడు. సభ్యత కాదు లెమ్మనుకున్నాడేమో, పొద్దున్న ఫ్యాక్టరీకి రానంటూ ఫోన్ చేశాడు.

సరిగా పదకొండు గంటలకి సారా తయారైపోయింది. సరస్వతి కూడా చీరకట్టుకుని ముస్తాబయింది. ఎంత మంది ఫ్రెండ్సుని రిసీవ్ చేసుకోవాలన్నా సుందరమే వెళ్లేవాడు ఏరోడ్రోమ్‌కి. అటువంటిది ఈరోజు సరస్వతి తయారై రావడం కొంత వింత అనిపించింది సుందరానికి.

సూట్‌కేసు, ఎయిర్‌బాగ్ తెచ్చి వరండాలో పెట్టాడు నౌకరు కుర్రవాడు రాము. సారా ఇంకేమైనా మరిచిపోయిందా అని చూడడానికి గదిలోకి వెళ్లింది సరస్వతి. కిటికీలో ఒక అట్టపెట్టె కనిపించింది. 'అరే, ఇది మర్చిపోయిందే' అనుకుంటూ పైకి ఎత్తి రాబోయింది సరస్వతి. పొరబాటున తలక్రిందులుగా తీసినట్లుంది, అందులోని వస్తువులన్నీ చిందరవందరగా నేలమీదపడిపోయాయి. ఆ చప్పుడికి సారా పరుగున వచ్చింది. సరస్వతి వంగి క్రింద పడ్డ వస్తువులను చూసి ఆశ్చర్య చకితురాలయింది. సారా పక్కనే చిరునవ్వు చిందిస్తూ నిలబడింది. ఆశ్చర్యంగానే సరస్వతి ఒక మట్టెల జత, చిన్న ముక్కుపుడక, (స్ప్రింగుది), మంచి సవరము, ముగ్గులు పెట్టుకొనే గొట్టము చేతితో తీసింది. "ఏమమ్మా ! ఆశ్చర్యపోతున్నావా ? నేను కూడా పెళ్లయ్యాక ఇవన్నీ వేసుకొని మిమ్మల్ని తలుచుకుంటాను. మేము హనీమూన్‌కి కూడా ఇక్కడికే వస్తామమ్మా!" అంటూ ఎంతో ఆనందంగా చెబుతున్న సారాని అలాగే హృదయానికి అదుముకుంది సరస్వతి.

ప్లేన్ టేక్-ఆఫ్ అవుతూంది. పరస్పరం వీడ్కోలు పుచ్చుకుంటున్నారు. టా టా! బై బై! చప్పట్లు మిన్ను మిట్టుతున్నాయి. సారా చేతులు రెండూ జోడించి "నమస్తే" అంటూ నవ్వుతూ చూసింది సరస్వతీ, సుందరాలకేసి. నవ్వుతున్న సారా కండ్ల నుండి రెండు కన్నీటి చుక్కలు రాలి పడడం అదే స్థితిలో ఉన్న సరస్వతి గమనించలేదు కాని, సారాని, భార్యని మార్చి మార్చి చూస్తున్న సుందరం గమనించాడు.

■

*(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 3-5-1972)*

# విలువ కట్టలేనిది

ఆఫీసునుండి వస్తూనే, ప్యాంటు జేబులో నుండి ఒక కవరు తీసి పద్మ చేతిలో పెట్టాడు వెంకట్రావు. "ఎక్కడిది ?" అన్నట్లు భర్తవేపు ప్రశ్నార్థకంగా చూసింది పద్మ. "చదువు, నీకే తెలుస్తుంది" అంటూ టవలు తీసికొని స్నానానికి వెళ్ళిపోయాడు. "ఎవరు రాసారమ్మా ? తాతయ్యగారా?" అంటూ పదేండ్ల గిరిజ పద్మవేపు ఆసక్తిగా చూసింది. "ఏమో ! చదవనీ" అంటూ ఉత్తరం విప్పింది పద్మ.

ప్రియమైన అన్నయ్యకి,

ఇక్కడ మేమందరం క్షేమం. అక్కడ మీరందరు క్షేమమనుకుంటాను. చి॥ శైలు ఈ మధ్యనే ఫ్లూ జ్వరంతో బాధపడింది. ఇప్పుడు కులాసాగానే వుంది. అక్కడ చిరంజీవులు గిరిజ, జలజ, రాము కులాసా అనుకుంటాను.

మరి ఒక ముఖ్యమైన విషయం అన్నయ్యా. మీ బావగారిని ఆఫీసువాళ్ళు ట్రెయినింగ్‌కి బాంబే పంపిస్తున్నారు. రెండు నెలలు వుంటారు. ఫ్యామిలీ ప్లానింగ్ ట్రెయినింగ్ కొరకు నేనుకూడ వెళ్ళవలెనని వున్నాను. శైలుతోటే మాకు చిక్కు వచ్చిపడింది. శైలుని ఈ రెండు నెలలు మీ దగ్గరే వుంచుదామని వుంది. అమ్మ దగ్గర అయితే దానికి కంపెనీ వుండదు. అందులో అది మరీ పల్లెటూరు. దీనికి అస్తమానం ఏదో ఒక సుస్తీ చేస్తూ వుంటుందాయె. నేనూ, శైలు ఆదివారం బయలుదేరి అక్కడికి వస్తున్నాము. వదినను అడిగినట్లు చెప్పేది. ఇంతే.

ఇట్లు,<br>మంజుల

ఉత్తరం చదవడం అవగానే దాన్ని టేబిల్‌మీద పెట్టి పద్మ భర్తకి కాఫీ తీసుకురావడానికి వెళ్ళింది. ఉత్సుకతను చంపుకోలేని గిరిజ ఉత్తరం చదవసాగింది. వెంకట్రావు గదిలోకి రాగానే "నాన్నా ! శైలు, అత్తయ్య వస్తారట కదా ! శైలు మనింట్లోనే వుండిపోతుందా ?" అంటూ ఎంతో అమాయకంగా, సంతోషంగా అడిగింది. "ఏమోనమ్మా ! హోమ్ మినిష్టర్ పర్మిషన్ కావాలిగా ముందు" అంటూ భార్య చేతిలోని గ్లాసు అందుకున్నాడు. "పాపం ! అప్పటికి నా మాట జవదాటనట్లు !" పద్మ కొంచెం నిష్ఠూరంగానే అంది. ఈ మంజులే తననీ, తన సంసారాన్నీ ఎన్నో తప్పులు పట్టింది. పిల్లలకి క్రమశిక్షణ నేర్పటం తెలీదు అంది. పిల్లలకి సరయిన ఆహారం ఇవ్వడంలేదని దెప్పింది. ఎంతయిన డాక్టరు కదా ! ఆవిడలాగ పెంచడం తనకెలా చాతనవుతుంది అని సరిపెట్టుకుంది పద్మ. కాని ఆ ఎత్తిపొడుపులు, హేళనా పూరిత వాక్కులు పద్మ మర్చిపోలేదు. ఒక్కనాడూ తన పిల్లలను పిలిచి తన యింట్లో వుంచుకోలేదు. తను వచ్చినా, పట్టుమని పదిరోజులు వుండకుండ తుర్రుమనేది. ఇప్పుడు అవసరం తనది కదా ! ఎంతో వినయంగా ఉత్తరం వ్రాసింది. "మీరేమంటారు రాణీగారూ !" అన్నాడు వెంకట్రావు పేపరు అందుకుంటూ. "అదేంటండీ ! నన్నుడుగుతారు ? అన్నగారాయె, చెల్లెమ్మాయె ! నేనెవర్ని మధ్యన ? నేను వద్దంటే మాత్రం ఆవిడ

రాకుండా ఉంటుందా ? మీరు రమ్మనకుండా వుంటారా ?" పద్మ జలజని కేకేసి, 'దాని జడలు విప్పడం మొదలెట్టింది.

"పద్మా ! మంజుల పరిస్థితి కూడా కొంచెం ఆలోచించు. అసలే దానికి పిల్లమీద మమకారం ఒక పాలు ఎక్కువ." "ఆ మాటే అనొద్దంటాను ? ఎవరి పిల్లలూ ఎవరికీఎక్కువ కాదు !" ఆవేశపడకు మరి ఒక్కగానొక్క పిల్ల. అందులో దాని ఆరోగ్యం కూడ అంత మంచిది కాదు. ఎటూ వీలుకాని పరిస్థితి. ఒక రెండు నెలలే కదా ! మనింట్లో వుండనీ." "ఇప్పుడు నేను కాదన్నానటండీ! ఎటొచ్చీ డాక్టరు మంజులలాగ పిల్లల్ని పెంచడం మాత్రం నాకు రా దన్నది మీరిద్దరు మర్చిపోకండి." జలజ జడకి రిబ్బను బిగిస్తూ అంది పద్మ. "ఊ .... సరేలే .... ఎప్పటి మాటలో పట్టుకుని ఇప్పుడు దెప్పుతున్నావు ! అయినా మంజుకి ఎవరున్నారు ! మనం తప్ప. మనమీద ఆపేక్షవల్ల కాని లేకుంటే దాని కూతుర్ని లక్షవరహాలు పోసినా మనింట్లో వుంచుతుందా?" "సరే! ఆ లక్షవరహాలేవో మీరే ఏరుకుందురుగాని, నాకు పనుంది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది పద్మ.

తన చెల్లెలు మంజులకి, పద్మకి చాలా విషయాల్లో అభిప్రాయభేదాలు వున్నవి అన్న విషయం వెంకట్రావుకి తెలియకపోలేదు. కాని ఇంటికొచ్చిన అతిధిని అవమానించేంత కుత్సితబుద్ధి మాత్రం కాదు పద్మది అన్న నమ్మకమే వెంకట్రావుకి ధైర్యాన్నిచ్చింది.

శైల వచ్చినందుకు పిల్లలు గంతులేశారు. కలిసిపోయి ఆడుకున్నారు. ఎప్పుడూ హాస్పిటల్ అనే చెల్లెలు, సావకాశంగా ఇంట్లో కూచుని కబుర్లు చెబుతూంటే వెంకట్రావుకి ముచ్చటేసింది. పద్మ కూడా ఆడబడుచుకి ఏలోటు లేకుండ అన్నీ చేసిపెట్టింది. మూడురోజులు మూడు నిమిషాల్లా కరిగిపోయాయి.

ఆరోజే మంజుల వెళ్ళేరోజు. శైలు, తీరా తను వెళ్ళేటప్పుడు గోల చేస్తుందేమో అని అ, తో పార్కుకి పంపేసింది. ముందుగానే అన్నయ్య దగ్గర వీడ్కోలు తీసుకుంది. పద్మ, మంజుల ఇద్దరు కలిసి స్టేషన్‌కి వచ్చారు. దారిపొడుగునా అప్పగింతలు పెడుతూనే వుంది మంజుల. "వదినా ! శైలుకి రోజూ కోడిగ్రుడ్డు, పాలు ఇవ్వు. ప్రొద్దుట టిఫిన్‌కి దానికి బ్రెడ్ అలవాటు. కొద్దిగ టోస్ట్ చేసి ఇవ్వు. నెయ్యి ఎక్కువగా వాడకు." అన్నిటికీ వూకొట్టింది పద్మ. "దానికి అస్తమానం జలుబు చేస్తుంది వదినా ! దాని పెట్టెలో స్వెట్టరు, మేజోళ్ళు పెట్టాను, రాత్రిళ్ళు వేసి పడుకోబెట్టు." తనొక్కతే పిల్లను పెంచుతున్నట్లు. చెప్పే కబుర్లు వింటూంటే పద్మకి చిర్రెత్తుకొచ్చింది కాని అనవసరంగా, గొడవెందుకని మౌనంగా వుండిపోయింది. ఆకలికి ఒక టానిక్కు, తిన్నది అరగటానికి ఒక మందు, జ్వరానికి ఒకటి, దగ్గుకొకటి ఇలా ఎన్నో మందుల పేర్లు వ్రాసి ఇచ్చింది మంజుల. మళ్లీ ఏకరువు పెడుతూంది. పద్మకి చిరాకేసి, ప్రయాణీకులకేసి దృష్టి సారించింది. "వదినా ! పండ్లరసం, పాలు రెగ్యులర్‌గా ఇవ్వండి. దాని ఖర్చుకి నెలనెలా నేను వంద రూపాయలు పంపుతాను" అంటున్న మంజుల మాటలకి వులిక్కిపడి ఇటు తిరిగింది పద్మ. కోపంగా తనకేసి చూస్తున్న వదిన చూపులలోని

వేడిని గమనించే స్థితిలో లేదు ఆ తల్లి ఆతురత. ఇక మాటలు చాలించండి. అంటూ రైలు ముందుకు సాగిపోయింది. వికలమైన మనస్సుతో ఇంటికి వచ్చింది పద్మ.

భర్త వచ్చీ రావడంతోటే అతని మీద విరుచుకుపడింది. "ఏమిటి మీ అన్నాచెల్లెండ్ర వుద్దేశం ? డబ్బు పంపుతుందట గదా ! మీ ముద్దుల చెల్లెలు. ఇదేమైనా పూటకూళ్ల ఇల్లు అనుకుందా? ఆ సంగతి ముందే తెలిసి వుంటే శుభ్రంగా ఏ బోర్డింగ్‌లోనే చేర్పించ మనేదాన్ని" పద్మ కోపంతో, అవమానంతో వుడికిపోతూంది. వెంకట్రావుకి భార్యని చూస్తే జాలేసింది. "ఛా .... ఎందుకలా అపార్థం చేసుకుంటావు ? పిల్లలు కల వాళ్ళం కదా అని......" "అందుకని ఆవిడ దానం చేస్తే మీరు భిక్షపట్టారా ?" "మంజుల చాదస్తంగా ఏదో అన్నది నువ్వేం పట్టించుకోకు. అవసరం అయితే వాడుకుందాం. లేదంటే తిప్పి ఇద్దాము." భార్యని అనునయిస్తూ అన్నాడు వెంకట్రావు. "నా పిల్లలతో బాటు అనుకున్నాను కాని ఆ పిల్లని పేయింగ్ గెస్టుగా నేను గ్రహించలేదు. అది మీరూ, మీ చెల్లి గుర్తుంచుకోండి" అంటూ ఆ ప్రసంగాన్ని అంతటితో ఆపేసింది పద్మ.

కాలండర్‌లోని కాయితాలు రెండిటిని తన చిన్నారి చేతుల్తో చింపేసింది నాలుగేండ్ల శైలు. మూడవ కాయితం కేసి చూస్తున్న శైలుతో పద్మ "శైలూ ! ఇంక నాలుగైదు రోజుల్లో మీ అమ్మ వచ్చేస్తుంది. అమ్మతో వెళ్ళి అత్తయ్యను మర్చిపోతావు కదూ !" అంది. "ఊహూ ! మమ్మీని కూడ ఇక్కడే వుండమంటాను" అంది ముద్దుగ శైలు. "నా తల్లే" అంటూ ఎత్తుకుని ముద్దాడింది పద్మ. "ఏమిటో అత్తాకోడండ్లిద్దరూ మురిసిపోతున్నారు" అంటూ టెలిగ్రాం చేతపట్టుక వచ్చాడు వెంకట్రావు. "మీ కోడలు ఇక్కడే వుండిపోతుందటండీ !" అంది పద్మ మళ్ళీ శైలును ముద్దు పెట్టుకుంటూ. "ఇంకెన్నాళ్ళులే ఆ మురిపం ! మంజుల రేపు సాయంత్రం వస్తానని టెలిగ్రాం ఇచ్చింది." "మమ్మీ వస్తుందా మామయ్యా" అంటూ గంతులేసింది శైలు.

ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లో వస్తున్న మంజుల మనస్సు మహా త్వరితగతి పరుగులు తీస్తూంది. ఈ రెండు నెలలు ఎలా వుందో కాని, ఈ రెండు గంటలుండటం కష్టమైపోతూంది మంజులకి. తనకే రెక్కలుంటేనా ! శైలు దగ్గర ఈ క్షణం వాలిపోనూ అనుకుంది మంజుల. ఏం బెంగెట్టుకోలేదు, కులాసాగానే వుంది అంటూ అన్నయ్య ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నాడు. కాని మంజుల హృదయం మాత్రం కూతురి కోసం కొట్టుకపోయింది. మంజుల భర్త కూడ ప్రయాణమయ్యాడు. కాని లాస్ట్‌మినిట్‌లో మినిష్టర్ ప్రోగ్రాం రావడంతో ఆగిపొయ్యాడు.

స్టేషన్‌లో రైలు ఆగీ ఆగకముందే బయట కురికింది మంజుల. కళ్ళు ప్లాట్‌ఫారమ్‌ని అన్వేషిస్తున్నాయి. ఇంతలో "మమ్మీ" అంటూ శైలు పరుగున వచ్చి మంజులని వాటేసుకుంది. వెనకాలే వెంకట్రావు చిరునవ్వుతో వచ్చాడు. వంగి కూతుర్ని అమాంతం ఎత్తుకొని హృదయానికి అదుముకుంది మంజుల. బొద్దుగా, ఆరోగ్యంగా, కళగా వున్న కూతుర్ని ఆప్యాయంగా చూసుకుంది మంజుల. 'శైలు వెయిట్‌ని కళ్ళతోనే వే చేస్తున్నట్లున్నావ్' అంటూ దగ్గరగా వచ్చాడు వెంకట్రావు. "షో అన్నయ్యా" అంటూ కూతుర్ని మరింత గట్టిగా హృదయానికి అదుముకుంది.

మంజుల రాకతో ఇంట్లో చెప్పలేనంత హడావిడి. "మమ్మీ మమ్మీ" అంటూ శైలు నోరు మూత వేయకుండ కబుర్లు చెబుతూంది. ఎప్పుడూ తన వెంట తిరిగే శైలు, అమ్మ కూతురయిపోయింది అని నవ్వుకుంది పద్మ. అందరితోబాటు శైలు కూడ ఇడ్లీలు, రొట్టెలు ఇష్టంగా తింటూంది. "ఆకలి అత్తయ్యా ! అన్నం పెట్టు" అని అడిగి భోంచేస్తూంది. ఆఖరికి చారు అన్నం అయినా సరే ఎంతో రెలిష్ చేసి కూతురు తినడం మంజులకి ఆశ్చర్యం కలిగించింది. ఇంటి దగ్గర రకరకాల డిషెస్‌తో తినమని బలవంతం చేసినా తినకపోయేది. ఆఖరికి పండ్లరసం, పాలు అయినా బ్రతిమాలి బెదిరించి ఇవ్వవలసి వచ్చేది. కాని ఇక్కడో ! అన్నయ్య పిల్లలతోపాటు ఆబగ అన్నము తినేయటం చూస్తే మంజులకి కొంచెం బాధగా కూడ అనిపించింది. తానంతగా చెప్పి పోయినా, వీళ్లు తన కూతుర్కి స్పెషల్‌గా ఏమీ ఇవ్వడం లేదు అన్నది స్పష్టమయింది. ఏదయితేనేం తన కూతురు ముందుకన్న కూడ ఆరోగ్యంగా వుంది అని మనసును సరిపెట్టుకో ప్రయత్నించింది. కాని హృదయంలో ఎక్కడో కలుక్కుమంటూనే వుంది. శైలుతో సంతోషంగా కబుర్లు చెబుతూంది. కాని అన్నయ్య, వదినతో మాత్రం కాస్త ముభావంగా వుండిపోయింది.

మంజుల ఊరికి ప్రయాణమవుతూంది. పద్మ అవీ, ఇవీ తినుబండారాలు తయారు చేసింది. చక్కిలాలు, సున్నివుండలు పెడుతూంటే "ఇవన్నీ ఎవరు తింటారొదినా !" అంది విసుగ్గా మంజుల. "అదేంటి మంజూ ! సున్ని వుండలంటే శైలుకి ప్రాణం" అంది పద్మ. "ఔను మమ్మీ. భలేగా వుంటాయి. అత్తయ్య రోజూ నాకు నెయ్యివేసి మధ్యాహ్నం పెడుతుంది" అంటూ ఒకటి తీసి నోటిలో వేసుకుంది శైలు. మంజుల మరేమీ మాట్లాడక పెట్టె సర్దుకోసాగింది. శైలుకి పెందలాడే భోజనం పెడ్తాను" అంటూ పద్మ దాన్ని చంక నేసుకు వెళ్ళింది. జలజ, గిరిజలు శైలు వెంటనే తిరుగుతున్నారు.

"మంజూ !" అంటూ వెంకట్రావు చెల్లెలి దగ్గరకొచ్చాడు. "ఏమిటి ?" అన్నట్లు లేచి నించుంది మంజుల. "ఇదిగోనమ్మా ! నువ్వు ఈ రెండు నెలలు పంపిన డబ్బు" అంటూ రెండు వంద రూపాయల నోట్లు తీసాడు జేబులోంచి. పరధ్యానంగా నడుస్తున్న పాంథునికి పెద్ద ఎదురు దెబ్బ తగిలినట్లయి మంజుల చివ్వున తలెత్తి చూసింది. చిరునవ్వుతో వెంకట్రావు చెల్లి చేతిలోపెట్టాడు. "అన్నయ్యా" అంటూ ఏదో అనబోతున్న మంజులను వారిస్తూ మంజుల చేతిని మూసేశాడు. "అయితే మీరు నాకోసం అనవసరంగా అప్పులయినా చేస్తారు కాని నాడబ్బు వాడుకోరన్నమాట" మంజుల కొంచం ఉక్రోషంగా అంది. "మంజూ ! ఎవరు చెప్పారు నీకు మేము అప్పుల్లో బ్రతుకుతున్నామని. పెద్ద డాక్టరువయితే అయ్యావు కాని నీ చిన్నప్పటి తొందరతనం, అవివేకం ఏమీ పోలేదు. నీ కూతురి పోషణ కోసం అప్పులు చేసేంత దుస్థితికి ఈ అన్నయ్య ఇంకా రాలేదు. నాతో అంటే అన్నావు కాని మీ వదినతో ఈ మాట అనేవ్, చాలా బాధపడుతుంది" అంటూ వచ్చినంత నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు వెంకట్రావు.

చేతిలో డబ్బుతో నిలబడ్డ మంజులకి చెప్పలేనంత బాధ కలుగసాగింది. "ఛీ .... ఛీ ..... తానెంత అహంభావి ! ఎంత మూఢురాలు! తన డబ్బు వాళ్ళేదో స్వంతానికి వాడేసుకున్నారని

ఎంత కుత్సితంగా ఆలోచించింది. ధన మదాంధకారం అంటే ఇదే కాబోలు. మధ్యతరగతి కుటుంబీకుడు అన్నయ్య అన్న చులకన భావమే కదూ, తనని నెల నెలా డబ్బు పంపించేలా చేసింది ? ఎంత మెత్తగ గుణపాఠం చెప్పారు తనకి. అన్నయ్య పిల్లలు తన రక్తసంబంధీకులే అయినా ఏనాడూ వాళ్ళని దగ్గరికి చేరదీయలేదు. అత్తయ్యగా ఆప్యాయత చూపలేదు. ఇంతెందుకు? ఇంతదూరం వస్తూ పసిపిల్లలకి ఏమైనా తెద్దామన్న ఆలోచన అయినా రాలేదు. నెలనెలా పంపిస్తున్నాను కదా అన్న ధీమా కదూ తనది. కాని తన వదినో ! తన పిల్లలకన్న ఎక్కువ అనురాగంతో చూసుకుంది తన కూతుర్ని" సిగ్గుతో, అవమానంతో, లజ్జతో చితికిపోసాగింది మంజుల.

"అరే ! వుండండర్రా ! అత్తయ్యకి చూపనీ" అంటూ పద్మ శైలుని మంజుల దగ్గరికి తెచ్చింది. క్రొత్త లంగా, జాకెట్టులో ముద్దొస్తూంది శైలు. వెనకే పాత బట్టలతోనే వున్న గిరిజ, జలజలు చిరునవ్వులతో వెలిగిపోతున్నారు. వాళ్ళందర్నీ చూస్తుంటే తానెంత అల్పురాలో అర్థమవసాగింది. పద్మ శైలుని దింపి మళ్ళీ లోపలికి వెళ్ళింది. "మమ్మీ ! ఎలా వుంది" అంటూ తన దగ్గరకి వచ్చిన శైలుతోబాటు గిరిజ, జలజలను దగ్గరకు తీసుకుంది మంజుల.

పసుపు, కుంకుమతో బాటు చీర, మంజుల చేతిలో పెట్టింది పద్మ. చీరతో బాటు చటుక్కున వంగి వదిన పాదాలని చేతితో తాకింది మంజుల. ఆడబిడ్డ చేష్టకి ముగ్ధురాలైన పద్మ, మంజులని ఆప్యాయంగా లేవనెత్తింది. మంజుల కండ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. "ఛా ... ఏంటిది ? మంజూ ! ఏమయింది" అంటూ పద్మ మంజు కళ్ళు తుడిచింది. "వదినా! నా కూతురి పోషణకి విలువకట్టి డబ్బు పంపానే కాని నీ మాతృ ప్రేమామృతానికి విలువ కట్టలేనమ్మా" అంటున్న మంజులని వారించింది పద్మ. మంజుల ఆవేశాన్ని అర్థం చేసుకుంది. "బాగానే వుందమ్మా నువ్వనేది! అది నీకు కూతురే కాని నాకేమీ కాదా ! నా ముగ్గురి పిల్లలతో బాటు అది నాలుగో పిల్ల అయింది. దానికోసం నేనేం ప్రత్యేకంగా ఖర్చు పెట్టలేదు. నువ్వు అనవసరంగా నాకేదో గొప్పదనం ఆపాదించకు. ఒంటెత్తుగ వున్న పిల్లేమో, నలుగురిలోకి వచ్చాక కాస్త హుషారుగా వుండి, ఆరోగ్యంగా వుంది" సామాన్యంగా చెప్పుకపోయింది పద్మ. కాని మంజుల తన ఆవేశాన్ని అరికట్టుకోలేక పోయింది. తన చేతిలోని డబ్బుతీసి మేనగోడళ్ళిద్దరి చేతిలో పెట్టింది. వారించబోతున్న వదిన్ని అవతలకి నెట్టింది. "నా ఇష్టం ! నా మేనగోడళ్ళకి నే నిచ్చుకుంటాను. నువ్వు అనవసరంగా జోక్యం కలుగజేసుకోకు" అంటూ గోముగా కసిరింది పద్మని. "అలా అన్నావు బాగుంది. ఎన్నాళ్ళనుంచో కలలు కంటున్నారు కదా, కంచిలంగాలో అంటూ, అత్తపేరు చెప్పి కుట్టించుకోండి, పిల్లలూ !" అని అంటున్న భార్యవేపు అనురాగంగా చూస్తూ వచ్చాడు వెంకట్రావు. "అంతా మీ అమ్మాయిలు పంచుకోవడమేనా నా కొడుక్కి వాటా ఏది ? అన్నాడు కొంటెగా !" "కొడుక్కి కోడలే బహుమతి" అన్నది నవ్వుతూ మంజుల. అందరూ గొల్లున నవ్వారు. ఎందుకో అర్థంకాకపోయినా శైలు కూడా నవ్వేసింది.

■

***(యువ మాసపత్రిక, జూన్ 1972)***

# పునిస్త్రీ

ఆ ఇంటి జనాభాను, వారు వేస్తున్న ఆర్భాట అట్టహాసాల్ని చూస్తున్న వారికెవరికీ అది ఓ చావు - ఇల్లులా గోచరించడం లేదు, వస్తున్న బంధువులు వస్తున్నారు. వచ్చిన వారు అప్పటికే ఇంట్లో గుమిగూడా ఉన్న వార్ని కావిలించుకొని, బుడిబుడి దీర్ఘాలు తీస్తూ, నట్టింట్లో కూచుని ఉండే రాజ్యలక్ష్మమ్మ దగ్గరికి తరలి వెళ్తున్నారు. అపరలక్ష్మిదేవిలాగ ముత్తయిదువుతనాన్ని రూపొందించుకొని వెలిగిపోయే ఆమె ముఖాన్ని చూడలేక ఆమెను పట్టుకొని రోదిస్తున్నారు. కాస్సేపు ఏడ్చాక తమ పని ముగిసినట్లు లోనికి వెళ్లి వారివారి యోగక్షేమాల్లో మునిగిపోతున్నారు. అన్నెము పున్నెము ఎరుగని పిల్లలు మాత్రం పెద్దవాళ్ల ఏడ్పుల్ని పట్టించుకోక ఇంటిబయట చేరి తమ ఆటపాటల్లో తేలిపోతున్నారు.

పెద్దపెట్టున రోదన ధ్వని విన్న పెద్ద కోడలు కాంతం చేస్తున్న పనిని వదిలి పరుగున వచ్చింది అత్తయ్య చెంతకి, లక్నోలో ఉండే ఆడబిడ్డ సబిత అప్పుడే వచ్చినట్లుంది. పాపం సబిత వచ్చేటప్పటికే

అన్నీ అయిపోయాయ్. "పాపా సబ్బూ !" అని ఆప్యాయంగా పిలిచే నాన్నగారు ఇక లేరు. పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక అమ్మను చేరింది సబిత.

"అమ్మా ! నీకు కూడా ఈ రాత రాసిపెట్టి ఉందా ! లక్ష్మీదేవి లాంటిది మా అమ్మ - అనుకొని మురిసిపోయానే ! నాన్న నిన్నీ గతికి తెచ్చి తన దారి తాను చూసుకున్నారా!" రాజ్యలక్ష్మిని పొదివి పట్టుకుని పెద్ద పెట్టున ఏడుస్తూంది సబిత.

"ఛా.... ఊర్కో సబితా ..... ఊర్కో" అంటూ కాంతం, ఆడబిడ్డ సబితను ప్రక్కకు తీసింది. అంతలా కూతురు ఏడుస్తున్నా నిర్లిప్తంగా కూతురు వంకే చూస్తూ, మౌనంగా ఉన్న అత్తగారిని ఆశ్చర్యంగా చూసింది కాంతం. "పదపద... తిండీ తిప్పలు లేక ఎన్నాళ్లయిందో!" అంటూ ఆడబిడ్డను లేవదీసింది. "నాన్న కేమయింది వదినా ? నాకు ముందే ఎందుకు ఉత్తరం వ్రాయలేదు....?" అంటూ వదిన్ని అనుసరించింది సబిత. "మామూలే కదా అనుకున్నామే, కాని, ఇలా ముంచుకొస్తుందనుకున్నామా ? మామూలు జ్వరమే అన్నాడు డాక్టరు. ఉన్నట్లుండి వాతం కమ్ముకొచ్చింది." టేబిల్ మీద ఫ్లాస్కులోంచి కాఫీ గ్లాసులోకి పోస్తూ, అంది కాంతం.

కాఫీలు సేవిస్తున్న కాంతం సబితలను మార్చి మార్చి చూస్తూ తనలో తాను నవ్వుకుంది రాజ్యలక్ష్మమ్మ. తండ్రి మరణించినందుకు కాదుకాని, తన పసుపు కుంకుమలు కఱువవుతున్నాయని తన కూతురు సబిత బాధ. ఔను అదే అందరి ఆవేదన కూడా. రాజ్యలక్ష్మమ్మ, మనుష్యుల ఆంతర్యాన్ని అర్థం చేసికోజాలని అర్భకురాలు కాదు. ఇంతెందుకు, పెద్దకోడలు కాంతం మొన్న చిన్నకోడలు సుగుణతో ఏమంటున్నది, "అత్తయ్య పసుపు కుంకుమలతో వెళ్లిపోతుందేమో, ఆవిడ ఫోటోను ఫ్రేం కట్టించి పూజామందిరంలో "సుమంగళి" పూజ చేసుకుందా మనుకున్నాను. కాని, మనమనుకుంటే మాత్రం మన పూజలనందుకొనే అదృష్టం ఆవిడకుండొద్దూ....?"

చిన్న కోడలు సుగుణమాత్రం ఏం తక్కువ తిన్నదని. "సరిగ్గా చెప్పావ్ కాంతం అక్కయ్యా. మరేం మా కన్నవారింట్లో నేనెప్పుడు గొప్పలు పోతుంటాను... మా మామగారి వంశవృక్షంలో స్త్రీలకెవరికి విధవచావులు లేనేలేవని. ఫ్చ్... ఇప్పుడు చూడు మన అత్తగారే ఎలా విధవై మోడులా మిగిలిపోయిందో?" సుగుణ మాటల్లోనిది తేలిక భావమో, బాధో అర్థం కాలేకపోలేదు రాజ్యలక్ష్మమ్మకి.

కోడళ్లు అలా అంటూంటే, కూతురు ఇలా అంటూంది. అందరూ అదే మాట. "అయ్యో పాపం ! ఈ వయస్సులోనా ఈవిడకీ అవస్థ. ఇన్నేళ్లు పసుపు, కుంకుమలతో కళకళలాడి ఈనాటికి పట్టిందా ఈ రాత !" రాజ్యలక్ష్మమ్మ వాళ్ల మాటలను, వ్యాఖ్యానాలను మరొక్కమారు నెమరుకు తెచ్చుకుని గాఢంగా నిట్టూర్చింది. ఔను ! భర్తకన్న ముందుగా చనిపోయి ఉంటే తనకా అవస్థ నిజంగా లేకుండా ఉండేది. కాని భగవంతుడు తన ప్రార్థనలను విని, తన కోరికపై తనకీ దురవస్థ-కాదుకాదు - తన అభీష్టాన్ని నెరవేర్చాడు. అందరూ ఎంతగా బాధపడినా, తనకు మాత్రం ఏమీ దుఃఖం కలగడం లేదు. తన ప్రార్థనలను ఆ సర్వేశ్వరుడు వినకుండా ఉంటే, ఏమయ్యేదో తలచుకుంటేనే రాజ్యలక్ష్మమ్మకి హృదయం జల్లుమంటుంది. ఎంతోసేపుగా అలా కూచున్న ఆమె,

నెమ్మదిగా మంచం మీద పడుకొంది. అలసి సొలసిన ఆ ముసలి తల్లి మనస్సు గతంలోకి పరుగు తీసింది.

ఆర్నెల్ల క్రితం మాట. రాజ్యలక్ష్మమ్మ దాదాపు స్పృహలేక అపస్మారక స్థితిలో మంచం మీద ఉంది. ఆమె ఇక ఎంతో సేపు బ్రతకదని తీర్మానించారు. మంచంచుట్టూ, కూతురు, కూతురు ప్రక్క ఇద్దరు కొడుకులు, వారి ప్రక్క కోడండ్లు నిలబడి వాదులాడుకుంటున్నారు. అప్పుడే కొద్దిగా మెలకువవచ్చింది రాజ్యలక్ష్మికి. కండ్లు తెరవబోయి, వాళ్ళమాటలు విని ఆ ప్రయత్నాన్ని మానుకుంది. కాంతం అంటూంది, "అత్తయ్యకి పునిస్త్రీ చావు రాసి పెట్టి ఉంది. అబ్బ .... ఎంత పుణ్యం చేసుకుందో...!" సుగుణ, అందుకొంది, "అక్కయ్యా ! అత్తయ్య పెద్ద దినంనాడు చేట వాయినాలు ఇచ్చి ఘనంగా జరిపించాలి. ముత్తయిదువు చావునాడు వాయినాలు ఇచ్చినా పుచ్చుకొన్నా ఎంతో పుణ్యమట కదా !" కూతురు కాబోలు అందు కుంది. "డెబ్భై ఏండ్ల ముత్తయిదువ తనమంటే మాటలా ! ఆమె బిడ్డలని చెప్పుకోడానికే మాకు గర్వంగా ఉంది కదన్నయ్యా...?" కొడుకులిద్దరు బహుశా తలలూపి వల్లెవేసి ఉంటారు. కండ్లు మూసుకు పడుకున్న రాజ్యలక్ష్మమ్మకి అలా అనిపించింది.

నెమ్మదిగా కండ్లు తెరిచింది రాజ్యలక్ష్మమ్మ. ఆమె దృష్టి బిడ్డలమీద నిలవలేదు. అలా దూరంగా హాల్లో ఒక ప్రక్క కుక్కి నవారు మంచంలో పడుకొని ఉన్న భర్త సీతారామయ్య వద్ద నిలిచింది. పక్షవాతం వచ్చి కాలూ - చేయి పడిపోయి మూడేండ్లుగా మంచానికే అంకితం అయిన భర్త - కండ్లు కనిపించవు, చెవులు కూడా (గట్టిగా చెప్తే తప్ప) వినిపించవు. ఏది కావాలో ఏది వొద్దో కూడా తెలియని పసివానితో సమానుడైన ఆ ఇంటి అధిపతి గతి కనుక్కొనే నాధుడే లేడా ?

"అమ్మాయ్ కాంతం...?" హీనస్వరంతో పిలిచింది రాజ్యలక్ష్మమ్మ పెద్దకోడలిని.

"ఏమిత్తయ్యా....?" అంటూ దగ్గరికి వచ్చింది కాంతం.

"పాలేమైనా కొంచెం త్రాగుతావా అమ్మా?" సబిత అనునయంగా అంది.

ఏమీ వద్దన్నట్లు సైగచేసి, "టైం ఎంతయింది" అన్నది రాజ్యలక్ష్మమ్మ సబితకేసి చూస్తూ.

"రాత్రి పదవుతున్నదమ్మా.... ఏం ? ఎందుకూ"

"మీ నాన్నగారికి అరటిపండు, పాలూ ఇచ్చారా?"

"వదినా ...? నాన్నకి పాలు ఇచ్చారా" వదిన కేసి చూసింది సబిత.

"సుగుణ ఇచ్చిందేమో అనుకున్నాను. అయినా ఈ వీరిగాడు ఎక్కడ చచ్చాడో....? ఒరేయ్... వీరయ్యా, మామగారికి పాలు తెచ్చి ఇవ్వరా. మేము మరిచిపోతే, నీవూ మరిచిపోతావ్రా" గయ్యిమంది కోడలు కాంతం వంటవాడు వీరయ్య వంక కోపంగా చూస్తూ.

"ఏదయినా మనమే కనుక్కొని ఇవ్వాలి. ఆయన ఏదీ అడగరు..." అంటూ కొడుకుల వంక చూసింది రాజ్యలక్ష్మమ్మ. "ఇదిగో... వెళ్తున్నానమ్మ..." అంటూ పెద్దకొడుకు లోపలికి వెళ్లాడు.

సీతారామయ్యతోపాటు రాజ్యలక్ష్మమ్మకి కూడా కొంచెం పాలు ఇచ్చారు. పాలుత్రాగి పడుకుందే కాని ఆవిడ గుండెల్లో ఆయాసం పెరుగుతూందే కాని తగ్గడం లేదు. శ్వాస పీల్చడం కూడా కష్టం అవుతూంది. రెండో కొడుకు ఇచ్చిన మందు త్రాగాక కొంత ఆరాటం తగ్గింది. మళ్లీ మగత నిదురలోకి జారిపోయింది రాజ్యలక్ష్మమ్మ.

కోడలు పిల్లలు, కూతురు కోరుకుంటున్నట్లు తను పునిస్త్రీగా చనిపోతే ఎంత పుణ్యం. పెండ్లయిన నాటినుండి ఒక్కరోజు కూడా పసుపు రాసుకోకుండా స్నానము చేసిన పాపానపోలేదు. ప్రొద్దుటే ఏళ్లు తోముకున్నంతనే ముఖాన కుంకుమ లేకుండా పచ్చినీళ్లయినా ముట్టలేదు. రాజ్యలక్ష్మమ్మ హృదయం ఏదో అనిర్వచనీయమైన తృప్తితో నిండిపోయింది. ఔను.... తనకింతకన్న కావల్సిందేమున్నది. ఆయనకన్న ముందుగా వెళ్లిపోవడమే తనకి గౌరవం. తన వారికి పేరు ప్రతిష్టలు.

రాజ్యలక్ష్మమ్మ తలంపులను భేదిస్తూ కొడుకుల అరుపులు వినిపించాయి. ఈ తడవ కొడుకులు తాపీగా కూచుని వాదించుకుంటున్నారు.

"అదికాదురా విశ్వం. ఆ ప్రాజెక్టులో హాస్పిటల్ సౌకర్యాలు అంతంత మాత్రం. మంచి డాక్టరు అసలే లేరు. నాన్నని ఎలా వెంటబెట్టుకు పోను" పోచంపాడు ప్రాజెక్టులో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేస్తున్న సీతారామయ్య జ్యేష్ఠ పుత్రుని పల్కులివి.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడర్ పనివెలగబెడుతున్న ద్వితీయ పుత్రరత్నం "కావచ్చు రామం అన్నయ్యా....? ఎలాగయినా మీకు బోలెడుమంది నౌకర్లు ఉంటారు... ఎవర్నో ఒకర్ని పెట్టి నాన్నకి సేవ చేయించవచ్చును. కాని మాకలా కుదరదే. మా సిటీ జీవితం నీకు తెలియంది కాదు కదా ! అందులోనూ మేమిద్దరం ఉద్యోగస్థులమయితిమి. ప్రొద్దున వెళ్లిన వాళ్లం మళ్లీ సాయంత్రం దాకా రాము. నాన్నయినా అటూ - ఇటూ తిరిగే మనిషి కాదాయె. పోనీ ఇంట్లో ఎవరైనా పెద్దదిక్కు అయినా ఉంటే ఫరవాలేదు" అలవాటుపడ్డ ఉపన్యాస ధోరణిలో చెప్పుకుపోతున్నాడు విశ్వం.

మత్తు విడిచి మన లోకంలో పడ్డ రాజ్యలక్ష్మమ్మ ఉలిక్కిపడింది. కన్నకొడుకులు తండ్రి సేవ చేయలేకపోవడానికి ఎంచక్కా కారణాలను ఏకరువు పెడుతున్నారు. కాసింతయినా కరుణ అన్న పదార్థం లేని కన్నకొడుకుల మాటలను మననం చేసుకొన్న మాతృ హృదయం బాధతో సుళ్ళు తిరిగింది. ఈనాడు పక్షవాతంతో బాధపడే ముసలి తండ్రే - ఓనాడు ఈ కొడుకుల కోసం పడని బాధలు లేవు. పెద్దకొడుకు రామం రక్తవిరోచనాలతో బాధపడ్తూ, దొడ్లోకి కూడా లేచిపోలేని ఆశక్తుడై పక్కలోనే విరోచనాలు చేసుకుంటే, పనివాళ్లు అసహ్యించుకుంటారని, తాను వద్దన్నా వినకుండా స్వయంగా దగ్గర పక్కగుడ్డలు ఉతికి తనకు సాయం చేసేవారు. కన్నకొడుక్కి సేవ చేయడంలో అంత శ్రద్ధ ఆయనకి. ఈ విశ్వానికి మాత్రం తక్కువగా సేవచేశారా ? క్రికెట్ ఆటలో కాలు విరిగి, బాండేజ్ కట్టుకొని, నిలబడలేక, నడువలేక ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలకు వెళ్లలేడనుకున్న

విశ్వం, ఆ ఏడు మంచి మార్కులతో ఉత్తీర్ణుడై ఈనాడింత వాడయ్యాడంటే కారణం ఎవరు....? కొడుకును ఎత్తుకొని రిక్షాలో ఎక్కించి, పరీక్షలనించి మళ్లీ ఇంటికి చేరవేస్తున్న ఆనాటి భర్త, తన కళ్లముందు ప్రత్యక్షమయ్యాడు రాజ్యలక్ష్మమ్మకు.

ప్చ్.... పుట్టిన కొడుకులకే పట్టలేదు తండ్రిసేవ. ఇక యెవరినో ఎందుకనాలి. పసుపు కుంకుమ పునిస్త్రీ చావు అంటూ తన దారిన తాబోతే, తదనంతరం తన భర్త గతి ఏం కావాలి? కాలూ - చేయి స్వాధీనంలోలేని, కళ్లు కనిపించని భర్తగతి అధోగతి కాక ఏమౌతుంది? తాను చనిపోవాలని కోరుకుంటున్నది కాని తన తరువాత తన భర్తని వీళ్లు సజీవదహనం తప్పక చేసివేస్తారు. తాను బ్రతికుండగానే తన భర్త తన చేతులమీదుగా దాటిపోవడమే తాను కోరుకోదగ్గ కోర్కె! తనని మాత్రం వాళ్లు చూస్తారని నమ్మకం ఏవిటి ? ఉహుఁ... చూడరు. కాని ఫరవాలేదు. తనకి కాలూ చేయి ఆడుతూంది. కండ్లు కనిపిస్తూనే ఉన్నాయ్. ఎలాగో ఓలాగు కాలం వెళ్లబుచ్చగలదు. భర్తని ఇంత అధ్వాన్నపు స్థితిలో పరాయివాళ్ల (?) దయాదాక్షిణ్యాలకి వదిలిపెట్టి పసుపు కుంకుమలతో వెళ్లిపోయే చావు తనకి వద్దు. ఆ ఘనత - ఆ ప్రతిష్ఠ తనకు దక్కకున్నా ఫరవాలేదు.

"హే... భగవాన్ ! నేనీ డెబ్బది వత్సరాలు భర్తని అన్నిటా అనుసరించాను. ఆయన సుఖమే నా సుఖంగా చూసుకున్నాను. ఇప్పుడు ఈ మరణంలో కూడా, నా భర్త సుఖంగా మరణించిన తరువాతనే - వారు బ్రతికినంతకాలం వారికి సకల సదుపాయాలు చూసే - నేను మరణించేటట్లు అనుగ్రహించు. అందరూ గొప్పగా పొగిడే... నా బంధువర్గం ఎంతో దయతో ప్రదానం చేసే పునిస్త్రీ చావుపట్టా నాకక్కర లేదు. ఈ లోకంలో గొప్పగా స్తుతించబడే ఈ పసుపు కుంకుమలను - కావాలంటే - పణంగా పెట్టి నిన్ను వేడుకుంటున్నాను. నాకు మాత్రం నా భర్త తరువాతనే మరణాన్ని ప్రసాదించు. నన్నిప్పుడు ఈ మృత్యు ముఖం నుండి కాపాడు..." రాజ్యలక్ష్మమ్మ భగవంతుని ప్రార్థిస్తూ పడుకుంది.

ఆ ముసలి ముత్తయిదువు మొరని ఆ సర్వాంతర్యామి ఆలకించాడో...

పునిస్త్రీ చావును పెద్దపెట్టున చేయాలని ధృడ సంకల్పంతో ఉన్న ఆ కుటుంబ సభ్యుల ఆశలను వమ్ము చేయ నిశ్చయించాడో....

డాక్టర్ల మందుమాకులే పనిచేశాయో... మొత్తానికి రాజ్యలక్ష్మమ్మ... మరణద్వారాల్ని సమీపించిన రాజ్యలక్ష్మమ్మ - వెనుదిరిగి ప్రపంచంలోకి మళ్లీ అడుగిడింది.

రాజ్యలక్ష్మమ్మకి సంప్రాప్తమయిన ఈ పునర్జన్మకి అందరూ అట్టే సంతోషించకపోయినా, అమితంగా సంతోషించిన వ్యక్తి ఒకరున్నారు. ఆయన సీతారామయ్య అని చెప్పడం అనవసరం కదా !

రాజ్యలక్ష్మమ్మ ఆలోచనల సరళి నుండి విడివడి కండ్లు తెరిచిచూసింది. అంతా ఒకటే

కోలాహలం. పెద్దకోడలు కాంతం అత్తయ్య ఏడవదేం చెప్మా అని ఆశ్చర్యపడింది. కాని రాజ్యలక్ష్మమ్మని ఏదో చెప్పజాలని నిశ్చింత, ఏదో అనిర్వచనీయమైన నిర్వికారస్థితి ఆవరించింది. తనకి పసుపుకుంకుమలు కరువై తన గౌరవం తగ్గిపోతుంది నేటితో. తను చనిపోయి, బ్రతికుండే వారి పూజల నందుకోజాలదు. ప్రతి స్త్రీ కోరుకునేటట్లు తను పునిస్త్రీ చావుకోరుకోలేదు. కాని తనకు ఇదే ఎంతో ఆనందాన్నిస్తూంది.

రాజ్యలక్ష్మమ్మ ఆనందపరవశంతో నిట్టూర్చింది. నిట్టూర్చిన ఆ తల్లి కళ్లల్లో నీటితెరలు పొరలాడాయ్. అవి ఆనందబాష్పాలు. అంతే ఆమె గుండెల్లో ఏదో కలుక్కుమంది. ఏమయిందో ఆలోచించుకొనేటంత వ్యవధి కూడా లేకుండా ఆ నొప్పి శరీరమంతా వ్యాపించింది.

రెప్పపాటులో రాజ్యలక్ష్మమ్మ ప్రాణవాయువులు అనంతాకాశంలో కలిసిపోయాయ్.

రాజ్యలక్ష్మమ్మకి పసుపురాసి, కుంకుమ పెట్టి రేవుకు తరలించుకుపోయి, ఆమె పసుపుకుంకుమలను ఏటిపాల్జేద్దామని వేగిరం వచ్చారు పూర్వసువాసినులు కొందరు. రాజ్యలక్ష్మమ్మ కళ్ల నుండి నీరుకారడం చూసిన ఒకావిడ "ఏడవకండమ్మా? బ్రహ్మలిఖితం... విధవప్రాప్తి అంటూ వ్రాసి ఉంటే తప్పించుకోగలమా ?" సమదాయింపుగా అంది.

ఇంకో ఆవిడ, "లేవండి పిన్నిగారూ ! ఇప్పటికే ఆలస్యమయిపోయిందంటూ పురోహితుడు తొందర పెడ్తున్నాడు. రేవుకెళ్లి రావడానికి బాగా టైం అవుతుంది కూడా...." అంటూ రాజ్యలక్ష్మమ్మ చేయిపట్టుకు లేపబోయింది. కట్టెలాంటి శరీరాన్ని ముట్టుకున్న ఆవిడ కెవ్వున కేకపెట్టడంతో ఇంటిల్లిపాది పరుగున వచ్చారు. వచ్చిన వారు అప్రతిభులై రాజ్యలక్ష్మమ్మ మృత శరీరాన్ని చుట్టుముట్టి కంటతడిపెట్టారు.

అత్తగారి పటం పూజలో పెట్టుకోవచ్చునో... కూడదో... అర్థంకాని కాంతం, అయోమయంగా నిలబడిపోయింది.

అత్తగారు పునిస్త్రీ చావుచచ్చారు అని చెప్పే తాహతు తనకున్నదో లేదో ? సందిగ్ధావస్థలో పడిపోయింది రెండవ కోడలు సుగుణ.

"అమ్మా! నీ పసుపుకుంకుమలు ఏటికి అర్పణకాకముందే మమ్మల వీడివెళ్లిపోయావా అమ్మా!" అంటూ తల్లి మీదపడి గొల్లుమంది సబిత. కొడుకులిద్దరూ అచేతనులై కన్నీరు కురిపిస్తూ నిలబడిపోయారు.

పశ్చిమదిక్కున అస్తమిస్తున్న సూర్యగోళాన్ని మరపిస్తూ రాజ్యలక్ష్మమ్మ పచ్చటి నొసటిపైని కుంకుమబొట్టు అరుణారుణ కాంతితో వెలిగిపోతోంది.

***(ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక, 9-6-1972)***

# మాలిన్యం అంటని మనస్సు

అప్పుడే అరవిచ్చుకుంటున్న గులాబీ మొగ్గలాగ ఉంది అపర్ణ. గులాబీరంగు ఫ్రిల్‌ఫ్రాకుకు మాచింగ్‌గా, రెడ్‌రిబ్బనుతో పోనీటైల్ కట్టింది, అరవింద కూతుర్కి. ముఖానికి పౌడర్ అద్దడం పూర్తయింది. గాలిలోకి ఎగురవేసి, ఎత్తి ఎట్టుకొని, అపర్ణని వాకిట్లోకి తెచ్చింది కానీ, దింపబుద్దేయలేదు. రామూ అందించిన తెల్లటి సాక్సు అపర్ణకు తొడిగి, అప్పుడు దింపింది. షూ తొడిగి, అపరంజిబొమ్మ - అపర్ణని మరొక్క సారి పరికించి చూసుకొని, ఆప్యాయంగా బుగ్గమీద ముద్దిడుకొంది. "రామూ.....! పాపని అలా షికారుకి తీసుకెళ్లి మళ్లీ వెంటనే తీసుకొచ్చేయి ; ట్రాఫిక్-అదీ - ఎక్కువగా ఉన్న చోటికి వెళ్లక. తారు రోడ్డు - అన్న మాటేకానీ, ఎక్కడలేని దుమ్మూ-ధూళీ ...." కూతురిని రామూకి అప్పచెప్పి, లోపలికి వెళ్లింది అరవింద.

అధునాతన వస్తుసముదాయంతో అత్యంత అందంగా ఇంటిని అలంకరించుకోవడంలో అరవిందకు సాటి అరవిందే ! ఆవిడ డ్రాయింగు రూమును కళాత్మకంగా అలంకరించిన తీరును చూస్తే అరవిందకు 'ఇంటీరియర్ డెకరేషన్'పై కల శ్రద్ధ, నేర్పరితనం ఇట్టే గోచరమవుతాయి. చక్కటి లినోలియం ఫ్లోరుకవరింగ్, క్రొత్త రకం ఫర్నిచర్ పీసెస్, వాటిపై ఎమరాల్డ్ గ్రీన్ కుషన్లు, తలుపులకి, కిటికీలకి - అదే రంగు కర్టెన్లు - అరవిందకు అలకంరణలో 'రిథమ్' పద్ధతి ఇష్టమని చాటుతున్నాయ్. గోడలకి వ్రేలాడుతున్న 'మ్యూరల్స్', వాల్‌మాట్స్ అరవిందకు మోడరన్ ఆర్ట్‌పై కల అభిరుచిని నిరూపిస్తున్నాయి. ఎంత ఖరీదైన వస్తువునయిన, కొన్న క్రొత్తల్లో పెట్టుకున్నంత జాగ్రత్తగా పెట్టుకోరు చాలామంది. కాని, అరవింద అలాకాదు. ఇంట్లో ఉన్న ప్రతి చిన్నవస్తువును-ఎక్కడిదక్కడ నీట్‌గా తళ...తళలాడుతూ ఉండేలా జాగ్రత్త పడుతుంది. ఇంటి గోడలకి ఏ మాత్రం బూజుకానీ, దుమ్ముకానీ కనిపించనీయదు. గదులన్నీ ప్రతిరోజూ, డెట్టాల్ వేసి తుడవాల్సిందే. ఒక్కమాటలో చెప్పాలంటే అరవింద ఇల్లు ఓ స్వీట్ - హోమ్.

అరవిందా - రమేష్‌ల మొదటిసంతానం అపర్ణ. అయిదేండ్లు అత్యానందంగా దాంపత్య జీవితాన్ని గడిపిన అరవింద, ఆరవ సంవత్సరం అపర్ణను కావాలనుకొని కనింది. అపురూపంగా పెంచుకుంటూంది. అపర్ణ పుట్టింది మొదలు అరవిందకు కూతురు తోడిదే ప్రపంచం. పీడియాట్రిషియన్ దగ్గరికి నెలనెలా తీసుకువెళ్లేది. ప్రతిరోజూ డైట్ సక్రమంగా, సైంటిఫిక్‌గా ఇచ్చేది. నెలనెలా పెరగవలసిన వెయిట్ ఏ మాత్రం ఎక్కువ తక్కువలయినా కంగారుపడిపోయేది. తన ఎం.ఎస్సీ., నాలెడ్జితో కొంత, పిల్లల పెంపకం మీద తను శ్రద్ధగా చదివిన పుస్తక పరిజ్ఞానం వల్ల మరింత అపర్ణ పెంపకం విషయంలో భార్య చాదస్తం కనబరుస్తుందేమో అని రమేష్ కొన్ని కొన్ని మార్లు తలపోశాడు. కానీ, అరవింద మనస్సును కష్టపెట్టడానికి ఇష్టపడక, ఏమీ అనలేకపోయేవాడు. అపర్ణ పారాడినంత మేరకు డెట్టాల్‌తో అలికించేది అరవింద. పాప ఆడుకొనే బొమ్మల్ని - వీలయితే-శుభ్రంగా స్టెరిలైజ్ చేసి ఇచ్చేది. రోజూ వాడే నాప్‌కిన్సు - బిబ్స్ ఇత్యాదులు ఉడికించి మరీ వాడేది. అరవింద శాస్త్రీయ పెంపకంలో ఆరోగ్యంగా పెరుగుతున్న అపర్ణను ఆప్యాయంగా చూసుకునేవాడు రమేష్.

అపర్ణ తరువాత మూడేండ్లకు పుట్టాడు కిశోర్. ముద్దులు మూటగట్టే ఆ చిన్నారి తనయుడు ఆ ఇంటికి రాజకుమారుడయ్యాడు. తన చిన్ని తమ్ముణ్ణి పదే పదే చూసుకొని మురిసిపోయేది అపర్ణ.

కిశోర్ ఫీడింగ్ టైముకి ఉయ్యాల దగ్గరికి నడిచింది అరవింద. గంట కొట్టినట్లుగా వాడు లేచి అమ్మకి చేతులు అందించాడు. ఫీడింగ్ బాటిల్‌ని శుభ్రమైన గుడ్డతో చుట్టి, బాబును ఎత్తుకొని అక్కడే ఉన్న సోఫా-కమ్-బెడ్ మీద కూచుంది అరవింద. కిషోర్ పాలు త్రాగడం పూర్తి అవడంతోటే అమ్మ ఒళ్లోనుండి క్రిందికి జారాడు. వాడి కాళ్లకి సాక్సు తొడిగింది అరవింద. చిట్టి వెధవకి ఇప్పుడిప్పుడే నడక వస్తూంది. బుల్లి-బుల్లి అడుగులు వేసుకుంటూ హాల్లో తిరగడం మొదలెట్టాడు. బాబు పాలు ఫ్రిజ్‌లో ఉంచి ఇటు తిరిగిన అరవిందకి లోపలకివస్తున్న రాము కనిపించాడు. "పాప....

ఏదిరా?" అంటూ పలకరించింది అరవింద. "తోటలో గులాబీ మొక్కల దగ్గర ఉన్నారమ్మా!" అంటూ వాడు దొడ్లో కెళ్లాడు. కాళ్లు చేతులు శుభ్రంగా కడుక్కొన్న తర్వాతకాని వాడికి కిశోర్‌ను ముట్టుకోడానికి వీల్లేదు. అది అమ్మగారి ఆజ్ఞ. కిశోర్‌ని రామూకి అప్పజెప్పి "అపూ...!" అంటూ అరవింద పోర్టికోలోకి వచ్చింది. అపర్ణ గులాబి మొక్కల దగ్గరలేదు. దూరంగా తోటమాలి సోమయ్య దగ్గర, బుద్ధిగా నిల్చుని ఏదో తెగవాగేస్తోంది. "అపూ! అక్కడేం చేస్తున్నావమ్మా!" అంటూ తోటవేపు నడిచింది అరవింద. సోమయ్య ప్రక్కనే ఓ చిన్నపాప. దగ్గర దగ్గర ఆరేళ్లుంటాయి. అపర్ణకేసి చూస్తూ నిల్చుంది. అపర్ణ అడుగుతూంది. "తాతా! ఈ పాప ఎవరు ....? ఇక్కడే ఉంటుందా?.... మరి నాతో కాన్వెంటుకి వస్తుందా?" అంటూ.

"నా మనవరాలు... చిన్నమ్మగోరూ! ఏయ్...సీతా ! చిన్నమ్మగారికి నమస్తే చెప్పు... ! పాడు మొద్దు.... ఏమీ తెలవదు." అరవింద వాళ్లమాటలు వింటూ దగ్గరి కొచ్చేసింది. మోకాళ్లవరకు వ్రేలాడుతున్న గౌనులో నిండిపోయి ఉంది సీత దుర్బల శరీరం. సోమయ్య భార్య గట్టిగ బిగించి వేసిన జడ, నిటారుగా నిలబడి ఉంది. భయంభయంగా చూస్తూ నిలబడిన సీత పెద్దమ్మగారిని చూడగానే గబుక్కున తాత వెనకాలకి వెళ్లి దాక్కుంది. "మమ్మీ... మమ్మీ....! ..... సీత బాగుంది కదూ. రేపు నాతోటే స్కూలుకు తీసికెళ్తాను!" అంటూ అపర్ణ, అరవింద దగ్గరికి రాబోయిన తొందరలో తోటలోని బార్డర్ రాయికి కాలు తగిలి, ముందుకు పడింది. అరవిందకన్నా ముందుగావచ్చిన సీత అపర్ణని లేవదీసింది. అపర్ణని సీత చేతిలో నుండి లాక్కొని, "పద అపూ... ఇంట్లోకి ... డాడీ .... పిలుస్తున్నారు" అంటూ వడివడిగా బాత్‌రూముకేసి నడిచివెళ్లింది అరవింద.

అపర్ణ బట్టలు విప్పి, శుభ్రంగా కాళ్లుచేతులు సోపుతో కడిగింది అరవింద. వంటికి, ముఖానికి పౌడరద్ది, ఇస్త్రీ షిమ్మీస్ వేసి, కాళ్లకి హవాయి చెప్పులు వేసినంతవరకు అరవిందకు తోచలేదు. అపర్ణ మధ్య ..... మధ్య ..... ఏదో అడగపోయింది కాని మమ్మీ ఎందుకో కోపంగా ఉందని తెలుసుకుని ఊరకుండి పోయింది.

రాత్రి భోజనాల దగ్గర నెమ్మదిగా డాడీ దగ్గర మొదలెట్టింది అపర్ణ. "డాడీ ...... ! నాకో కొత్త దోస్తీ వచ్చింది డాడీ... ఇవాళ మాట్లాడేశాను..." అంటూ. "ఎవరా?" అన్నట్లు రమేష్ భార్యవేపు చూశాడు. అరవింద ఏమీ మాట్లాడలేదు. "అపూ! వెళ్లి నీ కాట్‌మీద పడుకో.... ఇక్కడెందుకు?" అంటూ అపర్ణని పంపించేసింది అరవింద. "ఎవరా క్రొత్త ఫ్రెండు......! అపర్ణకి..." అంటూ రెట్టించాడు భార్యని రమేష్. "ఎవరోలెద్దురూ...! అయినా, ఈ సోమయ్య..... మనవరాలిని తెచ్చిపెట్టుకున్నాడెందుకో? ఆ మధ్య నాతో అన్నాడు... అల్లుడు మనవరాలిని సరిగా చూడడం లేదని..... తన కూతురు పోవడంతో ఆ పిల్ల అనాథ అయిందని ...... ఆ పిల్లనే తెచ్చినట్లున్నాడు ....... ఇదొక తద్దినం" అంటూ అరవింద పెరుగు గిన్నె అందుకుంది. రమేష్ విస్మయంగా భార్యకేసి చూశాడు. "వాళ్లింటికి అనాథ వస్తే.... ఈవిడ కెందుకో బాధ!" భర్త చూపులను అర్థం చేసుకొన్నదా అన్నట్లు, "అదికాదండి. ఇక మన అపూ అస్తమానం.... నేస్తం..... దోస్తీ.... అంటూ ఆ మురికిపిల్లతో ఎక్కడ తిరుగుతుందో అని భయంగా ఉందండి .... అటువంటివాళ్ల దగ్గర... ఎన్ని అంటురోగాలో!"

ఎంతో అసహ్యాన్ని ఎలిపి మాట్లాడుతున్న అరవిందని, ఏమని వారించాలో తెలియని రమేష్ భోంచేయడంలో నిమగ్నుడయ్యాడు. "ఈనాడు తనకి వ్యాపారంలో లక్షలు కలిసివచ్చి ఇంతవాడయ్యాడు. కాని, తన చిన్నతనం.... బీదరికంలో గడవలేదూ ....?" కాని, ఇవన్ని చెప్పి అరవిందని నొప్పించడం ఇష్టంలేదు - రమేష్‌కి. "ఈ ధనార్జన అంతా అరవింద సంతోషం కోసరమే కదా!" అనుకుంటూ భోజనం ముగించి లేచివెళ్లాడు రమేష్.

రంగనాథం గారింటికి పార్టీకి తయారవుతూంది అరవింద. రమేష్ అప్పటికే తయారై, అద్దంముందు నిల్చుని టై సవరించుకుంటున్నాడు. కిశోర్, రాముా చేతులలో గంతులు వేస్తున్నాడు. అరవింద ముస్తాబయింది. మాచింగ్‌గా చెప్పులు వేసుకొని తన చీరకి సూట్ అయ్యే కలర్‌లో ఒక జినియాపువ్వు కోసి ముడిలో అమర్చుకుందామని తోటలోకి వెళ్లిన అరవింద, అక్కడి దృశ్యాన్ని చూసి అలాగే నిలబడిపోయింది. సీత ప్రక్కనే మట్టిలో చతికిలబడి కూచున్న అపర్ణ సీత భుజం మీద చేయివేసి, ఏమిటో కబుర్లు - చేతులు త్రిప్పి - త్రిప్పి చెప్పేస్తూంది. సీత కూడా ఎంతో అమాయకంగా వింటూ నవ్వుతూంది. అరవిందకి, వాళ్లిద్దరిని చూడగానే చెప్పలేనంత కంపరం పుట్టుకొచ్చింది. జిడ్డోడుతున్న మురికి బట్టలతో ఉన్న ఆ సీత చెంత, టిప్ - టాప్‌గా డ్రెస్సయి ఉన్న అపర్ణని ఊహించలేకపోయింది. ఛీ...... ఛీ...... ఈ మట్టి, మురికి - అశుభ్రత - ఇక భరించలేకపోయింది అరవింద. "అపూ....!" అంటూ గట్టిగా అరిచింది, కూతురుకేసి కోపంగా చూస్తూ. "చూడు... మమ్మీ ! నాతో ఆడుకుందుకు రమ్మంటే రానంటూంది ఈ సీత...." మెత్తగా ఫిర్యాదు చేస్తూ లేచివచ్చింది అపర్ణ తల్లి చెంతకి. పట్టు పరికిణీపై మట్టిచారలు.... పాలనురుగులాంటి తెల్లటిసాక్సు దుమ్ము కొట్టుకుపోయాయి ! అరవిందకి ఏమనాలో తోచలేదు. పిల్లల్ని గట్టిగా దండించడమంటే గిట్టదు అరవిందకు. ఆ మురికిపిల్లతో ఆడొద్దని అపర్ణకి ఎలా నచ్చచెప్పాలో అర్థంకాలేదు. నెమ్మదిగా లోపలికి తీసుకెళ్లి, బట్టలు మారుస్తూ, "అపూ...! చూడమ్మా!..... ఆ సీత..... అలాంటి వాళ్లతో ఆడుకోకూడదమ్మా! వాళ్లు చాలా మురికిగా ఉంటారు. రోజూ స్నానం చేయరు...." అంది అరవింద. "ఏం మమ్మీ! ఎందుకు చేయరూ....? వాళ్లకి స్నానానికి నీళ్లు - అవీ ఉండవా?" అంది ముద్దుగా అపర్ణ. "అది కాదు..... వాళ్ల తరహానే అంత ...? ఎప్పుడూ అంట్రైడీగా ఉంటారు. వాళ్లకి ఉన్న జబ్బులు నీకొస్తాయి...." అపర్ణకి వేరే సాక్సు - బూట్లు తొడుగుతూ, అంది అరవింద. "సీతకేం జబ్బు మమ్మీ!" అంది మళ్లీ అపర్ణ. ఇక చెప్పక తప్పదనుకున్న అరవింద, "ఇదో చూడు.... అపూ....! నువ్వు వాళ్లతో ఆడుకోకూడదు. నీ ఫ్రెండ్స్ ఉన్నారుగా - శైల, గీత, రూప, సుచరిత - వాళ్లతో ఆడుకో కావాలంటే.... దొరక్క, దొరక్క ఈ పిచ్చిపిల్లే దొరికిందా నీకు...." అపర్ణను బయటకు నడిపిస్తూ అంది అరవింద.

చెంగున కారు ముందుసీట్లోకి దూకి నాన్న ప్రక్కస్థలం చేసుకుంటూన్న అపర్ణ "మమ్మీ.... ఆ సుచరితా, గీతావాళ్లు నేనేది చెప్పినా కేర్ చేయరు.... వాళ్లు చెప్పిందే కరక్టంటారు..... పెద్దగొప్ప......! మరేమో ..... నాకు సీతే బాగుంది...... అదే మంచిది" అంది సంజాయిషీగా వెనక సీట్లో కూచుంటున్న తల్లికేసి చూస్తూ. అపర్ణ మాటలకు మనసులోనే నవ్వుకున్న రమేష్, "అరూ...! కిశోర్ని ఎత్తుకున్నావుకదూ ! సో.... ఉయ్ షెల్ ప్రొసీడ్......." అంటూ కారును స్టార్టు చేశాడు.

కారు రివ్వున సాగిపోతూంది, తారు రోడ్డుమీద. కార్లోనుంచి అవతలకి చూస్తున్న అపర్ణ "మమ్మీ..... మమ్మీ...... అటుచూడు!" అంది. అదే సమయానికి ట్రాఫిక్ సిగ్నల్ రాకపోవడంతో, కారు ఆపాడు రమేష్ ఆ ప్లాట్‌ఫారంమీద ఓ అడుక్కుతినే ఆమె కూచుంది. ఆమె ప్రక్కనే ఓ ఐదేండ్ల పిల్ల కూచుంది. దాని ఒంటినిండా కురుపులు.... చీమూ, రసి కారుతూ... అబ్బ ! ఎంత ఘోరంగా ఉందాపిల్ల. చటుక్కున అరవిందలో ఒక ఊహ జనించింది. "చూశావా...: అపూ! మురికిగా ఉంటే...... అచ్చం...... ఇటువంటి రోగాలే వస్తాయి. ఆ సీతతో ఆడుకుంటే నీకూ ఇటువంటి కురుపులు వస్తాయి" అంది అరవింద. "నిజంగానా!" అన్నట్లు - నమ్మశక్యం కానట్లు - పేవ్‌మెంటు కేసి మళ్లీ చూసింది అపర్ణ. ఆ చిన్నారి బుర్రలో ఏంతట్టిందో, "సోమయ్య తాతకూడా మురికివాడే కదమ్మా!" అంది. "ఔను..... అతను..... సీత తాతేగా" "అవును మమ్మీ..... సోమయ్య ఎప్పుడూ మట్టిలోనే ఉంటాడు కదూ. వాళ్లనసలు ముట్టుకోకూడదు మమ్మీ..." అంది కళ్లు పెద్దవిచేసి, మళ్లీ పరీక్షగా ఆ కురుపుల పిల్లకేసి చూస్తూ. ఇదేదో తన సబ్జక్టు కాదన్నట్లు ఉండిపోయిన రమేష్ గ్రీన్‌సిగ్నల్ ఇవ్వడంతో కారును కదిపాడు.

వరండా మెట్లదగ్గర నిలబడి బొమ్మల పుస్తకం చూసుకుంటూన్న అపర్ణ చెంతకి పరుగున వచ్చింది సీత. సీతను చూడగానే ముఖం చిట్లించింది అపర్ణ. "ఛీ... ఛీ..... మురికిపిల్లవి.... నిన్ను ముట్టుకోకూడదు. నువ్వూ, సోమయ్య తాతా కుళ్లువాళ్లు. మిమ్మల్ని ముట్టుకుంటే కురుపులు వస్తాయి. వెళ్లు.... మా మమ్మీ కోప్పడుతుంది...." అంటూ దూరంగా జరిగింది అపర్ణ. అపర్ణ మాటలను అర్థంచేసుకున్న సీత అయోమయంగా చూసింది. నిన్ననే కదూ ఆటకు రమ్మని తన్ను అంతలా అడిగింది. ఏంటో... చిన్నమ్మగారు ఇలా అంటున్నారు. ఔన్లే... అపర్ణలా.... అంత నీటుగా తను లేదుగా. అవ్వ చెప్పిందే నిజం. 'మిద్దింటి వాళ్లు... వాళ్లతో మనకేంటే సావాసం!..' అంటూ. వెనక్కి తిరిగి వెళ్లిపోయింది సీత. వెళ్తున్న సీతను చూస్తూ అక్కడే నిలబడిపోయింది అపర్ణ.

ఇంతలో, అరవింద "అపూ!" అంటూ కేకేయడంతో లోపలికి వెళ్లిపోయింది.

ఇంటి వెనకప్రక్క ఓ చిన్నసైజు స్విమ్మింగ్ పూల్ కట్టించింది అరవింద, పెళ్లయిన క్రొత్తలో. ఆ పూల్ అయినా సరే, రోజు మార్చి రోజూ శుభ్రంగా కడిగించి, మళ్లీ ఫ్రెష్‌వాటర్‌తో నింపించేది, తను స్విమ్మింగ్ చేసే రోజుల్లో. అపర్ణకి స్విమ్మింగ్ నేర్పించాలనీ, ఈ మధ్యనే మళ్లీ రెనవేట్ చేయించింది స్విమ్మింగ్ పూల్‌ని. రమేష్ కూతురు అపర్ణకి స్విమ్మింగ్ సూట్ వేసి, సేఫ్టీ బెల్టు కట్టి హుషారుగా ఈత నేర్పిస్తున్నాడు. ఉత్సాహంగా కేరింతలు కొడుతూంది, అపర్ణ. అల్లంతదూరంలో నిల్చొని "అరే ! ఎంచక్కా ఈత కొడుతూంది... అపర్ణ!" అంటూ ముక్కుమీద వేలువేసుకొని ఆశ్చర్యపడుతూంది సీత. "అపూ....! ఈ పూటకి చాలు. కమౌట్" అంటూ రమేష్ ఇంట్లోకి వెళ్లిపోయాడు స్నానం చేయడానికి. నీళ్లలో నుండి ఇవతలికి వచ్చి నిల్చుంది అపర్ణ. తలకి ఉన్న ప్లాస్టిక్ కేప్‌ని తీసేసి జుట్టు వదిలేసి నిల్చుంది అపర్ణ. "అమ్మాయిగారూ ! అమ్మగారు స్నానం చేయడానికి రమ్మంటున్నారు మిమ్మల్ని...." అంటూ వచ్చాడు రాము. "వెళ్తాకానీ.... రామూ ! ఆ పైనుండే జామపండు కోసిపెట్టవూ...?" అంది ముద్దుగా. కిశోర్‌ను క్రిందికి దింపి చెట్టెక్కాడు

రాము. పండుకోయడంలో నిమగ్నుడైన రామూ కాని అది చూస్తూ నిలబడ్డ అపర్ణ కాని, కిశోర్ స్విమ్మింగ్ పూల్ గట్టు ఎక్కడం గమనించలేదు. దూరంగా ఉన్న సీతమాత్రం ఇది చూసి పరుగు పట్టింది. కాని, అప్పటికే కిశోర్, కాలుజారి పూల్‌లో పడిపోయాడు. "బాబూ! అంటూ రామూ చెట్టుమీద నుంచి క్రిందికి దుమికాడు. "తమ్ముడూ" అంటూ అపర్ణ కేకవేసింది. సీత గబుక్కున పూల్‌లోకి దుమికింది. అక్కడే తోటపని చేసుకుంటున్న సోమయ్యతాత, పరుగున వచ్చి నీళ్లలోకి దిగబోయాడు.... కాని, అపర్ణ "తాతా! ఛీ..... ఛీ..... నీ మురికిచేతులతో, కాళ్లతో, స్విమ్మింగు పూల్లోకి దిగకు. ఊః... మమ్మీతో చెప్తాను!" అంటూ అరుస్తూ, ఏడుస్తూ సోమయ్యతాతకి అడ్డం వెళ్లింది. ఈత రాని రాము అపర్ణని గట్టిగా ప్రక్కకు లాగాడు.

అపర్ణని విదిలించుకొని, నీటిలోనికి దుమికి, బాబుని, సీతను బయటకు తెచ్చాడు సోమయ్య. కిశోర్ నీళ్లు బాగా మ్రింగినట్లున్నాడు. కడుపంతా ఉబ్బి ఉంది. రామూ ఏడుస్తూ ఇంట్లోకి పరుగెత్తాడు. నడుముకు చుట్టుకున్న టవల్‌తో రమేష్, అపర్ణ గౌను చేతిలో పట్టుకొని అరవింద, అక్కడికి వచ్చేటప్పటికి సోమయ్య, బాబుని క్రిందపడుకోబెట్టి కడుపు ఒత్తుతున్నాడు. పెద్దగా ఏడుస్తూ, "మమ్మీ....! ఈ తాత, ఈ సీత, స్విమ్మింగ్ పూల్‌లో దిగి, ముటికి, ముటికి చేసేశారు మమ్మీ....! మన బాబును ముట్టుకున్నారు కూడా - చూడు 'కిశూ'ని ఎలా మట్టిలో పడుకోబెట్టారో ! బాబుకు కురుపులు వస్తాయి కదూ !" అమాయకంగా గుచ్చి-గుచ్చి అడుగుతూ, అరవిందని కావలించుకుంది అపర్ణ. కూతురు మాటలకు దిగ్భ్రాంతి చెందిన అరవింద, అంతలోనే కర్తవ్యం గుర్తుకువచ్చి. కిశోర్‌ని గబుక్కున ఎత్తుకొని, "బాబూ!" అంది. తల్లి చేతుల్లోకి వచ్చిన కిశోర్, కొంత తేరుకున్నట్లున్నాడు. ఏడవడం మొదలెట్టాడు. కిశోర్ ఏడుపు విన్న రమేష్ మనస్సు కుదుటపడింది. డాక్టరుకు ఫోన్ చేయడానికి లోనికెళ్లిపోయాడు రమేష్.

పాపం సీత కూడా బాగా నీళ్లుత్రాగినట్లుంది. కాని కొంత పెద్దపిల్ల అవడంతో తొందరగా తేరుకుంది. అరవింద సీతను సమీపించి, "సీతా! ఎలా ఉంది పాపా నీకు...?" అంది అనునయంగా. ఉలిక్కిపడి, కళ్లుతెరచి అరవిందవేపు దీనంగా చూస్తూ "అమ్మగారూ....! తప్పయిపోయిందండీ. దేవునితోడు..... ఇంకెప్పుడూ బాబును ముట్టుకోనండి..... ముట్టుకోనంటే ముట్టుకోనండమ్మ గారూ....." గట్టిగా ఏడుస్తున్న సీతని దగ్గరకి తీసుకొని హృదయానికి హత్తుకుంది అరవింద.

సీతపట్ల, అమ్మకు కల్గిన ఈ అకాల ఆదరణకి కారణం అర్థంకాని అపర్ణ, అమ్మకేసి ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది.

***(యువ మాసపత్రిక, ఆగస్టు 1972)***

# గోడ్రాలు

"అమ్మాయ్ ! ఇంకెవరైనా నలుగు పెట్టేవాళ్లున్నారా ? మరి, పిల్లకి హారతి ఇవ్వమంటావా ?" అంది హనుమాయమ్మ సీమంతపు పెండ్లికూతురు పరిమళ దగ్గర హారతి పళ్లెం పట్టుకు నిలబడి.

"ఉండండి, మామ్మగారూ ! వాళ్ల వదిన నళిని ఇంకా నలుగు పెట్టలేదు. రానివ్వండి. తనని కూడా బొట్టు పెట్టి రెండు గాజులు తొడగనివ్వండి" అంది, నళినికి అక్కగారి వరసయిన సక్కుబాయి.

"ఊఁ ఊఁ .... ఇంతవరకూ చాల్లే, పిన్నిగారూ ! పిల్లకి హారతి పట్టండి. కడుపు చలవకి పిల్లలు గల తల్లులు గాజులు తొడగడం రివాజు. కాని, ఈవిడెందుకు మధ్యలో !" అంది, నళిని అత్తగారు కాంతమ్మ.

ఆఖరి మాటలను కొంత నెమ్మదిగానే అన్నది. కాని, అప్పటికే అక్కడికి వచ్చిన నళిని చెవుల్లో ఆ నాలుగు ముక్కలు పడనే పడ్డాయి. వంగి కుంకుమభరిణె అందుకుంటున్నదల్లా నళిని తటాలున ఆగిపోయింది. నళిని వివర్ణ వదనాన్ని చూసిన పరిమళ బాధగా తల్లివేపు చూసింది. "ఏమిటమ్మా ! నువ్వు మరీను !" అంది, మందలింపుగా - నళిని వచ్చింది వచ్చినట్లు వెనక్కి తిరిగి వెళ్లిపోయింది.

అంతవరకు ఎంతో ఆనందంగా ఉన్న వాతావరణం ఒక్కమారు చప్పబడి పోయింది. ఏదో జరగకూడనిది జరిగినట్లు ఎవరికి వారు బాధపడ్డారు. నళినిని మరీ అంతలా అందరిలో అవమానించినందుకు సక్కుబాయికి చాలా కోపం వచ్చింది.

"ఏంటండీ, అత్తయ్యగారూ ! నళినికి ఏమంత వయస్సు ముంచుకుపోయిందని అలాంటి మాటలంటున్నారు ? పెండ్లయి ఇరవై, ముప్పై ఏండ్లు అయ్యాక కూడా సంతానవంతులైన వారు ఎందరో ఉన్నారు. మీరు అంతలోకే నళినిని పనికిరానిదానిగా చేసి మాట్లాడుతున్నారు ...."

"అయ్యో రాత ! ఇప్పుడు నేనేమన్నానని మీరందరూ నామీద ఇలా విరుచుకు పడుతున్నారు! ఏదో పూర్వకాలపు మనిషిని. నాకూ కొన్ని నమ్మకాలుంటాయి. నా కూతురి మంచి చెడ్డలు నేను చూసుకోవద్దా ?" కూతురి మంచే కాని కోడలి మనస్సును గ్రహించని కాంతమ్మ చేష్టలని అక్కడున్న వారు ఎవ్వరూ హర్షించలేకపోయారు.

వచ్చిన బంధువుల కందరికీ చకచకా వడ్డనలు జరిగిపోతున్నాయి. ఇంతకు ముందు జరిగిన విషయాన్ని ఏమాత్రం మనస్సులో ఉంచుకోక వచ్చిన అతిథులకి ఏ లోపం రాకుండా అన్నీ దగ్గర ఉండి చూసుకుంటూంది నళిని. బొంగరం లాగ తిరుగుతూ పనిచేస్తున్న నళినిని చూస్తే జాలి వేసింది పరిమళకి. వివాహమై పదేండ్లయినా, అదేం పాపమో కాని, నళినికి సంతానం కలగలేదు. పెండ్లయి సంవత్సరం నిండీ నిండకుండానే పరిమళ సీమంతం చేసుకుంటూంది. మెడిసిన్ ఫైనల్ ఇయర్‌లో ఉండగానే పెండ్లి చేసుకున్న పరిమళ హౌస్‌సర్జెన్సీ పూర్తి కాకుండానే పిల్ల నెత్తుకోబోతున్నది. కూతురికి అంత తొందరగా కడుపు రావడం కాంతమ్మకి గర్వకారణమైంది. అంతవరకు సూటీపోటీగా, చాటుగా కోడల్ని మాటలనేది. ఇప్పుడు కాస్త బాహాటంగానే అనడం మొదలుపెట్టింది.

బంధువులు వీడ్కోలు తీసుకొని సాగిపోతున్నారు. నళిని అక్క సక్కుబాయి కూడా వెళ్లటానికి తయారయింది.

"నళినీ ! ఓమారు మాతోకూడా రాకూడదా చెల్లీ, మా ఊరికి ? మీ బావగారికి తెలిసిన లేడీ డాక్టరొకావిడ ఉన్నది. ఆవిడ హస్తవాసి చాలా మంచిది. ఆవిడ చేతి చలవవల్ల ఎందరో పిల్లల తల్లులయారు" తనకి పసుపు, కుంకుమలు అందిస్తున్న చెల్లెలితో అంది సక్కుబాయి.

"అదేమిటక్కా ! అత్తయ్య ఏదో చాదస్తంగా అన్నారని నువ్వూ అదే అంటున్నావా ? ఇప్పుడు నాకేమయిందని నేను డాక్టరు దగ్గరికి రాను !" అంది, నవ్వేస్తూ నళిని.

"బాగుందే నువ్వనేది ! మీ అత్తగారికి మాత్రం ఉండదా ఏమిటి, ఒక మనుమడినో, మనుమరాలినో ఎత్తుకోవాలని ! అయినా ఇలా ఆలస్యం చేయడం ఎందుకు ? ఏ వయస్సులో ఏ ముచ్చట జరగాలో, ఆ వయస్సులో అది జరగాలి."

"నాకూ మావారికీ లేని బాధ మీకంతా ఎందుకక్కా ! ఈమాట అన్నందుకు నన్ను క్షమించు. అయినా, గవర్నమెంటువారు కుటుంబ నియంత్రణో అని గోల పెడుతున్న ఈ రోజుల్లో మా వంటి దేశభక్తులు ఇలా ఇతోధికమైన సేవ చేస్తున్నారని ఎందుకనుకోరు ?" సక్కుబాయి చిన్న కూతురు అనితను ఎత్తి ముద్దాడుతూ అంది నళిని.

వారి మాటలు వింటూ అక్కడికి వచ్చిన కాంతమ్మ - "ఇదమ్మా వరస ! చెపితే వినిపించుకోదు. ఇప్పుడే నాకేమిటి తొందర అని ససేమిరా డాక్టరు దగ్గరికి రాదు. మావాడంటావా? వాడి ఆఫీసూ, వాడి ఫైళ్ళూ తప్ప మరోటి పట్టించుకోడు. సరే ! మళ్ళీ మొదటికి వచ్చినట్లు, ఈవిడగారేమో ప్లానింగూ, గ్లీనింగూ అంటూ మొదలెడుతుంది. పెళ్లయిన కొత్తల్లో ఏ పాడు మాత్రలూ గ్రట్రా మింగారో ఏమో ! ఇప్పుడవి వికటించాయి. ఊఁ ..... ఇంతకీ నాకు నాయనమ్మ నయ్యే యోగం ఉండద్దూ !" అంటూ దండకం అందుకుంది.

ఏదో అనబోతున్న అక్కయ్యని ఊరుకోమని సైగ చేసి, నళిని నెమ్మదిగా అక్కడినుండి తప్పుకుంది.

పరిమళని లేడీ డాక్టరు దగ్గరికి తీసుకెళ్లి చూపించి తిరిగి వస్తున్నారు అన్నయ్య, వదినలు. వెనక సీట్లో జారగిలబడి కూర్చుంది పరిమళ. శ్రీకాంత్ కారు డ్రైవ్ చేస్తున్నాడు. పక్కనే కూర్చున్న నళిని పరిమళకి పుట్టబోయే చిట్టిపాపకి స్వెట్టరు అల్లుతూంది. డ్రైవ్ చేస్తూనే స్వెట్టరు అల్లికని చూసి శ్రీకాంత్ - "ఏమోయ్ ! ఎంత వరకు వచ్చింది నీ కోడలి స్వెట్టరు ?" అన్నాడు, హాస్యంగా.

"మీ చెల్లెమ్మ బరువు దింపేటప్పటికి స్వెట్టరు రెడీగా ఉంటుంది లెండి. దాన్ని గురించిన బెంగ మీకక్కరలేదు" బాగ్‌లోనుండి చిక్కుపడ్డ ఊలును విడదీసుకుంటూ అంది నళిని.

"అలాగా !" అంటూ అదేదో పెద్ద జోకయినట్లు గట్టిగా నవ్వాడు శ్రీకాంత్.

"అన్నయ్యా ! ఇంత మొండి ఘటాన్ని పెళ్లాడావేమయ్యా ! 'లేడీ డాక్టరు దగ్గర పరీక్ష చేయించుకో, వదినా !' అంటూ చెప్పి చెప్పి నా నోరు పోవలసిందే కాని ... ఊహూఁ ! సుతరామూ నా మాట వింటేనా !" హాస్యాన్ని కోపంతో మిళితం చేస్తూ అంది పరిమళ.

'అదేమో నాకు తెలియ దన్నట్లు భుజాలు ఎగరవేసి, 'ఏమిటోయ్ నీ జవాబు ?' అన్నట్లు భార్యవేపు ఓ చూపు పారేశాడు శ్రీకాంత్.

"ప్రతివాళ్ల బల్ల ఎక్కి పరీక్షలు చేయించుకోవడం నాకిష్టం ఉండదు. అయినా, ప్రాప్తంలో

లేని పిల్లలు పరీక్షలు చేసినంత మాత్రంచేత పుట్టుకరారు కదా !" ఎంతో సామాన్యంగా చెప్పినా, నళిని మాటల్లో కొంచెం బాధ ధ్వనించింది.

"ఇన్సల్ట్ ! మెడికల్ సైన్సుకే ఇన్సల్ట్. అసంభవాలని సంభవాలుగా చేయడంలో డాక్టరు దేవుణ్ణి మించిపోతున్నాడంటే అది అతిశయోక్తి కాదేమో !" డాక్టర్లని వెనకేసుకొస్తూ జవాబిచ్చింది, నేడో రేపో పరిపూర్ణ డాక్టరు కానున్న పరిమళ.

"అయినా, డాక్టరమ్మా, నీకెందుకమ్మా అంత దుగ్ద ! ఏమాత్రం టైమ్ వేస్ట్ చేయకుండా నువ్వు కంటున్నావని అందర్నీ కనమంటావా ? ఏమిటి ?" హాస్యంగా అంటున్న నళిని మాటలకు మధ్యలోనే అడ్డుకుంది పరిమళ - "చూడన్నయ్యా ! వదిన" అంటూ.

"ష్యూర్ ! ష్యూర్ ! మా చెల్లెమ్మని నువ్వేమీ అనటానికి వీలులేదు. కావాలంటే నువ్వూ కను. నీకు లైసెన్సు ఇచ్చేశాను." శ్రీకాంత్ చమత్కారానికి వదిన, ఆడబిడ్డ లిద్దరూ గొల్లున నవ్వారు.

"పరిమళా ! మీరందరూ నాకు పిల్లలు లేరని ఎందుకర్రా అంత బాధపడతారు ? ఏం, ఇంక ప్రపంచంలో పిల్లలే లేరా ? ఇప్పుడు నీ సంగతే చూడు. పిల్లను భూమిమీద పడేసి ఛలోమని హౌస్ సర్జెన్సీకి చెక్కేస్తావు వైజాగ్‌కి. నీ పిల్లను పెంచేవాళ్లు ఎవరు ? నేను కాదూ ! మరి ఆ బిడ్డ నా బిడ్డగా మెలగదూ ?" నళిని మనోనైర్మల్యానికి మనస్సులోనే అంజలి ఘటించింది పరిమళ.

"ఆ ధైర్యంతోనే కదమ్మా ఉన్నాను నేను ! అంతా బాగానే ఉంది. కాని, పరాయివాళ్ల పిల్లలు నీ పిల్లలవుతారా ? ఇప్పుడు వద్దు అనుకుంటే ముసలితనంలో పుడతారా ? పుట్టినా ఆసరా అవుతారా ?"

"మేము వద్దనుకున్నామని ఎవరు చెప్పారు నీకు ? పుట్టలేదు .... అంతే. ముసలితనంలో ఆసరా అంటున్నావు. పదిమంది పిల్లలు గల తల్లిదండ్రులు పరాయివాళ్ల పంచన పడి ఉండడం నేనెందరినో చూశాను. మరి వాళ్ల సంగతేమిటంటావ్ ? పిల్లలు కలగనంత మాత్రం చేత జన్మ వృథా అయినట్లు మాట్లాడితే మాత్రం నేను సహించలేను." నళిని ఆవేశపడడం గమనించి, శ్రీకాంత్ భార్య భుజం తడుతూ, "వెల్‌సెడ్, ఐ ఎంటైర్లీ అగ్రీ విత్ యూ, మేడమ్ ! చెల్లెమ్మ కేం తెలుసులే !" అన్నాడు. అన్నయ్యను ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది పరిమళ.

★ ★ ★

పరిమళకి సుఖ ప్రసవమై ఆడబిడ్డ పుట్టిందన్న కమ్మటి కబురును మోసుకొచ్చాడు శ్రీకాంత్. కబురు విన్న నళిని ఎంతో ఆనందంగా నిట్టూర్చింది. గబగబా వెళ్లి పంచాంగం తెచ్చి చూసి, పిల్ల ఏ నక్షత్రంలో పుట్టిందో చెప్పింది. చిరునవ్వుతో భార్యనే చూస్తున్న శ్రీకాంత్ నెమ్మదిగా - "నళినీ !" అంటూ పిలిచాడు. రాత్రంతా నర్సింగ్ హోములోనే ఉన్నాడేమో, పాపం నలిగిపోయాడు శ్రీకాంత్.

"అరే ! మీసంగతే మరిచాను. ఉండండి, కాఫీ తెస్తాను" అంటూ పరుగున వెళ్లి కాఫీ తీసుకొచ్చింది భర్తకి నళిని. "మీరు ఆఫీసు కెళ్లేటప్పుడు నన్ను నర్సింగ్ హోమ్‌లో డ్రాప్ చేయండి.

ఈలోగా వంటా అదీ పూర్తి చేసుకుంటాను. అత్తయ్య ఇంటికి వచ్చి స్నానం చేసి రెస్ట్ తీసుకుంటారు." నళిని మాటలకు ఆమోదం తెలుపుతూ బాత్‌రూమ్ కేసి నడిచాడు శ్రీకాంత్.

ముట్టుకుంటే కందిపోతుందా అన్నంత సుకుమారంగా ఉంది పరిమళ పాప. రక్తవర్ణంతో మిలమిలలాడుతున్న ఆ చిన్నారి పసికందును అలా చూస్తూ ఉండిపోయింది నళిని. అలసటగా కళ్ళు మూసుకొని పడుకొన్న పరిమళ నెమ్మదిగా కళ్ళు విప్పి నళినిని చూసి "ఎలా ఉంది, వదినా, నీ కోడలు ?" అంది.

"నా కోడలికేం ? బంగారు బొమ్మ ! నువ్వేం అంత నీరసంగా ఉన్నావు ? అందులో మెడికోవి ? రాత్రినుండి ఏమీ ఆహారం తీసుకోలేదటగా ! లే, లే!! కొద్దిగా హార్లిక్స్ తాగు" అంటూ, పరిమళని బలవంతంగా లేపి కొద్దిగా హార్లిక్స్ తాగించింది నళిని.

"అరే, నళినీ ! అన్నట్టు మరిచేపోయాను. నా పాంటు జేబులో పాపవి స్నాప్సు ఉన్నాయి - చూడు !" కాఫీ సిప్ చేస్తూ అన్నాడు శ్రీకాంత్.

"ఇంతసేపూ చెప్పనే లేదేమండీ !" అంటూ పరుగున వెళ్ళి నళిని, ఫోటోలున్న కవరు తెచ్చింది. బోర్లాపడి బోసి నవ్వుతో పాప ముద్దొస్తూంది. "బుజ్జి తల్లి ఎంత బాగుందో ! పరిమళ కూతుర్ని చూచి ఎంత మురిసిపోతుందో !" నళిని ఫోటోలు పదేపదే చూసి శ్రీకాంత్ చేతికిచ్చింది.

"నళినీ ! ఫోటోగ్రాఫర్ ఏమన్నాడో తెలుసా !"

"ఏమన్నాడేమిటి ?"

"'మీ డాటరా అండీ ? భలే స్వీట్‌గా ఉంది' అన్నాడు." శ్రీకాంత్ నళిని వేపు కొంటెచూపులు చూస్తూ అన్నాడు.

"ఔనంటే పోలే !" అంది నళిని, కాఫీ కప్పులందుకొని వెనక్కి తిరుగుతూ.

"అలా అనుకొనే తృప్తిపడమంటావా ?"

ఉలిక్కిపడింది నళిని. సమాధానం చెప్పకుండా లోపలికి వెళ్ళిన నళిని మనస్సులో శ్రీకాంత్ మాటలే రింగురుమంటున్నాయి.

ఔను, తన భర్తలోకూడా ఈ మధ్య బాగా మార్పు కనిపిస్తూంది. పరిమళ ప్రసవం అయిన రెండు నెలలకే కూతురు ఉషని వదిలి వైజాగ్ వెళ్ళి పోయింది. ఉష పోషణాభారం, ఆలనా పాలనా అంతా నళినిదే ! నళినితోబాటు పాపను ఆడిస్తున్న శ్రీకాంత్‌లో పిల్లలపై ఆసక్తి పెరగడం గమనించింది నళిని. కాని, ఈరోజు పూర్తిగా బయటపడి పోయాడు.

'హుఁ! ఎవరికి మాత్రం ఉండదు కని, పెంచాలని !' గాఢంగా నిట్టూర్చింది నళిని. పాప ఏడుపు వినపడడంతో తన ఆలోచనలకి స్వస్తి చెప్పి పాప చెంతకు పరుగెత్తింది.

అది ఒక శ్రీమంతుల ఇంట బర్త్‌డే పార్టీ. అసలే అందమైన భవంతిని మరింత అందంగా అలంకరించారు. రంగు రంగుల కాగితాలతో, బల్బులతో, బెలూన్లతో తోటలోని రకరకాల పూలమొక్కలని మరిపిస్తూ తిరుగుతున్నారు, రంగు రంగుల డ్రెస్సులలో చిన్నారి బాలలు. ఆ ఇంటి యజమాని శ్రీకాంత్ మిత్రుడవడం చేత నళిని కూడా వచ్చింది పాపకో ప్రెజెంట్ చేత పట్టుకొని.

లాన్‌లో గుండ్రంగా తిరిగి ఆడుతున్నారు పిల్లలు. 'బ్లైండ్ హంట్' ఆట అది. ఒక పిల్ల కండ్లకి గుడ్డ కట్టారు. ఆ పిల్లను కవ్విస్తూ చుట్టూ తిరుగుతున్నారు మిగతా పిల్లలు. అటుగా వెళుతున్న నళిని ఆగి, వాళ్ల ఆటలలో లీనమై ఆనందిస్తూంది. ఇంతలో - "ఏమండీ ! మీ అమ్మాయిని తీసుకురాలేదా ?" అంటూ ప్రశ్నించిందో పిల్లల తల్లి. 'మా అమ్మాయా ?' అన్నట్లు తిరిగి చూసింది నళిని.

"చాలా చిన్నపాప అని తీసుకు రాలేదేమో కదూ ?" అంది, తన తప్పును తానే సరిదిద్దుకుంటున్నట్లు. 'అలా అనుకునే తృప్తిపడమన్నావా ?' అన్న శ్రీకాంత్ మాటలు నళిని మస్తిష్కంలో మరొక్కమారు ప్రతిధ్వనించాయి. చిన్నబోయిన నళిని ఇదివరకు లాగా పిల్లల ఆనందంలో పాలు పంచుకోలేకపోయింది.

"అమ్మాయ్, నళినీ!" అంటూ వచ్చింది కాంతమ్మ, శ్రీకాంత్ గదిలోకి. పుస్తకం ఒళ్లో పెట్టుకొని ఎటో చూస్తూకూచున్న నళిని ఉలిక్కిపడి లేచి నిలుచుంది-"ఏమిటత్తయ్యగారూ!" అంటూ. "ఏమీ లేదమ్మా" అంటూ అక్కడున్న కుర్చీ లాక్కుని కూర్చుంది కాంతమ్మ.

ఎంతో పనుంటే తప్ప తమ గదిలోకి రాని అమ్మను విస్తుపోతూ చూశాడు శ్రీకాంత్. "బాబ్జీ! నువ్వీ మధ్య నళినిని గమనించలేదు. ఎంత చిక్కిపోయిందో చూశావా?" కోడలు యోగక్షేమ సమాచారాలని తనకి చెప్పడానికే అమ్మ పని కట్టుకొని ఇక్కడికి వచ్చిందా అని ఆశ్చర్య చకితుడయ్యాడు శ్రీకాంత్. ఏమనాలో తోచక భార్యకేసి చూశాడు.

"అది కాదు, బాబ్జీ! పాపని పరిమళ తీసుకెళ్లినప్పటినుంచీ నేనూ చూస్తున్నాను. నళిని చాలా దిగులు పెట్టుకుంది." అమ్మ మాటలకు అడ్డొస్తూ శ్రీకాంత్ - "అదేమిటమ్మా! ఎవరి పిల్లల్ని వాళ్లు తీసుకుపోక మన దగ్గర ఉంచుతారా! నీ పిచ్చి, నీ కోడలి పిచ్చి కాని!" అన్నాడు.

అమ్మా కొడుకుల సంభాషణని ఆలకిస్తున్న నళినికి కొంత నవ్వు, కొంత చిరాకు కలిగాయి. 'అయినా ఇదేమిటి? ఎన్నడూ లేనిది అత్తగారికి ఇంత శ్రద్ధ తన మీద!' నెమ్మదిగా గదిలోనుండి జారుకోవడానికి ప్రయత్నించింది నళిని.

"నేను వచ్చిందే మీ ఇద్దరితో మాట్లాడడానికి! ఎక్కడికి వెళతావు? కూర్చో" అంది కాంతమ్మ కోడల్ని ఉద్దేశించి. తప్పనిసరిగా మంచం చివర్న కూచుంది నళిని.

"ఎన్నాళ్లని పరాయి పిల్లల్ని తెచ్చి మరులు పెంచుకొని, వాళ్లు కాస్తా దూరం అవగానే దిగులు నింపుకుంటాం! మీకూ అని ఒక నలుసు అక్కరలేదా?"

బాబోయ్! పాతపాటే కొత్త రూపం దాలుస్తూంది. సహాయం కోసమా అన్నట్లు భర్తకేసి చూసింది నళిని,

"నేనూ అదే ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చానమ్మా!" దృఢంగా అంటున్న శ్రీకాంత్ ముఖంలోకి విస్మయంగా చూసింది నళిని.

"నా ఫ్రెండు భార్య గైనకాలజీలో స్పెషలిస్టు. ఫారిన్‌లో ఆరు సంవత్సరాలుండి రీసెర్చికూడా చేసి వచ్చింది. సర్జరీలో దిట్ట. నిన్ననే ఆవిడ దగ్గర అపాయింట్‌మెంట్‌కూడా ఫిక్స్ చేశాను. వచ్చే ఆదివారం పొద్దున్న పది గంటలకి వెళ్లాలి."

'ఇంత ఏర్పాటు చేసుకొని తనకెందుకు చెప్పలేదో!' అన్నట్లు భర్తవేపు ప్రశ్నార్థకంగా చూసింది నళిని.

"అలాగే వెళ్ళిరండి, నాయనా! ఒక్కగా నొక్క కొడుకువి నువ్వు. నీ కడుపున నాలుగు కాయులు కాస్తే చూసి తరిద్దామన్నదే నా ఆశ. నలుగురూ నాలుగు విధాలుగా అంటూంటే బాధగా ఉంటుంది. వెళ్లి రండి. ఏ పుట్టలో ఏ పాముందో!" అంటూ కాంతమ్మ లేచింది కుర్చీలో నుండి.

అత్తగారు అట వెళ్లగానే నళిని - "అదేమిటండీ! మాట మాత్రం నాతో అనలేదు?" అంది.

"అంటే ఏం ప్రయోజనం! నీ ఒరిజినల్ గ్రామఫోను రికార్డు ఉందిగా? అది మొదలెడతావు- 'ఆఁ ఎందుకండి ఈ పరీక్షలన్నీ' అంటూ."

"ఔను, నిజమే! ఇప్పుడూ అదే అంటాను. అనవసరంగా ఎందు కీ ప్రయాస!"

"నళినీ! ఇన్నాళ్లూ నువ్వు ఇప్పుడే ఏం తొందర! పుట్టేరోజే వస్తే వారే పుడతారులే అని అంటూంటే నేనూ పెద్దగా పట్టించుకోలేదు. కాని, పాప వెళ్లినప్పటినుండి ఈ శూన్యం భరించలేకుండా ఉన్నాను. ఏమైనాసరే నాకో పాపాయి కావాలి." శ్రీకాంత్ కంఠంలోని ఆవేదనకి కదిలిపోయింది నళిని.

"ఆవిడకూడా మా అన్నయ్య లాగే పిల్లలు పుట్టరు అంటే, అప్పుడెంత బాధో చూడండి. కనీసం ఇప్పుడు, ఎప్పుడో ఒకప్పుడు పుడతారులే అన్న ఆశతో అయినా ఉన్నాము. ఆ ఆశకూడా అడియాస అయితే?" నళిని ఇక మాట్లాడలేకపోయింది.

"ఎప్పుడో ఎనిమిదేండ్ల క్రిందటి మాట చెపుతున్నావు నువ్వు. అప్పటికీ, ఇప్పటికీ మెడికల్ సైన్సు ఎంత వృద్ధి అయిందో తెలుసా? అందులో మనం కన్సల్ట్ చేయబోయే డాక్టరు సర్జరీలో చాలాగొప్ప చేయి. ఎంత గడ్డు కేసులయినా సరే, కనీసం ఒక్క మారయినా గర్భం ధరించేటట్లు చేయగల సమర్థురాలట! నాకెందుకో చాలా నమ్మకంగా ఉంది. నళినీ! ప్లీజ్, నా కోసం అయినా ఈ తడవ ఒప్పుకో!" శ్రీకాంత్ మాటలను మధ్యలోనే తుంచేస్తూ నళిని గబగబా అక్కడినుండి

వెళ్లిపోయింది. వెళుతున్న నళిని ముఖం అశ్రుసిక్తమై ఉండడం గమనించిన శ్రీకాంత్ హృదయం ద్రవించింది. 'పాపం! మాతృత్వానికి నోచుకోని స్త్రీ జన్మ ఎంత బాధాకరం! అందులో ఈమధ్య అమ్మ సణుగుడు ఒకటి మరీ ఎక్కువయింది - ఏమైనా సరే వంశం నిలబెట్టాలి అంటూ. ఇలాగే ఉపేక్షిస్తే అమ్మ ఆలోచనలు పెడదారిని పట్టే అవకాశం కూడా ఉంది! ఏమైనా సరే, నా నళినికి సంతానం కలిగేటట్లు చూస్తాను. మాతృత్వపు అర్హతను కలిగిస్తాను' అని నిశ్చయించుకున్నాడు శ్రీకాంత్.

పొద్దుట పది గంటలకే డాక్టరు దగ్గరికి వెళ్లాలి. లేచింది మొదలు నళిని మనస్సు మనస్సులో లేదు. ఏదో చెప్పజాలని ఆరాటం. హృదయమంతా బరువుగా ఉంది. ఆఖరికి శ్రీకాంత్ దగ్గరికి వచ్చి, "అపాయింట్‌మెంటు ఫిక్స్ చేశారుగా - నేనూ, అత్తయ్య వెళ్లిరామా!" అంది.

"అదేమిటోయ్, కొత్తగా మాట్లాడుతున్నావు! నేనుకూడా వస్తున్నాను" అన్నాడు శ్రీకాంత్, స్టాండు మీది షర్ట్ తీసి వేసుకుంటూ.

"మీ రెందుకండీ అనవసరంగా! ఆడవాళ్లం మేము వెడతాంగా!" అనునయంగా అంది నళిని.

"అనవసరం కాదు, నళినీ, అవసరమే! నీకు చెప్పడం మరిచాను. భార్యా భర్తలిద్దరినీ రమ్మని కబురు పెట్టింది ఆవిడ నిన్నపొద్దున్న తన భర్తతో." టై బిగించుకుంటూ అటు తిరిగిన శ్రీకాంత్ నళిని వంక చూడలేదు.

కుప్పలాగ కుర్చీలో కూలబడి వెక్కివెక్కి ఏడుస్తున్న నళినిని చూచి దాదాపు నిశ్చేష్టితుడయ్యాడు శ్రీకాంత్. ముఖాన్ని చేతుల్లో దాచుకొని హృదయంలోని బాధనంతా అశ్రువుల రూపంలో వెడలగక్కుతూంది నళిని. నళినిని ఆ స్థితిలో చూసిన శ్రీకాంత్‌కి మొట్టమొదట జాలి కలిగింది. కాని, వెంటనే చెప్పలేనంత కోపం ముంచుకొచ్చింది.

"ఏమిటిది? చిన్నపిల్లలాగ! ఏమంత కొంప ముంచుకుపోయిందని అంతలా ఏడుస్తున్నావు! అమ్మ చెప్పిందే నిజం. అసలు నీకే పిల్లలంటే ఇష్టం లేదు. నీకు నీ ప్రాణం అంటేనే తీపి. ఆ విషయాన్ని దాచిపెట్టి ఇన్నాళ్లూ నాటకం ఆడావు. పిల్లల్ని కనడం అన్నది అంత భయంకరమైన విషయంగా భావించినదానవు పెండ్లి ఎందుకు చేసుకున్నావు? ఎందుకునన్నిలా బాధ పెడుతున్నావు?" కోపంగా మాట్లాడుతున్న భర్త మాటలను అర్థంచేసుకొన్న నళిని మరింత కుమిలి కుమిలి ఏడ్చింది.

"చెప్పు, నళినీ! నీకు నా మీద ఏమాత్రం ప్రేమ ఉన్నా ఈనాడు నాతో డాక్టరు దగ్గరికి వస్తావ్. నిన్నేం బలవంతంచేయను. చెప్పు! నేను తండ్రినవడం నీకు ఇష్టం లేదు కదూ?" పిచ్చిగా వాగుతున్న శ్రీకాంత్ మాటలకు ఉడికిపోయింది నళిని.

"ఎన్నెన్ని మాటలంటున్నా రండీ! పది సంవత్సరాలుగా మీ నీడనై, వెన్నంటి ఉన్న మీ అర్థాంగిని మీ రిదేనా అర్థం చేసుకొన్నది?"

"నీడ, వెన్ను - ఆపు నీ పాండిత్యం. మరి ప్రేమ ఉన్న దానివి మెడికల్ చెక్ అప్‌కి రావడానికి ఎందుకు తటపటాయిస్తున్నావు?" అంటూ నళినిని ఆవేశంగా కుదిపాడు శ్రీకాంత్.

"చెపుతానండీ, తప్పక చెపుతాను. అందరూ గొడ్రాలు, గొడ్రాలు అన్నా భరించాను. కానీ, ఈనాడు మీరు నన్నిలా మాటలతో చిత్రహింస చేస్తూంటే భరించలేకుండా ఉన్నాను. చెప్పి మీ మనస్సును బాధించకూడదని ఇన్నాళ్లు దాచాను. కాని, ఇక చెప్పకుండా మీ మనస్సును బాధించలేను" అంటూ నళిని గబగబా బీరువా తెరిచి తన చీరలనన్నిటిని బయటికి లాగి, అడుగున ఉన్న ఒక బ్రౌన్ పేపరు కవర్‌ని పైకి తీసింది. ఏదో మెస్మరిజం చూస్తున్నట్లు నిలబడిపోయిన భర్త చేతిలో పెట్టిందా కవర్ని.

"ఏమిటిది?" అనుమానంగా ప్రశ్నించాడు శ్రీకాంత్.

"ఎనిమిదేండ్ల క్రితం అన్నయ్య, వదినలు ఫారిన్ వెళ్లేముందు మనిద్దరినీ పరీక్ష చేసి ఇచ్చిన రిపోర్టు ఇది."

"మీ అన్నయ్య రిపోర్టు ఇవ్వలేదు, ఇస్తానని మరిచిపోయా డన్నావు?"

"మరిచిపోలేదండి - ఇచ్చే వెళ్లాడు. భగవంతుడు మన ఇద్దరి విధిని నిర్ణయిస్తూ ఇచ్చిన తీర్పండీ అది!" నళిని మాటలను అర్థం చేసుకోలేకపోయాడు శ్రీకాంత్. గబగబా కవరులోని కాగితాన్ని బయటికి లాగాడు. రిపోర్టు, బావమరిది డాక్టర్ సుధాకర్ వ్రాసిన ఉత్తరం ఉన్నాయి. ఉత్తరమే మొదట చదివాడు శ్రీకాంత్.

**"చెల్లీ!**

ఎందుకమ్మా నువ్వీ పరీక్ష నాదగ్గర చేయించుకున్నావు ? పిల్లలంటే ప్రాణం పెట్టే తల్లీ! నీకు పిల్లలకు ప్రాణం ఇచ్చే యోగం లేదమ్మా. నీ భర్త బాహ్యంగా ఎంత ధీరుడో, సంతాన ప్రక్రియలో అంత అధీరుడమ్మా. నీ భర్తవల్ల నీకు సంతానం కలిగే యోగం లేదు, నళినీ!

బావగారికి నెమ్మదిగా ఈ విషయం తెలియజేయి. అసలు తెలుపకున్నా ప్రమాదం లేదు. పురుషుడు ఎందులోనయినా తన అసమర్థతను ఒప్పుకుంటాడేమో కాని, తన పురుషత్వంలో మాత్రం కాదు.

విధాత నీ జీవితంతో చెలగాటమాడాడు, తల్లీ! ఇక ఇంతకన్న ఏమీ వ్రాయలేను.

నీ అన్నయ్య,
**సుధాకర్"**

■

***(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 6-9-1972)***

# న్యూ వేవ్

"అమ్మా, మిమ్మల్నే...! ఫోన్‌కాల్ వచ్చింది" హాస్టల్‌బాయ్, జోసఫ్ కేకలకి అటుగా వెళుతున్న నలుగురమ్మాయిలూ, ఒకేసారి వెనక్కి తిరిగి చూశారు. వారి ప్రశ్నార్థక ముఖ భావాలకి సమాధానంగా, "రాధమ్మగారండీ మీకేనమ్మా ఫోను..!" అన్నాడు జోసఫ్, "బీ ఆన్ ది మూవ్- నేనిప్పుడే వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను?" రివ్వున వెనక్కి తిరుగుతూ అంది రాధ.

"ఈ మామయ్యకి పని- పాటా లేదు. అస్తమానం రమ్మంటూ ఫోన్‌కాల్స్. ఈ తడవ ఎవరి పుట్టినరోజో! బహుశా రీరాదో - దాని బాబు టామిదో అయ్యుంటుంది-" విసుక్కుంటూ రిసీవర్ అందుకుంది రాధ.

"హలో......! మామయ్యా!!" అనబోయి, ఆవలి వేపు కంఠాన్ని విని, "వాట్.......! అత్తయ్యనా..?" అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచింది రాధ.

నిజానికి అది ఆశ్చర్యకరమైన విషయమే. హాస్టల్లో వుంటున్న ఆ సంవత్సరపు రోజుల్లో, ఏనాడూ రాధకి వాళ్ళత్తయ్య ఫోన్ చేసిన పాపాన పోలేదు. చేస్తే మామయ్య - కాకుంటే రేఖ.

"అత్తయ్యకి కల్గిన ఈ అకాల అనుగ్రహానికి కారణమేమిటో...!" అనుకుంటూ వున్న రాధకి, అత్తయ్య మాటలు చెవిలోకి సోకాయ్..

"రాధా...! చూడమ్మా ..! నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి; కాలేజీకి సెలవు పెట్టి మధ్యాహ్నం వస్తావు కదూ..!"

పిచ్చిగాని పట్టలేదు కదా, ఈ అత్తయ్యకి. ఓ ప్రక్క ఎగ్జామ్స్ తఱుముకొస్తున్నాయని, తను వీకెండ్స్‌కి కూడా మామయ్యగారింటికి వెళ్ళడం మానుకుంటే. ఓస్.. ఈవిడేమో, తీరుబడిగా సెలవుపెట్టి 'వ..స్తా..వు..' కదూ అంటోంది.

"ఎలాగత్తయ్యా.. ఇంపార్టెంట్ క్లాసెస్ మిస్ అవుతానే..!" అంటున్న రాధ మాటలకు అడ్డుపడుతూ ఆవలి వేపునుండి "చాలా అర్జంటమ్మా, రాక తప్పదు, ప్లీజ్..." అంటూ, అత్తయ్య అభ్యర్థన వినిపించింది.

రిసీవర్ క్రేడిల్ మీద పడేసి, పుస్తకాలను హాస్టల్ గదిలోని టేబిల్‌పై విసిరేసి, సెలవు చీటీ లెక్చరర్‌కిమ్మంటూ క్లాస్‌మేట్ సరోజకి చెప్పేసి, హాస్టల్ నుండి బయటపడింది రాధ.

"అర్జంట్.. అర్జంట్ అంటుందేకాని, అత్తయ్యకి కారు పంపుదామన్న ఆలోచన రాలేదా! అయినా ఈ రాతియుగపు రాధతో ఏనేమిటబ్బా అల్ట్రా మాడ్రన్ అత్తయ్యకి...?" ఎక్కవలసిన బస్సు వచ్చి ఆగడంతో, తన తలపులకు తాళాలు వేసి బస్సెక్కింది రాధ.

మావయ్య ఇంట్లోకి అడుగుపెడుతూ వున్న రాధకి అర్థమయింది, ఏదో జరగకూడదనిది జరిగిందని. ఇల్లంతా ఎప్పుడూ లేనంత నిశ్శబ్దంగా వుంది. భయం భయంగా వెళ్ళి డ్రాయింగ్‌రూము తలుపులు తోసింది. సోఫాలలో అత్తయ్య మామయ్య దిగాలుగా కూచుని వున్నారు. దైన్యమే మూర్తీభవించినట్లున్న వాళ్ళిద్దరి ముఖాలు చూడగానే, రాధకి కడుపులో దేవినట్లయింది. జరిగిందేమిటో అర్థమవని రాధ, మెల్లగా అత్తయ్య చెంతకి నడిచింది.

"అత్తయ్యా! రేఖ దగ్గరి నుండి ఉత్తరం వచ్చిందా?-"

రాధ ప్రశ్న వినగానే, చంద్రకాంతం కొంగులో ముఖం దాచుకొని కుమిలి కుమిలి ఏడవడం మొదలెట్టింది.

అత్తయ్య ఏడుపు విని రాధ కంగారెత్తిపోయింది. "మామయ్యా...!" అంటూ మామయ్య దగ్గరికి నడిచింది. ఖిన్నవదనంతో మారు మాట్లాడక ప్రక్కనే వున్న కవర్ని రాధ చేతికిచ్చాడు కృష్ణారావు.

అత్తా- మామయ్యలకేసి ఒక్కసారి చూసి, ఉత్తరం తెరిచింది రాధ.

'మైడియర్ మమ్మీ!

డిసీజ్ యువర్ రేఖ. నేనేమైపోయానో అని భయపడుతున్నారు కదూ, డాడీ! నో ఫియర్ మమ్మీ; ఐయామ్ యాజ్ హెల్దీ- యాజ్ ఏన్ ఆపిల్- తిరుగు ప్రయాణంలో గోవా ట్రిప్ వేసుకున్నట్లు నీకు ముందుగా వ్రాసాను గుర్తుందా! గోవాలో రెండు రోజులు గడిపాం. అబ్బా! ఎంత

బాగుందనుకున్నావు. సీనరీ అనుకుంటున్నావు కదూ- నో మమ్మీ- ఇటీజ్ ద హిప్పీస్ సొసైటీ. మా ఫ్రెండ్సందరు, ఎంత చెప్పినా వినకుండా మద్రాసుకు మళ్ళారు. కాని నేను మాత్రం ఇక్కడే వుండిపోయాను. ఎంత థ్రిల్లింగ్‌గా వుందనుకున్నావ్, ఈ గోవాలో. మొదట్లో రెండుమూడు రోజులుండి మద్రాస్ ఎచ్చేద్దామనుకున్నాను. కాని ఇక్కడి లైఫ్ చూస్తూ విడిచి రాబుద్ధి అవడం లేదు. ఇటీజ్ సో వండర్‌ఫుల్ అండ్ ఎక్సైటింగ్- ఇది చదివి, డాడీ కోపోద్రిక్తులవుతున్నారు కదూ! ఐపిటీ పూర్ డాడీ. లైఫ్‌లో ఏమీ ఎంజాయ్ చేయలేకపోయారు. బై-ది-బై, హావీజ్ అవర్ ఓల్డ్ ఫాషన్డ్ డేమ్ రాధ... ఆ అందాల హంపీ కన్య ఓమారు గోవాను సందర్శిస్తే మళ్ళీ మద్రాసు రాదనుకుంటాను!

మమ్మీ కొద్దిగా వ్రాసానని కోపం చేసికోకు. భూలోక స్వర్గమని పిలువబడే ఈ గోవాని గుఱించి, మా హిప్పీలను గుఱించి, సుదీర్ఘమైన ఓ లేఖ వ్రాస్తాను త్వరలో. చూశావా, నా పక్కగా చేరి, క్విక్ క్విక్ అంటూ గోల పెట్టూంది, నా ఫ్రెండ్ ఎలైనా. అందమైన తన చేతుల్ని టైట్ ప్యాంట్సులో దూర్చి కమాన్ కమాన్ అంటూ, నన్ను పిలుస్తూంది - సముద్ర స్నానానికి కాబోలు-

సో, బై మమ్మీ.. హాపీ టైం విత్ యువర్ క్లబ్ యాక్టివిటీస్.

- రేఖ."

**పి.యస్:** నా లవ్‌లీ అడ్రస్.
టెంట్ నెంబర్ 2,
గ్యాస్పర్ డైస్ బీచ్,
పనాజి - గోవా.

ఉత్తరం చదివి స్థాణువులా స్తంభించిపోయింది రాధ. నిశ్శబ్దంగా వున్న గదిలో చంద్రకాంతం అత్తయ్య ఏడుపు మాత్రం హృదయ విదారకంగా వినిపిస్తూంది.

"ఎందుకే చంద్రం ఏడుస్తావ్! కూతుర్ని అల్ట్రా మాడరన్‌గా పెంచావ్. ఒక్కగానొక్క కూతురు- ఆడింది ఆట, పాడింది పాట. ఎప్పుడైనా కాదు- కూడదు అంటే- డాడీ చెడ్డవాడు. నీ కూతురు చేసిన ఘనకార్యాన్ని, నీ ఫేషనబుల్ సర్కిల్స్‌లో చెప్పుకుని గర్వపడు..."

"మామయ్యా..! ఏమిటా మాటలు...." బాధగా అంది రాధ.

"కాకుంటే ఏంటమ్మా..ఏనాడైనా భర్తగా మీ అత్తయ్యగాని, తండ్రిగా రేఖగాని నన్ను గౌరవించారా! ఈనాడు ఆపద వచ్చిందని 'అలో'మని ఏడిస్తే ఏం లాభం?" కృష్ణారావు కోపాన్ని- బాధని మిళితం చేసి మాట్లాడుతూంటే, రాధకి ఏమనాలో అర్థం కాలేదు.

అత్త చూస్తే అవమానంతో కృంగిపోతోంది. మామ చూస్తే బాధతో విలవిల్లాడి పోతున్నాడు.

రాధ లేచి వంట గదిలోకి నడిచింది. పని కుర్రాడు భయపడి ముడుచుకు కూచున్నాడు. ఇంట్లో వంట ప్రయత్నం చేసినట్లు లేదు. రాధే స్టవ్ అంటించి, కాస్త కాఫీ తయారు చేసి తెచ్చింది. ఇంతలోకి బజారు వెళ్ళిన వంటవాడు వచ్చాడు. వాడిని వంటకి పురమాయించి, కాఫీని కప్పుల్లో పోసుకొని వచ్చింది రాధ.

"ఛీ... ఛీ.. ఎంత అప్రతిష్ఠ. నేనెలా తల ఎత్తుక తిరుగను...." అంటున్నాడు కృష్ణారావు.

"మామయ్యా! జరిగిందేదో జరిగింది. అత్తయ్య అయినా ఇలా జరుగుతుందని ఊహించిందా...? ముందు మీరీ కాఫీ తీసుకోండి. స్థిమితంగా ఆలోచిద్దాం." అంటూ కాఫీ కప్పులను అత్తమామలకు అందించింది రాధ.

"అసలీ బొంబాయి ప్రయాణపు సంగతే నాకు తెలీదమ్మా. నేను నెల్లూరికెళ్ళి వచ్చేటప్పటికే రేఖ తన ఫ్రెండ్సుతో ఎడ్యుకేషనల్ టూర్ వెళ్ళిందని తెలిసింది. అయినా ఓ విషయం- తల్లీ కూతుర్లు ఏదైనా నాతో చెప్పిచేశారు కనుకనా - ఇది చెప్పలేదనుకోవడానికి.." రాధకి, కృష్ణారావు ఆరోపణలు వింటుంటే కోపం వచ్చింది.

మామయ్య ఈనాడిలా కోపంగా మాట్లాడుతున్నాడు కానీ, ముందు నుండి కఠినంగా అదుపాజ్ఞలు అమలుచేసి వుంటే, రేఖ వ్యవహారం ఇంతవరకు వచ్చేది కాదుగా.

భర్త రోషావేశపు పలుకులు ములుకుల వలె గుచ్చుకున్న చంద్రకాంతం, వర్షిస్తున్న కళ్ళతో రాధవేపు చూసింది.

"మామయ్యా! ఊర్కే మాటలెందుకూ? ఎలాగో ఓలాగు రేఖని వెనక్కి తీసుకురావాలి కదా" అంది రాధ.

"ఎంత తేలికగా అంటున్నావమ్మా. రేఖ ఎంత పెంకిఘటమో నీకు తెలియందేముంది! ఊఁ... హూఁ.. ఒకవేళ వెళ్ళినా, అది వస్తుందన్న ఆశ నాకు లేదు...!"

"వెళ్ళి ట్రై చేసినందువల్ల నష్టమేమీ లేదు కదండీ" అంది చంద్రకాంతం భర్తవేపు చూస్తూ.

"ఎవరు వెళ్ళేది..? నువ్వు వెళ్తావా?? వెళ్ళినా నీ ముద్దుల కూతురు నిన్ను లక్ష్యపెట్టుందా? ఆ అవమానం కూడా అనుభవించాలని వుంటే, భేషుగ్గా వెళ్ళు; నాకేం అభ్యంతరం లేదు.. నేను మాత్రం గోవా రాను -రాలేను" కృష్ణారావు మామయ్య ఇంతలా మారిపోయాడేమా అని ఆశ్చర్యపోయింది రాధ.

"అలా అంటే ఎలా మామయ్యా! తప్పు చేసింది. సరే ఒప్పుకున్నాం. ఎంతైనా మనపిల్ల కదా! ఎలాగో ఓలాగు దార్లోకి తీసుకరావాలి కాని, ఇలా వదిలేస్తామా?"

"అలా చెప్పు రాధా, మీ మామయ్యకి. ఎంతసేపూ నన్ను దుయ్యపట్టడమే కాని, జరగవలసిన దాన్ని గురించి ఆలోచించరేం! ఏమయినా సరే ఎవరో ఒకరు వెళ్ళి, రేఖని, నయాన్నో భయాన్నో నచ్చచెప్పి తీసుకురావాలి" చంద్రకాంతం అత్తయ్య కొంత ధైర్యాన్ని పుంజుకొని మాట్లాడింది.

"నయాన్న చెప్పడానికి నావల్ల కాదు. భయాన్న లాక్కు రావడానికి రేఖ ఏమీ చిన్నపిల్ల కాదు. ఎలా తీసుకువస్తావో మరి నీయిష్టం నా చేత కాదని మాత్రం నేను ఒప్పుకుంటున్నాను."

"పదిమందికి తెలిసేలోగా ఎలాగో ఓలాగు దాన్ని తీసుకురావాలి కదండీ! మీరే అలాగంటే ఎలాగు?"

"ఇంతకీ నన్నేం చేయమంటావో చెప్పు. నేను వెళ్తే మాత్రం నాతోరాదు రేఖ అని మాత్రం స్పష్టంగ చెప్పగలను.." కృష్ణారావు కొంచెం మెత్తబడడం గమనించింది రాధ.

"పోనీ మామయ్యా! అత్తయ్యా నువ్వు ఇద్దరూ వెళ్ళిరండి" అనునయంగా అంది రాధ.

"లాభం లేదమ్మా! మా ఇద్దరిలో ఏ ఒక్కరి మాటకి అది విలువ ఇవ్వదు. బలవంతం చేస్తే, పంతం పట్టి కూచుంటుంది ఖాయంగా."

"అందుకేనండి నేను రాధకి కబురు చేసింది. మీరూ రాధ వెళ్ళి నచ్చచెప్పి తీసుకు రండి."

చంద్రకాంతం అత్తయ్య మాటలకి వులిక్కిపడింది రాధ. తను వెళ్ళడమా, అందులోను గోవాకి. పరీక్షలొకవేపు తరుముకొస్తుంటే.. తనకెలా సాధ్యపడుతుంది ఈ ప్రయాణం..! మామయ్య ఏమంటారో అన్నట్లు, మామయ్యకేసి చూసింది రాధ.

"ఔనమ్మా! మీ అత్తయ్య చెప్పింది రైటే. రేఖ దేనికయినా గౌరవం - విలువా అంటూ ఇస్తే అది నీమాటకేనమ్మా. నువ్వే దాన్ని ఒప్పించి తీసుకురాగలవని నాక్కూడా నమ్మకం కలుగుతోంది."

మామయ్య అభ్యర్థనని, అత్తయ్య ఆవేదనలోని ఆక్రందనని అర్థం చేసుకున్న రాధ, ఇక తిరస్కరించలేకపోయింది.

"అలాగే మామయ్యా.......! ఒక వారం రోజుల్లో తిరిగి వచ్చేద్దాం. టికెట్లు రిజర్వు చేయించండి-" అంటూ మేడపైకి నడిచింది రాధ.

అది రేఖ లివింగ్‌రూమ్; స్టడీరూము కూడా. మామయ్యా వాళ్ళింటికి వీకెండ్సుకి వచ్చినప్పుడల్లా రాధ ఆ గదిలోనే వుంటుంది. గదిలోకి వచ్చీ రావడంతోటే వాలు కుర్చీలో వాలిపోయింది రాధ. రేఖ టూర్‌వెళ్ళి అప్పుడే రెండు నెలలయినా ఇంకా ఆ గదిలోనే మసలుతున్నట్లు అనిపించింది రాధకి. రేఖ విప్పి విడిచిన లుంగీలు, హేంగరికి వ్రేలాడుతున్నాయ్. కోట్ స్టాండుమీద నైటీ నెగ్‌లెక్టెడ్‌గా పడి వుంది. టేబిల్‌మీద అస్తవ్యస్తంగా పడి వున్నాయ్ కొన్ని పుస్తకాలు. అందులోని ఒక పుస్తకంలోంచి తొంగి చూస్తోంది రేఖ ఫోటో. దాన్ని చేతిలోకి తీసుకొంది రాధ.

ఆమధ్య తేనాంపేట కాంగ్రెస్ గ్రౌండ్స్‌లో 'రాక్ సైక్లోన్' అనే ఓ హిప్పీస్ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అమెరికాలోని ఉడ్‌స్టాక్‌లో జరిగే హిప్పీస్ సమావేశాన్ని పోలి వుందా సమావేశం. అన్ని ప్రాంతాలనుంచి హిప్పీలందరూ తరలివచ్చారు ఆ చోటుకి. మద్రాసు నగరవాసుల్ని- ముఖ్యంగా టీన్ఏజర్స్‌ని - ఆ సమావేశం ఎంతగానో ఆకర్షించింది. రేఖ వెంట రాధ కూడా వెళ్ళింది. రేఖకి హిప్పీలంటే ఏదో చెప్పలేని వ్యామోహం. రోడ్లల్లో, బస్సుల్లో హిప్పీలు ఎక్కడ కనిపించినా, ఎంతో అడ్మిరేషన్‌తో వాళ్ళని చూసేది రేఖ. కొందర్నయితే పలకరించేది కూడా.

గ్రౌండ్సులో అడుగుపెట్టిందే తడవుగా, రేఖ విహంగమై విహరించింది. హిప్పీలలో తానొకర్తెగా మారి వారి వెంట తిరిగింది. రేఖ స్వభావానికి పూర్తిగా వ్యతిరేఖమైన స్వభావం, రాధది. రాధకివన్నీ

నచ్చవు. "ఎందుకొచ్చామురా భగవంతుడా!" అనుకుంటూ, జనం పల్చగా వున్న వేపు నడక సాగించింది రాధ.

చెట్లక్రింద గుంపులు గుంపులుగా కూచొని, పాప్ మ్యూజిక్ పాడుకుంటున్నారు కొందరు. వాళ్ళ ఆకార వ్యవహారాన్నిచూసి మొదట్లో నవ్వు వచ్చినా తరువాత జాలివేసింది రాధకి. మామూలు హిప్పీలతోపాటు మద్రాసులోని కొందరు విద్యార్థినీ విద్యార్థులు సయితం అప్పటికప్పుడు హిప్పీలుగా మారినట్లు బిహేవ్ చేయడం మొదలెట్టారు. ఒక హిప్పీని చూచి నవ్వాపుకోలేకపోయింది రాధ. చొక్కాను తిరగేసి తొడుక్కున్నాడా మానవుడు. అంటే బొత్తాములున్న పార్టు వెనక్కి వెళ్ళింది. ఇంకొక హిప్పీ తెల్లని టెరీన్ చొక్కామీద ఇంత మట్టి రాసుకుంటున్నాడు. వేరొకమనిషి పాంటుని పర్రుమని చింపి, చినిగిన పాంటువంక చిద్విలాసంగా చూస్తూ బోల్డు సంతోషపడిపోతున్నాడు- "ఏవిటో వీరి చేష్టలు" అనుకుంది రాధ.

ముఖంమీదపడే జుట్టును మురిపంగా ముందుకు లాక్కుంటూ నవ్వుకుంటున్నారు కొందరు మగ హిప్పీలు. జుట్టు విరబోసుకుని నడుము చుట్టూ లుంగీని చుట్టి, మట్టిలో ఎక్కడపడితే అక్కడ కూలబడిపోతున్నారు, కొందరు ఆడ హిప్పీలు. ఏ వస్తువునయినా సరే, కొనుక్కుతినడం, ఒకే తినుబండారాన్ని ఎంగిలి అని భావించక నలుగురు తినడం పరమానందంగా భావించి సంచరిస్తున్న ఆ సముదాయాన్ని చూసి, విస్తుపోయింది రాధ.

ఒకచోట నలుగురు హిప్పీలు ఒకరి భుజాలమీద ఇంకొకరు చేతులు వేసుకొని ఒంటికాళ్ళమీద నిలబడి, ఒకే ఒక్క కోకోకోలా బాటిల్‌లో నాల్గు స్ట్రాలు ముంచి, అందులోని ద్రవాన్ని జుర్రుకుంటున్నారు. ఆ నలుగురిలో ఒక ఆడ హిప్పీ కూడా వుంది. అటుగా వస్తున్న రాధని చూసి, "హేవ్ ఎ సిప్" అన్నాడు ఓ హిప్పీ. "నో.. థ్యాంక్స్.." అంటూ ముఖం చిట్లించి ముందుకు నడిచింది రాధ.

ఓ చెట్టు క్రింద పదిమంది హిప్పీలు పరమానంద దశలో వున్నారు. హుక్కాలను గంజాయితో నింపి ఎంజాయ్ చేస్తున్నారా మానవులు. కొందరి ఆడ హిప్పీల చేతుల్లో మాత్రలు కాబోలు మాయమైపోతున్నాయి. మత్తుకోసరం మాత్రలు కూడా వున్నట్లు అప్పుడే తెలియవచ్చింది రాధకి.

అటూ-ఇటూ తిరిగి అలసిపోయిన రాధ, రేఖను అన్వేషిస్తూ బయలుదేరింది. కొందరి హిప్పీల చెంత మట్టిలో కూచుని, తెగ మాట్లాడేస్తోంది రేఖ. మెల్లగా రేఖ దగ్గరకు వచ్చి "ఇక వెళ్దామా...!" అంది రాధ.

"ఎస్...ఎస్.. ఉయ్ షల్‌గో..." అంటూ లేచి నిల్చుంది, రేఖ.

"సోసూన్...!!" అన్నాడు అందులోని ఒకడు.

"కాంట్ బట్. ఇక్కడే కూచుండిపోతే మా స్క్వయిర్స్ వూరుకుంటారా?" కాస్తకష్టంగా అంది రేఖ.

"అక్కడే వున్నది మన నీక్‌నెస్. ఈ స్క్వేయిర్స్‌ని మనం కేర్ చేయకూడదు.." అన్నాడు ఆ మగహిప్పీ.

నవ్వుకుంటూ నడిచింది రేఖ.

"స్క్వేయిర్ అంటాడేమిటి రేఖా!?" అంది రాధ.

"ఓ అదా! ..." అంటూ పకపక నవ్వింది రేఖ. స్క్వేయిర్స్ అంటే పేరంట్స్ అన్నమాట, హిప్పీల పరిభాషలో. స్క్వేయిర్ నాల్గుమూలలా మూయబడి అందున్న ప్రాణికి హాయి స్వేచ్ఛ లేనట్లే - స్క్వేయిర్స్ అనబడే ఈ పేరంట్స్ వలనకూడా పిల్లలకి స్వేచ్ఛ లభించదు.." రేఖ వివరణకి రాధకి ఒల్లుమండింది.

హిప్పీలతో కలిసి రేఖ తీయించుకున్న ఫోటోని పరికించి చూస్తున్న రాధకి రెణ్ణెల్ల క్రితం తేనాంపేటలో జరిగిన రాక్ సైక్లోన్ కండ్లముందు సినిమా రీలులా తిరిగింది.

"అమ్మాయ్ రాధా! ఏం చేస్తున్నావ్?" అన్న అత్తయ్య కేకకి ఉలిక్కిపడి, "ఇదో వచ్చేస్తున్నా...!" అంటూ మెట్లు దిగసాగింది రాధ.

★ ★ ★

"మామయ్యా! ఈ మహానగరంలో రేఖ ఎక్కడుందో తెలుసుకోవడమెలా!" సర్క్యూట్ హౌస్‌లో నాల్గవ నంబరు రూముకి తాళం పెడుతున్న కృష్ణారావు మామయ్యతో అంది రాధ.

"చూద్దామమ్మా.....! వాకబు చేద్దాం. ఏలాగూ, రేఖ లేఖలో గ్యాస్పర్ డైస్ బీచ్ అంటూ వ్రాసిందిగా-అదెక్కడుందో అడుగుదాం" రాధ వెంట రాగా ఆఫీసు రూంకేసి నడిచాడు కృష్ణారావు.

రాధ, కృష్ణారావులు ఆ ఉదయమే గోవా వచ్చారు. అందమైన 'అల్టినో' ప్రాంతంలో అతి సుందరంగా కట్టబడిన సర్క్యూట్‌హౌస్‌లో ఓరూము తీసుకున్నారు. పనాజి పట్టణపు సొబగు, ఆ పట్టణాన్ని ఆనుకొని వున్న అరేబియా సముద్రపు హొయలు సర్క్యూట్‌హౌస్ నించే చక్కగా కన్పిస్తున్నాయి.

హోటల్ ఆఫీసు గదిలోకి అడుగిడిన కృష్ణారావుని చూసి "వాట్ కెన్ ఐ డు ఫర్ యు సర్" అంటూ లేచి వచ్చాడు కేర్ టేకర్.

"నాట్‌మచ్.. వేర్ కెన్ ఐ మీట్ ది హిప్పీస్ హియర్.." అన్నాడు కృష్ణారావు కాస్త తడబడుతూ.

కేర్‌టేకర్ అదోలా బుజాలెగరేసి "హిప్పీస్- దోస్ స్కప్పీ అండ్ డర్టీ పీపుల్...? ఎవెరివేర్..." అన్నాడు. టేబిల్ సొరగులోంచి గోవాని గురించిన గైడ్ ఒకటి తీసి ఇస్తూ, "ప్లీజ్ ట్రై కాళింఘూట్ ఆర్ గ్యాస్పర్‌డైస్ ...." అన్నాడు.

కృష్ణారావు గైడ్‌లోని పేజీలను తిప్పసాగాడు. గోవాని గుటించిన సమస్త విషయాలు అందులో వున్నాయి, ఓ మాపుతో సహా.

సర్క్యూట్ హౌస్‌ని వదలి వాకబు చేసుకుంటూ - చేసుకుంటూ అరేబియా సముద్రపు అందచందాలను తీర్చిదిద్దే గ్యాస్ఫర్డైస్ సముద్రతీరాన్ని చేరారు రాధ, కృష్ణారావులు. బంగారు వన్నె ఇసుకలో బంగారు వెంట్రుకల చిన్నదొకటి, అటు వెళ్తున్నదల్లా, రాధని చూసి ఆగిపోయింది.

రాధ చెంతకు పరుగున వచ్చి, "హాయ్...!" అంటూ పల్కరించింది. "హాయ్" అంటూ ప్రత్యుత్తరమిచ్చి, ఆ అమ్మాయికేసి చూసింది రాధ. అప్పుడే సముద్ర స్నానం చేసి వచ్చినట్లుంది. తల వెంట్రుకల నిండానీళ్లు, బిగుతుగా పైజమా వేసి పైన ఓ షర్టులాంటిది తొడిగింది. వంటికి అంటుకపోయిన తడిబట్టలతో, కాళ్ళకి చెప్పులయినా లేని ఆ అమ్మాయిని చూసి రాధకి జాలివేసింది. చేతిలోని వేరుసెనక్కాయల పొట్లం లోంచి కొన్ని తీసి రాధకి, కృష్ణారావుకి ఆఫర్ చేసింది. సభ్యతకోసరమని ఒకటి రెండు సెనక్కాయలు తీసుకున్న కృష్ణారావు "అమ్మా రాధా...! రేఖని గురించి ఈ అమ్మాయితో వాకబు చేయి... నేనలా వెళుతుంటాను" అంటూ వారిరువురి మధ్యనుండి తప్పుకున్నాడు.

రాధ, ఆ అమ్మాయి వెంబడే ఇసుకలో నడవసాగింది. ఆ పిల్ల కాస్సేపు కుంటికాలితో కుంటింది- ఇంకాస్సేపు ఇసుకలో సర్కిల్స్ కొడుతూ తిరిగింది. మధ్య మధ్య వేరుసెనగపప్పులు తింటూనే వుంది. రాధకి ఆ అమ్మాయి అమాయక ప్రవర్తన చూస్తుంటే .. అడవిలో చెంగున దుముకుతూ పరుగెత్తే లేడిపిల్ల జ్ఞాపకానికొచ్చింది. అమ్మ ఒడిలో హాయిగా కదలాడే పసిబాలిక స్మరణకు వచ్చింది.

"మే ఐ నో యువర్ నేమ్ ప్లీజ్..." అంది రాధ ఆ అమ్మాయిని మాటల్లోకి దింపుతూ.

"మై నేమ్..!" అంటూ కాస్సేపు ఆలోచనలో పడిపోయిందా అమ్మాయి. బహుశా మర్చిపోయింది కాబోలు అనుకొంది రాధ.

"వాట్సువర్ నేమ్...?" తిప్పి ప్రశ్నించింది రాధని, ఆ అమ్మాయి.

"రాధ" అంది నవ్వుతూ రాధ.

"హౌస్వీట్... మైనేమ్ ఈజ్ ఎలైన్.." అంది ఆ అమ్మాయి.

అవీ- ఇవీ మాట్లాడాక వున్నట్లుండి రాధని ప్రశ్నించింది ఎలైన్, "నువ్వు కూడా మాలో ఫ్రెండుగా చేరుతావా!" రాధ ఆ ప్రశ్నకి సమాధానమివ్వకనే, "మీలో ఈ మధ్య ఓ క్రొత్త అమ్మాయ్ వచ్చి చేరింది తెలుసా!" అంది.

"ఏస్.. ఓ మద్రాసీ అమ్మాయి, అందమైన జుట్టు, నల్లటి కళ్లు. షి ఈజ్ సింప్లీ బ్యూటిఫుల్- ఆ అమ్మాయేనా..!" అంది ఎలైనా.

వెదుకపోయిన తీగె కాలికి చుట్టుకున్నంత సంతోషపడిపోయింది రాధ. "ఆఁ.. ఔను ఔను. నన్నొక్కమారు ఆ అమ్మాయి దగ్గరికి తీసికెళ్ళవూ.." అంది, కాస్త బ్రతిమాలే ధోరణిలో.

"ఊఁ.. హూఁ..." అంటూ తల అడ్డంగా వూపింది ఎలైనా.

"ఏం!" అంది హతాశురాలైన రాధ.

"ఎందుకంటే ఎవరు ఎప్పుడు ఎక్కడెక్కడుంటారో నాకే సరిగ్గా తెలియదు. కొందరు సన్‌బాత్ తీసుకుంటుంటారు. మరి కొందరు షాపింగ్‌కో, టెంపిల్‌కో, ఏదో జాబ్ చేసేందుకో వెళ్ళి వుంటారు. ఎక్కడుంటుందని ఆ అమ్మాయిని పట్టను.." అంది ఎలైనా. నిరుత్సాహ పడిపోతున్న రాధని చూసి, "డూ వన్‌థింగ్. ఈ రాత్రికి మూన్‌లైట్ మెడిటేషన్కి ఈ బీచ్‌కే వస్తున్నాం. అదుగో ఆ కనిపిస్తున్న పెద్ద గుడారం లేదూ- అందులో ప్రేయర్స్. అర్ధరాత్రి పన్నెండు వరకు అక్కడే వుంటామ్. యూకెన్‌మీట్ యువర్ రేఖా దేర్. సో.. బై....గుడ్‌లక్." చేతులూపుకుంటూ పరుగున వెళ్ళి ఆమె కోసరం అటుగా వస్తున్న ఓ మగ హిప్పీని కలుసుకొంది. ఒట్టి అండర్ వేర్ ధరించి వేసుకోవలసిన గురు షర్టు, పైజమాను ఎలుపు చుట్టబెట్టి ఎలైన్ నడుముచుట్టూ చేతులు వేస్తూ సముద్రపు వేపు నడిపించుకపోయాడు ఆ మగ హిప్పీ. రాధ నెమ్మదిగా మామయ్యకేసి నడిచింది.

పౌర్ణమి వెన్నెల పుచ్చ పువ్వుల్లా వ్యాపించి, పసిమి వర్ణపుటిసుకకు ప్రత్యేక శోభనిస్తోంది. అలలమీద గాలి అల్లనల్లన వీస్తూ మేనుకెంతో ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. గుడారాన్ని సమీపించగానే కృష్ణారావు ఆగిపోయాడు. "అమ్మా రాధా..! నేనీ కొబ్బరిచెట్ల క్రింద కూచుని వుంటాను- మరి నీవొక్కదానివి వెళ్లి రాగలవా?" అన్నాడు.

"మీకేం భయం అక్కరలేదు మామయ్యా...! ప్రొద్దుట ఆ అమ్మాయితో మాట్లాడినప్పటినుండి నాకు చాలా ధైర్యంగా వుంది. వాళ్ళు కూడా నాలాంటి అమ్మాయిలే కదా. మీరు నిశ్చింతగా వుండండి-" అంటూ ముందుకు సాగింది.

డ్రమ్స్ శబ్దంతోపాటు ఫ్లూట్ వాద్యం కూడా వినిపిస్తోంది. నెమ్మదిగా గుడారంలోకి ప్రవేశించింది రాధ. గుడారం నిండా యువతీయువకులు. మధ్యలో ఒకతను డ్రమ్స్ వాయిస్తూ బీటిల్స్ పాట పాడుతున్నాడు. ప్రక్కనున్న అతని చేతిలో ఒక మాండలిన్. మరిద్దరు హిప్పీలు పాటకి అనుగుణంగా దరువు వేస్తున్నారు. గుడారంలో అక్కడక్కడ కాండిల్స్ తప్ప వేరే లైట్లంటూ లేవు. కాండిల్ వెలుగు చొరని చోటు వెన్నెల పరచుకుంటూంది. లయబద్ధంగా తలలూపుతూ సామూహికంగా డాన్సు చేస్తున్నారు హిప్పీలలో చాలామంది. ఆనందసాగరంలో మునిగితేలుతున్న ఆ వందలాది హిప్పీల సమావేశంలో, ఎక్కడుందని వెదికి పట్టుకోగలదు రేఖని. "ప్చ్.. నో యూజ్" అనుకుంటున్న రాధని. "హాయ్ రాధ.. యు హావ్ కమ్.." అంటూ పరుగున వచ్చి కావిలించుకుంది ఎలైన్. ఆ అమ్మాయి దగ్గరినుండి వస్తున్న గంజాయి వాసనకి రాధకి కడుపులో తిప్పినంత పనైంది. కాని ఎలాగో నిలదొక్కుకొని, ఆ అమ్మాయి చేతులు పట్టుకొంది "హాయ్" అంటూ.

"కమాన్.. నా ఫ్రెండ్సందర్నీ మీట్ అవుదువుగాని-" అంటూ రాధని లాక్కెళ్లింది ఎలైన్.

అస్తవ్యస్తంగా దుస్తులు ధరించి కలగాపులగంగా పూసలు వేసుకొని, తైల సంస్కారం లేని జుట్లతో అశుభ్రంగా వున్నవారి చెంతకి నీట్‌గా డ్రెస్సయి వున్న తనని లాక్కెళ్లుతుంటే అదోలా

అనిపించింది రాధకి. ఒక్కొక్కరిని చూపిస్తూ తిరిగింది ఎలైన్. కొందరు "హాయ్" అన్నారు. కొందరు పిచ్చిగా నవ్వారు. మరికొందరు నవ్వేందుకు ఓపికలేక చేతులూపారు. చేతులు ఊపేందుకు కూడా ఓపిక లేనికొందరు మూర్ఛావస్థలోకి వెళ్ళిపోతున్నారు.

వాలి, తూలిపోతున్న ఓ అమ్మాయిని గుర్తిస్తూ, "ఓ. హియరీజ్ యువర్ గర్ల్..." అంటూ చూపించింది ఎలైన్. రేఖ అప్పటి ఆకారాన్ని చూసి, తెల్లబోయింది రాధ. పావడా జాకెట్టు మాత్రం వున్నది, ఒంటిపైన. జుట్టు విరబోసి వుంది. ఎడమవేపు పాయమాత్రం జడలాగా అల్లి కంఠం చుట్టూ పడవేసింది. మెడలో ఓ రుద్రాక్షమాల; తలచుట్టూ నుదిటిమీద పడేలా వేరొక తావళం; చేతులకి పూసలదండలు- సన్యాసినిలా వున్న రేఖని గుర్తుపట్టలేకపోయింది రాధ.

మత్తులోనున్న మగువ తలెత్తి చూసింది. మూతలుపడుతున్న కళ్ళను బలవంతాన తెరచి మళ్ళీ చూసింది. "ఓ... మైగాడ్. రాధా.. నువ్వా...! ఓల్డ్ ఫాషెన్డ్ డేమ్- నీకెందుకులే మా సుఖాలు కూచో.. కూచో..." అంటూ రాధని లాగి తనప్రక్క కూలేసింది.

రేఖని చూడగానే చెప్పలేనంత దుఃఖం ముంచుకొచ్చింది రాధకి. అల్లారుముద్దుగా పెరిగి, సకల ఐశ్వర్యాలలో మునిగి తేలవలసిన రేఖకి ఏమిటీ అవస్థ...? - రేఖ ఇప్పుడేం చెప్పినా వినిపించుకొనే స్థితిలో లేదు. మారు మాట్లాడక రేఖ ప్రక్కనే కూచుంది రాధ.

ధమ్ మారో ధమ్

మిట్ జాయే గమ్

బోలో సుబహ శ్యామ్

హరేక్రిష్ణ హరేరామ్

దునియానే హమ్‌కో దియా క్యా

దునియాసే హమ్‌నే లియా క్యా

..... ..... ..... ..... ..... ..... ..... .....

గిటారు వాద్యంమీద పాట వాయిస్తూ శ్రావ్యంగా పాడుతున్నాడో హిప్పీ. "నో..... నో.... స్టాపిట్" అంటూ మిగతా హిప్పీలంతా ఏకకంఠంతో కేకలు పెట్టారు. వెంటనే పాట ఆగిపోయింది. ఎందుకలా అరుస్తూ కేకలు పెడుతున్నారో అర్థంకాని రాధ ఆశ్చర్యంగా చూసింది. ఎవ్వరూ రాధ అనుమానాన్ని తీర్చే స్థితిలో లేరు. అటుగా వస్తున్న ఎలైన్ రాధకేసి చూసి, "ఎలా వుంది మ్యూజిక్?" అంది. "బాగానే వుంది కాని, అంతమంచిపాటని ఎందుకు ఆపివేశారు?" అంది రాధ.

"ఓ... అదా...! మా హిప్పీలను గురించి ఓ సినిమా వచ్చిందీ మధ్య. మాకట్టుబాట్లని, పద్ధతులని వికటరూపంలో చూపించారా సినిమాలో. దొంగతనాలు చేసినట్లు, జేబులు కొట్టినట్లు - ఏవో - ఏవో చూపించారు..." ఎలైన్ కోపంగా అంటూంటే రాధ అడ్డొచ్చింది.

"అదేంటి.. ఆ ప్రాంతంలోని హిప్పీలు అలాంటివారేమోలే...!" అంది కాస్త నెమ్మదిగా రాధ.

"నో.. నెవర్.. మేమలాంటివాళ్ళం ఎన్నటికీ కాదు. ఎప్పుడూ టైం వేస్టు జేస్తూ కూచోం. ఏదో పనిమీద తిరుగుతూ వుంటాం. ఎప్పుడు మీటయినా పది పదిహేను మందికన్నా ఎక్కువ చేరం. మెడిటేషనికి కూడా ఒక్కరొక్కరమే వెళ్ళి కూచుంటామ్..." కోపోద్రిక్తంగా చెప్పుకుపోతున్న ఎలైన్ ముఖం కందగడ్డలా ఎర్రబడింది.

"డోంట్ గెట్ ఎక్జైటెడ్ ఎలీ.. హావ్‌దిస్ డ్రింక్" అంటూ, ఓ మగహిప్పీ ఎలైన్ కింత డ్రింక్ పోసి, ఎలైన్ రాధల మధ్యనుండి తప్పుకున్నాడు.

నిషా ఎక్కి హుషారు తగ్గిపోతోంది. హరేరామ హరేకృష్ణ అంటూ ఆనందంగా తాండవం చేస్తూ ఒకరిమీద ఒకరు పడుతూ లేస్తూ ఊగిపోతూ, నృత్యం చేస్తున్నారు. గంజాయి మత్తు పూర్తిగా ఎక్కిన రేఖ ఒక స్తంభానికి వీపు ఆన్చి సుషుప్తావస్థను చేరుకున్నట్లుంది. ఇక వేచి లాభం లేదనుకుంది రాధ. పూర్తిగా నిషాలో పడని ఓ అమ్మాయి చెంతకేగి రేఖను చూపించి "ఈ అమ్మాయి నివాసము తెలుసా...!" అంది రాధ.

"యుమీన్ రేఖ..! మి- సుషన్ అండ్ రేఖ ।- వియ్ త్రీ లివ్ ఇన్‌హట్ నెంబర్-టు - కాళింఘూట్ బీచ్..." అంది ఆ అమ్మాయి. ఆవిడ తొడుక్కున్న బనియన్ మీద 'క్లేరా' అని వ్రాసి వుంది. బహుశా అది ఆవిడ పేరేమో !

"హరేరామ హరేకృష్ణ..." అనుకుంటూ, తూలుతు సోలుతు పోతున్న క్లేరాని ఆపి, అడిగింది రాధ "ఏం...! మేము రేపు మీ ఇంటికి రావచ్చా..?" అంటూ.

"షూర్. క్వైట్ వెల్‌కమ్. బై టెన్ మార్నింగ్" అంటూ వెళ్లిపోయిందా అమ్మాయి.

"అమ్మయ్య.. ఇంతయినా ఇన్ఫర్‌మేషన్ చిక్కింది" అనుకుంటూ, గుడారం బయటకు నడిచింది రాధ. దగ్గరిలోనే వున్న కొబ్బరిచెట్టు కింద కూచుని సిగార్ కాలుస్తున్న మామయ్య కేసి నడిచింది రాధ.

గోవాలోని సముద్రతీరాలన్నింటికన్నా కాళింఘూట్ సముద్రతీరం ఎన్నతగినది. అందంగా వున్న ఏడుమైళ్ల సముద్రతీరం పొడవునా నీడకోసరమని ప్రత్యేకమైన ఆచ్ఛాదనాలను అమర్చారు, గోవా ప్రభుత్వంవారు. టూరిస్టుల సహాయార్థం రంగురంగుల గుడారాలు కూడా నిర్మించారు. ఈ గూడారాలతో పాటు హిప్పీలు నిర్మించుకున్న గుడిసెలు కూడా వెలిశాయ్ తీరంవెంబడి. హిప్పీలు కట్టుకున్నవి తాత్కాలికమైన గుడిసెలు. కొబ్బరి మట్టలతో, ఆకులతో, తడికలతో నిర్మాణమైన ఈ గుడిసెల ఖరీదు అతి స్వల్పం. గుడిసె నెంబర్లు తెలియజేస్తూ చిన్న చిన్న అట్టముక్కలు గుడిసెల ముంగిట గుచ్చబడి వున్నాయ్.

రాధ ముందు, వెనుక కృష్ణారావు, ఒక్కొక్క గుడిసెనే చూసుకుంటూ ముందుకు సాగిపోతున్నారు.మామయ్యని చూసి జాలి వేసింది రాధకి. 'ఉదయం టిఫిన్ కూడా సరిగా తీసుకోలేదు. ఆమాటకొస్తే ఈ రెండు నెలల్లో ఆయన కడుపార తిన్నదెప్పుడు...?' రాధ ఆలోచనలకు అంతరాయం కల్గిస్తూ అల్లంత దూరాన, ఓ పిల్ల, ఓ చిన్న గుడిసెలోంచి తడికెను తోసుకొని బయటకు వచ్చింది. ఆవిడ రేఖ అని గుర్తు పట్టడానికి రాధకి ఎంతో టైం పట్టలేదు. రాత్రి వేసుకున్న దుస్తులే ఇంకా ఒంటిమీద వున్నాయ్. అప్పుడే నిద్రలేచి వచ్చినట్లుంది. ముఖం మీద పడుతున్న జుట్టును ఒక చేత్తో వెనక్కి తోసుకుంటూ, ఇంకో చేతిలోని ఆపిల్ పండును ఆరగిస్తోంది. మొట్టమొదట రాధను చూసింది. "హలో రాధా!" అంటూ పరుగున రాధను చేరింది. రాధ ప్రక్క ఎటో చూస్తూ నిలబడి వున్న డాడిని చూసి నివ్వెరపోయింది. "డాడీ.. మీరూ వచ్చారా.." అంటూ కృష్ణారావుని కావలించుకున్నంత పని చేసింది.

ముఖాముఖి ముద్దుల కూతుర్ని చూసిన కృష్ణారావుకి దుఃఖం ముంచుకొచ్చింది. మాటలు తడబడుతుండగా, "రేఖా! బాగున్నావా తల్లీ..?" అన్నాడు. ఆ క్షణాన కృష్ణారావులో వుదయించిన సంతోషాతిశయం ఆయన ముఖంలో చూడగల్గింది రాధ. కాస్సేపట్లో కృష్ణారావు ముఖం వివర్ణమైంది. కూతుర్కి దూరంగా జరిగి నిలబడుతూ, ముఖం పక్కకి తిప్పుకున్నాడు.

"మమ్మీ రాలేదా డాడీ..! మిమ్మల్నే..? ఈ ఎక్సైటింగ్ గోవాకి, ప్రక్కన మమ్మీ లేకుండా మీరొక్కరే వచ్చారా?" మాటలు కలుపుతూ అంది రేఖ. ప్రత్యుత్తరంలేని డాడీవేపు ఓ స్మైలు పడేసి, రాధవేపు తిరిగింది రేఖ.

"ఏయ్ రేఖా........! నీకోసం తిరిగి తిరిగి కాళ్ళు నొప్పెడుతున్నాయి. అలా వెళ్ళి కూచుందామా?" అంది రాధ.

"అందాకా ఎందుకే...! ఇదంతా స్థలం కాదు? ఇక్కడే కూచుందాం" అంటూ ఇసుకలో చతికిల బడింది రేఖ.

రాధ, కృష్ణారావు కూడా అక్కడే కూచున్నారు.

"సో.......... రాధీ! నువ్వు కూడా వచ్చేశావన్నమాట. హౌడుయులైక్ దిస్ యర్థ్లీ పేరడైస్...?"

"మేమీ స్వర్గాన్ని చూసి, తరించి పోదామని రాలేదులే" కోపంగా అంది రాధ.

"మరి..? ఏదైనా టూర్‌మీద వచ్చారా? మీ ఫ్రెండ్సంతా ఎక్కడ? బై-ది-బై రాధీ.. డాడీనెందుకే ఇంతదూరం ఇసుకలో నడిపించక తెచ్చావ్...?"

"రేఖా! మేమెందుకొచ్చామో తెలుసా, టు టేక్ యు టు మద్రాస్..."

"వాట్.....? నన్ను తీసికెళ్ళడానికా. నేనేమైనా వస్తువుననుకున్నారా? నన్ను పట్టుకు పోవడానికి..." పక పక నవ్వింది రేఖ.

'రేఖా! సీరియస్‌గా చెబుతుంటే ఏంటా వెకిలినవ్వు? నీ లెటర్ చూసినప్పటినుండి మీ అమ్మ అన్నమూ, నీళ్ళు లేకుండా ఏడుస్తోంది. గోవాలో చూసింది చాలు. నీ హిప్పీ అవతారమూ చాలు. ఇక బయలుదేరు ఇంటికి." కృష్ణారావు కోపంగా మాట్లాడడం చూసి రాధ కాస్త భయపడింది. రేఖ తండ్రికేసి మొండిగా చూసింది.

"ఏం! నన్ను నమ్ముకునే బ్రతుకుతూందా అమ్మ, నాకోసరం అన్నమూ నీళ్ళు మానుకొని చచ్చిపోవడానికి.."

విస్మయంగా చూశారు శ్రోతలిద్దరూ.

"ఎస్ డాడీ! ఈ ప్రపంచంలో ఏ ఒక్కరూ- ఏ ఒక్కర్ని నమ్ముకొని పుట్టలేదు. ఈ బంధాలు-బాంధవ్యాలు అన్నీ మిథ్య. ఒట్టి హుళక్కి. అందుకే మా హిప్పీలను పేర్లు పెట్టుకొని కూడా పిలుచుకోం. జస్ట్ ఎ ఫ్రెండ్ దట్సాల్..." రేఖ చేతులతో ఇసుకను త్రవ్వి కుప్పపోస్తూ అంది.

"సరే బాగానే వుంది. నీకింత విద్యనిచ్చి, ఇన్నిరోజులు పెంచినందుకయినా వాళ్ళకి నువ్వు కృతజ్ఞత చూపక్కరలేదా?" అంది రాధ.

"కృతజ్ఞత అంటే ఏఁవిటి నీ ఉద్దేశంలో..?"

"వాళ్ళు చెప్పినట్లు విని.."

రాధ మాటలను మధ్యలోనే అందుకొంది రేఖ. "కరెక్ట్. నువ్వు ఆ మాట అంటావనే ఊహించాను. పెద్దలు చెప్పినట్లు విని, పెండ్లి చేసుకొని, పిల్లల్ని కని, సంసారం చేసి, ముసలివాళ్ళయి ఆఖరికి చచ్చిపోవడం ! మహాబోర్.."

"పోనీ మీరు చేసే నిర్వాహం ఏమిటో..?" కోపంగా అన్నాడు కృష్ణారావు.

'మేము ఏదో చేస్తున్నామని చెప్పుకోవడం లేదు డాడీ! ఎలాగూ చచ్చిపోయేవాళ్ళమే. ఏ క్షణంలో చావు వచ్చి మనల్ని వరిస్తుందో తెలీదు. అందుకోసరం, అంతులేని ఈ పోరాటం, అగాధమైన జీవితాకర్షణ; ఆ జీవితం కోసరం ఎన్నో ఆశలు, మోసాలు అండ్ వాట్‌నాట్! అందుకే మేము ఆశల్ని చంపుకుంటున్నాం. మనుష్యులు ఒకర్నొకరు ప్రేమించుకుంటూ బ్రతకడమే మా ధ్యేయం. ప్రపంచంలోని మనుషులందరూ హిప్పీలయిపోతే కాని ఈ ప్రపంచం సుఖపడదు డాడీ!" రేఖకి హిప్పీయిజం బాగా వంటబట్టినట్లుంది, ఉపన్యాసం దంచేస్తోంది.

కృష్ణారావుకి చిర్రెత్తుకొచ్చింది. "రేఖా! నీ ప్రసంగాన్ని చాలించి- మద్రాసుకు ఎప్పుడు ప్రయాణమవుతావో అది చెప్పు ముందు..."

'ప్చ్.. ప్చ్... ప్చ్. పూర్ డాడీ సుఖపడడమే చేతకాదు నీకు. ఇంతదూరం ఎలాగు వచ్చావుకదా, గోవాలోని వండర్‌ఫుల్ ప్లేసెస్ ఒక్కటైనా చూశావా? 'దోనాపాల్'లోని రాక్ గార్డెన్స్ చూడకూడదూ-ఓస్, గార్డెన్స్ అంటే మీకు పెద్ద లైకింగ్ లేదుకదూ! వాటబవుట్ చిల్డ్రన్స్ పార్క్ ఇన్ 'మాయేం

లేక్'..? యు డోన్ట్ లైక్ దట్ టూ! పోన్లే డాడీ... 'బోన్లా' ఫారెస్ట్‌లో బోల్డు బైసాన్స్, వైల్డ్ బోర్స్.. వెళ్దామా హంటింగ్‌కు? మరిచాను మీరు ఆయుధాలు సరండర్ చేసి ఆర్నెల్లయింది కదూ..!'' రేఖ, వ్యవహారాన్ని పూర్తిగా నవ్వులాట క్రిందికి దింపేస్తోందని గ్రహించింది రాధ.

"మామయ్యా...! నేను రేఖతో మాట్లాడి సర్క్యూట్ హౌస్‌కి పిలుచుకు వస్తాను. మీరు వెళ్ళండి- ఎండ బాగా రాకముందే'' అంటూ కృష్ణారావుని పంపించి వేసింది రాధ.

రాధ రేఖనే చూస్తూ కూచుంది. తండ్రి వెళుతున్న వేపు చూస్తూ, ఏమీ తోచని రేఖ, ఇసుకలో వలయాలు గీస్తోంది.

'రేఖా! అన్నీ బాగానే వున్నాయి, కాని ఏంటిటా అశుభ్రత మీలో?'' అంది వున్నట్లుండి రాధ.

ఉలిక్కిపడి ఇటు తిరిగింది రేఖ. "ఇంత శుభ్రంగా వుంటారు కదా మీరు, మీలోని మనస్సు, హృదయాలు నిర్మలంగా లేవేం?''

నివ్వెరపోయింది రాధ.

"అంతే రాధా. మనుష్యులు బాహ్యంగా శుభ్రత పాటిస్తే చాలదమ్మాయ్! లోపల కూడా వుంచుకోవాలి శుభ్రతని'' తేల్చేసింది రేఖ.

"మిమ్మల్ని చూస్తుంటే, నాకు రాతియుగపు మనుష్యులు గుర్తుకొస్తున్నారు'' అంది రాధ ఉక్రోషం పట్టలేక.

"ఎక్సాక్ట్‌లీ! వాటీజ్ రాంగ్ విత్ దెమ్? వాళ్ళే హాపీగా జీవితాలు గడిపారు. స్వార్థం ఎక్కువయిన కొద్దీ మనుష్యులు నాగరికత పెంచుకున్నారు. ఒక సుఖం కోసరం ఇంకో సుఖాన్ని జోడించారు. దాన్ని సాధించడానికి ఎన్నో అక్రమాలు- అరాజకాలు- మారణకాండలు..'' మళ్ళీ పాతధోరణిలోకి వెళ్ళిపోతున్న రేఖని ఆపింది రాధ.

"మనిషి కూడా జంతువులాగా వ్యవహరిస్తే ఎలాగ? ఇక మనిషికి జంతువుకి భేదం ఏంటి...?''

"అదే రాధా మేము కూడా అడిగేది. మెదడున్న మనిషి కూడా తన స్వలాభం కోసం మరొక్క మనిషిని, కత్తికట్టి, వలపన్ని, వేటాడి లొంగదీసుకుంటాడు. అలా వచ్చినవే కదా ఈ యుద్ధ గాథలన్నీ..

మాకు కోరికలు తక్కువ. ఇక్కడ చూడు. నీతో నేనిలా మాట్లాడుతున్నానా; నా ఫ్రెండ్సు నాకోసరం ఫిష్ కుక్ చేస్తారు. పండ్లు రెడీ చేస్తారు. దొరికిన రోజున బ్రెడ్, బట్టర్ అండ్ రైస్. లేని రోజున నక్షత్రాలని చూస్తూ, సరదాగ పాడుకుంటూ పడుకుంటాం. ఇప్పుడు చెప్పు- మంచి మంచి డిన్నర్లకి వెళ్ళి, ఫాషనబుల్‌గా తినీతినక ఇంటికి వచ్చి, ఆ హోస్టెస్‌ని అనవసరంగా తిడుతూ, డన్‌లప్ పరుపుల మీద పడి, నిద్రరాక దొర్లేకన్న ఈ ఇసుక తిన్నెలమీది జీవితమే సంతోషంగా లేదూ!''

రేఖ సుదీర్ఘ ప్రసంగాన్ని విని రాధ అదిరిపడింది. కొంపతీసి తనని కూడా అందులోకి లాగడం లేదు కదా!

రాధ కంగారు చూసి రేఖ హాయిగా నవ్వింది. "మేము ఎప్పుడూ ఎవర్నీ ఫోర్స్ చేయం. మాలో ఎచ్చి కలిసారా, మనస్ఫూర్తిగా కలుపుకుంటాం. కలిసి జీవిస్తాం. కలిసి తిరుగుతాం.."

"కలిసే చస్తారు కాబోలు-" అంది రోషంగా రాధ.

"తప్పేముంది రాధా! పెద్దవాళ్ళంటే సరే! నువ్వు కూడా ఇంత నారో మైండెడ్‌గా ఆలోచిస్తావేం?" బాధగా అంది రేఖ.

"ఆలోచించడం కాదు రేఖా! మన తల్లిదండ్రులను బాధించి, మనం ఎందుకీ పెడదారులు తొక్కాలన్నదే నా సందేహం! సరేపోనీ; ఇలా తిరుగుతూ వుంటారు కదా! మీకు రోజులెలా జరుగుతాయ్. ఏదైనా పని చేస్తారా...?"

"అలా అడిగావ్ బాగుంది. అసలు మీరు మమ్మల్ని సరిగ్గా అర్థం చేసుకోకుండానే దుమ్మెత్తిపోస్తారు. మేము ఏ పనినయినా సరే నిస్సంకోచంగా చేస్తాం. దొరికిన డబ్బులతో తృప్తిపడి జీవిస్తాం. కావాలంటే బిక్షమయినా ఎత్తుతాం కాని, ఒకరిని మోసగించడం, దొంగతనాలు చేయడం లాంటివి చేయం. మీ మాదిరి హిపోక్రిటికల్‌గా జీవించలేము. చెప్పేదేదో చేసి చూపిస్తాం..." ఉపన్యాస ధోరణిలో చెప్పుకుపోతున్న రేఖనే చూస్తూ వుండిపోయింది రాధ.

ఇంతలో 'హాయ్' అంటూ రివ్వున ఎచ్చిందో హిప్పీ జంట. 'హాయ్' అంది రేఖ.

"ఆర్ యు నాట్ కమింగ్?" అన్నాడు ఆ జంటలోని మగహిప్పీ.

"షూర్...యు-బీ- ఆన్ ది మూన్..." అంది రేఖ.

"ఎక్కడికోయ్ ఆ పిలుపు..?" అంది అప్రయత్నంగా రాధ.

"ఓ.. అదా! ఇప్పుడు వాళ్ళిద్దరూ దగ్గరిలోనే వున్న ఒక ఆశ్రమానికి వెళుతున్నారు. అక్కడ ఒక పద్నాలుగేండ్ల బాలయోగి వున్నారు. అతనే ఇక్కడి హిప్పీలలో చాలామందికి గురువులాంటివాడు."

"రేఖా..! ఇదే నాకసలు అర్థం కానిది. ఇన్ని దురలవాట్ల మధ్యనున్న మీకు దైవచింతన ఎలా కల్గుతుంది?"

"అదో.. రాధీ! మళ్ళీ మొదటికొస్తున్నావ్. ఏమిటోయ్ మా దురలవాట్లు? గంజాయి త్రాగడమా..? ఏం..! మీరు తాగే విస్కీ, బ్రాందీ, సిగరెట్, కాఫీ, టీలకన్నా చెడిందా అది. ఉండుండు- అడ్డుపడకు; ఎల్.యస్.డి. మాత్రలంటావా? ఏం! మీరు వాడే మార్ఫియా, స్లీపింగ్ టేబ్‌లెట్స్ ఏం తక్కువ తిన్నాయని.

దైవ ప్రార్థన అంటావా! చర్చీలకీ వెళ్తాము. ఆశ్రమాలకి వెళ్తాము. ఎప్పుడు ఎక్కడ ప్రార్థన చేయాలనుకుంటే అక్కడే కూచుని మెడిటేషను ప్రారంభిస్తాం."

ఒక పక్క రేఖ మాటలను వింటూనే, దూరంగా కదిలిపోతున్న ఆ హిప్పీల జంటను కన్నార్పకుండా చూస్తూ కూచుంది రాధ.

మగహిప్పీ జుట్టును బాగా సన్యాసిలాగ పెంచాడు. గడ్డం మీసాలు కలిసిపోయాయ్. పచ్చటి దేహచ్ఛాయ, నడుముకి చిన్న తుండుగుడ్డ మినహా ఒంటిమీద ఇంకేమీ దుస్తులు లేవు. మెడలో వ్రేలాడుతున్న ప్లేకార్డు కొట్టొచ్చినట్లు అగుపిస్తోంది. ఆ అట్టమీద 'మేక్ లవ్, బట్ నాట్ వార్' అంటూ వ్రాసి వుంది. ఎడమచేతికి గాజులాంటిదొకటి తొడుక్కున్నాడు. మెడలో లావుపాటి మొలత్రాడు. ఇదీ అతని వేషధారణ. వయసు మాత్రం ఏమంత ఎక్కువ వుండదు. మహా వుంటే పాతిక సంవత్సరాలు. ఇక ఆడహిప్పీ- భుజాలమీద పడే జుట్టును బిగించయినా కట్టలేదు. ఇరవై సంవత్సరాలకి మించని వయస్సు. 'ఓం శివ' అని ప్రింటు చేయబడ్డ శాలువాని చీరలాగ చుట్టింది. మెడలో పూసలదండ. చేతులకి ఏవో గాజులు. ముఖాన ఎఱ్ఱటి బొట్టు- ఇద్దరూచేతులు పట్టుకొని నడుస్తూ నవ్వుకుంటూ రాధ దృష్టి పథాన్నుండి దూరమైపోతున్నారు.

రాధ చూపులనే గమనిస్తున్న రేఖ "చూశావా రాధీ! వాళ్ళిద్దరు భార్యాభర్తలకన్నా ఎక్కువ ప్రేమగా వుంటారు- అంతే. భార్యాభర్తలయినా ఒకరిమీద ఒకరు ఆధారపడి వుంటారేమో. ఇక్కడ అదేం లేదు. ఫ్రీ బర్డ్స్. అతను ఇటలీలో పుట్టాడు. వ్యవసాయ శాస్త్రంలో పట్టభద్రుడు. ఆవిడ ఫ్రాన్సు దేశానికి చెందిన స్త్రీ. టౌలాన్ అనే వూర్లో పుట్టింది. అక్కడున్న పెద్ద కాలేజీలో సోషియాలజీలో డిప్లొమా కోర్సు చదివేది...... అతడూ, అదే కాలేజీలో పార్టుటైం జాబ్ చేసేవాడు."

"అయితే వాళ్ళిద్దరికి అక్కడే పరిచయమయిందా?"

"ఉహూఁ... అక్కడే ఉంది గమ్మత్తు. ఆవిడకి చదువుమీద, అతనికి వుద్యోగం మీద విరక్తి పుట్టి విడివిడిగానే 'ఛలో' అంటూ ఎగిరారు. హిచ్-హైక్ చేసుకుంటూ బొంబాయిలో వచ్చి పడ్డారు. పటాటోపాన్ని సూచించే డ్రస్సుని అమ్ముతూ, మగ హిప్పీ ఆడహిప్పీకి కనిపించాడు. ఊర్లు కలిశాయి. మనసులు వలచాయి. ఇద్దరూ కలిసి బ్రతుకుదామని నిశ్చయించుకొన్నారు. ఇలా హాయిగా వుంటున్నారు."

"రేఖా! చదువులు పూర్తి చేసుకొని, ఉద్యోగాలు చేసి, ప్రపంచానికి తాము చేయవలసిన బాధ్యతలు నిర్వర్తించి, తఱువాత హిప్పీలుగా మారొచ్చుగా!"

రాధ మాటలకు ఫక్కున నవ్వింది రేఖ. "ఎప్పుడు? ముసలివాళ్ళయ్యాకనా! అప్పటికి బంధాలు బాగా బిగించుకుపోయి వుంటాయి. వాటిని తెంచుకురాలేరు. అయినా మనిషికి ఏ జీవితంలో హాయి, సంతృప్తి దొరికితే ఆ జీవితాన్నే కోర్తాడు. ఈ హిప్పీ జీవితంలో వుండే మాధుర్యం నీకు అర్థం కాదులే రాధా. ఇదొక స్వేచ్ఛా జీవితం. ఆకాశాన్ని అంటుకుపోతూ స్వేచ్ఛా విహారం చేసే, పసిడి పతంగులము మేము..."

"నీ ధోరణి చూస్తుంటే నన్ను మద్రాసు పోనిచ్చేటట్లు లేవే- నే నేర్చుకున్న పాఠాలు చాలుకాని, ఇక వెళ్దాం పద సర్క్యూట్ హౌస్‌కి. మామయ్య మనిద్దరికోసం నిరీక్షిస్తూ వుంటారు" లేచి నిలబడుతూ అంది రాధ.

"ఐవోంట్ లీవ్‌యు సో సూన్ రాధీ... ఈ పూట నా గెస్టువి. ఊఁ ... రా లోనికి" అంటూ భుజంపైని చేతులు వేస్తూ రాధని లాక్కుని వెళ్ళింది గుడిసెలోకి.

లోపల ఇద్దరమ్మాయిలు, అస్తవ్యస్తంగా పడుకొని ఏవో పుస్తకాలు తిరగేస్తున్నారు. కొత్తమ్మాయిని చూడగానే చటుక్కున లేచి నిలబడ్డారు. రేఖ వాళ్ళిద్దరిని రాధకి పరిచయం చేసింది"

"మీట్ మై కజిన్ రాధ-"

"షి ఈజ్ మిస్ సుషన్"

"షి ఈజ్ మిస్ క్లేరా"

"హాయ్" అన్నాయి రెండు కంఠాలు. "గ్లాడ్ టు మీట్ యు" అంది మూడో కంఠం.

రాధ క్లేరాని గుర్తించింది. రాత్రి మెడిటేషన్ కాంప్‌లో రేఖ ఉనికిని చెప్పిన క్లేరాకి ధన్యవాదాలు చెప్పింది. రాధని గుర్తించిన క్లేరా నవ్వేసింది.

"అనదర్ అడిషన్ టు అవర్ స్వీట్ హోమ్...!" అంది, చిరునవ్వుతో సుషన్.

"నో.. నో.. షిఈజ్ జస్ట్ ది గెస్ట్" అంది రేఖ.

గుడిసె అంతర్భాగాన్ని పరికించి చూసింది రాధ. ఒకవేపు టార్పాలిన్ చుట్ట. ఇంకో ప్రక్క చిన్న టేబుల్ మీద కప్పులు- సాసర్లు- టేబిల్ క్రింద మట్టిని పాత్రలు - మూకుళ్ళు. వేరొక ప్రక్క దారంమీద వ్రేలాడుతున్న బట్టలు.

సుషన్, క్లేరాలు, రేఖతో గుసగుసలాడి గుడిసె బయటకు నడిచారు.

పచ్చటి పైజామా వేసుకున్న సుషన్, జర్మనీలో గ్రాడ్యుయేట్ కోర్సుకు చదువుతోందని, స్ట్రెచ్ పాంటులో వున్న క్లేరా లిటరేచర్ స్టూడెంట్ అని, అమెరికా వాసి అని రేఖ చెబుతూ వుంటే రాధ ఆశ్చ్యపోయింది. "పోనీలే విద్యావంతులయినవారి సాహచర్యంలోనే వుంది రేఖ..." అంటూ సంతోషించింది రాధ.

కాస్సేపట్లో, ఫ్రైడ్ ఫిష్, బ్రెడ్ టోస్ట్, అరటిపండ్లు ప్లేట్లలో పెట్టుకొని లోపలికి వచ్చారు, సుషన్, క్లేరాలు. రేఖ టార్పాలిన్ పరిచింది. నలుగురూ కింద కూచొని అరమరికలేకుండా కావలసినవి తిన్నారు. అరటిపండ్లు చాలా పెద్దవి. మధురంగా కూడా ఉన్నాయి.

"గోవాలో అరటిచెట్లు బాగా ఎక్కువ" అంది రేఖ.

"కొబ్బరి చెట్లు కూడా కదూ...!" అంది రాధ.

"రేఖా! బై-ది-బై..." రేఖ చెవిలో ఏదో వూదింది క్లేరా.

"షూర్ షూర్.. నాట్ దిస్ ఓల్డ్ స్టఫ్..." అంది రేఖ.

"ఏమిటోయి అదీ..!" ఆశ్చర్యంగా అడిగింది రాధ.

"అదో ఫ్రూట్ డ్రింక్‌లే. 'ఫెనీ' అంటారు దాన్ని. అదో ఆ సీసాలో వుంది.కాని కాస్త ఓల్డు స్టఫ్. సర్క్యూట్‌హౌస్‌కెళ్ళే దారిలో పుచ్చుకుందాములే" అంది రేఖ.

తినడం అయ్యాక క్లేరా సుషన్‌లు లేచి బయటకు నడిచారు. సుషన్ మౌత్ ఆర్గన్ వాయిస్తూ కొబ్బరి చెట్టు నీడలో కూచుంది. సుషన్ పాటకి లయబద్ధంగా గుమట్ (గోవా ప్రజలు వాయించే వాద్యం) వాయిస్తూ నిలుచుంది క్లేరా.

గబగబా డ్రెస్ మార్చుకుని రాధతోపాటు బయటపడింది రేఖ. వీళ్ళిద్దరినీ చూసి హడావిడిగా లేచారు సుషన్, క్లేరాలు.

"లెటజ్‌గో" అంది రేఖ.

"వేర్...?" ఒకసారే అన్నారు సుషన్, క్లేరాలు.

"మా డాడీని చూడరా మీరు..?" అంది నవ్వుతూ రేఖ.

"యువర్ డాడీ, మైగాడ్, అయితే నువ్వు వెళ్ళిపోతావా?" అంది సుషన్ దిగాలుగ.

అదేం లేదన్నట్లు తల అడ్డంగా వూపింది రేఖ.

గోవా బజార్ల వెంట నడిచిపోతుంటే రాధకి ఏంవిటో కొంత తమాషాగ మరి కొంత బాధగా కూడా అనిపించింది. హిప్పీలంటే వింతగాదు ఆ పట్టణ ప్రజలకి. కాని హిప్పీలలో అతకని రాధకేసి వింతగా చూడ్డం మొదలెట్టారు చాలామంది.

ఒక కూల్‌డ్రింక్ షాప్ దగ్గర ఆపింది రేఖ. అందరూ 'ఫెనీ'ని త్రాగారు. రాధకి బాగా నచ్చిందా డ్రింక్.

"ఇదెలా తయారు చేస్తారు..?" అంటూ దుకాణదారుని అడిగింది రాధ. వాడేదో కొంకిణి భాషలో గొణుక్కున్నాడు. "అదొక ట్రేడ్ సీక్రెట్ రాధా! వాళ్ళు మనకి చెప్పరు. జీడిమామిడి పళ్ల రసం, ఆపిల్ పళ్ళరసం, కొబ్బరి నీళ్ళతో తయారయ్యే ఈ ఫెనీ గోవా ప్రజల ప్రత్యేక పానీయం" విడమరచి చెప్పింది రేఖ.

దారినపోయే ఆడపిల్లలు చాలా వుత్సాహంగా చలాకీగా వుండడం గమనించింది రాధ. సైకిళ్ళమీద బస్సులమీద రిక్షాలమీద వెళ్ళే జనంకన్నా కాలినడకనే ఎక్కువమంది వెళుతున్నారు.

"ఈ వూరివారికి నడక బాగా ఇష్టమనుకుంటాను" అంది రాధ, రేఖ వంక చూస్తూ.

"ఔను. నువ్విక్కడి గర్ల్స్‌ని గమనించే వుంటావ్. ఎంత స్లిమ్‌గా యాక్టివ్‌గా వున్నారోచూడు. నడక వాళ్ళకి మంచి ఎక్సర్‌సైజ్" మాట్లాడుతూనే ఫాషనబుల్ 'అల్‌టినో' ప్రాంతాన్ని చేరుకున్నారు నల్గురూ.

సర్క్యూట్ హౌస్‌లోని నాల్గవ నెంబర్ రూమ్ ముందు నిలబడి మెల్లగా నాక్ చేసింది రాధ. కృష్ణారావు తలుపు తీశాడు. రేఖ వచ్చిందా అన్నట్లు ఆత్రంగా చూసి, రేఖతో వచ్చిన మరో ఇద్దరమ్మాయిల్ని గమనించి లోపలికి తప్పుకున్నాడు. రాధ రేఖలతోపాటు, సుషన్ క్లేరాలు కూడా లోపలికి నడిచారు.

కృష్ణారావుని "మైడాడీ..." అంటూ సుషన్, క్లేరాలకు పరిచయం చేసింది రేఖ. "నమస్తే" అంటూ చేతులు జోడించారు, వాళ్ళిద్దరూ. "ఫర్వాలేదే" అనుకున్నాడు కృష్ణారావు. రేఖతో కాస్త ఘాటుగా మాట్లాడి నాల్గు చీవాట్లేద్దామనుకున్న కృష్ణారావుకి ఆ ఇద్దరు కొత్త అమ్మాయిలు రావడంతో కొంత ఆశాభంగమయింది.

రేఖ జాలీగా గోవాని గురించి కబుర్లు తెగ చెప్పేస్తోంది రాధతో. వాళ్ళామధ్య ఎలా ఓ స్కూళ్ళో టీచింగ్ వర్క్ చేసిందీ, కొన్ని ఎగ్జామ్స్ అవీ కండక్ట్ చేసిందీ, మంచి పెయింటర్ అయిన క్లేరా ఎలా బొమ్మలు గీచింది, అన్నీ వాగేస్తోంది రేఖ. వాళ్ళు గడిపే జీవితంలో తృప్తి ఆనందమే తప్ప మరేమి లేనట్లే అనిపిస్తోంది వినేవాళ్ళకి. కృష్ణారావు విన్నంతసేపూ విని "సరే రేఖా! నువ్విక్కడికి వచ్చి దాదాపు రెండు నెలలయిందిగదా. ఇక్కడి లైఫ్ బాగా ఎంజాయ్ చేసినట్లున్నావ్. సో లెటజ్‌గో బాక్ టు అవర్ ప్లేస్" అన్నాడు.

కృష్ణారావు అన్న కడపటి మాటలు అర్థమయిన సుషన్ క్లేరాలు వులిక్కిపడి రేఖ వైపు చూశారు. రేఖ ఇదేం పట్టనట్లు నవ్వుతూ చూసింది తండ్రికేసి.

"డాడీ! వాటీజ్ రాంగ్ విత్‌మి అండ్ మై ప్రెజంట్ లైఫ్?"

"ఎవ్విరిథింగ్ ఈజ్ రాంగ్" అన్నాడు కృష్ణారావు కోపంగా.

బాబోయ్! మళ్ళీ మొదటికి వస్తున్నాడు మామయ్య అన్నట్లు భయంగా చూసింది రాధ.

"డాడీ! మీకెన్నిమార్లు చెప్పాలి. నాకిక్కడ హాయిగా జాలీగా వుంది. నన్నిక్కడ ఆనందంగా వుండనివ్వరెందుకు?"

"హాయి, ఆనందం! ఇదంతా ఫూలిష్‌నెస్. ఇంకొక రెండునెలలు పోతే మీ బ్రతుకులు కుక్కలు చింపిన విస్తర్లవుతాయ్" బాధగా అన్నాడు కృష్ణారావు.

"కాదు డాడీ. అలా మాత్రం అనకండి మీరు. ఇదొక న్యూ వేవ్ డాడీ. వచ్చి మాలో చేరేవారే కాని, చేరినవారు వదలిపోలేరు. లవ్, అఫెక్షన్, ఆనెస్టీ అనే సిద్ధాంతాలమీద నిర్మితమైన మా హిప్పీఇజానికి పునాదులు తొలగవు డాడీ.

డాడీ మీకిదే చెబుతున్నాను. మీరన్నట్లు నా బ్రతుకు బరువే అయిననాడు తప్పక మీచెంతకు వస్తానులే డాడీ. బై డాడీ! మమ్మీకి నా లవ్ చెప్పు. బై మైడియర్ రాధ! గుర్తుంచుకుంటావు కదూ ఈ రేఖని."

"రేఖా! వెయిట్ దేర్. నీతో నేనూ వస్తున్నాను. ఐటు వాంట్ టు ఫాలో యువర్ లైన్..." సూట్‌కేసు పట్టుకొని హుషారుగా బయటకు నడుస్తున్న రాధని చూసి కృష్ణారావు నిలువునా నీరైపోయాడు.

"వాట్..! రాధా!! రాంక్ స్టూడెంట్‌వి.. నువ్వు మాలో కలవడమా! పిచ్చిగాని పట్టలేదు కదా?-" సంభ్రమాశ్చర్యాలతో ప్రశ్నించింది రేఖ.

రేఖకి జవాబు చెప్పలేదు రాధ. బ్రమ్నపడిపోయిన మామయ్యకేసి చూస్తూ "బై........ మామయ్యా....!" అంటూ బయటకు నడిచింది రాధ.

  

మద్రాసుకు తిరిగి వచ్చిన కృష్ణారావు దాదాపు పిచ్చివాడైపోయాడు. చంద్రకాంతం-సరేసరి-ఇల్లువదిలి బయటకు రావడం మానేసింది. కృష్ణారావు మగవాడు, బయటి ప్రపంచంలో నడయాడడం అతనికి తప్పనిసరి. ఎవ్వరు ఏమని పలకరించినా తన కూతురు రేఖని గురించి హేళన చేస్తున్నట్లో, రాధని అక్కడే వదిలివచ్చిన తన అప్రయోజకత్వానికి నిందిస్తున్నట్లో బాధపడేవాడు. ఆఫీసు వదలడం తరువాయి, ఇంటికి కూడా రాక మెరీనా తీరంలో నిర్మానుష్యమైన ఓచోట కూచుని నీలాంబుధికేసి చూస్తూ చాలాసేపు గడిపేవాడు.

ఆరోజు అలాగే సముద్ర తీరాన కూచుని శూన్య దృక్కులతో సముద్రంకేసి చూస్తున్నాడు కృష్ణారావు. ఆరోజు పౌర్ణమి–కాబోలు-ఎవరిమీదో పగపట్టి విజృంభించినట్లు మహోన్నతమైన కరళ్లతో కడలి కెరలి యాడుతోంది. ఆ సముద్రుని నృత్యాన్ని తన్మయత్వంతో తిలకిస్తున్నాడు కృష్ణారావు. ఉవ్వెత్తున లేచి తీరాన్ని తాకే ప్రతి కెరటం తనతోపాటు, అస్తవ్యస్తంగ తీరాన ఉన్న అందమైన రాళ్ళను, చిన్ని చిన్ని గవ్వలను, తనతోటి తీసికొని వెళ్ళిపోతోంది. ఉధృత కెరటాలకేళీ విన్యాసానికి ముచ్చటపడి, తమకుతామే దాసోహమంటున్నాయో లేక కెరటపు ప్రభావానికి తట్టుకోలేక కొట్టుకొని పోతున్నాయో-ఆ చిన్ని చిన్ని గవ్వలూ రాళ్ళు! అర్థమవలేదు కృష్ణారావుకు. కాని కృష్ణారావుకు విస్మయం కల్గించిందొక్కటే. ఎంతోసేపుగా సుస్థిరంగా నిలబడి 'మీరు నన్ను కదల్చలేరు' అంటూ అలలకు బుద్ధి చెప్పి పంపిన ఓ పొడుగాటి నున్నటి రాయి తన కనులముందే కెరటంతో నేస్తంకట్టి కడలి గర్భంలో కలిసిపోయింది. చివుక్కుమంది కృష్ణారావు హృదయం. బాధతో సుళ్ళు తిరిగింది అతని అంతరంగం. "ఎంతోసేపు స్థిరంగా నిలబడిన ఆ అందమైన రాయి కూడా అలల ధాటికి ఆగలేకపోయిందా!" అని, అనుకుంటూ వుండగానే అలలు అత్యంత వేగంతో వచ్చి ఒడ్డును తాకి దాదాపు కృష్ణారావు కూచున్న చోటును చేరి మళ్ళీ వచ్చినంత వేగంగానే వెళ్లిపోయాయ్.

గబుక్కున లేచి నిల్చున్న కృష్ణారావు కాలికి ఏదో గట్టిగా తగిలింది. అరే! ఆశ్చర్యం.... అదే, ఆ అందమైన రాయే! దాని చుట్టూ- కొన్ని చిన్న రాళ్ళు- మరిన్ని గవ్వలు. అందమైన రాయికేసి చూస్తున్న కృష్ణారావు మదిలో ఓ ఆశ మెదిలింది.

ఇల్లు చేరిన కృష్ణారావుని మందహాస వదనంతో ఆహ్వానించింది భార్య చంద్రకాంతం. "ఏమిటి చెప్మా ఈవిడ సంతోషానికి కారణం!" అనుకుంటున్న కృష్ణారావు చేతిలో ఓ లేఖ పెట్టింది. అది గోవానించి రాధ వ్రాసిన ఉత్తరం.

మరుసటి రోజు రాధా రేఖలను రిసీవ్ చేసుకునేందుకు సెంట్రల్ స్టేషన్‌కి వెళుతున్న కృష్ణారావు దంపతుల ఆనందం వర్ణనాతీతం.

***(తరుణ మాసపత్రిక, ఏప్రిల్ 1973)***

# తమ్ముడూ తగులబెట్టకు

'అన్నయ్యా ............ అన్నయ్యా ! అనిల్ అన్నయ్యా !! మరి, నీతో నేను కూడా వస్తానన్నయ్యా !'

'వేలెడు లేవు, నువ్వెందుకురా ? అయినా, నేనేం సినిమాకో, షికారుకో వెళుతున్నాననుకున్నావా ?'

'అబ్బ, బోరుకొడుతూందన్నయ్యా. స్కూలేమో మూసేశారు. మాస్టారు, మళ్ళీ కబురు పెట్టేవరకు బడి ముఖం చూడవద్దన్నారు. ప్లీజ్, నన్నూ తీసికెళ్ళన్నయ్యా నీతో ప్లీజ్ !'

'ఓరీ పిచ్చి వెధవా ! మేము వెళుతున్నది ఎక్కడికో తెలిస్తే నువ్విలా మారాం చేయవ్. మేమంతా కలిసి స్టేషనుకేసి వెళుతున్నాం.'

'రైలు స్టేషనుకేగా ! బలే .... బలే రైలంటే నాకెంతో ఇష్టం అన్నయ్యా. నే తప్పక వస్తాను.'

'ఖర్మ - రైళ్ళు చూడ్డానికి కాదురా మేము వెళ్తుంటా - బుజ్జి బాబ్జీ - స్టేషన్ తగలెట్టడానికి.'

'హాఁ'

'ఆఁ కాకుంటే రైళ్ళనాపడానికి; అయినా తమ్ముడూ - ఇవన్నీ నీకెందుకురా ? నువ్వెళ్ళి ఆడుకో.'

'ఎవరు సురేషా ! రా, రావోయ్ నీకోసమే వెయిట్ చేస్తున్నా. ఏం బ్రదర్ మనవాళ్ళంతా రెడీయేనా !'

'...........ఎప్పుడో ! లే, వెళ్దాం.'

'వన్‌మినిట్ ! ఇదో వచ్చేస్తున్నా.'

'ప్లీజ్ అన్నయ్యా ! నువ్వు చెప్పినట్లు వింటాను. నన్నూ తీసుకెళ్ళన్నయ్యా.'

'అబ్బబ్బ ! వీడిని తప్పించుకోవడం కష్టమవుతుందోయ్. నేనూ వస్తానంటూ వేధిస్తున్నాడు ...... !'

'ఊఁ ఇట్ ! ఉండుండు; నేను ఒప్పిస్తాను. బాబ్జీ ! ఇలా రామ్మా ! చూడు, మేమందరం నీకన్నా బోల్డు పెద్దవాళ్ళం కదా ! వేర్పాటుగా మన వాళ్ళకి మటుక్కే ప్రత్యేక రాష్ట్రం సాధించేందుకని మేము బయట చాలా చాలా పనులు చేయాల్సి వుంది బాబ్జీ ..........!'

'చాలా పనులంటే ......'

'ఇదిరా వీడి ధోరణి. ప్రతిదీ ఆరాయే !'

'చూడు - అవి నీకు అర్థం కావు తమ్ముడూ ! సమ్మెలు - సమావేశాలు. నిరాహారదీక్షలు, ఘెరోవ్‌లు .....'

'ఏదో సామెత చెప్పినట్లుంది - వెనకటికి పిల్లి అంటే అర్థం మార్జాలం అన్నాట్ట - చూడు చిట్టితండ్రీ, మేము ఈరోజు ఓ బస్సు తగలబెట్టాలి. ఆఫీసులకు వెళుతున్న ఓ నల్లగొఱ్ఱెల మందను ఆపాలి. గోపయ్య వీధిలో పోస్టాఫీసు లేదూ - అందులోని కుర్చీలు, బల్లలు కాల్చేయాలి. ఇంకా ఇంకా ..... !'

'బస్సునెలా తగలబెడతారు అన్నయ్యా !'

'అబ్బబ్బ ! పెట్రోల్ లేదూ ! అదిపోసి. అమ్మ కిరసనాయిల్ కుమ్మరించి బొగ్గులపొయ్యి అంటించదూ - అట్లా. మాదేముందోయ్ ఘనత - రైళ్ళను రైళ్ళనే వెనక్కి మళ్ళిస్తున్నారు కొందరు. స్టేషన్లు తగలబడిపోతుంటే రైలు పట్టాలు చలికాచుకుంటున్నాయ్ .....'

'అనిల్ అన్నయ్యా ! మన ఊరిలోని స్టేషనుకేనా మీరు నిప్పెట్టేది. ఎందుకూ ! అది కాలిపోతే మరి మనం మావయ్యా వాళ్ళ వూరికెళ్ళాలంటే ఎలా !'

'ఒరేయ్ అనిల్ ! మీ తమ్ముడు అపర గాంధీలా మాట్లాడుతున్నాడురా !'

'ఏడ్చాడు ! చూడు బాబ్జీ అది కాలిపోతే దాని బాబులాంటి స్టేషను కట్టుకుందాం కాని, నోరు మూసుకుని వూరకే కూచో !'

'ఒరేయ్ అనిల్ ! మన ప్రక్కూరి స్టేషన్‌కి నిప్పెట్టినప్పుడు చూడాలి అతగాడి అదే స్టేషన్ మాష్టారుగాడి గోల ! 'బాబ్బాబు ! చచ్చి మీ కడుపున పుడతాను నా సర్వీస్‌బుక్ లోపలే వుండిపోయింది వెళ్ళి తెచ్చుకోనివ్వండి నాయనా' అంటూ ఒకటే బ్రతిమాలాడట.'

'కావాల్సిందే, వెధవకి ! లేకుంటే డ్యూటీ-అట-డ్యూటీ ! తిక్క కుదిరింది. పాత కధలెందుక్కాని వెళ్దాం పదరా, టైం అయ్యింది.'

'సురేష్ అన్నయ్యా ........... ! అదేంటి నీ చేతిలో ? జెండాకదూ ! ఆజెండాని నాకియ్యవా అన్నయ్యా ...... ?'

'ఇదిగో ఏది అనూ, జై ......'

'జై జై ......'

'గుడ్ ..... ఫరవాలేదురా అనిల్, వీడూ ఓ ఛోటా నాయకుడు కాగలడు. బాలసేనకి పనికొస్తాడులా వుంది.'

'వాడి మొహం. పదరా సురేష్ ! వీడితో పెట్టుక కూచుంటే మనకి అయినట్టే. మళ్ళీ ఆ మాజీమంత్రి కారు మనం వెళ్ళకముందే దాటిపోయినా దాటిపోవచ్చు. రాళ్ళదెబ్బలు తగలకుండా కారు దాటిపోతే మనకెంత సిగ్గుచేటు.'

'బాబ్జీ ! టాటా వెళ్ళొస్తా.'

'అన్నయ్యా ! మీరొచ్చేంతవరకూ ఈ జెండాతో ఆడుకుంటానన్నయ్యా సరేనా !'

'ఊఁ అలాగే.'

'సురేష్ ! ఏంటోయ్ మా యింటి ముందు మంటలాగ వుంది. అరే బాబ్‌జీగాడు ! బాబ్‌జీ ! ఏం చేస్తున్నావురా ? అమ్మా వాళ్ళు ఎక్కడికెళ్ళారు !'

'అమ్మేమో పది నిమిషాల్లో వస్తానంటూ - నా ఫ్రెండు ప్రవీణ్ లేడూ వాళ్ళింటికెళ్ళింది. ఈ సాయంత్రం అమ్మా వాళ్ళంతా కలిసి ఊరేగింపు వెళతారట. చూడన్నయ్యా...... ! ఎంచక్కా తగలబెట్టే ఆట ఆడుకుంటున్నానో ....... ! మరి నన్ను రావద్దన్నావుగా మీతో. అంచేత - ఇంట్లోనే బస్సులు-రైళ్ళు - సర్టిఫికెట్లు అన్నీ కాల్చిపడేసాను. చూడు - ఎలా తగలబడిపోతున్నాయో .......... !'

'ఏమిట్రా నువ్వనేది ? నువ్వేం తగలబెట్టావురా వెధవా ?'

'మరి - నీది టెన్నిస్ బ్యాటు, నాన్నది ఆఫీస్ కోటు. ఇంకా మరి ..... నీ అలమారలో లేవూ ... నీ పుస్తకాలు, కోట్ స్టాండు మీదున్న నీ కొత్త టెరిలిన్ ప్యాంట్, మొన్న నాకు మామయ్యా కొనిచ్చిన టాయ్ ట్రెయిన్, అత్తయ్య పంపిన డబుల్ డెక్కర్ బస్ ఇవన్నీ. అబ్బే ఏమో అనుకున్నాను. చాలా వీజీ అన్నయ్యా, నువ్ చెప్పినట్టే - ఇంత కిరసనాయిల్ పోసి నిప్పెట్టాను. ...... 'ఘుప్' అంటూ అంటుకున్నాయ్.'

'యూ - రాస్కెల్ ! నా బట్టలూ - నా పుస్తకాలూ, అన్నీ తగలెట్టావన్న మాట. అయ్యయ్యో! ఎంతపని చేశావురా. నా రికార్డు బుక్కులు కూడా అలమారలో వుంచానే - వాట్ని కూడా వేసావా ? నా హెచ్.యస్.సి, నా సర్టిఫికెట్లూ - అన్నీ తగలెట్టావా ....?'

'ఆఁ ..... ముందుగా వాటినే అంటించాను. బాధపడకన్నయ్యా, వాటి బాబులాంటి రికార్డు బుక్కులూ - సర్టిఫికేట్లు రాసుకోవచ్చు ..... !'

'దగుల్బాజీ వెధవా ! కొంప కూల్చేవుకదరా ! మనాటిని మనమే తగలబెట్టు కుంటామటరా?'

'అదేంటన్నయ్యా ! ఇందాక నువ్వూ సురేష్ అన్నయ్య చెప్పారుగా. బస్సులు, రైళ్ళు - ఏవేవో తగలెట్టాలని ! మీరు బోల్డు పెద్దవాళ్ళు కాబట్టి పెద్ద పెద్దవి కాల్చేసారు. నేను మరి చిన్నవాణ్నిగా. అంచేత చిన్న చిన్నవి కాల్చేసాను. ఏం తప్పా !'

'రాస్కెల్ ! నువ్వింట్లో కాల్చినవి మన వస్తువులురా !'

'అవునూ ! మీరు బయట కాల్చేసింది కూడా మనవాట్నే కదన్నయ్యా !'

***(జాగృతి వారపత్రిక, 30-7-1973)***

# పూర్వజ

ఆలయ ఆవరణలో, గలగలా గంతులేస్తూ ఆడుకొంటున్న చిన్నారి పాపల్ని చూస్తూ కూచున్నాను, నేను. 'శివ-విష్ణు' ఆలయంలోని నవగ్రహాలని పదిరోజులుగా ప్రదక్షిణ చేస్తున్న నేను, అక్కడి పరిసరాలకి చిరపరిచితురాలినయ్యాను. మా చంటిపాప, సుమ, పుట్టినప్పటినుండి నాకేదో నలతగా ఉంటోంది. నలభై రోజులు నవగ్రహ ప్రదక్షిణ చేస్తే, నా ఆరోగ్యం కుదుటపడుతుందన్న ఆశతో - పక్కింటి మామ్మగారు చెప్పినప్పటినుండి మొదలెట్టాను. "ఎవ్వరేది చెప్తే - అది ఆచరించడమేనా-?" అంటారు, శ్రీవారు. కానీ, కోవెల కారణంగానయినా కాస్త కాలు కదిపినట్లుంటుందన్న ఉద్దేశ్యముతో, సాయంకాలాలు ఇలా బయలుదేరుతున్నాను.

ఆడుకుంటున్న పాపలలో, మా పెద్ద పాప స్వర్ణ కూడా ఉంది. "చీకటిపడి పోయింది, ఇక వెళ్దామే స్వర్ణా -" అంటూ, కేకేసాను. కానీ, నా చూపులుమాత్రం గుడి ముఖద్వారంవేపు తచ్చాడుతున్నాయ్. రోజూ, నేను వచ్చిన కాస్సేపటికల్లా వచ్చి, నా వెంట వెంట తిరుగుతూ, నవగ్రహ ప్రదక్షిణ చేసే ఆ పాప ఎందుకో ఇంకా రాలేదు. రోజూ, ఆ అమ్మాయితో ముచ్చటలాడటం అలవాటయిన నాకేంటో వెలితిగా ఉంది. ఆ అమ్మాయితో - అదే పూర్ణిమతో - పరిచయమే, నాకు భలే గమ్మత్తుగా, ఆసక్తిదాయకంగా జరిగింది.

ఆరోజు నేను నవగ్రహమందిరంలోకి వెళ్లి, గిన్నెలోని నూనె పైనుండే దీపంలో వంచి, వత్తి కూడా అందులోనే వేసి వెనక్కి తిరిగాను. ఇంతలో "అత్తయ్య గారండీ ! నా గిన్నెలోని నూనె కూడా వంచరూ..." అంటూ, నా చేతికి నూనె గిన్నె అందించింది, నా ప్రక్కనున్న బాలిక. "ఇంత చిన్నపిల్లచేత నూనె గిన్నె ఇచ్చి పంపారెందుకబ్బా !" అనుకుంటూ, నూనె గిన్నె అందుకున్నాను నేను. నూనె వంచి ఇచ్చిన గిన్నెను, జాగ్రత్తగా చేతిలోకి తీసుకుంది ఆ పాప. నేను ప్రదక్షిణ మొదలెట్టగానే, నా వెనకే తిరుగుతూ, ఒక్కొక్క ప్రదక్షిణకి, ఒక్కొక్క పైసా చొప్పున

మూలగ్రహాలమీద విసిరేయసాగింది. "అమ్మో! పిల్ల చిన్నదయినా, భక్తి లావే....!" విస్తుపోయాను, నేను.

ప్రదక్షిణలు పూర్తిగావించుకొని, విభూతి, కుంకుమలు తీసికొని ఆంజనేయ స్వాములవారి మందిరానికి ముంగిట ఉన్న ఎత్తైన మంటపం మీద కూచున్నాను. ఆరోజు ఎందుచేతనో, మా పాప-స్వర్ణ-నాతో గుడికి రాలేదు. నేను ఒక్కదాన్నే కూచుని ఉంటే, ఏమనుకుందో ఏమో - ఆ అమ్మాయి కూడా వచ్చి నా పక్కనే కూచుంది. పాపకి మహా ఉంటే - పదేండ్లుంటాయేమో ! బక్కపల్చగా, తెల్లగా ఉంది. ముఖంలో, కళ్లుమాత్రం కొట్టొచ్చినట్లు పెద్దగా ఉన్నాయ్. అరచేతిలోని కుంకుమా - విభూతి కలిసిపోకుండా కాగితపు ముక్కలతో అతి జాగ్రత్తగా చిన్నచిన్న పొట్లాలు కట్టింది.

"నీ పేరేంటి పాపా....!" అన్నాను ఊరుకోలేక.

"పూర్ణిమ" అంది, అరచేతిలో మిగిలిపోయిన విభూతిని నుదుటికి, పొట్టకి రాసుకుంటూ.

"ఏం పాపా ! నువ్వొక్కత్తెవే వచ్చావు....? పెద్దవాళ్లెవరూ రాలేదా?" అన్నాను, నేను.

"లేదండీ. అయినా ఎవరొస్తారండీ అత్తయ్యగారూ ! నాన్నమ్మకేమో మోకాళ్లనొప్పి ; అమ్మకి ఇంట్లో చేసినంత పని - పైగా ఇంతదూరం నడవగలదాండీ, అమ్మ?"

"ఎక్కడేంటి పాపా, మీ ఇల్లు?"

"క్రెసంట్ పార్క్ స్ట్రీట్ లేదండి... అక్కడ...."

"ఓహో... మా ఇంటికి వెళ్లేదారిలోనే అన్నమాట ! అక్కడినుండి నువ్వొక్కదానివే వస్తావా .....?"

"ఔనండీ. నవగ్రహాలని శ్రద్ధగా చుట్టే - మనం కోరుకున్నవన్నీ జరుగుతాయట కదండీ....! అలా అని మా ఇంటికి వచ్చే శాస్త్రులుగారు చెప్పారు లెండి...." కళ్లు ఇంతింతవి చేసి చెప్తున్న ఆ చిన్నారి పూర్ణిమను చూస్తే నాకు ముద్దేసింది.

"అబ్బో.... ! ఏంటో నీ కోరిక ....?"

"నా కోరికాండి - ! అబ్బే ఏం లేదులెండి అత్తయ్యగారూ - !" బోల్డు సిగ్గు పడిపోతూ అంది, పూర్ణిమ. కొంపదీసి మంచి మొగుడికోసరం ఇప్పటినుండే దీక్షపూని ప్రదక్షిణములు చేయడంలేదు కదా ఈ పిల్ల ! - అనిపించింది నాకు.

ఏమనుకుందో ఏమో - అంతలోకే అందుకొని, "మరేనండి అత్తయ్య గారూ! నాకో చెల్లెలో-తమ్ముడో పుట్టాలని ఇలా దేవుడికి ప్రదక్షిణలు చేస్తున్నానండీ-" చిక్కటి చిరునవ్వుని జోడించి చెప్తున్న పూర్ణిమ మాటలకు నా హృదయం స్పందించింది. పాపం, తన తరువాత పిల్లలు లేక కాబోలు - ఈ చిన్ని హృదయం తల్లడిల్లుతూంది....!

"నువ్వొక్క దానివేనామ్మా! మీ వాళ్లకి ?" అనవసరపు ప్రశ్నే అయినా, ప్రసంగం పొడిగించడానికి వేశాను.

"ఔనండీ -" ఛంగున లేచి నుంచుంటూ అంది పూర్ణిమ. "వస్తానండి అత్తయ్య గారూ, ఆలస్యమయితే అమ్మ కంగారు పడుతుంది -" వెళ్లిపోతూ అంది, పూర్ణిమ. అలా వెళుతున్న ఆ అమ్మాయి ముఖంలో ఏదో చెప్పజాలని ఆవేదన - దాని వెనుక కన్పించే తృప్తి నాకు గోచరమయ్యాయ్.

అలా మొదలయిన మా పరిచయం దినదినాభివృద్ధి చెందింది. ఒక్కరోజు నేను వెళ్లడం ఆలస్యమయినా, పూర్ణిమ రావడం ఆలస్యమయినా, ఇద్దరం ఒకరి కోసరం ఒకరం నిరీక్షిస్తూ ఉండేవారం.

"ఇక వెళ్దామే అమ్మా....!" అంటూ స్వర్ణ వచ్చి నా ప్రక్కన నిలుచుంది. దాని స్నేహితురాండ్రందరూ వెళ్లినట్లున్నారు - ఇక ఇంటి ధ్యాస పట్టుకుంది అమ్మాయిగార్కి. లేవబోతున్న నేను, గబగబా గుడిలోకి వస్తున్న పూర్ణిమను చూసి ఆగిపోయాను. నన్ను చూసి, "అత్తయ్యగారూ! ఒక్క నిముషం ఉండండి. ఇప్పుడే వచ్చేస్తాను..." అంటూ, గుడిలోకి పరుగుతీసింది పూర్ణిమ. పూర్ణిమ ఈడుదే అయినా మా స్వర్ణకి గుడిచుట్టడాలు, కుంకుమ విభూతులు పెట్టుకోవడాలు ఏమీ పట్టవు. ఎంతసేపూ ఆట - లేకుంటే చదువు. ఆటలాడి విసుగుపుట్టిందేమో - పూర్ణిమ వెంబడి గుడిలోకి వెళ్లింది స్వర్ణకూడా.

కాస్సేపటికి ఇద్దరూ నా దగ్గరికి వచ్చారు.

"ఏం పూర్ణిమా ! ఇంతాలస్యం....?" అన్నాను నా ప్రక్కనే కూచుంటున్న పూర్ణిమను చూస్తూ.

"ఏం లేదండీ అత్తయ్యగారూ ! అమ్మకి ఒంట్లో బాగోలేక చాలాసేపు లేవకుండా పడుకుంది. అందుకని...." ఏదో చెప్పలేకపోతున్న ఆ పిల్ల కండ్లలో, నీళ్లు ఇప్పుడో-అప్పుడో అన్నట్లు తొంగి చూస్తున్నాయ్.

"ఎందుకమ్మా దాపరికం ఈ అత్తయ్య చెంత !" అంటూ ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాను, పూర్ణిమని.

అంతే, పూర్ణిమ నా ఒళ్లోపడి వెక్కి వెక్కి ఏడ్చింది. ఈ హటాత్సంఘటనకి నేను తెల్లబోయాను. స్వర్ణ బిక్కముఖం వేసికొని నా ప్రక్క కూచుంది. కాస్సేపటికి పూర్ణిమ లేచి కూచుని స్కర్టు అంచులతో కళ్లు తుడుచుకుంది.

"ఏం పాపా ! మీ అమ్మకి బాగోలేదా?" అన్నాను. కాదన్నట్లు తలవూపింది పూర్ణిమ. మళ్లీ ఏమనుకుందో ఏమో, నెమ్మదిగా వెనక్కి తిరిగి, బ్లౌజు ఎత్తి వీపు చూపింది.

ఆశ్చర్యం ! తెల్లటి వీపుమీద ఎర్రటి వాతలు !

నాకేం అర్థంకాక, పూర్ణిమకేసి బాధగా చూశాను.

"మరండి - మా నాన్నమ్మ ఈ ఉదయం వేడివేడిగా ఏడట్లు వేసిందండీ అత్తయ్యగారూ! మరీ వేడివి వేసిందేమో - వాతలు పడ్డాయండీ. అది చూసి అమ్మ ఏడ్చింది." పూర్ణిమ, ఏడుపుతో సంతోషాన్ని జోడిస్తూ నివేదించింది.

"ఎందుకమ్మా ఏడట్లువేయడం....?" తెల్లబోతూ, అడిగాను.

"అయ్యో ! నిజంగా మీకు తెలీదాండి అత్తయ్యగారూ ! (జాలిగా నాకేసిచూస్తూ) మా అమ్మకి పుట్టిన పిల్లలందరూ పురిట్లోనే చచ్చిపోతున్నారుగా. నా వెన్ను కాలితే అమ్మకి కడుపు చలువయి పిల్లలు బ్రతకొచ్చుగా. అందుకని....!"

"అందుకని - నీ వీపుమీద వాతలా ! అయ్యో రామ ! మరి, మీ అమ్మా, నాన్నగారూ చూస్తూ ఊర్కుండిపోయారా ?"

"అమ్మ ఏడుస్తూ వద్దంటే వద్దంది. నాన్నగారింట్లో లేరు. అయినా, అమ్మ పిచ్చిగాని, ఈ వాతలెంతకాలముంటాయ్ అత్తయ్యగారూ ! ఇంతలో మానిపోవూ! ఎంచక్కా తమ్ముడో- చెల్లెలో పుడ్తారుగా. ఆ ఆశతోనే ఈ కష్టాన్ని ఆనందంగా అనుభవిస్తాను అత్తయ్యగారూ -" పదేండ్ల అమాయకపు బాలిక అరువదేండ్ల అనుభవాన్ని పుడికి పుచ్చుకుని మాట్లాడుతుంటే, నాకు దుఃఖం ముంచుకొచ్చింది.

"పోన్లేమ్మా ! ఇంటికెళ్లగానే కాస్త కొబ్బరినూనె సున్నపుతేట రాసుకో. అయినా, ఇలా వాతలు వేయించుకుంటారా?" - ఇక అక్కడ కూచోలేక లేచిపోయాను.

ఆ రాత్రి పడుకున్నానేకాని నా ఆలోచనలన్నీ ఆ అమాయకపు బాలిక పూర్ణిమ చుట్టే తచ్చాడుతున్నాయ్. తొలి చూలు పిల్ల తర్వాత, పిల్లలు దక్కకపోతే పెద్దపిల్ల వెన్ను మంచిదికాదనడం విన్నాను. కానీ, ఇంతలా నమ్మి, ఇంత ఘోరంగా వ్యవహరిస్తారని ఊహించలేకపోయాను. కండ్లు అలా మూయగానే ఆ పచ్చటి వీపు, ఎర్రటి వాతలు ప్రత్యక్షమవసాగాయ్. నిద్రరాక మసలుతూ, ఆ రాత్రే నిశ్చయించుకున్నాను, ఏమైనా సరే, పూర్ణిమ తల్లిని కలిసి మాట్లాడాలని. ఆ నిశ్చయాని కొచ్చాక కాస్త కన్ను మూయగలిగాను.

"పద పూర్ణిమా ! నేను కూడా మీ ఇంటికి వస్తాను," అన్నాను గుడి బయటకు వస్తూ.

"నిజంగానేనా అత్తయ్యగారూ ! పదండి....." బోల్డు సంతోషపడిపోతూ, నాముందు నడిచింది పూర్ణిమ.

ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ నడక సాగించామ్. పూర్ణిమ ఎంతో హుషారుగా మాట్లాడేస్తూంది. ఆ రోజు మా చంటిది, సుమ, కూడా నాతో వచ్చింది గుడికి. దాన్ని బలవంతంగా నా చేతుల్లోంచి లాక్కుని తను ఎత్తుకుంది పూర్ణిమ. పూర్ణిమ చంక నెక్కి కేరింతలు కొట్టసాగింది సుమ.

"అత్తయ్యగారూ ! ఈ పాపని రోజూ మా ఇంటికి తీసికెళ్తానండి." అంది, మురిపెంగా పూర్ణిమ.

"ఊఁ.... అలాగే ..." అన్నాను నేను నవ్వుతూ.

హెన్సుమెన్ రోడ్డు మలుపు తిరిగి, క్రెసంట్ పార్క్ స్ట్రీటువేపు దారి తీసింది పూర్ణిమ. ఒక పెద్ద ఇంటిముందు ఆగి, గేటు తెరిచి, "రండి అత్తయ్యగారూ -" అంది పూర్ణిమ, క్రిందికి జారిపోతున్న సుమని, మళ్లీ చంకలోకి లాక్కొంటూ. ఏడ్పుకి సిద్ధమవుతున్న సుమని, పూర్ణిమ వద్దనుండి అందుకొని, "పెద్ద ఇల్లేనే" అనుకుంటూ, పూర్ణిమని అనుసరించాను. కాని పూర్ణిమ తిన్నగా వెళ్లక ప్రక్కకి దారితీసింది. ఓహో.... ఔట్ హౌసులో నన్నమాట వీళ్లుండేది. త్యాగరాయనగర్‌లో కొందరు భాగ్యవంతులు, వారి భవంతుల వెనుకవేపు చిన్నచిన్న గదులు కట్టించి, అద్దెకు ఇస్తుంటారు. ఇలా చేయడం వల్ల ఇంటిగల వాళ్లకి కాస్తమాట సాయం, మరికొంత ఆర్థిక సాయం.

మూడు గదులున్న చిన్న పోర్షన్‌లోకి, రివ్వున దూసుకుపోయింది పూర్ణిమ. "అమ్మా ! కోవెల అత్తయ్య గారంటూ ఉంటానే ఆ అత్తయ్యగారొచ్చారమ్మా - నిన్ను చూడ్డానికి...." పూర్ణిమ మాటలు విని, ఓ ముప్పై సంవత్సరాలున్న స్త్రీ బయటకు వచ్చింది. "రండి...... రండి" అంటూ, నన్నాహ్వానిస్తున్న పూర్ణిమ తల్లికేసి చూశాను. బహుశా ఆవిడకి ముప్పై ఏండ్లు కూడా ఉండవేమో అనిపించింది. అచ్చు గ్రుద్దినట్లు పూర్ణిమనే పోలి ఉంది. నీరసంగా ఉన్న ఆవిడ గర్భవతి అని గ్రహించాను. పూర్ణిమ గబగబా రెండు మోడాలు తెచ్చి వరండాలో వేసింది. ఇద్దరం కూచున్నాము.

"మీ పాప పూర్ణిమకి భలే దైవభక్తండీ! క్రమం తప్పకుండా గుడికి వస్తుంది" అంటూ నవ్వుతూ నా ప్రసంగాన్ని ప్రారంభించాను. తల్లి చెవిలో ఏదో గుసగుసలు పోతోంది, పూర్ణిమ. ఆవిడ నవ్వుతూ, "చూడండి, మా పాపకి మీ పాప బాగుందట. అలాంటి పాప కావాలనే తను గుడికి వెళ్తొందట...." చెబుతూ చెబుతూనే ఆవిడ ముఖం వెలవెలపోవడం గమనించాను. మంచినీళ్లకై పేచీపెట్టున్న సుమని పూర్ణిమకి అప్పచెప్పాను.

"ఏమండీ ! మీ పేరు నాకు తెలియదు. మిమ్మల్ని చూడ్డం కూడా ఇదే ప్రథమం. కానీ, పూర్ణిమతో కొన్ని నెలలుగా నాకున్న పరిచయాన్ని ఆధారం చేసుకొని, మీరు నాకు చాలా ఆప్తులన్న భావనతో మిమ్మల్నొకటి అడగదలచాను..." అన్నాను.

"ముఖంలో కాస్త ఆశ్చర్యం కనబరుస్తూ, "తప్పక..." అన్నట్లు తలతిప్పి నా వంక చూసింది.

"పాపం చిన్నపిల్ల కదా, అంతలా వాతలు పెట్టారెందుకండీ పూర్ణిమ వీపు మీద....!"

నా మాటలు పూర్తికాకమునుపే, ఆవిడ నయనాలు అశ్రుపూరితములయ్యాయ్. మాటలు రాక, కన్నీటిని పైటకొంగుతో తుడిచేసుకొంటున్న పూర్ణిమ అమ్మని, మళ్లీ నేనే పలుకరించాను.

"క్షమించండి. మీ పాప వీపుమీది వాతల్ని గుర్తుచేసి మిమ్మల్ని బాధపెట్టినట్లున్నాను. పోనీలెండి, ఇంతకూ మీ పేరు తెలుసుకోవచ్చునా?"

"కృష్ణవేణి."

'నా పేరు లక్ష్మి' - మా వారి ఉద్యోగం మేముంటున్న ఇల్లు, వీధి, ఇత్యాది వివరాలన్నీ ఎరుకపరిచాను కృష్ణవేణికి.

కొద్దిగా కోలుకున్న కృష్ణవేణి మాట్లాడసాగింది. "కొద్ది దినాల సాన్నిహిత్యానికే మా పాప పట్ల, మీకంత బాధగా ఉంది కదా, ఇక కన్నతల్లిని నా కెంత ఆవేదన ఉంటుందో ఊహించండి అక్కయ్యగారూ ! ఏమని చెప్పను....? ప్రతి తడవా నాకు గర్భం రావడం, ఎనలేని ఆశలు పెంచుకోవడం, మా ఆశాపాశాలకు గ్రొడ్డలివేటులా, పుట్టిన శిశువు పురిటిలోనే మరణించడం అలవాటైపోయింది. మా పెండ్లయిన సంవత్సరానికే పుట్టిన ఈ పూర్ణిమని చూడండి. చక్కగా, ఆరోగ్యంగా ఉంది. తర్వాత పుట్టిన ఇద్దరు పిల్లలూ - ఇద్దరూ మగపిల్లలే - పుట్టీపుట్టగానే కన్ను మూసారు. ఏటేటా శిశువును మోయడం నా వంతు - అపనిందను మోయడం నా కన్న కూతురు వంతు అవుతున్నది. పూర్ణిమ వెన్ను మంచిది కాదంటుంది మా అత్తయ్య. నష్టజాతకురాలంటూ తిట్టిపోస్తారు, మా మామగారు. చూశారుగా నిన్న ; పసిదన్న దయాదాక్షిణ్యం లేకుండా పూర్ణిమ వెన్ను మీద ఎంతలా వాతలు పెట్టారో ! -" పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది కృష్ణవేణి.

ఈ మూర్ఖపు ముసలమ్మల అర్థంలేని మూఢనమ్మకాలకి - చెప్పొద్దూ - నాకు ఒళ్లు మండుకొచ్చింది. వీళ్లసలు సరిగ్గా డాక్టరుకి చూపించారో లేదో...? అదే ముక్క కృష్ణవేణితో అన్నాను.

"అదేం లేదండీ. చూపిస్తూనే ఉన్నాం ప్రతి తడవ. మా తల్లిగారి వూరు కాళహస్తికి దగ్గరగా ఉన్న వెంకటాపురం. బస్తీకాకపోయినా, పెద్ద పల్లెటూరే. ఆ వూర్లో కాన్పులెన్నో చేసి అనుభవం గడించిన నర్సమ్మ కూడా ఉంది. అయినా, పెద్దపిల్ల అక్కడేగా పుట్టింది. మరొక్క విషయం, నావి చాలా సులభమైన కాన్పులు..."

"కాన్పు సులభమైనంత మాత్రాన పిల్లలు ఆరోగ్యంగా పుట్టారని ఎక్కడుందండీ ? అయినా, రెండు తడవలు అలా జరిగాక మీరు కాస్త జాగ్రత్తపడాలి" అన్నాను.

"అందుకేనండీ ఈ మారు మద్రాసు లోనే పురుడు పోసుకుంటాను" అంది, కృష్ణవేణి.

"అయితే ఇకనేం, మీరు ధైర్యంగా వుండొచ్చు. ఈ మారు పూర్ణిమ ఓ 'అక్క' అవడం ఖాయం. చీకటి పడుతోంది ఇక వెళ్ళి వస్తానండి. పూర్ణిమను తోడుతీసుకొని మా ఇంటికోమారు రండి..."

"అలాగే... తప్పక వస్తాను..."

సుమని తీసికొని, ఇంటిదారి పట్టాను నేను. నీలకంఠ మెహతా స్ట్రీటులో వుండే మా ఇల్లు, పూర్ణిమ వాళ్ళ ఇంటికి చాలా దగ్గర. పది నిముషాల్లో ఇల్లు చేరుకున్నాను.

గుడినుండి అప్పుడప్పుడు పూర్ణిమ వాళ్ళింటికి వెళ్ళి కృష్ణవేణి ఆరోగ్య సమాచారాలు కనుక్కుంటూ వుండేదాన్ని. అలా వెళ్తున్న నాకోమారు, పూర్ణిమ నాయనమ్మను చూచే భాగ్యం కూడా కల్గింది. ఆవిడ, పూర్ణిమ కనబడితే చాలు కళ్ళల్లో నిప్పులు పోసుకునేది. సుమని ఎత్తుకు తిరుగుతున్న పూర్ణిమని చూసి "అంతేలే... ఈ దరిద్రపుగొట్టు ముఖానికి పరాయి పిల్లల్ని ఎత్తి మోసే భాగ్యమేలే-" అంటూ ఈసడించుకొనేది. వాళ్ళ నాయనమ్మని తప్పించుకు తిరిగే, పూర్ణిమ ఖిన్న వదనాన్ని చూసినపుడల్లా నాకు భరించరాని బాధ కల్గేది.

ఆ రోజున, సుమని పొరపాటున క్రింద పడవేసిన రోజున, ముసలమ్మ మరీ గొడవచేసింది. "నీ స్వంత తమ్ముళ్ళను పొట్టన పెట్టుకుంది చాలక, పరాయమ్మ కన్న బిడ్డల నెందుకే ఎత్తి కుదేస్తావ్" అంటూ టక్కుటక్కున ఆ పిల్ల నెత్తిమీద మొట్టికాయల వర్షం కురిపించింది. కృష్ణవేణి గ్రుడ్ల నీరు కుక్కుకుంటూ పూర్ణిమని దగ్గరికి తీసుకుంది. ఊర్కుండలేక నేనే, "అదేంటి మామ్మగారూ! పిల్లలెపుడూ క్రిందపడరాయేంటి...? పూర్ణిమను ఏమీ అనకండి" అంటూ సర్దిచెప్పాను. పువ్వుల్లాంటి పసిపాపల లేత మనస్సులను ఈ పెద్దవారు ఎంత నిర్దాక్షిణ్యంగా నలిపివేస్తారో!

పూర్ణిమవాళ్ళ కుటుంబంతో నాకు స్నేహం ఎంత పెరిగిపోయిందంటే, కృష్ణవేణి కాన్పు విషయంలో చెప్పలేనంత శ్రద్ధ తీసికోవడం మొదలెట్టాను. పూర్ణిమకి ఎలాగయినా సరే, ఈ మారు ఓ చెల్లో - తమ్ముడో దక్కేటట్లు చేయాలి. 'అత్తయ్యగారూ! ఇదుగోండి నా చిన్నారి చెల్లి!' అంటూ, తన చిట్టి చెల్లెల్ని నాకు చూపిస్తున్నప్పుడు ఆ పిల్ల సుందర వదనంలోని మందహాస వీచికలను చూచి ఆనందించాలి.

కృష్ణవేణిని ఎగ్మూర్ హాస్పిటల్లో చేర్పిస్తే మంచిదేమో అనిపించింది నాకు. ఎంచేతనంటే, అక్కడ పీడియాట్రీషియన్‌గా పనిచేసే డాక్టర్ కరుణాకర్, మా వారికి బాగా తెలిసినవారు. ఈ మాటే మా వారి చెవిలో వూదాను.

"ఓ... దానికేం... వాడికి చెబుతా కానీ, మీ స్నేహితురాలి వివరాలన్నీ ఇవ్వుమరి..." అన్నారు, మా వారు.

రోజులు దొర్లుతున్నాయ్. గుడిలో కానీ, వీధిలో కానీ చిన్నపిల్లలు కంటబడితే చాలు, వారిని ఆబగ చూసేది పూర్ణిమ. నేనది గమనిస్తూ, "ఇంకెన్నాళ్ళులే... నీకూ ఓ చెల్లాయి వస్తుంది. అప్పుడు ఈ అత్తయ్యని మరిచిపోతావు కదూ...!" ఉడికిస్తూ, అనేదాన్ని. "పొండి అత్తయ్యగారూ...!" అనేదా అమ్మాయి, నవ్వుతూ.

నా గుడి చుట్టడాలు పూర్తయ్యాయ్. గుడికి వెళ్ళడమైతే మానేశాను కాని, కృష్ణవేణీ వాళ్ళ ఇంటికి నాలుగైదు రోజుల కొకమారైనా వెళ్ళకపోతే తోచేది కాదు. ఆ రోజు పుదయం అలవాటుగా వాళ్ళింటికి బయలుదేరాను. వాకిట్లో నిలబడి, బిక్కుబిక్కుమంటూ ఏదో ఆలోచిస్తోంది పూర్ణిమ. ఆ పిల్లను చూడగానే, మీ "అమ్మ ఏదమ్మా ?" అన్నాను.

"అమ్మని ఇందాకనే హాస్పిటల్‌కి తీసికెళ్ళారండి అత్తయ్యగారూ" అంది, భయం భయంగా.

"మరి, నాయనమ్మ ఎక్కడ?"

"గుడి కెళ్ళిందదండీ - అర్చన చేయించుకు రావడానికి..."

"నా దంతా దురదృష్ట జాతకమట అత్తయ్యగారూ. అందుకని నాయనమ్మ నన్ను రావద్దంది. నాకు భయంగా వుందండి అత్తయ్యగారూ. అమ్మకి ఈ తడవ పుట్టిన పాప బ్రతకాలి. లేకుంటే నన్ను మా నాయనమ్మ చంపేస్తుందండీ..." బావురుమంటూన్న పూర్ణిమని, ఒళ్లోకి తీసికొన్నాను.

"ఊర్కో - ఏడవకమ్మా. పాప ఎందుకు చచ్చిపోతుంది ? ఈ మారు అలా జరగదు. మునుపంటే మీ మామయ్యగారి వూర్లో వైద్య సదుపాయాలు లేక, పుట్టిన ఇద్దరు పిల్లలు చచ్చిపోయారు. ఇప్పుడలా ఎందుకు జరుగుతుంది...? నీకేం భయం లేదులే. నేను వచ్చి వెళ్ళానని మీ నాయనమ్మతో చెప్పు..." పూర్ణిమని ఓదార్చి, ఇంటి ముఖం పట్టాను.

మా వారు ఆఫీసుకు వెళ్ళేందుకు తయారై, నా కోసరం చూస్తున్నట్లున్నారు. ఆదరాబాదరగా వచ్చిన నన్ను చూసి, "ఏంటోయ్ అదోలా వున్నావ్...? మీ స్నేహితురాలి కేమయింది?" అన్నారు.

"కృష్ణవేణిని ఈ వుదయమే హాస్పిటల్‌కి తీసుకువెళ్ళారట ........ ఈ దినమే కాన్పు కావచ్చునేమో!" అన్నాను.

"ఈజ్ ఇట్...?" ఏం ఫరవాలేదు లక్ష్మి. డాక్టర్ కరుణాకర్ మీ స్నేహితురాల్ని ఇదివరకే పరీక్షించాడట. నేను ఆఫీసుకి వెళ్ళగానే మళ్ళీ ఓమారు ఫోన్ చేసి కనుక్కుంటాలే. నీ పనీ - అదీ ముగించుకొని హాస్పిటల్‌కి ఓమారు వెళ్ళి రాకూడదూ...! సో... ఐ షెల్ గో..." బయటకు నడిచారు, మా వారు.

వంట ముగించుకొని, పక్కింటివారికి సుమని అప్పచెప్పి, హాస్పిటల్‌కి ప్రయాణమయ్యాను నేను. ఆటో చిక్కడం ఎలా కష్టం కాలేదో - ఎగ్మూర్ హాస్పిటల్‌లోని ప్రసూతి వార్డు కనుక్కోవడం కూడా, అట్టే కష్టం కాలేదు నాకు. ప్రసూతివార్డులోని ప్రతి మంచం ప్రక్కన ఓ ఊయల. నిదురోతున్న శిశువులు కొందరు. ఊరకనే ఏడుస్తున్న పిల్లలు మరికొందరు. అందర్నీ చూచుకుంటూ కృష్ణవేణి పడుకొనివున్న పక్కకేసి నడిచాను. కృష్ణవేణి మగతగా అటు తిరిగి పడుకొనివుంది. ప్రక్కనే వున్న ఉయ్యాలలోకి ఆత్రంగా చూశాను. ఖాళీ తొట్టి నన్ను వెక్కిరించినట్లనిపించింది. నివ్వెరపోయాను. గుండె ఒక్క మారు ఆగిపోయినట్లనిపించింది. తమాయించుకొని ప్రక్కకి తిరిగాను. ప్రక్కపడకలోని బాలెంతరాలు నా వివర్ణ వదనాన్ని గమనించి, నవ్వుతూ "బేబీ కోసరం చూస్తున్నారా...? ప్రసవమైనప్పటినుండి బేబీని బయటకు తేనే లేదండి. అదేదో రక్తం ఇస్తున్నారుట" అంది.

ఇంతలో సుడిగాలిలా దూసుకు వచ్చింది పూర్ణిమ. "అత్తయ్యగారూ! నాకు తమ్ముడు - బుల్లి తమ్ముడు పుట్టాడట! అంతేకాదు అత్తయ్యగారూ, నా తమ్ముడికి ఇకనేం ప్రమాదం లేదట- ఇందాకనే డాక్టరుగారు మా నాయనమ్మతో చెప్పారు..." నన్ను గట్టిగా వాటేసుకుంటూ, అంది పూర్ణిమ.

పూర్ణిమ ముఖంలో, తొలిసారిగా, పున్నమి వెన్నెలలు గాంచిన నా కళ్ళు ఆనంద బాష్పాలతో నిండాయి.

"మీ నాయనమ్మగారెక్కడ...?" అన్నాను.

"ఇందాకనే ఇంటికెళ్ళింది. మళ్ళీ ఓ గంటలో వస్తానంది."

మగతగా నిదరోతున్న కృష్ణవేణిని లేప మనస్కరించలేదు. ఆనందం నిండిన హృదయంతో- "పూర్ణిమా, అమ్మ లేచాక నేనొచ్చి వెళ్ళానని చెప్పు..." అంటూ, ప్రసూతివార్డు నుంచి బయటకు నడిచాను.

ఆ సాయంత్రం ఇంటి పనులు ముగించుకొని, శ్రీవారికై ఎదురుచూస్తూ కూచున్నాను. మా ఇంట్లో ఏదో శుభం జరిగినంత సంబరంగా వుంది నాకు. మా వారు వచ్చిందే తడవుగ, పూర్ణిమకి తమ్ముడు పుట్టాడన్న శుభవార్తని వారి చెవిలో వెయ్యాలి...

నిరీక్షిస్తున్న శ్రీవారు రానే వచ్చారు. వాకిట్లోంచే, "కంగ్రాచ్యులేషన్స్... పూర్ణిమకి తమ్ముడు పుట్టాడు... ఆరోగ్యంగా వున్నాట్ట..." అంటూ వచ్చారు.

"నేనే ఆ శుభవార్తను మీ చెవిలో వేద్దామని వువ్విళ్ళూరుతుంటే... మీరే చెప్పేశారే..." నవ్వుతూ, అన్నాను.

"ఇందాక డాక్టర్ కరుణాకర్ క్లబ్బులో కలిసాడు..." టై లూస్ చేసి కుంటూ, సోఫాలో చేరగిలబడి అన్నారు, శ్రీవారు.

బ్రూ కాఫీ సేవిస్తున్న శ్రీవారికేసి చూస్తూ అన్నాను. "ఇంతకీ కృష్ణవేణిది కాదండి అదృష్టం; పూర్ణిమదే! పాపం, ఆ పిల్ల తమ్ముడికోసరం ఎంత పాటు పడ్డది! అయినా మనం ఛాదస్తాలంటూ అంతలా తీసిపారేస్తాముకదా! వెన్ను చలవకి ఏడట్లు వేసిందని వాళ్ళ నాయనమ్మని ఎంతగానో తిట్టుకున్నాను. కానీ, ఇప్పుడనిపిస్తోంది - పూర్ణిమ నిజంగా దురదృష్ట జాత ఎందుకు కాకూడదా - అని. పుట్టిన బిడ్డ లక్షణంగా వున్నాడంటే ఏడట్ల ప్రభావమే కాకూడదా!?..."

మాటల మధ్యలో ఉలిక్కిపడ్డట్లు నావేపు చూసి, మావారు పకపకా నవ్వడం మొదలెట్టారు.

"ఇంకా చెప్పవేం లక్ష్మీ...! పూర్ణిమ, నవగ్రహాల చుట్టిన పుణ్యమే కావచ్చు, వేయించుకున్న వాతల ప్రభావమే కావచ్చు - లేక - వాళ్ళ నాయనమ్మ శాస్త్రులవారిని పిలిపించి - చేయించిన 'శాంతి'యే కారణం కావచ్చు... ఇంకేదో కావచ్చు. కానీ, అసలు కారణం తెలిస్తే నీవు నిర్ఘాంతపోతావ్...! అదేవిటో తెలుసా? పుట్టిన బిడ్డ బ్రతకడానికి కారణం నీవే...!"

"ఏవిటి...! నేనా...!!"

"ఊఁ... నువ్వు పట్టుబట్టబట్టి ఈ కేసు కరుణాకర్ చేబట్టాడు. అతని హస్తవాసి వల్లే ఈ బిడ్డడు బ్రతికాడు! కృష్ణవేణికి పుట్టిన బిడ్డ 'రీసెస్ బేబీ' అట- "

"అంటే!" అన్నాను, ఏమీ అర్థమవక.

"నా ఇంజనీరింగ్ బుర్రకే పూర్తిగా అర్థం కాలేదు. మరి నీ లిటరేచర్ బుర్రకి మాత్రం ఎలా అర్థమై చస్తుందిలే..."

"అబ్బ విసిగించక వివరాలు చెబుదురూ!"

"అంత ఓపికా - నాలెడ్జీ నా కెక్కడున్నాయ్ - అదో ఆ టీపాయ్ మీద ఇందాక కరుణాకర్ ఇచ్చిన సైన్స్ జర్నల్ పడేశాను. అందులో పదమూడవ పేజీ తెరిచి చదువు..." ఆర్డర్ జారీచేసి లోనికి జారుకున్నారు శ్రీవారు.

ఆదరాబాదరాగా టీపాయ్ మీదున్న సైన్స్ జర్నల్ తెరిచి పదమూడవ పుటలోని వ్యాసాన్ని చదవడం మొదలెట్టాను.

**రీసెస్ శిశువులు** (Rhesus babies)

పుట్టబోయే శిశువుల్ని రీసెస్ ప్రమాదంనుంచి తప్పించే వైద్య పద్ధతులు, ఆధునిక వైద్య విజ్ఞానం ఎల్ల మనకిప్పుడు లభ్యమవుతున్నాయి. తల్లి యొక్క రక్తాణువులు, పుట్టబోయే శిశువు యొక్క ఎర్ర రక్తాణువులను విరిచివేసే కారణంగా, శిశువు కామెర్లతో జన్మించడమో, మృత శిశువుగా పుట్టడమో జరుగుతుంటుంది. ఈలాంటి శిశువులను రీసెస్ శిశువులని, ఈ వ్యాధిని "హెమోలిటిక్ ఎనీమియా' (Haemolytic anaemia) అని, అంటారు.

భార్యా భర్తల రక్తంలో గల, రక్త వైరుధ్యం ఇందుకు కారణం. మానవ రక్తాన్ని అనేక రకాలుగా విభజింపవచ్చును. ఉదాహరణకు ఏ బి ఓ (ABO) సిస్టమ్ తీసుకొందాం. 'ఓ' గ్రూపు రక్తం గలవారికి 'ఏ', లేక 'బి' లేక 'ఏ బి' రక్తపు గ్రూపులు పనికిరావు. ఎందుచేతనంటే, 'ఓ' గ్రూపు రక్తం గలవారిలో 'ఏంటీబాడీస్' (Anti bodies) అనబడే శరీర రక్షక పదార్థాలు వుంటాయి. ఇవి, దానంగా గ్రహింపబడ్డ విరుద్ధ రక్తంలోని కణములకు అతుక్కుని వాటిని హరింపజేస్తాయి.

మానవకోటిలో నూటికి ఎనభై ఐదు మంది రక్తంలో రీసెస్ అనబడే సూక్ష్మరేణువులు వుంటాయి. వీళ్ళందరిని రీసెస్ పాజిటివ్ (Rh+) వ్యక్తులంటూ వ్యవహరిస్తాము. రక్తంలో రీసెస్ సూక్ష్మరేణువులు లేని వ్యక్తుల్ని రీసెస్ నెగెటివ్ (Rh-) వ్యక్తులుగా వ్యవహరిస్తాము. ఆర్. హెచ్. పాజిటివ్ వ్యక్తియొక్క రక్తాన్ని, ఆర్. హెచ్. నెగెటివ్ వ్యక్తికి ఇచ్చామనుకుందాము. రెండవ వ్యక్తి రక్తం ఏంటీబాడీస్‌ని తయారుచేస్తుంది. ఈ తయారైన నిరోధక రేణువులు, ఆర్.హెచ్. పాజిటివ్ రక్తకణాల్ని నాశనం చేస్తాయి.

సర్వసాధారణంగా ఆర్.హెచ్. నెగెటివ్ స్త్రీ, ఆర్.హెచ్. పాజిటివ్ శిశువును పొంది వుంటుంది. శిశువు జననమొందే సమయంలో శిశువుయొక్క ఆర్.హెచ్. పాజిటివ్ రక్తం, ఏ కొద్దిగానైనా తల్లి యొక్క రక్తప్రసరణలోకి జారుకుంటుంది. తత్కారణముగా, తల్లియొక్క ఆర్.హెచ్. నెగెటివ్ రక్తం, శిశువు నుండి పొందిన ఆర్.హెచ్. పాజిటివ్ రక్తానికి విరుద్ధంగా, ఏంటీబాడీస్‌ని తయారుచేస్తుంది. తల్లిలో, ఈ నిరోధక రేణువులు తయారవ్వకముందే ప్రథమ శిశువు జన్మించడము వలన, ఆ శిశువుకు ఏంటీబాడీస్ వలన ప్రమాదము లేదు. కానీ, తరువాత పుట్టబోయే శిశువులకు, వాటివలన ఎంతేని ప్రమాదంవుంది. ప్రథమ సంతానం తరువాత తల్లిరక్తంలో అత్యధికంగా విస్తరిల్లి, రక్తంయొక్క పసుపురంగు ద్రవపదార్థంలో (ప్లాస్మాలో) విలీనమై, బిడ్డపిండంలో ప్రవేశించి, బిడ్డ యొక్క ఆర్.హెచ్. పాజిటివ్ రక్త కణాల్ని నాశనం చేస్తాయి. ఈ రక్త క్షీణత కారణంగా, పుట్టినపుడు నార్మల్‌గా కనిపించే శిశువు, పుట్టిన కొద్దికాలానికే విపరీతమైన కామెర్ల వ్యాధికి గురియై అకాల మరణం చెందుతుంది. బిడ్డ పుట్టిన వెంటనే, బిడ్డలోని క్షీణరక్తపు స్థానే ఆర్.హెచ్. నెగెటివ్ రక్తాన్ని మార్పిడిచేయడం వలన, ఆ బిడ్డను బ్రతికించవచ్చును.

భార్యాభర్తల మధ్య ఇలాంటి రక్త వైరుధ్యం వున్న కారణంగా పై ప్రమాదాలు సంభవిస్తాయి. కాన్పులు దగ్గిర దగ్గిరగా ఏర్పడ్డకొద్దీ, ఈ రక్తవైరుధ్యం అధికమవుతుంది. కాన్పులు దూరమయ్యే కొద్దీ వైరుధ్యం తగ్గిపోతుంది.

ఏది ఏమైనా, గర్భిణీ స్త్రీలందరూ తప్పనిసరిగా ఆచరించవలసిన పని ఒకటుంది. అది వారి రక్తంలోని రీసెస్+ గ్రూపింగ్ తెల్సుకునేందుకు డాక్టర్లచేత పరీక్ష చేయించుకోవడమే. నూటికి పదిహేనుమంది స్త్రీలు ఆర్.హెచ్. నెగెటివ్ రక్తాన్ని పొందివుంటారు. అలాంటి స్త్రీలకి తొలి కాన్పు తర్వాత ఏంటి-డి (Anti-D) అన్న ఇంజెక్షన్ ఇచ్చి మలి కాన్పుల శిశువులను మరణంపాలు కాకుండా కాపాడవచ్చును.....''

నాకు అర్థమైపోయింది. కృష్ణవేణికి పూర్ణిమ తరువాత పుట్టిన ఇద్దరు మగ పిల్లలూ దక్కకుండా పోవడంలోని కీలకం తెలిసిపోయింది నాకు.

చిన్నారి పూర్ణిమ తాను చేయని తప్పుకు దురదృష్ట జాతగా ఆడిడి పాలైంది. అందుకే ఆ పసిదానిపై నాకు ఎనలేని ప్రేమాభిమానాలు - సానుభూతీ.

ఆఖరుకి తానో అందాల తమ్మునికి పూర్వజగా నిలిచి, అందరి మెప్పులు పొందింది.

***(యువ మాసపత్రిక, అక్టోబరు 1973)***

# ప్రభ

మెత్తుగా-మెత్తగా ఉన్న లాన్, ఆకుపచ్చటి తివాసీ పరిచినట్లుంది.

ఆ ఇంటిముందు, బస్సాగీ ఆగడంతోటే బిలబిలా ప్రవేశించారు చిన్నారి విరిబాలలు.

లాన్ చుట్టూరా వేసిన బుల్లి బుల్లి కుర్చీల్లో చిట్టి పొట్టి పాపలు, ఒక్కరొక్కరే వచ్చి కూచుంటున్నారు. కూచుని, ప్రక్కవారితో కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు, "పుట్టిన్రోజు పాప ఇంకా రాదేం చెప్మా .......!" అంటూ కేకలు పెడ్తున్నారు.

"హాయ్, ఇక్కడే వున్నా, వచ్చేశా" అందమైన సుమన, అందరివైపూ చూస్తూ అంది.

పిల్లలందరూ సుమన్ని చుట్టేసారు, "హాపీ బర్త్డే టు యూ !" అంటూ. అందరి శుభాకాంక్షలను అందుకొని, అభివందనాలు చేస్తూ చుట్టూ తిరుగుతూంది సుమన.

పాలనురుగు లాంటి ఫారిన్ నైలక్స్ ఫ్రాకు. ఆ ఫ్రాకుపైన అందంగా కుట్టబడ్డ ఎర్రటి ప్లాస్టిక్ పువ్వు. కాళ్ళకి తెల్లటి మేజోళ్ళు - వాటిమీద ఎర్రటి బూట్లు. వదులొదులుగా అల్లుకున్న జడ - జడ చివర ఎర్రటి రిబ్బను.

మెచ్చుకోలుగా తననే చూస్తూన్న పిల్లల్ని చూస్తూ, "ఏం ! నాకీ డ్రస్సు బాగుందా ! ఈ ప్లాస్టిక్ గులాబి పువ్వును మా డాడీ హైద్రాబాదు నించి తెచ్చారు" అంది.

"ఎంత ముద్దొస్తున్నావ్ - నువ్వీ డ్రెస్‌లో .... సింప్లీ స్మాషింగ్ ....." అలా అని అనకపోయినా, అందరి ముఖాల్లో అదే భావం వెల్లివిరిసింది.

"ప్లీజ్ .... కమాన్ .... నిలబడ్డ మెందుకు. వెళ్ళి కూచుందాం" అందర్నీ కుర్చీల చెంతకి తీసికెళుతూ అంది, సుమన.

దూరంగా, గేట్‌నానుకొని ఆ హడావిడినంతా ఆనందంగా తిలకిస్తూ నిల్చుంది ప్రభ.

"వీళ్ళంతా ఎంచక్కా డ్రెస్ చేసుకున్నారు ? అన్నీ కొత్తవి. ఎంతో ఫాషన్‌గా కూడా వున్నాయ్" తన బట్టల కేసి అయిష్టంగా చూసుకుంటూ అనుకుంది ప్రభ.

"అమ్మా ! సుమన నన్ను కూడా తన పుట్టిన్రోజు పార్టీకి పిలిచిందే ! నేను కూడా వెళ్ళాలి. మరి, నాకు మంచి గౌను కొనిపెట్టవూ .........?" అని తనంటే అమ్మ విసుక్కుంది.

"బాగానే వుంది. ప్రతి పేరంటానికీ కొత్త బట్టలు కొనుక్కునేంత భాగ్యవంతులం కాము తల్లీ !" అంటూ. మళ్ళీ ఏమనుకుందో - ఏమో - సంక్రాంతి పండక్కని తీసి వుంచిన చీటీ గౌను గుడ్డని అప్పటికప్పుడు కుట్టించి ఇచ్చింది. ఎంతో సంబరపడుతూ తొడుక్కున్న ఆ గౌను ఇప్పుడీ పిల్లల డ్రస్సుల ముందు దిగదుడుపుగా వున్నట్లనిపించింది, ప్రభకి. "వాళ్ళందరి మధ్యకి వెళ్లి కూచోవాలా ? అమ్మో ! వాళ్ళందరూ కాన్వెంటులో చదివే పిల్లలు. ఇంగ్లీషే తప్ప మరే భాష రానట్లు అదే మాట్లాడతారు. తెలుగు స్కూల్లో తనూ ఇంగ్లీషు చదువుకుంటోంది. కాని వాళ్ళలాగ తను మాట్లాడగలదా ?" తనలో తాను బాధపడ్తూ గేటు వద్దనే నిలబడిపోయింది ప్రభ.

"ఛ .... ఎంత చిక్కొచ్చింది. తనసలు పార్టీకి రానసే అంది. కాని, సుమన బలవంతం చేసింది. 'ఎదిరింట్లో వుండి నువ్వు రాననటావేం ! రాకపొయ్యావంటే చూడు, నీతో కటీఫ్ కొట్టేస్తాను. ఊఁ ....' అంటూ బెదిరించింది. 'వాళ్ళెవరో మాట్లాడరని నీకెందుకు బాధ ? నేనున్నానుగా నీ దోస్తు. ప్లీజ్, నాకోసమైనా రా. వస్తావు కదూ ! ఏం ?' అంటూ, ఎంతగానో బ్రతిమిలాడింది. మరిప్పుడో తన ఫ్రెండ్స్ మధ్య మెలగుతూ, నన్నసలు గమనించనైనా లేదు" అనుకుంటూ నిల్చుంది ప్రభ.

గబుక్కున గుర్తుకొచ్చింది ప్రభకి. "అయ్యో ఇప్పుడెలా! వస్తున్న ప్రతి వక్కరూ సుమనకేదో ఒక బహుమతి తెచ్చిస్తున్నారు. నేనేం తీసుకరాలేదే !" ఆ చిన్నారి మనస్సు ఆలోచన్లో పడ్డది.

లాన్ మధ్యగా వున్న టేబిల్‌మీద కేక్ అమర్చి, దానిమీద కాండిల్స్ వెలిగించారు. చుట్టూ చేరిన పిల్లలు, సుమన కాండిల్స్ ఆర్పేయగానే చప్పట్లు కొట్టి పాట పాడేందుకు సిద్ధమౌతున్నారు.

ఒక్క నిముషం - తను కూడా వెళ్ళి వాళ్ళలో కలుద్దామా అన్పించింది ప్రభకి. కాని కానుక ఏమీ లేకుండా వట్టి చేతులతోనా .... ఏం బాగుంటుంది ? కనీసం ఓ పువ్వు ..... అవును, సుమన గౌనుకి వున్న పువ్వులాంటి ఓ పువ్వునైనా తెచ్చి ఇస్తే ..... !

ఆలోచన తట్టీ తట్టగానే గుట్టు చప్పుడు కాకుండా సుమనా వాళ్ళింటి వెనుక వేపున్న గులాబీ తోటవేపు పరుగు తీసింది ప్రభ.

తోట మధ్యగావున్న మెర్క్యురీ స్తంభం వెదజల్లుతూన్న వెండి వెన్నెల కాంతిలో రంగారుతున్నాయ్ - రంగురంగుల గులాబీలు. అమ్మో ! ఎన్ని రకాల గులాబీ మొక్కలో ! ముందుకు కదిలింది ప్రభ.

ఆశ్చర్యం .... ఎంతో పెద్ద మొక్కకి ఒక్కగా నొక్క పువ్వా ? బొద్దుగా తెల్లగా అరవిచ్చుకుంటోన్న అందమైన గులాబీని చూసి ఆశ్చర్యపోయింది ప్రభ.

"దీన్ని కోసి సుమనకి ప్రెజెంటుగా ఇస్తే ...." అనుకున్నదే తడవుగా మొక్కమీదికి వంగింది ప్రభ. మొక్కకి మధ్యగానున్న పువ్వును అందుకోవడం కష్టమైంది. కాని, అలాగే అతి కష్టంగా వంగి, పువ్వును తెంపింది.

"ఏయ్ ! ఎవరది ఆ మొక్క దగ్గిర ..... ! ఏం చేస్తున్నావ్ ....... ?" తోటలో ఓ మూల నించి సింహగర్జన విన్పించింది. అది తోటమాలి నరసింహ గర్జన.

అంతే -

ఉలిక్కిపడి, గులాబీ ముళ్ళమీద పడిపోయింది పాపం ప్రభ. కాని వెన్వెంటనే లేచి, చేతిలో గులాబీ పువ్వుతో బాటు లాన్ కేసి పరుగు తీసింది.

"ఔరా ! దొంగతనంగా పువ్వు కోసుకొని పరుగెత్తుతున్నావా ? ఉండు నీపని చెప్తాను ...." పిల్లదాని వెనుకే పరుగుదీసాడు తోటమాలి.

ఒక్క పరుగున సుమన్ని చేరుకుంది ప్రభ.

"సుమనా ! సుమనా !! ఇదో-నేనూ వచ్చేగా నీ పుట్టినరోజు పండక్కి. ఇదుగోనే నీకు నా బహుమతి" సుమన చేతిలో పెడుతూ అంది ప్రభ.

"హౌ స్వీట్ ...... హౌ నైస్ ........ చాలా బాగుంది. థాంక్యూ ప్రభా ! థాంక్యూ వెరీ మచ్......" ఆనందపడిపోతూ ప్రభని కావిలించుకుంది సుమన.

ప్రభ ముఖంలో ఆనందం తాండవించింది.

"లెట్మిసీ .... లెట్మిసీ ...." అంటూ ఒక్కొక్కరే పువ్వును చూస్తూ ప్రక్కవారి కందిస్తున్నారు.

"ఎంత అందమైన రంగు !"

"మై ...... ఈ తెల్లటి పువ్వుపైని ఎర్రటి మరకలు ఎంచక్కా అమరాయి."

"అబ్బ ! ఆర్టిస్టిక్‌గా అమర్చుకుందీ సింధూరపు సిరిచుక్కల్నీ గులాబీ !"

"ప్లీజ్ .... నన్ను ... చూడనీవూ .... ?"

పిల్లల చేతులు మారిమారి పెద్దల చేతుల్లోకి వచ్చిందా వింత గులాబీ. "అరె ఏవిఁటీవింత. అచ్చం తెల్లగానూ లేదూ. అటు ఎర్రగానూ లేదు. వైట్ రోజ్‌మీద రెడ్ డాట్స్ వున్న ఇలాంటి పువ్వు చాలా అరుదైంది."

"అదో ! మిసస్ రావ్‌గారు వస్తున్నారు. మిసస్‌రావ్ ! త్వరగా రండి. మీరో వింత గులాబీని చూద్దురుకాని."

ఆ హడావిడిని దూరాన్నించి గమనిస్తున్న సుమన తల్లి మిసస్ రావ్ ఇంతలో అక్కడికి రానేవచ్చారు.

అందుకుంది అరవిచ్చుకున్న గులాబీని. "అరే ! ఆశ్చర్యంగా వుందే ! మా తోటలో కూడా బోలెడు గులాబీ రకాలున్నాయ్ ..... ఇలాంటి మల్టీకలర్డ్ రోజ్ - ఇదే నే చూడ్డం తొలిసారిగా ..... వాటె లవ్‌లీ ఫ్లవర్ ..... !" ఆశ్చర్యపోతూ నిల్చుంది మిసస్ రావ్.

చేతులు కట్టుకొని నిలబడ్డ మాలి, నేలకేసి చూస్తూ, "అమ్మగారండీ ! తప్పైపోయిందమ్మా. తమరిన్నాళ్లూ ఫ్లవర్ షోకంటూ అపురూపంగా పెంచుతూ వచ్చిన తెల్ల గులాబీ మొక్కదమ్మా ఈ పువ్వు. నా ఏమరుపాటువల్ల ఈ తప్పు జరిగిపోయింది. బద్దకించి కాస్త కూలబడ్డానమ్మా! ఇంతలో సుడిగాలిలా వచ్చి పువ్వుని తెంపి ఇక్కడికొచ్చి పడిందా పాప. అదిగోండి - ఆపాపేనమ్మా ?" బాధపడ్తూ చెబుతున్న మాలికేసి చూసింది మిసెస్ రావ్.

"మాలీ నీకేమి పిచ్చిపట్టలేదు కదా ! నువ్వు చెప్తున్న మొక్కది పూర్తిగా తెల్లగులాబీ. మరి ఇది చూడు ఊఁ హుఁ. మనమొక్కది కాదీ పువ్వు ......"

"సుమనా ! ఎక్కడిదమ్మా ఈ గులాబీ ....." కూతుర్ని చూస్తూ అంది మిసస్ రావ్.

"నా ఫ్రెండ్ ప్రభిచ్చింది మమ్మీ ! ప్రభా .... వేరార్ యూ ....?" అటూ ఇటూ, తిరుగుతూ అంది సుమన.

సుమన ప్రక్కనే వున్న కుర్చీలోకి వాలిపోయి వుంది ప్రభ.

"అరే ఏమయిందమ్మా నీకు ..... లే ...." కుర్చీలోంచి లేవనెత్తింది ప్రభని, సుమన తల్లి.

ప్రభ గౌను మీద ఎర్రటి రక్తపు మరకలు !

గొంతు క్రిందా - నోటిమీద గీసుకుపోయిన రక్తపు గీతలు !

ప్రభ చేతిలోని తెల్లగులాబీ సంతరించుకున్న ఎర్రటి చుక్కలకు అసలు కారణం తెలుసుకొన్న సుమన తల్లికి ఆపసిదానిపై ఆగ్రహానికి బదులు ఆరాటము కల్గింది. గులాబీముల్లు గుచ్చుకున్నంత మాత్రాన పాపకెందుకు మగత కల్గాలి .... అర్థమవ లేదా మాతృ హృదయానికి.

కబురందుకున్న డాక్టర్ చిటికెలో వచ్చాడు.

ఆయన పిలువగా పెద్ద డాక్టర్లు వచ్చారు.

ప్రభ తల్లిదండ్రులూ పరుగున వచ్చారు.

"పాప మాకు దక్కేనా !"

"ఊఁ హూఁ ...." పెదవి విరిచారు డాక్టర్లు ....

ప్రభ పక్కమీద కూచొని సుమన కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది.

సుమన చేతిలో గులాబీ.

ఎర్ర చుక్కల తెల్లగులాబీ.

బాధగా రోదిస్తున్న సుమన నయనాల్లోంచి ఏకధారగా కన్నీరు.

కన్నీట క్లేదన మొందిన గులాబీలోంచి 'రక్తం' ప్రవహించి, ప్రభ ముఖంమీద పడుతోంది.

పుష్పం మళ్ళీ శ్వేతవర్ణాన్ని దాల్చింది.

ప్రభ ఈలోకాన్ని వదిలి పోయింది.

(సప్తమ జన్మదినోత్సవం నాడు, మిత్రులతో ఆనందంగా ఆడుకుంటున్న చిట్టి తమ్ముడు, సైమన్ స్మిత్ పొరపాటున గులాబీల పొదపై పడి అశువులు బాసాడు. ముళ్లు నోటిలో, గొంతులో చొచ్చుకుపోయిన కారణంగా, మెదడులోని రక్తపునాళాలలో రక్తం గూడు కట్టుకుందట. అదే ఆ పసివాడి మరణానికి కారణమన్నారు డాక్టర్లు. ఆ బాలునికి ఈ చిన్న కథానిక కన్నీటితో అంకితం- **రచయిత్రి)**

■

***(తరుణ మాసపత్రిక, జూన్ 1975)***

# ఆక్షణం

తెరమీద మధ్యవయస్సు హీరోయిన్ తన కూతురు ధరించవలసిన లంగా, ఓణీలతో ఎగురుతూంది - పుట్టలు, గుట్టలు పట్టుకొని.

లావుపాటి బొజ్జని అతి కష్టంగా బుష్ షర్ట్‌లో దాచేసి ఆయాసపడుతూ, పరుగెత్తుతున్నాడు అలనాటి హీరో.

ఆనంద పెదవుల మీద అప్రయత్నంగా చిరునవ్వు వెలిసింది. పాపం ! హీరోకి హార్ట్అటాక్ రాదుకదా యీ పరుగు పందెంలో ...... !

హీరోయిన్‌ని దొరకపుచ్చుకున్నాడు హీరో. ఇద్దరూ పొదలమాటుకి అదృశ్యమయ్యారు, సెన్సార్ కత్తెరకి అందకుండా !

ఆనంద కళ్ళు సినిమా చూస్తున్నవే కాని, మనస్సు మాత్రం మన్మధని గురించే ఆలోచిస్తూంది. ఈరోజు సినిమాహాల్లో ఇంతలా కబుర్లు చెబుతూ, నవ్విస్తూ, కవ్విస్తూ కూచున్న ఈ మన్మథ నిన్న తనతో ఎంత ఘర్షణపడ్డాడు ! ఎంత భయపడ్డది తాను ! కొండలా వచ్చిన ఆపద, దూదిలా ఎగిరిపోతుందంటారు దీన్నే కాబోలు. నిన్నటికి నిన్న ....

★ ★ ★

"ఏమండీ ! ఇలా తల పట్టుకు కూచుంటే ఎలాగండి ?" ఆప్యాదమాటలు, ఆనంద నోట్లో వుండగనే 'గంయి'మని లేచాడు మన్మథ.

"అంటే నీ వుద్దేశం, నేనేం పట్టించుకోవటంలేదనే కదూ ! సంసారం అంటే లక్ష్యం లేని చవట దద్దమ్మననే కదూ !"

"అబ్బబ్బ ! ఎందుకండీ అంతంత మాటలు ! మనమిద్దరమే అయితే ఫరవాలేదు. మనిద్దరికి ముగ్గురున్నారే ! ఎంతకాలమిలా ........... ?"

"అందుకే నేను నా వుద్యోగం ఊడిననాడే చెప్పాను - పిల్లల్ని తీసుకొని పుట్టింటికి వెళ్ళమని. నాకెలాగూ నా అన్నవాళ్ళు లేరు, కనీసం నువ్వయినా......."

"భలేవారండి మీరు ..........? ఉద్యోగం లేక మనస్తాపంలో ఉన్న మిమ్మల్ని విడిచి టింగురంగా అంటూ నేను మాత్రం వూరెళ్ళి కూచోనా ........?"

"ఈ మాట ఇప్పటికి వందసార్లు చెప్పావు. అందుకే నాతోబాటు నువ్వూ...."

"నే నెప్పటికైనా, దేనికైనా తయారేనండీ ! కానీ .... పిల్లలు ....? ఈ నెల జీతాలు కట్టక స్కూలుకి కూడ పంపలేదు కదా వాళ్ళని ....!"

"ఓహ్ ! వాళ్ళేమీ .... ఐ.ఎ.ఎస్.లు, డాక్టరీలు వెలిగించక్కరలేదులే !"

"చూడండి ! ఎన్నాళ్ళిలా ఇంట్లో వస్తువులు అమ్మి తింటూ కూచుంటాం? ఇదో, అదో అని అప్పుడే నాలుగు నెలలవుతూంది....!"

"నందా ! నన్నేం చేయమంటావో చెప్పు ? నేనూ ఉద్యోగ ప్రయత్నంలోనే వున్నాను కదా ! ఇంక అదీ, ఇదీ కాకుంటే దొంగతనానికి బయలుదేరాలి !"

"రామరామ ! ఏ మాటన్నా మీతో కష్టమే వచ్చిపడింది. అయినా బంగారం లాంటి ఉద్యోగాన్ని వొదులుకొని .."

"అదిగో! మళ్లీమొదటికొస్తున్నావ్ ! ఉద్యోగం బంగారమో, వెండో నాకు తెలీదనుకున్నావా? ఆ వెధవ చేసే దగుల్బాజీ పనులన్నింటికి తలూపుతూ, అతగాడు చేసే అక్రమాలనన్నింటిని కప్పిపుచ్చుతూ, పైగా నేను పై అధికారులతో అబద్ధపు సాక్ష్యం పలకాలా ? అలా పలకనన్నానని నామీద లేనిపోని నిందారోపణలు చేసి ఉద్యోగం ఊడదీయిస్తాడా ? నా నిజాయితీ బయటపడి మళ్ళీ ఉద్యోగం రాకుండా పోతుందా .........?"

"చూడండి. మీ మట్టుకు మీరు న్యాయంగా వున్నారు. ఒకరి సొమ్ము అక్రమంగా తినడం లేదు. నిజమే, కష్టపడి కడుపు నింపుకుంటున్నారు. అంతవరకు చాలండీ మీ నిజాయితీ ! ఒకరితో మీకేం పని ?"

"ఇలా ప్రతి ఒక్క చవట అనుకొనే మన దేశమిలా తగలబడిపోతున్నది. నందా ! నీకెందుకు ..... నీవేం దిగులుపడకు ! నిన్ను కట్టుకున్నందుకు, పిల్లల్ని కన్నందుకు, మిమ్మల్ని పోషించే భారం నాది ...." చిరాగ్గా, మరింత కోపంగా మన్మథ లేచి పచార్లు చేయడం మొదలెట్టాడు.

"నేను చెప్పేది... ప్లీజ్ ...... కాస్త వినండి. ఇందాక మీరు అలా బయటకు వెళ్ళినప్పుడు రామస్వామి ...."

"ఎవరు ? ఆ గుంటనక్క రామస్వామే ! వెధవ ! వాడెందుకొచ్చాడు మళ్ళా ? నువ్వెందుకు రానిచ్చావ్ వాడిని ?"

"అబ్బబ్బ ! మీరావేశపడక నేను చెప్పేది కాస్త వినండి. మీ కంపెనీ జి.ఎమ్. పంపిస్తే వచ్చాట్ట !"

"ఊ......"

"ఆ ఫైల్లోని ఆ కాగితాలని తొలగించి వేసి, అతడుచెప్పినట్లు చేస్తే మిమ్మల్ని వేరే వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించి, అక్కడి బ్రాంచికి మేనేజర్‌ని చేసే పూచీ తనదంటూ చెప్పాట్ట ....."

"స్కౌండ్రల్ ! ఇడియట్ ! ఆ రామస్వామి గాడవన్నీ ఏకరువు పెట్టూ కూచుంటే, సావకాశంగ విన్నావన్న మాట. నీకెంత బుద్ధిలేదు నందా !"

మన్మథ కోపావేశంలో అన్న మాటలకి కొంత జడిసింది ఆనంద. కానీ, వెనువెంటనే ధైర్యం తెచ్చుకుంది.

"ఔనండీ ! అతడు చెప్పేది కరెక్టే ! ఈ ఊర్లో ఉండొద్దు మనం. వేరేచోటి కెళ్ళి నిజాయితీగా బ్రతుకుదాం. మీ జి.ఎమ్. అడిగే కాగితాలను అతగాడికి ఇచ్చిపడేస్తే మనకేం పోతుందండీ ?"

"అయ్యో ! పిచ్చి ఆనందా నీకేం మతిపోయిందా ? ఆ కాగితాల్లోనే వుంది, అతని జాతకమంతా! సంసారం కాపాడుకోడానికే అతనికి దాసోహం అవడంకన్నా, నా భార్యాపిల్లల కింత విషమిచ్చి నేనూ, నాతోపాటూ ...."

"పోనీ ఆ పనయినా చేసి పుణ్యం కట్టుకోండి. చావాలేక బ్రతకనూ లేక, రోజు రోజు చావటంకన్నా ...." దుఃఖం ముంచుకొచ్చింది ఆనందకి.

ముభావంగా కాఫీ త్రాగి బయటికెళ్ళిన మన్మథ, హుషారుగా ఈల వేసుకుంటూ వచ్చాడు, పన్నెండుగంటల ప్రాంతంలో. చేతినిండా బట్టల ప్యాకెట్లు, పూలు, పండ్లు, మిఠాయి పొట్లాలు. దిగ్భ్రమ చెందిన ఆనంద, అనుమానంగా చూచింది భర్తకేసి. మన్మథ చిరునవ్వు నవ్వాడు. పిల్లలు కొత్తబట్టల సంబరంలో పడిపోయారు. భర్తని చేరిన ఆనంద, ప్రశ్నార్థకంగా చూసింది.

"భయంలేదోయ్ ! నేనేం దొంగతనం చేయలేదు .....!"

దెబ్బతిన్నట్లు చూసింది ఆనంద.

"పిచ్చిమొద్దూ ! ఆశ్చర్యపోతున్నావెందుకోయ్ ? భార్యాపిల్లలకు అన్నం పెట్టలేని నా నిజాయితీ ఎందుకు-నన్ను కాల్చనా ! రాత్రంతా ఆలోచించాను. నువ్వు చెప్పిందే సబబనిపించింది. ప్రొద్దుటే

వెళ్ళి ఆ ఫైలులోని ఆ కాగితాలను జి.ఎమ్. ముఖాన పడేశాను. జి.ఎమ్. నన్ను మెచ్చుకున్నాడు. నా సిన్సియారిటీకి జోహారు లన్నాడు. ఇవ్వవలసిన నాలుగు నెలల జీతం ఇచ్చి, రేపటినుండే డ్యూటీలో జాయిన్ కమ్మంటూ ఆర్డర్సు, షేక్‌హేండ్ ఇచ్చి మరీ పంపాడు. ఇప్పుడు చెప్పు ! నందా ! నేను ప్రయోజకుణ్ణే కదూ !" ఆనంద చుట్టూ చేతులేసి, ముఖంలో ముఖం పెట్టి, అడిగాడు మన్మధ.

భర్త ముఖంలోకి సూటిగా చూడలేక, తప్పు చేసినదానిలా తల దించుకుంది, ఆనంద.

"చెప్పు నందా ! నీకిపుడు సంతోషంగా ఉంది కదూ !" ఆనంద వీపుమీద ముఖం రుద్దుతూ అన్నాడు మన్మధ.

మరేం మాట్లాడలేని ఆనంద తన కంటినీటితో భర్త షర్టుని తడిపింది.

"నందా ! ఊర్కో. మన కష్టాలన్నీ గట్టెక్కాయి. ఇప్పుడీ కన్నీరెందుకు ? పద మన నూత్న జీవితాన్ని స్వీట్స్‌తో సెలబ్రేట్ చేద్దాం." పిల్లల వద్దకు ఆనందని నడిపించాడు మన్మధ.

కొత్త బట్టలని, మిఠాయిని, పండ్లని పంచేసుకొని, పువ్వులని, కొత్తచీరని అమ్మకి అందించారు పిల్లలు పరమానందంగా.

హాల్లో ఇంటర్వెల్‌ని ఉద్దేశిస్తూ, గోల్డ్‌స్పాట్-స్నాక్స్ కన్పించసాగాయ్.

తనకి పరిచయమున్న ముఖాలేమైనా కన్పిస్తాయేమోనని అటూ-ఇటూ చూస్తున్న ఆనంద వద్దకు వచ్చాడు, రామస్వామి.

"ఓ .... మీరు కూడా వచ్చారే ! మీ మిసెస్ రాలేదా ... ?" అంది, చిరునవ్వు నవ్వుతూ ఆనంద.

"రాలేదమ్మా ! ఆవిడకి ఇటువంటి సినిమాలు నచ్చవ్. ఏవో పాతకాలపువి మార్నింగ్ షోస్‌కి మాత్రమే వెళ్తూంటుంది. అన్నట్టు మన్మధగారు రాలేదా ? పిల్లలేరీ ?" అన్నాడు రామస్వామి.

"అందరం కలిసే వచ్చామండి. మావారిప్పుడే అలా పిల్లల్ని తీసుకొని బయటకు వెళ్ళారు.'

"అలాగా ...... !" అంటూ రామస్వామి ఒక్క నిమిషం ఆగి, సందేహిస్తూనే, "ఆనందగారూ! నేనంతగా చెప్పి కూడ మీరు మీవార్ని ఒప్పించలేకపోయారు కదండీ ! జి.ఎమ్. అగ్గిమీద గుగ్గిలమైపోతున్నాడు. వీలయితే మన్మధగార్ని క్రిమినల్ కేసులో కూడా ఇరికించాలని చూస్తున్నాడు. కొండని తలతో ఢీకొనడం ఎందుకు చెప్పండి ?" మన్మధ దూరంగా రావటం గమనించిన రామస్వామి, మెల్లగా జారుకున్నాడు.

దిగ్భ్రాంతికి లోనయిన ఆనంద, కొంతసేపు కోలుకోలేకపోయింది. ఇంతలో భర్త-పిల్లలు రావటం, భర్త తనచేతిలో చిప్స్ ప్యాకెట్ పెట్టడం, వెంటనే సినిమా ప్రారంభం కావడం, ఇవన్నీ

క్షణంలో జరిగిపోయాయ్. సినిమాలో లీనమైపొయ్యారందరూ - ఒక్క ఆనంద తప్ప. ఆనంద మస్తిష్కంలో అనంతకోటి అనుమానాలు!

భర్త మాటలకి, రామస్వామి మాటలకి ఎక్కడా పొంతన కుదరడం లేదు. ఎవ్వరి మాట నమ్మాలి ? ఎవ్వరిమాట తోసిరాజనాలి .... ?

భర్తకేసి తదేకంగా చూడసాగింది ఆనంద, ఎవరో కొత్తమనిషిని చూచినట్లు. ఎంతో ఆనందంగ, మరెంతో ఆహ్లాదంగ వున్న తన భర్త తనకి అబద్ధం చెప్పవలసిన అగత్యమేమిటి? కానీ రామస్వామికేం పట్టింది, అసత్యమాడడానికి ..... ? తెరమీద గ్రూప్ ఫోటో పడడంతో తన ఆలోచనలకి స్వస్తి చెప్పింది, ఆనంద.

సినిమానుండి ఇంటికి వచ్చిన మన్మధ హుషారుగ పిల్లలకి అన్నం పెట్టడంలో భార్యకి సాయపడ్డాడు. పిల్లలకి సినిమా చూడకముందున్న హుషారు, సినిమా చూచి వచ్చాక లేదు; అన్నాలు తినీ-తినక మంచాలకి అడ్డం పడ్డారు.

పిల్లల భోజనాలయ్యాక, భార్యాభర్తలిద్దరూ కూచున్నారు భోజనానికి.

"ఒక కంచం చాల్లేవోయ్ !" రెండో కంచాన్ని దూరంగా తోస్తూ, అన్నాడు మన్మధ.

తలెత్తి చూచిన ఆనందకి చిలిపి నవ్వులు చిందిస్తున్న భర్త కన్పించాడు.

మన్మధ నడిపించే ఆ రసవత్తర నాటకంలో తాను కూడ పాల్గొనదలచింది ఆనంద.

"మీ ఇష్టం," అంటూ ఒకే కంచంలో వడ్డించింది.

"నందా ! ఇలా మనిద్దరం ఒకే కంచంలో తిని ఎన్నాళ్ళయిందో కదూ !" మన్మధ అందిస్తున్న అన్నం ముద్దని చేతిలోకి తీసుకొని మనోహరంగా నవ్వింది, ఆనంద.

తనో ముద్దచేసి, భర్తచేతికందించింది, ఆనంద.

"అబ్బ ! ఎంత రుచిగా వుందీ పూట నీ వంట !" అంటూ, మన్మధ ఆనందని కవ్విస్తూ భోజనం పూర్తి చేశాడు.

ఆనంద వంటిల్లు సర్ది, పడుకునే గదిలోకి నడిచింది. లోనికి వెళ్ళిన ఆనంద ఓ క్షణం నివ్వెరపోయి నిలబడిపోయింది. పక్కమీద తెల్లటి దుప్పటి పరిచి వుంది. వాటిమీద మల్లెలు విరిసి సువాసనలు వెదజల్లుతున్నాయ్. మల్లెల సువాసనలకు తోడు సుగంధ శృంగార పరిమళాలు, ఆశ్చర్యచకితయై గదిని పరికిస్తున్న ఆనందకేసి, ఆనందంగా చూశాడు మన్మధ.

"రా, నందా ! అలా నుంచున్నావేం ? పదేళ్ళనాటి మన తొలిరేయి గుర్తొచ్చిందా ? అప్పటిలాగే-ఇప్పుడూ మంచం దగ్గరికి నడిపించాలా ?" మన్మధ మాటలకి నవ్వొచ్చింది ఆనందకి. అయోమయంగానే భర్త చెంతకి నడిచింది ఆనంద.

దరి చేరిన అర్ధాంగిని అత్యంత తమకంతో హృదయానికి చేర్చుకున్నాడు మన్మధ. ఊపిరి సలపలేనంత ఉద్వేగంతో వూగించాడు. భర్త ఉధృత ప్రణయంలో కొట్టుకపోయిన ఆనంద మనస్సు-శరీరం, ఆనందంతో మూగవోయాయి .........

ఆదమరచి నిద్రపోతున్న భర్తకేసి చూస్తూ అలాగే పడుకుంది ఆనంద. భర్త ప్రవర్తనని, పల్కులని చేష్టలని అర్థం చేసుకోలేక, ఇదమిత్థమని సమన్వయపరచుకోలేక, ఆనంద బుర్ర పగిలిపోసాగింది. ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టడం లేదు ఆనందకు. కళ్ళు మూసుకొని పడుకున్న ఆనంద నిద్రాదేవి ఒడిలోనికి జారుకునేటప్పటికి, మన్మధ, మంచంమీద నుంచి జారుకున్నాడు.

ఏదో శబ్దానికి ఉలిక్కిపడి ప్రక్కకి తిరిగి చూచింది, ఆనంద. తన ప్రక్కన భర్త లేడు. గబుక్కున లేవబోయిన ఆనంద గదిలో ఒక మూలవంగి, సూట్‌కేసు లోంచి ఏదో బయటకు తీస్తున్న భర్తను చూచి ఆగిపోయింది. భర్త దృష్టిలో పడకుండా, అలాగే పడుకొని, భర్త చేష్టలని గమనించసాగింది.

సూట్‌కేస్‌లోంచి అట్టపెట్టె నొకదాన్ని బయటకు తీసాడు మన్మధ. అందులోంచి ఇంజెక్షన్‌ని సిరంజిని తీసి టేబిల్‌పై పెట్టి మంచంకేసి చూశాడు. వెంటనే కళ్ళు మూసుకొని నిద్రనభినయించసాగింది ఆనంద.

సిరంజిలోకి మందును ఎక్కించి మళ్ళీ భార్యకేసి చూశాడు మన్మధ. పాపం ఆదమరిచి నిదురోతోంది, ఆనంద అనుకున్నాడు. లేచి, పిల్లలున్న గదికేసి నడువబోయాడు. మళ్ళీ ఏమనుకున్నాడో ఏమో ఆ ప్రయత్నం విరమించాడు. ఓ మారు సిరంజికేసి చూచి మెల్లగా ఆనందపడుకున్న మంచంవేపు నడిచాడు.

ఉలిక్కిపడింది ఆనంద మన్మధని చూచి. ఇదేంటి ? ఈయన ముఖం ఇంత వికృతంగా వుంది ? ముఖం నిండా ఆ చెమటేంటి ? ఎందుకలా వణకి పోతున్నాడు ! చూద్దాం ! ఏమవుతుందో! అని మళ్ళీ నిద్ర నభినయించింది, ఆనంద.

ఆనంద ముఖంకేసి దీర్ఘంగా చూచి, గబుక్కున వంగి ఆమె చేయి అందుకున్నాడు మన్మధ.

భర్త చెయ్యి తనమీద పడగానే చివ్వున లేచి కూచుంది ఆనంద. అదిరిపోయాడు మన్మధ. ఒక్కడుగు వెనక్కి వేశాడు.

"ఏవిటి మీరు చేస్తున్న పని ..... ?" ప్రశ్నించింది ఆనంద. జవాబు చెప్పటానికి తటపటాయించాడు మన్మధ.

"చెప్పండి ! ఎందుకిస్తున్నారు, నాకీ ఇంజక్షన్ ? నాకేం జబ్బు చేయలేదే !"

ఈమారూ సమాధానం చెప్పలేదు మన్మధ. అతనిచేయి మాత్రం వణకసాగింది.

"ఏమండీ ! నా ముఖం చూచి నిజం చెప్పండి. ఆ సిరంజిలో వున్నది విషం కదూ !"

పట్టుబడిపోయినట్లు తలవంచుకున్నాడు మన్మధ.

"మీరెంతపనికి సిద్ధపడ్డారండి ! కట్టుకున్న భార్యకే విషమిచ్చి చంపాలన్న సత్సంకల్పం! పోనీ, అదీ మంచిదే ! భర్త చేతుల్లో మరణించడం కన్న భార్యకి కావలసినదేమున్నది ? కానీ, నన్ను

చంపి మీరు పొందగోరే లాభమేమిటి ? నాపేర ఇన్స్యూరెన్స్ లేదే ! నాపేర ఏ ఆస్తిపాస్తులు లేవే !!"

• "నందా ! నందా !!" గట్టిగా అరిచాడు మన్మధ.

"ప్లీజ్ చెప్పండి ! నేను చనిపోవడమే మీ కోరికయితే, ఇదో ఇప్పుడే ఇంజక్షన్ చేసుకొని సంతోషంగా చచ్చిపోతాను. కాని, మీరు పిల్లలు సుఖంగా బ్రతుకుతామని మాత్రం మాట యివ్వండి." చెయ్యి చాపుతూ, ధృఢ నిశ్చయంతో అంది ఆనంద.

"నందా ! ఆనందా !! నన్నెంత అపార్థం చేసుకుంటున్నావ్ ? నువ్వు చనిపోయాక నేను, పిల్లలు బ్రతికుంటామనే నీ ఉద్దేశ్యమా ? నీతోపాటే మేమూ .....!"

"అంటే అందరికీ ఇలాగే విషపు ఇంజక్షన్లు ఇచ్చి చంపేస్తారన్నమాట !"

దానికేం సమాధానంలేనట్లు చూశాడు, మన్మధ.

"ఎంత పనికి ఒడిగట్టారండీ ? కుటుంబాన్ని పోషించలేక ఈ నిర్మూలన పద్ధతికి దిగజారారన్నమాట ! హుఁ ఇటువంటి అఘాయిత్యానికి తలపెడతారని రాత్రి సినిమాహాల్లోనే ఊహించవలసింది. కాని, అంతదూరం ఆలోచించలేకపోయాను."

"హూ....( అప్పు తెచ్చి ...... ! అలా ఎన్నాళ్ళు ? ఒకని దగ్గర తలవంచి, దేహీ ! అని చేయిచాపడంకన్న, ఒక్కసారి అందరం చనిపోవటమే మేలనే ఈ నిశ్చయానికి వచ్చాను. నాకు బి.ఎ లో వచ్చిన బంగారు పథకాన్ని తెగనమ్మాను. పిల్లలకు పిడికెడు అన్నం పెట్టలేని ఆ గోల్డ్‌మెడల్, కనీసం ప్రశాంతంగా కనుమూయడానికైనా ఉపయోగపడితే మేలనుకున్నాను. ఆనందంగా నిద్రపోయిన నా పిల్లలు ఆనందంగానే మరణిస్తారు. నందా ! ప్లీజ్ ! నిన్ను వేడుకుంటాను. నాతో సహకరించు, నా మనస్సాక్షిని చంపుకొని నేనో క్షణమైనా బ్రతకలేను. నన్ను నమ్ముకున్న మిమ్మల్ని, నడివీధిలో అనాథలుగ వదలలేను. అందుకే నాతోబాటు మీరూ !"

ఎవరో కొత్తమనిషిని చూచినట్లు చూసింది, ఆనంద.

"అంటే మనమందరం చనిపోవడమే దీనికి పరిష్కారమా ?"

"అంతకన్న ఇంక వేరే మార్గం లేదు. నేను లేక నువ్వు లేవు. మనిద్దరం లేక పిల్లలు లేరు. ముందు పిల్లలకి ఇంజక్షన్ యిచ్చి ఆ పిమ్మట మనిద్దరం ఒకేమారు ఇంజక్షన్ చేసికొని ఒకరిచేతుల్లో ఒకరం ......"

మన్మధ చేతుల్ని విదిలించి లేచి, నుంచుంది, ఆనంద.

ఆనంద ముఖంలో అంతులేని గంభీరత.

ఇంత చదువులు చదివి, ఎంతో జ్ఞానం, అనుభవం సంపాదించిన మీరు కేవలం బ్రతుకుతో పోరాడలేక పిరికిపందలాగ పారిపోవడమా .....?"

"నువ్వెలాగయినా భావించుకో!నా కనవసరం. నా తుది నిశ్చయం, నిర్ణయం మారదు."

"అంటే ! మీరు చనిపొమ్మనగానే మేము మీ ఆజ్ఞను శిరసావహించాలా ?"

దెబ్బతిన్నట్టు చూశాడు, మన్మధ ఆనందకేసి -

అదే నిశ్చల గంభీరత ! ప్రళయానికి ముందు కనిపించే ప్రశాంతత !!

"ఓహో ! మిమ్మల్ని చంపే అధికారం నాకు లేదన్నమాట. నీమీద లేదేమోకాని, నేను జన్మనిచ్చిన నా పిల్లలమీద నాకున్నది అధికారం !" ఒక విధమైన ఉన్మాదం చోటు చేసుకున్నది మన్మధలో.

విరక్తిగా నవ్వింది నందా ! మళ్ళీ మళ్ళీ నవ్వింది !

"మీరు జన్మనిచ్చిన మీ పిల్లలు ! బాగుంది ! ఫలానా రోజున ఫలానా బుల్లిబాబును కంటున్నాను - అన్న దృఢనిశ్చయంతో కన్నారా ? కేవలం మీ ఆనంద సమయంలో మీ ప్రమేయం లేకుండా ఆవిర్భవించిన జీవులండీ అవి."

ఆనంద మాటలకి మరొక్కమారు అదిరిపోయాడు, మన్మధ. వెనువెంటనే చెప్పలేనంత కోపం ముంచుకొచ్చింది.

"ఈ వితండ వాదాలు నా కనవసరం. నేను చెయ్యదల్చుకుంది తప్పక చేసి తీరుతాను."

గబగబ పిల్లలున్న గదిలోకి నడిచాడు, మన్మధ.

సుడిగాలిలా ముందుకు సాగిన ఆనంద, పిల్లలకి భర్తకి మధ్య నిలబడ్డది. ఆవేశంతో వూగిపోతూ, విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయిన భర్త కాళ్ళపై పడిపోయింది. పండుటాకులా వణకిపోతూ, బావురుమంది.

"ఏమండీ ! ఒక్కమారు, ఒకే ఒక్కమారు, ఆ పసికందులకేసి కన్నెత్తి చూడండి. వాళ్ళేం పాపం చేశారని వాళ్ళ చిరులేత జీవితాలిలా అర్ధాంతరంగా అంతరించాలి ? కవిత, గీతలు ఇద్దరూ నా రెండు కళ్ళు - అని వాళ్ళని నెత్తిమీద కెక్కించుకునేవారే! మీరేనా వాళ్ళ కళ్ళని శాశ్వతంగా మూసివేసేది !! ఆదమరచి నిదురోతున్న ఈ పసికందులకు విషం ఎలా ఇవ్వగలరండీ ........? మీరు నిజంగా మనుషులేనా .........? మీదీ నిజంగా హృదయమేనా .......?" భార్య బరువైన మాటలు వింటూ చేష్టలుడిగి నిలబడ్డాడు, మన్మధ.

భర్త మౌనాన్ని ఆసరాగా చేసికొని, ఆనంద గబగబ లేచి పిల్లల్ని నిద్రలేపింది. సగం నిద్రలో లేచి, లేఏక మత్తు మత్తుగ తల్లిదండ్రులకేసి చూడసాగారు, పిల్లలు.

"ఆనందా ! ఎంత పని చేశావు ? కన్నబిడ్డల ఎదుట దోషిగా నిలబెట్టావా

నన్ను ........?" గిరుక్కున వెనుతిరిగి గదిలోకి వెళ్ళిపోయాడు మన్మధ. అతని వెనువెంటనే పరుగెత్తిన ఆనంద, మన్మధ గది తలుపులను బంధించనీయకుండ అడ్డుపడింది.

"వదులు, ఆనందా ! నిన్నుకాని, పిల్లల్ని కాని నేను చంపను, చంపలేను. ఆ హక్కు నాకు లేదని నువ్వేగా నిరూపించావ్. అసమర్థుడనైన నేను ఈ ప్రపంచంలో బ్రతకను, బ్రతకలేను, బ్రతకకూడదు ...." రోషావేశం ముప్పిరికొంటూన్న భర్త చేతిలోని సిరంజిని బలవంతంగా లాగి నేలకేసి కొట్టింది, ఆనంద.

ఆదిశక్తివలె నిలబడిన ఆనందకేసి, బ్రద్దలయిన సిరంజికేసి చూడసాగాడు మన్మధ.

ఆవేశం దిగిపోయిన మన్మధ మంచం మీద జారగిలబడి రోదించసాగాడు. భర్తని అనురాగంతో తన ఒడిలోకి తీసుకుంది ఆనంద. తల్లిలా తన ఎదపై భర్త తలని చేర్చుకుంది.

"మీరు జీవన్మృతులు కారండీ ! మృత్యుంజయులు కావాలి. భగవంతుడు మనకిచ్చిన అమూల్యమైన వరాలండీ మన ఈ జీవితాలు. నీటిని అర్ధాంతరంగ అంతరింపజేసే అమానుష కృత్యాలను మనం చేయకూడదండీ ! కష్టాలు వచ్చినప్పుడే వాటికి ఎదురొడ్డి నిలబడాలి. చనిపోవటమే కష్టాలకి పరిష్కారమైతే రోజు కెంతమంది చనిపోవాలి ? అవిటివారు, దీర్ఘరోగులు, అన్నాహారాలకి అలమటించే అనాధలు - అభాగ్యజీవులు ఎందరో - ఎందరెందరో ధైర్యంగా బ్రతుకులు కొనసాగిస్తూ వుంటే - మీరు .... కేవలం ...."

"నందా ! ఇవన్నీ నేను ఆలోచించలేదనుకున్నావా ? ఆలోచించి ఆలోచించి నా బుర్ర బ్రద్దలయింది. ఇంతకన్న మార్గం నాకు కన్పించలేదు ..." భార్య పరిష్వంగంలో సేదతీరిన మన్మధ కొద్ది కొద్దిగా మామూలు స్థితికి వస్తున్నాడు.

"నిజంగా మీకు ఈ ఉద్యోగం చెయ్యడం ఇష్టం లేకుంటే, ఈ ఉద్యోగమే కాదు - ఈ ఊర్నే వదిలి అజ్ఞాతంగా ఎక్కడయినా బ్రతుకుదాం. కాళ్ళుచేతులు ఇచ్చాడు భగవంతుడు. కొద్దో-గొప్పో చదువుకున్నవాళ్ళమే ఇద్దరం. ఎలాగో బ్రతక్కపోము."

"అవన్నీ నువ్వనుకున్నంత సులభం కాదు నందా ......!"

"అంటే అన్నిటికన్న సులభం చంపడం - చనిపోవడం అన్నమాట ...."

"నందా !" బాధగా చూశాడు మన్మధ.

"చూశారా ! 'చంపడం' - ఈ మాటంటేనే మీ కెంత బాధగా వుందో ! మీరు మామూలు మనిషయ్యాక, మీ మనస్సు మీ స్వాధీనంలోకి వచ్చాక చీమను కూడా చంపలేరండీ ! ఆ క్షణం, ఆ ఘోరనిశ్చయానికి మిమ్మల్ని వుసికొల్పిన ఆ భయంకర క్షణం దాటి పోయిందండీ !" భర్త తలని మరింత గట్టిగా హృదయానికి హత్తుకుంది ఆనంద.

■

***(యువ మాసపత్రిక, ఆగస్టు 1978)***

# కన్నతల్లి

అందంగా, మరెంతో సుందరంగా, రంగు రంగుల కాంతులీను దీపాలతో ముచ్చటగొల్పే బెలూన్లతో, మనోహరమైన రంగు కాయితాలతో అలంకరింపబడిన ఉయ్యాలలో ముద్దుగ పవ్వళించింది బాలసారె పాపాయి - అదే ఆనందరావు సునీతల కడుపు పంట. మెత్తగ పవ్వళించి, అలవోకగ నవ్వుకుంటూంది. ఆ నవ్వుకు పరవశిస్తూంది సునీత. తన ముద్దుల మురిపాన్ని చూచి ఆనందరావు పితృగర్వంతో తిరగేస్తున్నాడు ఇల్లంతా. ఆహూతులు రావడం మొదలెట్టగానే మరింత బిజీ అయిపోయాడు.

"హలో, హవ్ డుయుడూ, గ్లాడ్ టు సీయూ, హాయ్, కమిన్, ఇలా రండి. థాంక్యూ" అన్న కేకలతో ఆ ప్రదేశం మార్మోగిపోతూంది.

"సునీ ! హవ్ స్వీట్ !" అంటూ, ఊయలలోకి వొంగి చూచింది ఊర్మిళ.

ఊయల కుదుపుకి ఉలిక్కిపడి కనుతెరిచిందా పాప !

"ఊర్మిళా ! పాప నా పోలికే కదూ !" ఆసక్తిగా అడిగింది సునీత.

"వేర్ ఈజ్ ది డాట్ ? షి ఈజ్ జస్ట్ లైక్ యూ" అంటూ చేతులూపుకుంటూ వచ్చిందో నెలవంక. ఆవిడ స్టేట్స్ నుంచి వచ్చి ఇంకా నెల కూడ దాటలేదు. తెలుగు దాదాపు మరచినట్లే లెక్క.

తృప్తిగ పాపాయివంక మరొక్కమారు ప్రేమగ చూచింది సునీత.

"అబ్బ ! ఎన్నాళ్ల కెన్నాళ్లకి నీ కోర్కె తీరింది సునీతా ! ఆశలన్నీ వదులుకున్నావు కదే !" ప్రాణ స్నేహితురాలు విమల మాటలు కంటకప్రాయంగ తోచాయి సునీతకి. అయినా ఏం మనుష్యులు ! ఔచిత్యం తెలీకుండ మాట్లాడుతారు ! ముఖం చిట్లించింది సునీత.

"అదేంటమ్మా సునీతా ! బాలెంతరాలివి. కాళ్లకి చెప్పులు, చెవులో దూది లేకుండ అలా తిరిగేయడమే ....?" మాణిక్యాంబ మందస్వరాన మందలించింది సునీతని.

"ఆ ............. ఈ కాలంలో కూడ ఇటువంటి ఛాదస్తాలేంటండీ ! అదే - స్టేట్స్‌లో అయితేనా ..." నెలవంకగారి స్టేట్స్ కబుర్లతో చెవులు త్రుప్పడిపోయిన శ్రోతలు నిస్సహాయంగ రక్షణ కోసమా అన్నట్లు సునీత కేసి చూసారు. "ప్లీజ్ .... ఇటు రండి" అంటూ నెలవంకని టేబిల్ వైపు నడిపించింది సునీత. రిఫ్రెష్‌మెంట్స్‌తో నిండిన టేబిల్‌ని చేరిన నెలవంక యింక బిజీ అయిపోయింది.

పాపనే తదేకంగ చూస్తూ నిలుచున్న వినత తను తెచ్చిన ప్రెజంట్‌ని ఊయెలలో పెట్టి ఇటు తిరిగి నెమ్మదిగా నిశ్వసించింది. ప్రక్కన నిల్చున్న సునీత భుజం మీద చేయి వేసి "కంగ్రాట్యులేషన్స్ సునీతా, యూ ఆర్ రియల్లీ వెరీ లక్కీ" అంది.

"థాంక్యూ" అంటూ గర్వంగా నవ్వింది సునీత.

"సునీతా ! నువ్వేమీ అనుకోకుంటే నాదొక చిన్న రిక్వెస్ట్" అంది వినత.

"గో అహెడ్" అన్నట్లు చూచింది సునీత.

"నీకు డెలివరీ చేసిన డాక్టరు పేరు చెప్తావా ? నేను కూడ వెళ్లి కన్సల్ట్ చేస్తాను" అంది, వినత.

ఒక్క క్షణం కలవరపడ్డది సునీత, కాని వెంటనే తేరుకొని "ఓ ! యస్ ! దానికేం అలాగే చెప్తాను" అంటూ ఎవర్నో రిసీవ్ చేసుకోవడానికి గబగబ ముందుకు నడిచింది సునీత.

"ఎంతైన సునీత అదృష్టవంతురాలు. పిల్లని కన్న ఆయాసం ఇంతయినా లేదు కదా ! సులువుగ, ఎంత హాయిగ తిరిగేస్తూంది. మా కాలంలో అయితేనా మేము మూడు నెలలు బాలింతరాలి మంచం దిగేవారమే కాదు" మాణిక్యాంబ ఇంటింటి ముచ్చట్లు మళ్ళీ మొదలు.

వీళ్ల మాటలన్నిటినీ అడ్డగిస్తూ పెద్దగా ఏడ్పు లంకించుకుంది, అద్దాలలోని అందాల బాల. పాప రోదనకి ఒక్క ఉదుటున పరుగెత్తుకొచ్చింది సునీత. గబ గబ చేతుల్లోకి ఎత్తుకోబోయింది. కాని అప్పటికే ఊయలని చేరిన సునీత పనిమనిషి లక్ష్మి పాపాయిని సందిట్లోకి తీసుకుంది. లక్ష్మికేసి ఒక్కక్షణం చూచింది సునీత. ఏమనుకుందో పాపాయిని ఆమెకే ఇచ్చింది.

"బేబీ జాగ్రత్త !" అంటూ, నాప్‌కిన్‌ని అందించింది.

లోపలికి నడిచింది లక్ష్మి, పాపాయిని పదిలంగ పట్టుకొని.

"అదేంటి సునీ ! మీ లక్ష్మి అంత నీరసంగా వుంది. ఒంట్లో బాగోలేదా ?" అంది వినత, వెళ్తున్న లక్ష్మినే చూస్తూ.

"ఆ .... ఆ.... ఈ మధ్య ఏదో సుస్తీ చేసింది. మాతోబాటు బాంబేకి వచ్చిందిగా ! అక్కడి నీళ్లు పడలేదు" అంది సునీత.

"ఆహా ! అలాగా !" అంది వినత.

"సునీతా !" అంటూ హడావిడిగ వచ్చాడు ఆనందరావు.

"ఏంటండీ ?" అంటూ, ఎదురేగింది సునీత.

"చూడు ! డా. సంజయ్ చోప్రా వచ్చారు. బేబీ ఏదీ ?" అంటూ ఊయలలోకి వంగాడు.

"ఆకలికి ఏడుస్తూంటే ఇప్పుడే లక్ష్మి పాలు పట్టడానికి తీసుకెళ్లింది." భర్త వెనకాలే నడిచింది సునీత డాక్టరుగార్ని రిసీవ్ చేసుకోవడానికి.

"ఇదేం మాయదారి కాలంరా నాయనా ! నెలయినా నిండని పసిగందుకి పాలు పట్టాల్సింది కూలి మనిషా ! కన్నతల్లి కామాత్రం తీరుబడి లేదూ ! ఔన్లే అందం, సోయగం తరిగిపోవూ ..." సన్న సన్నగ గొణుక్కుంటూంది మాణిక్యాంబ.

"అందం చెడిపోతుందనే కాదులే; ఈవిడగారి సోషియల్ ఆక్టివిటీస్‌కి, తిరుగుళ్లకి ప్రతిబంధకం అని కూడ పాలివ్వడం మానేసి వుంటుంది. ఏం, మనిషిరా బాబూ !" మనస్సులోనే తిట్టుకుంది ఊర్మిళ.

"అదే నేనయితేనా ..... ! ఇన్నాళ్లకు పుట్టిన అనుంగు శిశువును అహర్నిశలూ ఎదకానించుకోనూ .....!" తన్మయంగా కళ్లు మూసుకొని, అప్పుడే నిరాశగా కళ్లు తెరిచింది వినత.

పదిలంగ, మరెంతో జాగ్రత్తగ, పాపాయిని తెచ్చి ఉయ్యాలలో పడుకోబెట్టింది లక్ష్మి. కడుపునిండ పాలు త్రాగిన పాపాయి హాయిగా నిద్రపోతూంది. అలాగే ఆసక్తిగా అందర్నీ చూస్తూ నిల్చుండిపోయింది లక్ష్మి.

"ఊ ..... నీకేం పని ఇక్కడ ? లోపలికెళ్లి ఏర్పాట్లన్నీ చూడు, ప్లేట్లన్నీ కడిగి రెడీ చేయమని శామ్యూల్‌కి చెప్పు" అంది, సునీత కటువుగ.

వెంటనే వెనుదిరిగిన లక్ష్మి అప్పుడే గదిలోకి ప్రవేశిస్తున్న డాక్టర్ సంజయ్‌ని చూచి, ఒక్క క్షణం - ఒకే ఒక్క క్షణం - ఆగి మళ్లీ వెంటనే ప్రక్కకి తప్పుకొని లోపలికి వెళ్లిపోయింది.

"హవ్ ఈజ్ మై స్వీటీ ?" అంటూ పాపాయి బుగ్గలు ఒక్కమారు నిమిరి, ఆనందరావు వెంట డైనింగ్ టేబిల్ దగ్గరకు నడిచాడు డాక్టర్ సంజయ్ చోప్రా. ఆహూతులకన్నా ఎక్కువ అయిటమ్స్ వున్నాయా అన్నంత భ్రమ కల్గిస్తూంది డైనింగ్ టేబిల్. ఎవరికి నచ్చింది వాళ్లు ప్లేట్లలో పెట్టుకొని తమ ఫ్రెండ్స్‌తో కుర్చీలలో సర్దుకుంటున్నారు.

"పాప పుట్టినందుకే ఇంత ఆర్భాటం చేసారు .......... ! ఇక పాప పెళ్లి కెంత అట్టహాసం చేస్తారో .........?" ఊర్మిళ మాటలకు ఫక్కున నవ్వారు వినత, వినోదిని, కౌసల్య.

'ఔను మరి ! ఇక పిల్లలు పుట్టరు అనుకున్న తరుణంలో ఆపద్బాంధవుడులాగ వచ్చాడట కదా, ఈ డాక్టర్ సంజయ్ చోప్రా యు.కె. నుండి.

"ఔనౌను ! సునీత ఫాలోపియన్ ట్యూబులు రెండు మూసుకుపోయాయి. ఇక పిల్లలుపుట్టే అవకాశమే లేదన్నారట డాక్టర్లు. కాని ఈ డాక్టరు అదేదో సరిక్రొత్త ప్రయోగాలు చేసారట కదా ...." దాదాపు ఏడాది బాంబేలోనే వుండి పోయారుగా సునీత." వినోదిని మాటల్ని అత్యంత శ్రద్ధగా వినడం మొదలెట్టింది వినత.

"ఔను నేనూ విన్నానామాట ! సునీత గర్భంలో నుండి అండాన్ని వేరుచేసి, సునీత భర్త వీర్యంలోని పురుష కణాలతో కల్పి సైంటిఫిక్‌గ ఒక టెస్ట్‌ట్యూబ్‌లో గర్భధారణ గావించారట. అంటే తల్లి గర్భంలో కాక టెస్ట్‌ట్యూబులోనే ప్రాణం పోసుకుంటుంది శిశువు. తర్వాత మళ్ళీ గర్భాశయంలోకి చేర్పిస్తే తొమ్మిది నెలలకి పరిపూర్ణ శిశువుగ మారి బాహ్య ప్రపంచంలోకి వస్తుందట. అలా వచ్చిన పాపాయే ఈ పాపాయి" ఊర్మిళ మాటలకు తెరచిన నోరును మూయడం మరచింది మాణిక్యాంబ.

"ఏమిటేమిటి ? తల్లి గర్భంలో కాక బయట శిశువు ఏర్పడుతుందా ? ఇదేం విడ్డూరమమ్మా ....." బుగ్గలు నొక్కుకుంటున్న మాణిక్యాంబని చూచి నవ్వారు వినత, వినోదిని తదితరులు.

"ఔనండి మామ్మగారూ ! సునీతగారి పాపాయిని టెస్ట్‌ట్యూబ్ బేబీ అని కూడ అంటారట!

నేను కూడ అలాగే పాపని కనాలని వున్నాను." వినత మాటలకి మరింత విస్తుపోయి, అవాక్కయి కూచుండిపోయింది, మాణిక్యాంబ.

భుక్తాయాసం తీరిన అతిథులు నెమ్మదిగా ఇల్లు చేరే ప్రయత్నంలో పడడం గమనించి ఆనందరావు, "ఒక్కక్షణం. అందరు కాస్సేపు ఆగండి. మా చిరకాల వాంఛితాన్ని నెరవేర్చి, మాకొక నూతన జీవితాన్ని, బ్రతుకులో ఒక ప్రయోజనాన్ని ప్రసాదించిన డా. సంజయ్ చోప్రా గార్కి మేము ప్రేమతో, కాదు, కాదు కృతజ్ఞతతో ఈ చిన్న కానుకను సమర్పించు కుంటున్నాము" అని మడిచిపెట్టిన ఒక చిన్న కాయితాన్ని డాక్టర్ చేతిలో పెట్టి షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. సునీత వినమ్రతతో డాక్టరుగార్కి నమస్కరించింది. డాక్టర్ కాయితాన్ని తెరచి చూచాడు. పదివేల రూపాయలకి డ్రాఫ్టు అది. ఆనందరావుకేసి చూచి, "మిస్టర్ ఆనందరావ్! నేను మీ కేసును చేపట్టింది కేవలం నా ఇంట్రెస్ట్‌కొద్ది. మీరు నాకిచ్చిన మొత్తం చాలా పెద్దది" అన్నాడు డాక్టర్ చోప్రా.

"అలా అనకండి డాక్టర్! ఏదో మా తృప్తి కోసం మీరు స్వీకరించాలి" దాదాపు ప్రాధేయపడ్తున్న దంపతులకేసి ఒక్కమారు చూచి "ఆల్‌రైట్" అంటూ, ఆ చెక్కును అందుకున్నాడు డా. సంజయ్ చోప్రా. చెక్కుని వెనక్కి తిప్పి గబగబ ఏదో రాసాడు.

అదే గదిలో దూరంగా ఎటో చూస్తూ నిరాసక్తగా నిలుచున్న లక్ష్మికేసి నడిచాడు డాక్టర్ సంజయ్. డాక్టర్ తన దగ్గరికి రావడం చూచి ఒక్కడుగు వెనక్కి వేసింది లక్ష్మి. లక్ష్మి చేతిని అందుకొని అందులో ఆ డ్రాఫ్టును వుంచి ఇటు తిరిగాడు డాక్టర్ సంజయ్.

"డాక్టర్ ....... !" అన్నాడు ఆనందరావు.

"యస్ ! మిస్టర్ ఆనందరావు ... ! ఈ పైకం ఆమెకే అందుతుంది. షి ఓన్లీ డిజర్వ్స్ దట్ అమౌంట్" అంటూ గబగబ బయటికి నడిచాడు డా. సంజయ్.

చేష్టలుడిగి నిల్చున్నారు ఆనందరావు దంపతులు.

జరుగుతున్నదేమిటో అర్థంకాని ఆహూతులు అయోమయావస్థలో పడిపోయారు. కాని పదివేల రూపాయలతో నిలబడిపోయిన లక్ష్మి హృదయం బాధతో అలమటించింది.

తన బీదతనాన్ని, అశక్తతను ఆలంబనగ చేసికొని ఆనందరావు దంపతులు శిశువు కొరకు తన రక్తమాంసాలని వినియోగించుకున్నారు. ఇంతెందుకు ? ఆనందరావు దంపతుల టెస్ట్‌ట్యూబ్ బేబీని తన గర్భంలో నవమాసాలు మోసి కనింది. కాని తనకేం హక్కున్నదా గర్భస్థ శిశువుపై .........? ఆనందరావు దంపతుల నోముల పంట ఆ పాప ! చెక్కుచెదరని శరీర సౌందర్యంతో తల్లి కాగల్గింది సునీత ! కాని తనో ! తల్లియై యుండి కూడ తను కన్నబిడ్డకు కనీసం కన్నతల్లి అని కూడ చెప్పుకోజాలని అశక్తురాలు !!!



*(ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 4-5-1979)*

# నాదే అదృష్టం

అందమైన తన కళ్ళని చక్రాల్లా తిప్పుతూ తెగ కబుర్లు దంచేస్తోంది ప్రణతి. భుజానికి వ్రేలాడుతున్న సంచీని పదే పదే పైకి లాక్కుంటూ ప్రణతి కబుర్లకి తలూపేస్తోంది తన్మయత్వంగా అనుపమ.

విమానంలాంటి కారు బుర్రున దూసుకొచ్చి నెచ్చెలులిద్దరి సమీపంలో ఆగింది.

"హాయ్ మమ్మీ! డాడీ కూడా వచ్చారా...!" ఎగురుతూ కారుకేసి పరుగెత్తింది ప్రణతి.

"మున్నీ! మీ ఫ్రెండ్ని కూడా పిలవమ్మా. మనింటి దగ్గరేగా వాళ్ళిల్లు." చెప్పింది కూతురుకే అయినా పర్మిషన్ కోసరం భార్య వంక చూశాడు ప్రణతి తండ్రి. తన షార్ట్ హేర్ని అటూ - యిటూ వూపి పర్మిషన్ గ్రాంట్ చేసింది ప్రణతి మమ్మీ.

"అనూ! కమాన్...!" అంటూ కార్లోంచి ఒక్క దూకు దూకి అనుపమ చేతిని పట్టి లాగింది ప్రణతి.

"వద్దు ప్రణతీ! మా రిక్షా అబ్బాయి వస్తాడుగా! తమ్ముణ్ణి కూడ వెంట తీసికెళ్ళాలిగా" అంది అనుపమ.

"ఓకే..." కార్లోకి గెంతుతూ అంది ప్రణతి.

దుమ్ము లేపుకుంటూ పోతున్న కారుకేసి చూస్తూ నిల్చుంది అనుపమ. దూరం నుంచీ బెల్ మ్రోగించుకుంటూ వస్తున్న రాములు రిక్షాని చూచిన అనుపమ ముఖం మరింత ముడుచుకుపోయింది.

"రా పాపా! ఇంకా చిన్న స్కూలు కెళ్ళి బాబుని తీసికెళ్ళాలి. ఇప్పటికే ఆలస్యం అయింది." రిక్షావాడి అదిలింపుతో అయిష్టంగానే రిక్షా ఎక్కింది అనుపమ.

ఇంద్రభవనం లాంటి ప్రణతి యింటి ముందునుంచి సాగింది అనుపమ రిక్షా. అమ్మో! ఎంత పెద్దదో గార్డెన్. ఎన్నెన్ని చెట్లో! పూలమొక్కలు ఎంత బాగున్నాయ్-! "అక్కా! మనం

సాయంత్రం మీ ఫ్రెండ్ వాళ్ళింటికెళ్ళి ఆడుకుందామే! వాళ్ళ తెల్లబొచ్చు కుక్క ఎంత బాగుందో! దాన్ని చూస్తే నాకసలు భయమేలేదు. కరవనే కరవదు" ఉత్సాహంగా అడుగుతున్న తమ్ముడికేసి చూచి, "అలాగే" అన్నట్లు తలూపింది అనుపమ.

"అమ్మా! ప్రణతి వాళ్ళిల్లు ఎంత బాగుంటుందని! వాళ్ళింట్లో అసలు గచ్చే కన్పించదమ్మా. మెత్తగా కార్పెట్ పరిచి వుంటుంది ఇల్లంతా. మనం కూడా కార్పెట్ వేయించు కుందామా!" ప్రణతి వాళ్ళింటికి వెళ్ళి వచ్చినపుడల్లా కూతురు యిటువంటి కబుర్లే బోలెడు చెప్తుందని కమలకు తెలుసు. అందుకే నవ్వేసి వూర్కుంది సమాధానం ఇవ్వకుండా.

"అమ్మా! మా ఫ్రెండ్ యింట్లో - ప్రతి రూములో ఫోన్ వుందే! మరేం... మేడమీద నుండి వాళ్ళమ్మగారు ప్రణతితో ఫోన్లో మాట్లాడుతారు. అదేదో ఇంటర్ కమ్– అట... నాన్నగారు చెప్పారు. వాళ్ళందరికి ఒక్కొక్కరికి ఒక్కోగది. మనకి చూడు - యింత మంది వున్నా అందరికీ కల్పి ఒకే రూము."

"నువ్వలా అస్తమానం ప్రణతి యిల్లు యిలావుంది - అలావుంది అని చెప్తూ పోతే ఎలా చెప్పు. మనకన్న వాళ్ళు గొప్పవారు. ధనవంతులు. అటువంటి ఇళ్ళు ఇంకా ఎన్నో కొనగల సమర్థులు. ఇంతమాత్రం ఇంట్లో వున్నందుకే మనకి నెలకు మూడు వందలవుతూంది. మన పనిమనిషి 'రంగి' ని చూడు. వాళ్ళింట్లో దగ్గర దగ్గర పదిమంది వున్నారు. ఒకే చిన్న గుడిసె వాళ్ళది."

"పోమ్మా! నువ్వు మరీను! రంగి మనం ఒకటేంటి?"

"ఊహుఁ కాదు. అలాగే ప్రణతి మనం కూడా ఒకటి కాదు. తెల్సిందా? ఎవరి అదృష్టం వాళ్ళది. ఒకరి అదృష్టం మరొకరికి రాదు" పదేళ్ళ అనుపమకి ఇంతకన్న వివరంగా చెప్పలేకపోయింది కమల.

"ఔను అమ్మ చెప్పింది అక్షరాలా నిజం. ప్రణతి చాలా అదృష్టవంతురాలు. వెరివెరీ లక్కీగాల్. తనకి పండక్కి - పెళ్ళికి ఒక మంచి ఫ్రాక్ - ఒక సిల్కులంగా వున్నాయి. ప్రణతికో - అమ్మో - ఎన్ని ఫ్రాక్స్ ఎన్నెన్ని మాడరన్ డ్రెస్సులు." ప్రణతి అదృష్టాన్ని గురించి ఆలోచించసాగింది అనుపమ.

"అనూ! చిన్నబాబు ఏడుస్తున్నట్లున్నాడు. వాడికేం కావాలో కాస్త కనుక్కో."

"ఛల్...! తనో సర్వెంట్ ఇక్కడ తనింట్లో! చిన్న తమ్ముడు ఏడిస్తే ఎత్తుకోవాలి. పెద్ద తమ్ముడికి ఆల్ఫబెట్స్ నేర్పాలి. ప్రణతి కయితే ఎంత మంది నౌకర్లు. అసలు ఇప్పటికీ ప్రణతికో 'ఆయా' వుంది. ఆయా నా బూట్లు పట్టుకురా. గెట్ మి మై మిల్క్ అంటూ ఎన్నెన్ని ఆర్డర్లు వేస్తుంది ప్రణతి..." గుక్క పెట్టి ఏడుస్తున్న చిన్నాని ఎత్తుకోవడానికి విసుగ్గా లేచింది అనుపమ.

  

"అమ్మా, అనూ! నిన్నటి లెక్కలు చేసావా?" రామారావు కూతురుతో అన్నాడు.

"లేదు నాన్నగారూ..." అంది అనుపమ చేస్తున్న హోమ్ వర్క్ నుండి తలెత్తకుండానే.

"సాయంత్రం స్కూలునుండి వచ్చేసావుగా. మరేం చేస్తున్నావ్" కాస్త కోపంగా అన్నాడు రామారావు.

"స్కూలునుండి రావటం నాల్గింటికే కాని నాలుగున్నరకి ప్రణతి వాళ్ళింటికెళ్ళి ఇప్పుడేగా వచ్చింది. వచ్చినప్పటినుండి ఆ పిల్ల కబుర్లే సరిపోయే! ఇక చదువు సంగతి ఎక్కడ పట్టిందా పిల్లకి...!" మరుసటి రోజుకై గోరుచిక్కుళ్ళు వలుస్తున్న కమల అంది.

"ఔనా, అనూ! వాళ్ళింటికి మళ్ళీ ఎందుకెళ్ళావ్? ఆ అమ్మాయి మనింటికి ఎప్పుడూ రాదుకదా! నువ్వెందుకలా అస్తమానం దేబిరిస్తావ్...?"

"ప్రణతి మనింటికి వస్తాననే అన్నది. నేనే రావద్దన్నాను..." గర్వంగా అంది అనుపమ.

"ఏం! ఎందుకో కారణం అడగవచ్చా...? వెటకారంగా అన్నాడు రామారావు.

"ఆ పిల్లనెందు కడుగుతారు. నే చెప్తా వినండి. ప్రణతి వాళ్ళింట్లో లాగ యిక్కడ సోఫాలు, కార్పెట్లు, టీవీలు, టీపాయ్‌లు లేవుగా. అంతేకదూ అనూ...?"

తల్లిమాటలకు కోపంగా చూచింది అనుపమ.

"చూడమ్మా, అనూ! మనకు లేనిదాన్ని గురించి మనం ఆశలు పెట్టుకోకూడదమ్మా. అలాగని మనల్నిచూచి మనం జాలి పడకూడదు. మనింటికి రావటానికి ఇష్టంలేని, మన తాహతుకి మించినదని నువ్వు అనుకుంటున్న స్నేహితురాలితో స్నేహం పెంచుకోవటం అట్టే మంచిది కాదు తల్లీ...! సరేకానీ, అవేవో లెక్కలు - పట్రా నేనే చేసి చూపెడతాను..." ఆ విషయాన్ని అంతటితో ఆపుతూ అన్నాడు రామారావు.

  

ఫ్లూ జ్వరంతో పదిరోజులు పడకేసి ఆరోజే స్కూలుకెళ్ళింది అనుపమ. క్లాసులో అడుగుపెట్టిన అనుపమ ప్రణతి కోసరం చూచింది. కానీ, ప్రణతి కూడా రెండు రోజులుగా స్కూలుకు రావటంలేదని మధురిమ చెప్పింది. "పాపం ప్రణతికి కూడా ఫ్లూ జ్వరం రాలేదు కదా...!" అనుకుంది జాలిగా, అనుపమ.

సాయంత్రం రిక్షా రాములు ఎంతకీ రాకపోవటంతో యింటి దారిపట్టింది అనుపమ. పెద్ద తమ్ముడు రవికి కూడా జ్వరం. అనుపమ ఒక్కతే బయలుదేరింది. ప్రణతి వాళ్ళిల్లు సమీపించగానే బిక్కున ఆగిపోయాయ్ అనుపమ పాదాలు. "పాపం! ప్రణతి కెలావుందో? ఒకమారు వెళ్ళి చూస్తే...!" అనుకుంది అనుపమ. అనుకుందే తడవుగా గేటు తీసికొని లోపలికి నడిచింది అనుపమ.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఎక్కడా ఏ అలికిడీ లేదు.

"ప్రణతీ!" నెమ్మదిగా పిలిచింది అనుపమ తలుపువద్ద నిలబడి.

ఎవ్వరూ బదులు పల్కలేదు. అప్పటికి గుర్తొచ్చింది, తన ఇంట్లోలాగ కాదు ఇక్కడ- కాలింగ్-బెల్ వుందని. నెమ్మదిగా బజ్జర్ నొక్కింది అనుపమ. సుమధుర రాగాలాపన చేసింది కాలింగ్‌బెల్.

వంటింట్లోంచి నాయరూ - ప్రణతి గదిలోంచి ఆయా ఒక్కమారే వచ్చారు.

"ఓ.... నువ్వా అనుపమా! రా! నీ ఫ్రెండ్‌కి జ్వరం వచ్చింది...." ఆయా వెంట ప్రణతి గదిలోకి నడిచింది అనుపమ.

దోమతెర పైకెత్తి పెట్టిన మంచం మీద పడుకుంది ప్రణతి. జ్వరం తీవ్రంగా వుందేమో- ముఖమంతా కందిపోయి వుంది.

"ఎన్నాళ్ళనుంచి.. ఆయా ప్రణతికి జ్వరం?" మంచం దగ్గరికెళ్తూ అంది అనుపమ.

"రెండు రోజులయిందమ్మా! అది సరే- నువ్వు స్కూలు నుండేగా వస్తున్నావ్. ఉండు కాస్త.... చా.. తెస్తాను."

"వద్దొద్దు ఆయా! నేను చా తీస్కోను. నాకు కూడా నిన్ననే జ్వరం తగ్గింది."

"అలాగా! వుండు- కొంచెం హార్లిక్స్ కల్పుకొస్తాను. మరేం ఫర్లేదు. మా ప్రణతికి కూడా ఇవ్వాలి." అంటూ లోపలికెళ్ళింది ఆయా.

"ఎవరూ ...?" అంటూ కళ్ళు తెరచి చూచింది ప్రణతి.

"నేనే ప్రణూ! అనుపమని" మంచం ప్రక్కనున్న కుర్చీలో కూచుంటూ అంది అనుపమ.

"నువ్వా అనూ! మమ్మీ వచ్చిందేమో అనుకున్నాను.మమ్మీ రాలేదు కదూ!" బలహీనంగా అంది ప్రణతి.

"మీ మమ్మీ రావటం ఏంటి.. ఎక్కడికెళ్ళింది ఆంటీ... ప్రణూ? డాక్టర్ దగ్గరకెళ్ళారా...?" అంది అనుపమ.

"కాదు అనూ! డాడీ మమ్మీలు ఇవేళ మార్నింగ్ వికారాబాద్ వెళ్లారు. ఏదో మేరేజి ఫంక్షన్. తొందరగా వచ్చేస్తామన్నారు. ఇంకా రాలేదు చూడు. అబ్బ! తలనొప్పిగా వుంది. ఆయా! కొంచం తలపట్టవా...?"

"ఆయా హార్లిక్స్ తేవటానికెళ్ళింది ప్రణతీ"

"వెళుతూనే వుంది. నిముష నిముషం. పిలవలేక నా ప్రాణం పోతున్నది. అనూ, మా మమ్మీ ఈవెనింగ్ వచ్చేస్తుంది కదూ!" ఆశగా అడుగుతున్న ప్రణతికేసి జాలిగా చూసింది అనుపమ.

తనకి జ్వరం వచ్చిన వారంరోజులు తన పక్కనుంచి కదలనీయలేదు అమ్మని. అమ్మా! అమ్మా!! అంటూ చిన్నపిల్లలాగా మారాం చేసి తల్లి పక్కలోనే రాత్రింబవళ్ళు గడిపింది. ఇక్కడ చూస్తే- ప్రణతి పాపం జ్వరంతో బాధపడ్తూంటే పలకరించడానికి పనివాళ్ళు కూడా రావటం లేదు.

ఇంతలో బిస్కెట్లతో - హార్లిక్స్ కప్పులతో ప్రవేశించింది ఆయా.

"ఇదిగోమ్మా, అనుపమా! కాస్త హార్లిక్స్ తీసుకో - ప్రణతీ! నువ్వు కూడా కొంచెం హార్లిక్స్ త్రాగు..." బిస్కట్ల ప్లేట్‌ని, కప్పుల్ని టీపాయ్ మీద పెట్టి అంది ఆయా.

"వద్దు ఆయా! నాకు ఆకలిగాలేదు. తాగాలని అన్పించడం లేదు."

"ఊహూ॥ అలాగంటే ఎలాగ? అమ్మగారొచ్చి నన్నే కేకలేస్తారు. ఇదిగో- ఈ టాబ్లెట్ వేసికొని హార్లిక్స్ త్రాగు..." బలవంతంగా ప్రణతి గొంతులో పోసింది ఆయా.

అతి కష్టంమీద మాత్ర మింగి హార్లిక్స్ తాగిన ప్రణతి వెనువెంటనే హార్లిక్స్‌ని వాంతి చేసుకుంది.

"రామ! రామ! ఇదేం ఖర్మరా బాబు! ఏం చిన్నపిల్లా - చితకపిల్లా? పదేళ్ళ పిల్ల వాంతి వస్తే-వస్తుందని చెప్పే తెలివిలేదా? నా చీరంతా కరాబయింది. ఇప్పుడే స్నానం చేసి వచ్చాను. ఆ రామి అయినా లేదు ఇవన్నీ ఎత్తి పొయ్యడానికి. అమ్మగారూ, అయ్యగారూ బయటికెళ్తే దానికి ఆటవిడుపే!" తిప్పుకుంటూ, కసురుకుంటూ ప్రణతిని అటుతోసి- ఇటుతోసి బెడ్‌షీట్‌తో సహా లోపలికెళ్ళింది విసురుగా ఆయా.

కళ్ళనిండా నీళ్ళు నింపుకొని నీరసంగా బెడ్‌మీద వాలిపోయిన ప్రణతిని జాలిగా చూసింది అనుపమ.

తనకి జ్వరం వచ్చినన్నిరోజులు తనో మహారాణి తనింట్లో. తనకు జరిగిన వుపచారాలు-గారాబాలు మచ్చుకు కూడా కన్పించడం లేదిక్కడ. అక్కడ ఆఫీసుకు సెలవు పెట్టి తన ప్రక్క కూచుని కథలు, కబుర్లు చెప్పేనాన్నగారు.

అక్కా! నీకు జ్వరం వచ్చిందా..? నేను ఏడవనులే అల్లరి చేయనుగా.. ముద్దు ముద్దుగా పలికే చిట్టి తమ్ముడు, ప్రతి నిముషం తన యోగక్షేమాలు విచారిస్తూ తన చెంతనే గడిపిన మాతృమూర్తి, నాన్నగారు కొనిచ్చిన కొత్త సంచీ కావాలంటే నువ్వే తీసుకో, ఏం.. అంటూ అనునయం చూపించే తన మొదటి తమ్ముడూ - ఏరి - ఈ ఇంద్రభవనంలో మచ్చుకైనా కన్పించరేం!

మనిషి అదృష్టానికి ఆస్థి - అంతస్థులు కొలబద్దలని తనిన్నాళ్ళు అనుకుంది. కానీ ఇప్పుడు తెలుసుకుంది అవన్నీ కొల్లలుగా వున్న తన స్నేహితురాలు ఎంత అదృష్టవంతురాలో!

"నేనిక ఇంటికి వెళతాను ప్రణూ!" అంటూ లేచింది అనుపమ.

కళ్ళ కొలకులనుండి జారుతున్న నీళ్ళని తుడుచుకుంటూ "అలాగే" అంది ప్రణతి.

***(ఆదివారం వారపత్రిక, 3-5-1981)***

# స్వీట్‌హోంలో స్పీడ్ బ్రేకర్స్

అందమైన ఆదివారం. అందినంతవరకు నిద్రసుఖాన్ని ఆస్వాదించడం ఆనందరావు హాబీ. ఆనంద లోకాల్లో విహరిస్తున్న ఆనందరావుని ఈ లోకంలోకి తెచ్చిపడేసింది శ్రీమతి ఆనందరావు- ఆవిడే అరుణాదేవి, "ఏమండోయ్ కాఫీ..." అంటూ.

బద్దకంగా ఒళ్లు విరుచుకున్న ఆనందరావు భార్య ముఖంలోకి ప్రేమగా చూసి, మరింత మక్కువగా కప్పుతోబాటు భార్య చెయ్యి అందుకున్నాడు.

"సర్లెండి సంబరం ! పొద్దుటే మీతో సరాగాలాడుతూ కూచుంటే ఇక నా పని అయినట్లే! అదిగో... అప్పుడే మీ సంతానం పాలకోసం ఢంకా బజాయించేస్తున్నారు...." విసురుగా చెయ్యి లాక్కుంది అరుణ.

"ఛా... ఛా... లైఫ్‌లో థ్రిల్ అంటూ లేకుండా పోతున్నది కదా ! ఏం, ఒక్క నిమిషమలా చెయ్యి ఇచ్చేసి నిలబడితే నీ సొమ్మేం పోయింది....?" కాఫీ సిప్ చేస్తూ విసుక్కున్నాడు ఆనందరావు.

"ఊ.... థ్రిల్.... అదొక్కటే తక్కువ మన బతుక్కి..." అరుణ మాటలు పూర్తికాకుండానే జ్యేష్ఠపుత్రుని కేక శరవేగాన వచ్చి తాకింది.

"మమ్మీ... శ్వేత టూత్‌పేస్ట్ అంతా కొరికేస్తోంది..."

"అమ్మ బాబోయ్ ..... చెక్క బిళ్లల్లాంటి పన్నెండు రూపాయలు పోసి మొన్ననే కొన్నానా ట్యూబ్." అంటూ కాఫీ కప్పునలా భర్త చేతిలో వదిలేసి పరుగెత్తింది అరుణ.

టూత్‌పేస్ట్ ట్యూబ్‌ని శ్వేత చేతిలో నుంచి లాక్కుంది అరుణ. అంతే ! కొట్టినట్లే పెద్దగా ఏడ్వడం మొదలెట్టింది ఆ రాలుగాయి, నాలుగేళ్ల శ్వేత.

"దొంగభడవా...! కొట్టకుండానే ఏడ్పు మొదలెడితే ఇక కొట్టనని కదూ నీ ధైర్యం....?"

కిందపడ్డ పేస్ట్‌ని తీయనూలేక, అలాగే నేలమీద వదిలేయలేక బాధపడిపోయింది అరుణ.

"మమ్మీ.... నాకు బూస్ట్...." ఆరేళ్ల కవిత చెంగుపట్టుకు లాగింది.

"పాలుకావాలేం.... పాపం ! చిన్నపిల్ల తెలియక పేస్ట్ పాడుచేస్తే, వస్తువు పాడవుతూంది, తీసి దాచాలని నీకు తెలియదటే ! " కవిత వీపు మీద ఒక్కటి అంటించింది అరుణ.

"అన్యాయం..... అన్యాయం.....! ఇంత ఘోరం ఎక్కడయినా ఉందా ? తప్పు ఒకరిదయితే శిక్ష వేరొకరిదా ...?" రంగ ప్రవేశం చేశాడు ఆనందరావు.

"డాడీ...." అంటూ ఆనందరావుని అంటుకుపోయి బావురుమంది కవిత.

"అబ్బబ్బ... చచ్చిపోతున్నాను బాబూ ఈ పిల్లల్తో.... ప్రొద్దుటే మీ రాగాలేంటి ? ఔన్లే... అందరిళ్లల్లో రేడియోలు, టేప్‌రికార్డులు.... మరి మనింట్లో ఈ రాగమన్నా ఉండద్దూ....?" పిల్లలకి పాలు కలపడానికి వంటింట్లో కెళ్లింది అరుణ.

పాలుతాగిన పిల్లలు ముగ్గురూ ముందు గదిలో ఆటల్లోపడ్డారు. మిక్సర్‌లో పెసరపప్పు వేస్తున్న అరుణదగ్గరికి చేరాడు ఆనందరావు, "పెసరట్టులోకి ఉప్మా చేస్తున్నావు కదూ...?" అంటూ.

"ఆహా... మీకేం, ఎన్నెన్ని కోర్కెలన్నా కోర్తారు .... ఇన్ని రకాలు చేయడానికి నాకున్నవి రెండే చేతులు, రెండే కాళ్లు..."

"పోన్లే అరుణా ! నీకు ఓపికలేకుంటే మానేయ్ ! అందుకని ఇంత చదువెందుకు చదువుతావు...? అయినా నువ్వేగా పెసరట్టులోకి ఉప్మా అలవాటు చేశావ్ ! పెళ్లయిన కొత్తలో అయితే ఇద్దరం ఆదివారం నాడు ఎంత సరదాగా టిఫిన్లు చేసుకొని తినేవారం ....!"

"సరేలెండి... ఆ రోజులు మళ్లీ రమ్మన్నా రావు. ఇప్పుడు ఆదివారం అంటేనే భయమేస్తోంది. పిల్లల తలంట్లు, యూనిఫారమ్ గోల, ఒకటా....?" పెనం మీద పెసరట్టుని పళ్లెంలో వేసి టేబిల్ దగ్గర కూచున్న భర్త కందించింది అరుణ.

"చాలా బాగుందోయ్ పెసరట్టు. అరే, అదేంటి ఉప్మా కూడా చేశావే...! అమ్మ దొంగా ....! ఇన్ని అబద్ధాలెప్పుడు నేర్చుకున్నావ్? అందుకే ఇద్దరు ఆడపిల్లల్ని కన్నావ్....!"

"ఔనౌను... నేనే కన్నాను." ముసిముసిగా నవ్వింది అరుణ.

"సర్లేవోయ్ బడాయి ! పెసరట్టు ఎంతబాగా కుదిరిందో ఒక్కమారిలా రుచి చూడు" భార్య నోటికి పెసరట్టు ముక్క అందించాడు ఆనందరావు.

"డాడీ.... ! నాకు పెసరట్టు...." అంటూ వినయ్ వచ్చి ఆనందరావు వీపు మీద వాలాడు.

"ఊఁ .... ఊఁ .... నాకు మమ్మీ - టిఫిన్ ..." అంటూ అక్కా చెల్లెళ్లిద్దరు తయార్ !

"ఉండండ్రా... డాడీ తిన్నాక తిందురుగాని" కసురుకుంది అరుణ.

"ఒద్దొద్దు అరుణా ! పిల్లలు తిన్నాక నేను తింటాను. వాళ్లకి పెట్టేయ్!" టేబిల్ ముందునుంచి లేచిపోయాడు ఆనందరావు.

ప్రాణం వుసూరుమంది అరుణకి. ఈ మాయదారి పిల్లలతో తిండి తినడానికి కూడా కుదరదు. విసుక్కుందే కాని వెంటనే తల్లిప్రాణం మనస్సును మందలించింది. ముగ్గురికి పెసరట్లు వేసి పెట్టి మళ్లీ ఆనందరావుకి వేసి తీసికెళ్లేసరికి ఆయనగారు పేపర్ చదవడం కూడా అయి క్షురకర్మలో కూచున్నారు.

"అరే...! టిఫిన్ తెచ్చావా...? అక్కడ పెట్టు. తర్వాత తింటాను" అన్నాడు అద్దంలో నుంచే భార్యను చూసి.

"ఈ చల్లారిన పెసరట్లే మీకు గతి" అరుణ ప్లేటుని అక్కడే టీపాయ్ మీద పెట్టి వెనుతిరిగింది.

"నువ్వు తిన్నావా అరుణా....?" అన్నాడు ఆనందరావు.

"తింటాన్లెండి. తినక తప్పుతుందా...." వెళ్లిపోయింది అరుణ.

ఏంటో అరుణకీ మధ్య కోపతాపాలు, చిరాకు పరాకులు ఎక్కువైపోయాయి. ఇది వరకు ఎంత సరదాగా గడిచిపోయేవి రోజులు ! సెలవురోజు అంటే పండుగ రోజే ! పొద్దుటినుంచి

రాత్రివరకు సరిపడ్డ కార్యక్రమం ముందటి రోజే సిద్ధం చేసేది అరుణ. ఒక్క నిమిషం కూడా ఒకర్నొకరు విడిచిపెట్టకుండా గడిపేవారు. ఇప్పుడో ! రోజులో మూడు వంతులు టైము పిల్లలతో సరిపోతున్నది. లైఫ్ అందుకే మరీ ఇంత డల్‌గా తయారయింది.

"డాడీ....!" వినయ్ పిలుపు.

"ఏంట్రా...." అంటూ ఇటు తిరగడంలో గడ్డం మీద బ్లేడు తెగింది.

"అబ్బబ్బ....! ఏంట్రా ఆ గావు కేకలు...?" బాధతో పెద్దగా అరిచాడు ఆనందరావు.

"ఏంలేదు డాడీ ! శ్వేత మాగజైన్‌లో పేజీలు చింపుతూంది" కామ్‌గా జవాబిచ్చాడు పుత్రరత్నం.

"రామ... రామ....! అది ఆఫీస్ లైబ్రరీదిరా ! రేపు ఆ రామారావు నా పీక పట్టుకుంటాడు... పిల్లలకి అందకుండా పుస్తకాలు దాచాలండీ.... అంటూ."

"వెధవా...! అక్కడినుంచి పొలికేకలు పెట్టకపోతే పుస్తకం లాక్కోలేవురా..." వినయ్‌నే నాలుగుతిట్టి శ్వేత చేతిలోని కారవాన్ లాక్కున్నాడు ఆనందరావు. అప్పటికే రెండు పేజీలు చింపేసింది శ్వేత.

"ఎక్కడి పిల్లలురా బాబూ ! అయినా పొద్దుటే ఏదో హోమ్‌వర్క్ చేసుకోక ఏంట్రా ఈ అల్లరి....?!" అంటూ గదమాయించాడు పిల్లల్ని. వినయ్, కవిత పుస్తకాలు ముందేసుకున్నారు బుద్ధిగా.

తనేం చేయాలో తోచక నోట్లో వేలేసుకొని నిల్చుంది శ్వేత.

"అమ్మా.... ! తమరిక లోపలికి తగలడండి. ఇక్కడ చేసిన నిర్వాకం చాలు" లోపలికి తోశాడు చిన్నదాన్ని. ఆరున్నొక్క రాగంతో అమ్మను చేరింది శ్వేత.

"ఎందుకు తల్లీ ! ఏడుస్తున్నావ్...? ఏం ఘనకార్యం వెలగబెట్టి వచ్చావ్....?" కుక్కర్ స్టవ్‌మీద పెట్టి శ్వేత నెత్తుకొని సముదాయించింది అరుణ.

"డాడీ కొట్టారు!" ముద్దుముద్దుగా ఫిర్యాదు చేసింది శ్వేత.

పిల్లల్ని ఎంతో గారాబంగా చూసే ఈయనగారు ఈమధ్య ఎందుకో బాగా మారిపోతున్నారు. తనెప్పుడయినా పిల్లల్ని కొట్టే "బెదిరించి పెంచే పద్ధతి మంచిది కాదు ప్రేమతో నచ్చ చెప్పుకోవాలి...." అంటూ పిల్లల్ని సమర్థించే ఈయనే పిల్లల్ని కసురుకుంటున్నారు. ఆయన్నని ఏం లాభంలే ? పిల్లలు పెరిగేకొద్దీ అల్లరీ పెరుగుతూంది. వాళ్ల అవసరాలు తీర్చడానికే తనకి టైమూ, ఓపిక ఉండడం లేదు. ఇదివరకు లాగా ఆయన వెంబడి పరుగులు తీయడం లేదని ఆయనకి ఉక్రోషం....! మనస్సులోనే నవ్వుకుంది అరుణ.

భోజనాల కార్యక్రమం పూర్తయింది. ఎండపూట కాస్సేపు పండుకోండర్రా అంటే ముగ్గురిలో ఏ ఒక్కరూ వినరే...! ఎక్కడా స్థలం లేనట్లు ఆనందరావు మంచంలోనే చేరారు. ఇలా కాదని ముగ్గురుకి తలో దెబ్బా వేసి ముందు గదిలో ఫేన్ కింద పడుకోబెట్టింది అరుణ.

"అమ్మయ్య ! రణరంగం తగ్గిందిరా బాబూ !" అంటూ చాప వేసుకొని నడుం వాల్చింది అరుణ?

"అరూ... ! అరుణా.....! ప్లీజ్...." అన్నాడు ఆనందరావు తన పక్కచోటు చూపిస్తూ.

"ఇక చాల్లే ఊర్కోండి...! ఏ క్షణంలోనయినా పిల్లలు లేచి రాగల ప్రమాదముంది...." నవ్వుతూనే తిరస్కరించింది అరుణ.

"హాలీడే అంటే జాలీడే అనుకునేవాడిని ఇదివరకు. బోరు డే అయి కూచుంది నా పాలిట ! స్వంత పెళ్లాంతో కబుర్లాడడానికి కూడా విన్నపాలు చేసుకోవాలి...ఖర్మ...!"

బాగా కోపం వచ్చేసింది మానవుడికి ! నవ్వుకుంటూ పడుకున్న అరుణ ఎవరో డోర్ బెల్లు కొట్టడంతో లేచి వెళ్లి తలుపు తీసింది.

"అమ్మగారూ ! పిల్లలకి ఎప్పటినుంచి స్కూలు..." అంటూ గుమ్మంలో నిలబడ్డాడు, రిక్షాలో రోజూ పిల్లల్ని స్కూలుకి తీసికెళ్లే వెంకటేషు.

"ఔను వెంకటేషూ.... నేనే సుబ్బితో కబురు చేద్దామనుకుంటున్నాను. ఎల్లుండి నుంచే పిల్లలకు స్కూలు. ఉండుండు. ఒక్క క్షణం ఆగు...." అంటూ లోపలికెళ్లింది అరుణ.

అలిగి పడుకున్న భర్త చెంతకు చేరింది అరుణ. "ఏమండోయ్ మాట !" అంటూ. మరింత బిగుసుకొని అటు తిరిగి పడుకున్నాడు ఆనందరావు.

"మీ కోపతాపాలు తర్వాతకాని నేనో మాట చెప్తాను వింటారా...."

"ఏంవిటట....?" అన్నట్లు చూశాడు ఆనందరావు.

"వెంకటేషు వచ్చాడు రిక్షా తీసుకొని. పిల్లలు ముగ్గుర్నీ మంజుల దగ్గరికి పంపుదామా ....? ఈరోజు టి.వి.లో మూవీ కూడా ఉంది. సినిమా అయిపోగానే దిగబెట్టాడు వెంకటేషు...."

"హాయ్ ......! ఎంత బ్రహ్మాండమైన అయిడియా....!"

అమాంతం లేచి కూచున్నాడు ఆనందరావు.

వెంకటేషు మాటల అలికిడికి లేచిపోయిన అరుణ సంతానం "మమ్మీ....? ఎక్కడికి ఆంటీ ఇంటికా" అంటూ అరుణని చేరారు. "నువ్వు రావా మమ్మీ...." అని అడిగాడు వినయ్.

"చూడు వినయ్ ! మీ డాడీకి బాగా తలనొప్పిగా ఉందట ! నాకేమో ఇంట్లో బోలెడు పని. ఆంటీ ఇంట్లో అల్లరిచేయకుండా ఆడుకోండి. సినిమా అవగానే వెంకటేషుతో వచ్చేయండి."

"అలాగే మమ్మీ..." అంటూ సంతోషంగా ఒప్పేసుకున్నాడు వినయ్. అన్న వెంబడి చెల్లెళ్లు తయారయ్యారు మేము కూడా అంటూ.

పిల్లల్ని చకచకా తయారు చేసింది అరుణ. వాళ్లకి మళ్లీ పాలు కలిపి ఇచ్చి, రిక్షా ఎక్కించేసరికి మూడయింది.

"వెంకటేషూ ! మర్చిపోకుండా రాత్రి తొమ్మిదింటికి మంజుల అమ్మగారింటికి వెళ్లి పిల్లల్ని తీసుకురా... ! జాగ్రత్త..." అప్పగింతలు పెట్టింది అరుణ.

"అలాగేనండీ ! ఎన్నిమార్లు నేను పార్టీలకని పిల్లల్ని ఆరింటికి తీసికెళ్లలేదూ !" రిక్షాపోనిచ్చాడు వెంకటేషు.

"మమ్మీ టా టా...." పిల్లలు ముగ్గురికీ టాటా చెప్పి తలుపు వేసుకొని గదిలోకొచ్చింది అరుణ.

"అమ్మయ్య ! ఎన్నాళ్ల కెన్నాళ్లకు.... ఎన్నేళ్లకెన్నేళ్లకీ ఏకాంతం..." అంటూ భార్యని మంచం మీదకి లాగాడు ఆనందరావు.

"ఏఁవిటో నండీ ! పిల్లల్నలా పంపిస్తూంటే నాకేంటో గిల్టీగా అన్పించింది..."

"యూ సెంటిమెంటల్ ఫూల్ ! ఇలా నీతో ఆర్గ్యూ చేస్తూంటే టైమంతా వేస్ట్ -" ఆనందరావు వాగ్ధాటిని ఆపుతూ బెల్లు ట్రింగుమని మోగింది. 'ఈ తడవ ఎవరబ్బా' అనుకుంటూ అరుణ భర్త చేతులని తొలగించుకొని గుమ్మంలోకొచ్చి తలుపు తెరచింది.

"తొరగా అంట్లేయండమ్మగారూ ! నాలుగిళ్లలో అంట్లు తోమి నేను బేగిన టి.వి. కెళ్లాల..." చీపురందుకుంది సుబ్బి. సర్కారు ఎక్స్‌ప్రెస్‌కయినా కొంత స్పీడు తగ్గుతుందేమో కాని సుబ్బికి మాత్రం కాదు. అది వచ్చిందంటే ఇక గాలి దుమారమే !

పంచవన్నెలు మారుతున్న ఆనందరావు ముఖాన్ని చూసిన అరుణకి నవ్వాగలేదు. సుబ్బి పని పూర్తయేసరికి అరుణ కూడా గబగబా వంటకానిచ్చి శుభ్రంగా స్నానం చేసి తెల్లటి ఇస్త్రీ చీర కట్టుకుంది. అందంగా అలంకరించుకున్న అర్ధాంగిని చూసి ఆనందరావు కోపాన్ని మరిచాడు.

తను కూడా హుషారుగా ఈలపాట పాడుకుంటూ ఈజీచెయిర్‌ని అలంకరించాడు.

సుబ్బిని సాగనంపి, మల్లెపూలు అమ్మకానికి వస్తే కొనుక్కొని ఆనందరావు కుర్చీ దగ్గరే కూచుంది అరుణ. పువ్వులు కడ్తున్న భార్యనే చూస్తున్నాడు ఆనందరావు.

"ఏంటలా చూస్తున్నారు?" అంది నవ్వుతూ అరుణ.

"ఇలా ఇంత ప్రశాంతంగా, కుదురుగా నువ్వు నా దగ్గర కూచుని ఎన్ని రోజులయిందో...?"

"పిల్లలున్నాక అలా ఎలా కుదుర్తుందండీ....?"

"కుదరడం, కుదరకపోవడం మన చేతిలోనే ఉందే భామామణీ ! ఈరోజు చూడు నీ బుర్ర

అమోఘంగా పనిచేసి మనకెంత ఆనందాన్ని ప్రసాదించిందో...! పిల్లలూ హాపీగా ఉంటారు... మనకీ కొంత రిలీఫ్...." అరుణ జడ పట్టుకొని లాగాడు ఆనందరావు.

"అబ్బ...! ఊర్కోండి పిల్లలొస్తారు" అని అనలేదు అరుణ. ముగ్ధమోహనంగా నవ్వింది భర్తకేసి చూసి.

గ్రీన్‌సిగ్నల్‌ని అందుకొన్న ఆనందరావు నెమ్మదిగా భార్య ప్రక్కనే కూచున్నాడు.

"అదిగో......! ఇలాగయితే ఇక నేను పూలు కట్టినట్లే ! పిల్లలు లేరుకదా అని మీరు మొదలెట్టారా .... అల్లరి....!" గోముగా భర్తచేతిని ఆవలికి తోసింది అరుణ.

"సాయం చేస్తానంటే వద్దంటావేంటోయ్....?" అంటూ ఇన్ని మల్లెపూలు తీసి అరుణ తలమీద పోశాడు ఆనందరావు. కిలకిలా నవ్వింది అరుణ. భార్య నవ్వుతో పరవశిస్తున్న ఆనందరావుకి మొదటిమారు బెల్లు విన్పించలేదు. మరింత గట్టిగా రెండవమారు మోగిన బెల్లు శబ్దానికి భార్యాభర్తలిద్దరు ఉలిక్కిపడ్డారు.

"ఎవరు చెప్మా....?" అంటూ ఆముదం తాగిన ముఖం పెట్టాడు ఆనందరావు.

"ఏమో !" అంటూ పైకి లేచింది అరుణ.

అప్పటికే ఇల్లు దద్దరిల్లేటట్లు మోగిపోతూంది బెల్లు. పరుగు పరుగున వెళ్లి తలుపుతీసిన అరుణ నిశ్చేష్టురాలై నిలబడి పోయింది. "ఆంటీ" అంటూ లోపలికి దూసుకు వచ్చిన మంజుల పుత్రద్వయాన్ని చూసి.

"హాయ్ అంకుల్!" కిశోర్ ఆనందరావుకో గ్రీటింగ్ పడేసి ఒక్క గెంతు గెంతి మంచం మీద పడ్డాడు.

"మంచినీళ్లు ఆంటీ" అంటూ కిరణ్ ఫ్రిజ్ డోర్‌ని ఒక్కలాగు లాగాడు.

"మమ్మీ, డాడీ ఏరీ...?" అంది ఎలాగో గొంతు పెగల్చుకొని అరుణ.

"డాడీకి మాంచి తలనొప్పట. మమ్మీకేమో ఇంట్లో బోలెడు పని" దిండుతో మంచం మీదే ఫుట్‌బాల్ ఆడేస్తూ జవాబిచ్చాడు కిశోర్.

"వినయ్, కవిత, శ్వేత ఏరాంటీ...?" కిరణ్ అడుగుతున్న ప్రశ్నకి జవాబివ్వడానికి కూడా తోచక అలాగే నిలబడిపోయారు మిసెస్ అండ్ మిస్టర్ ఆనందరావ్....!

***(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 11-9-1981)***

# ఇది న్యాయం అది నేరం

"అమ్మా ! చూడమ్మా మాలి, నేచెప్తే విన్పించుకోకుండా-కొట్టేస్తా-కొట్టేస్తానంటున్నాడు" బొండుమల్లెల్ని మాలగా కట్తున్న తల్లి యశోధర వీపుపై వాల్తూ అంది శోభ.

కడ్తున్న మాలని పక్కకు నెట్టి, కూతుర్ని ముందుకు లాక్కుని ముద్దాడింది యశోధర.

."ఊఁహూఁ. నువ్వు చెప్పటమూ, మాలి విన్పించుకోకపోవడమూనా!! ఎంత అపరాధం. పద పద ఆ సంగతేదో తేల్చుకుందాం" అంటూ లేచింది.

తనకన్న తొందరగా అడుగులేస్తూ, తనని లాక్కుపోతున్న శోభని చూస్తే నవ్వొచ్చింది యశోధరకి.

"ఇంతకీ... బుజ్జీ నీ మాట ఏం వినలేదే, మాలి?" అంది సముదాయింపుగా యశోధర. ముందు నడుస్తున్న శోభ వెనక్కి తిరిగి తల్లిని చూస్తూ, "మరేమో, నేను, మా ఫ్రెండ్సు నందిని, నళిని, తరుణ అందరం వుయ్యాలకట్టి వూగమూ.. అదేనమ్మా! మంచి మామిడి చెట్టు దాన్ని కొట్టేస్తాడటమ్మా మాలి. చూడమ్మా, వద్దు మాలీ.. కొట్టొద్దు- అంటే మీకు తెలవదు లెండి బుల్లెమ్మగారూ అంటున్నాడు, పేద్ద... తనకే తెలిసినట్లు-" వెక్కిరిస్తూ అంది శోభ.

"ఛ... ఛ.. అలా ఎందుకు కొట్టేస్తాడు..." అంటూ అనునయంగా అనబోయిన తల్లిని మధ్యలో ఆపి "ఎందుకు కొట్టేయడూ.. అదిగో చూడు... గొడ్డలిని పట్టుకొని నిలబడ్డాడు సినిమాలోని విలన్‌లా. నువ్వు తొందరగా పదమ్మా! మాలి అన్నంతపని చేస్తాడు. అసలు భయంలేదుమాలికి" యశోధర చేయివదిలి మాలి చెంతకి వెళ్ళింది శోభ - దోషిని న్యాయాధిపతి చెంత నిలదీసే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లా.

ఔను. నిజమే. చాలా పెద్ద చెట్టు. ఎన్నో ఏళ్ళుగా మధురమైన మామిడి పళ్ళని అందించింది. చెట్టు మొదట్లో పిల్లలు చెమ్మా - చెక్కా, దాగుడుమూతలు ఇప్పటికీ ఆడుకుంటున్నారు. చెట్టు కొమ్మలమీద ఎన్నో పక్షులు గూళ్ళు కట్టుకొని స్థిరనివాస మేర్పరచుకున్నాయి.

బ్రహ్మాండమైన ఆ చెట్టుకేసి, దాని చెంతనే గొడ్డలి చేతపట్టి నిలబడ్డ మాలి సోమయ్యకేసి ఒక్కమారు చూచింది యశోధర. సోమయ్యకేసి నడుస్తూ- "సోమయ్యా! ఈ చెట్టును నాగా మ్యకపోతేనేం...?" అంది.

"అమ్మగారూ! ఇటు చూడండి. మొదలునుండి మానెలా ఎండిపోయిందో. అదీకాక దీని వ్రేళ్ళు చుట్టూరా వ్యాపించి చిన్న చిన్న మొక్కల్ని పెరగనివ్వడం లేదు. ఇది ఇక్కడిలా వున్నంతకాలం చిన్న మొక్కలు ఎక్కిరావండమ్మా. కాపు కూడా రెండేళ్ళుగా ఆగిపోయిందా. ఇంకెందు కండమ్మగారూ...... యీ దండగ చెట్టు. ఈ మోడునిలా వదిలేస్తే ఏనాడో విరిగి నేలపై బడి మిగతా లేత మొక్కల్ని నాశనం చేస్తుంది..."

"అంతేనంటావా.. సోమయ్యా?"

"ఆఁ.. అంతేనండమ్మ! అయ్యగారికి కూడా చెప్పాను. సరే. కొట్టేయ్ అన్నారు."

వెనక్కి తిరుగుతున్న యశోధరతో- "ఏమ్మా! వొద్దని చెప్పు సోమయ్యతో- నువ్వు వద్దంటే మానేస్తాడు. నాన్నగారితో నేను చెప్పి ఒప్పిస్తాను" అంటూ మారాం చేస్తున్న కూతుర్కి జవాబివ్వలేని స్థితిలో వుండిపోయింది యశోధర.

"అంటే నీకూ ఇష్టమేనన్నమాట!! ఛీ... ఛీ.. ఈ మాలి అన్నీ పనికిమాలిన పనులే చేస్తాడు. నాన్నొచ్చాక చూడు ఏం చేస్తానో! సోమయ్యా నిన్ను వుద్యోగం లోంచి డిస్మిస్ చేయించకపోతే నాపేరు శోభేకాదు..." కోపంతో గునుస్తూ వుండిపోయింది శోభ.

లోపలికి వెళ్తున్న యశోధర మస్తిష్కంలో ఎన్నెన్నో ఆలోచనలు. మానుమాకులకేనా ఈ గతి లేక మనుష్యులకుకూడానా..? అనుకోకుండా తనీమధ్య స్నేహితురాలు సుజాత ఇంట్లో చవిచూసిన కొన్ని అనుభూతులు తన మనఃఫలకంపై ప్రతిబింబించసాగాయ్.

"హల్లో! మైడియర్ మిసెస్ బుద్ధా! ఎంతటి సర్ప్రైజ్..." అంటూ ఎదురొచ్చి రిసీవ్ చేసుకుంది సుజాత, యశోధరని.

"ఏం. చెప్పకుండా రాకూడదా..." అంది యశోధర.

"అలా అని నేనన్నానా... ఇంతకీ తమరొక్కరే వచ్చారు... తమ భర్తగారు- వారేనే గౌతమ్‌గారు కాననసీమలకు ఏకాకిగ వెళ్ళినట్లున్నారు? ఏయ్ అంత కోపంగా చూడకే తల్లీ. ఏదో మీ శ్రీవారు ఫారెస్టు ఆఫీసరు కదా అని అలా అన్నాన్లే. ఆనాడు పిచ్చి గౌతముడు భార్య యశోధరని విడిచి వెళ్ళిపోయేడు - కానీ - ఈ యశోధరని విడిచి మా గౌతమ్ అన్నయ్య ఎక్కడికీ వెళ్ళడులే..."

"సుజ్జీ! నీ అల్లరి చూస్తుంటే పెళ్ళయి ఇన్నేళ్ళయినా మీ శ్రీవారు నిన్నేమాత్రం అదుపు ఆజ్ఞలలో పెట్టలేదని యిట్టే తేలిపోతుంది. కనీసం 'చిన్న సుజ్జీ' పుట్టేక కూడా నువ్వు నయాపైసంతా మారలేదన్నమాట.." సుజాతతో యింట్లోకి వెడుతూ అంది, యశోధర.

"అవునూ యశూ నువ్వు మానైట్ క్వీన్ని చూడలేదు కదూ!! వాటె పిటీ... త్వరగా నడు చూపిస్తాను...!"

"నైట్‌క్వీనా! ఏమిటోయ్ నువ్వంటున్నది..?"

"అదేనోయ్ మా రాకుమారిగారు! పగలల్లా నిద్రబోయి రాత్రిళ్ళు ఎంచక్కా ఆడుకుంటుందనుకున్నావ్..."

"మీ పాప విషయమా నువ్ చెప్తోంది?"

"ఆఁ దాని విషయమే.. తన ఆటతో ఏడ్పులతో ఇంటిల్లిపాదిని రాత్రంతా నిద్రపోనివ్వదు. అందుకని మా అన్నయ్యే దానికి ముద్దుగా నైట్‌క్వీన్ అంటూ నామకరణం చేశాడు" పాప గదిలోకి అడుగిడుతూ అంది సుజాత.

అందమైన గది అది. ఆ గదిలో చందనపు బొమ్మ పడుకొని నిద్రపోతోంది. అమ్మ మాటలనే విన్నదో - లేక - చల్లగా జొరబడిన పిల్లగాలికి సీలింగ్‌నించి వ్రేలాడుతున్న పంచలోహపు పంచకళ్యాణి బొమ్మ అటూ యిటూ కదలాడుతూ వినిపించిన సప్త స్వరాల సవ్వడికే మేల్కొందో కాని పాపకి మెలకువ వచ్చి కళ్ళు తెరచి చూచింది.

"అబ్బో బుజ్జి కళ్ళు తెరచి చూస్తున్నావే? ఏదీ నవ్వు - ఆంటీ వచ్చింది.. ఇటు చూడు" అంటూ పాప బుగ్గలని సున్నితంగా చిదిమింది సుజాత. ముద్దులొలుకుతున్న 'మర్ఫీ' బేబీని చేతుల్లోకి తీసుకుంది యశోధర. అంతదాకా తల్లి ప్రక్కనే నిలబడి ఆసక్తిగా చూస్తున్న శోభ "అమ్మా! నేనెత్తుకుంటాను. నాకివ్వవూ పాపని" అంటూ మారాం చేస్తున్న శోభకేసి చూస్తూ "శోభా నువ్వింకా చిన్నదానివి కదమ్మా. ఈమారు వచ్చినప్పుడు ఎత్తుకుందువు కానీలే... ఏం.." అంటూ, శోభ బుగ్గ గిల్లింది సుజాత. పసిదాని సంతోషానికైనా దాని చేతులకి బిడ్డనివ్వలేదు కదా అని యశోధర మనస్సు చివుక్కుమంది. కానీ, అంతలోనే తమాయించుకుంది. సుజాతకి పెండ్లయిన పదేండ్లకి పుట్టిన పసిడిబొమ్మ ఆ పాప. అపురూపం కాక మరేమవుతుంది.

"అత్తయ్యా ! పాపని స్నానానికి తెమ్మన్నారు" అంటూ వచ్చింది సుజాత మేనకోడలు- కాబోలు ఓ పదేండ్ల పాప - కాన్వెంటుకు వెళ్తున్నదేమో యూనిఫాం ధరించి వుంది. కబురందించి బయటకు నడిచింది. పాప స్నానానికి కావలసిన సరంజామా తయారుగా వుందోలేదో చూట్టానికి లోపలికెళ్ళింది సుజాత.

పాప గదిని పరికించి చూస్తూ నుంచుంది యశోధర. నైట్‌క్వీన్ గది నిజానికో మహారాణీగారి మందిరంలాగానే వుంది. చిట్టి పాపకి వాడే చిన్ని చిన్ని బట్టల్ని మేంటల్‌పీసులో చక్కగా అమర్చి వుంచారు. బేబీ ఆయిల్, సోపు, షాంపూ, పౌడర్, క్రీమ్-యిత్యాదులను డ్రెస్సింగ్ టేబిల్‌మీద నీట్‌గా సర్ది వుంచారు. పాపకింకా నడవడమే రాదు. రాణిగారు నడిచిననాడు కాళ్ళు కందిపోవునేమోననేమో, పాపగదిలోనేకాక ప్రక్కనున్న హాల్లో కూడా మెత్తటి బీజ్ కార్పెటు పరిచి వుంచారు.

ఉయ్యాలలో మేల్కొనే బజ్జున్న పాప తనకెదురుగా మేంటల్ పీస్‌మీదున్న నిలువెత్తు బుద్ధ విగ్రహానికేసి చూస్తోంది. ఆ యిత్తడి విగ్రహానికి ప్రక్కగా పైనుండి వ్రేలాడుతున్న చాండిలియర్

మీద సూర్యకిరణాలు పడి పరావర్తనము చెంది మినుక్ మినుక్ అన్నపుడల్లా గలగలా నవ్వుతూంది పాప.

గమ్మత్తుగా వున్న ఆ గది అలంకరణను చూస్తున్న యశోధర, "యశూ!" అన్న సుజాత పిలుపుకి వులిక్కిపడి వెనుతిరిగింది.

"చూడు యశూ ! మారాణిగార్కి స్నానానికి టైం అయింది. లెట్స్‌గో. మా నాయరిచ్చిన క్షాఫీ తాగుతూ డైనింగ్ రూములోకూచో, దీని స్నానం పూర్తి కానిచ్చి నేనూ వస్తా..." యశోధరని, శోభని డైనింగ్ రూములోకి లీడ్‌చేస్తూ అంది సుజాత.

విశాలమైన డైనింగ్ టేబిల్ చుట్టూ మేచింగ్‌గా చక్కటి కుర్చీలు అమర్చి ఉన్నాయి. టేబిల్‌కి మధ్యగా అందమైన వెండి కేండిల్ స్టాండ్‌మీద పింక్ రంగు కొవ్వొత్తులు ఆ రూము రంగేమిటో తెలియజేస్తున్నాయి. మార్బల్ ఫ్లోరింగ్‌మీద అడుగుపెట్టిన యశోధర ఓకుర్చీ లాగి కూర్చుంది.

ఫ్రిజిడేర్‌లోంచి నీలంపు నీటి జాడీనొకదాన్ని బయటకు తీసి టేబిల్‌మీద పెట్టూ, "కూర్చో పాపా" అంటూ తల్లి పక్కన నిలబడ్డ శోభని పల్కరించాడు నాయర్.

"మీకు కాఫీ.. పాపకి బోర్నవిటా కదూ మేడమ్" అంటూ వంటగదికేసి నడిచాడు నాయర్. డైనింగ్ రూము పర్యవేక్షణ పూర్తి కావటంతో విసుగెత్తిన యశోధర వంట గదికి వెనుకవేపుగా ఓ రేకుల షెడ్డులాంటిది కనిపించగా "ఏంటా" అని అటుకేసి నడిచింది. వెలుతురు తక్కువవడం చేత గబుక్కున షెడ్‌లో ఏమున్నది అంతు చిక్కలేదు యశోధరకి. అంతలోకి "ఎవరూ! అమ్మడూ! నాకింకా కాఫీ ఇవ్వలేదమ్మా!" అన్న మాటలు విన్పించి రేకుల షెడ్డులోకి ప్రవేశించింది యశోధర.

ఆ షెడ్డులో ఓ పక్కగా ఓ కుక్కి మంచం. ఆ మంచంమీద పడుకుని వుందో ముసలావిడ. వయస్సు దాదాపు ఎనభై ఏండ్లు ఉంటాయి. ఆవిడ కట్టుకున్న చీర, నడుం వరకు ఆక్రమించిన దుప్పటి ఎంతో అశుభ్రంగా వుండి మురికోడుతున్నాయ్. గది గోడలు పెచ్చులు రేగి సున్నానికి మొహం వాచిపోయినట్లు అగుపిస్తున్నాయ్. పైకప్పునుండి వ్రేలాడే బూజు- కట్టిన తోరణాల్లాగ అమరాయి ఆ గదికి. విస్తుపోయి చూస్తున్న యశోధరని "ఎవరమ్మా నువ్వు సుజాత స్నేహితురాలివా?" లేచి కూచుంటూ అంది, ఆ ముదుసలి. చూపు ఆనలేదు కాబోలు కళ్ళకి చేతులు అడ్డం పెట్టుకుని చూస్తూంది. "ఔనండీ" అంది యశోధర. కూచోవాలో, బయటకు వచ్చేయాలో తెలియని సందిగ్ధావస్థలో పడిపోయింది యశోధర.

ఇంతలోకి "యశూ ఎక్కడున్నావు? నీ కాఫీ చల్లారిపోతూంది. చప్పున రా" అంటున్న సుజాత కేకలని వెనక్కి తిరిగింది యశోధర.

బాత్‌రూమ్ బయట నిలబడి వున్న సుజాతతో "ఎవరోయ్ ఆ షెడ్డులోని ముసలమ్మ పాపం కాఫీ ఇంకా ఇవ్వలేదటోయ్!" అంది యశోధర జాలిగా.

"ఆవిడా ... ఆవిడ మా నాయనమ్మలే! నువ్వెళ్ళి కాఫీ తాగు. నాయరు ఆవిడ సంగతి చూసుకుంటాడు. తూరుపు తెల్లవారనివ్వదు కాఫీకి.." అంటూ అలక్ష్యంగ బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది సుజాత.

రాణీగారి స్నానం అయ్యేక వాళ్ళమ్మ, అమ్మమ్మా స్నానాల గదినుంచి బయటకు నడిచారు.

కాఫీ, ఫలహారాలు పూర్తిగావించుకొని, డ్రాయింగురూములో కూర్చుని కబుర్లలో పడిపోయారు స్నేహితురాండ్రిద్దరూ. సుజాత అమ్మ- సుందరమ్మ కూడా వచ్చి కూచుంది కాస్సేపటికి. ఆవిడ్ని చూస్తే మంచి కలుపుకోలు మనిషిలాగ అనిపించింది. ఇంతలోకి "అమ్మగారూ...!" అంటూ వచ్చింది పనిమనిషి.

"పెద్దమ్మగార్కిపూట తానం చేయించాలటమ్మా...!"

"ఏం అప్పుడే ఏం తొందరొచ్చింది? మొన్ననేగా ఇద్దరం కూచోపెట్టి శుభ్రంగా ఒళ్ళు కడిగాము" ఈసడింపుగా అంది సుందరమ్మ.

"ఈయాళ యాకాదశటగదా..?"

"ఆఁ ... సరేలే.. ! పని తెమలక ఛస్తున్నాను నేను పసిదానితోటి. ఈవిడకి తిథి నక్షత్రాలు కావల్సి వచ్చాయ్. నీకెందుకు, నువ్వెళ్ళు. ఆవిడ అట్లాగే అంటూ వుంటుంది."

తనదారిన తానెళ్ళిపోయింది పనిమనిషి. ఇదంతా వింటున్న యశోధరకెందుకో కష్టమనిపించింది. పాపం ముసలావిడ - ఇంకా ఆచారాలు పట్టుక వేలాడుతోంది. పసిదాని స్నానానికే అలసిపోయిందీవిడ. నిజమే! పాపాయి స్నానానికి ఎంత హంగామా! ఎన్ని ఏర్పాట్లు. తను చూస్తూనే వుందిగా దాదాపు ఓ గంట పట్టింది. (పాపాయి ఎక్కువా? పండు ముసలి ఎక్కువా?)

డ్రాయింగ్‌రూములో కన్సీల్డ్‌గా అమర్చిన గోడగడియారం నాల్గున్నొక్కటి కొట్టి వూరుకుంది. అటుగా వచ్చిన సుందరమ్మ, "అరే! అప్పుడే అయిదయిందా? మరిచేపోయేను. సుజా? పాపకీదినం విరోచనమయిందా? అయిదుగంటలవరకూ చూచి డాక్టర్‌గార్కి ఫోన్ చేయమన్నారు మీ నాన్నగారు" అంటూ కూతుర్కి కూతురు కూతురు విరోచనం సంగతి గుర్తు చేసింది.

రానేవచ్చారు సుందరమ్మ భర్త పద్మనాభం ఇంతలోకి. వచ్చీ రాగానే, "ఎక్కడ నా బుజ్జితల్లి! కాబోయే మిస్ ఇండియా ఏమంటోంది...?" అంటూ, బట్టలయినా విప్పకుండా పాపని ఎత్తుకున్నారు.

"మీ మిస్ ఇండియా ఈరోజు సమ్మె చేసింది నాన్నా.." అంది నవ్వుతూ సుజాత.

"ఓ మైగాడ్.. సమ్మే..." అంటూ పద్మనాభంగారు పాపని పైకి ఎగరేసారు.

"ఎగుమతీ దిగుమతులు బంద్..." నవ్వుతూ సుజాత అన్నమాటలకు అందరూ గొల్లున నవ్వారు. ఆ నవ్వుల గలగలలలో పాప ఘనకార్యం గావించడం ఒక్క పద్మనాభం తప్ప మిగతావారు గమనించలేదు. తడిసిపోయిన ప్యాంటు వంక చూసుకుంటూ "నెవర్ మైండ్ స్వీటీ" అంటూ పాపని మరొక్కమారు ముద్దుపెట్టుకొని సుజాత చేతికందిచ్చారు.

"అబ్బబ్బ! వెధవ గొడవ..." సణుక్కుంటూ వచ్చింది వెనుకవేపునుంచి సుందరమ్మ.

"ఏమైంది సుందరీ..." కోటు విప్పి కుర్చీమీద పడవేస్తూ అన్నారు పద్మనాభంగారు.

"ఏవిటండీ లేకపోతే. పనిమనిషి వున్నంతవరకు మీ అమ్మగార్కి మలమూత్రాదుల

గుర్తుకుర్రావు. అది అటుపోగానే ఈవిడగారు కేకలుపెడతారు- అర్జంటుగా వెళ్ళాలంటూ. అస్తమానం ఈవిడని ఎవరు తీసుకెళ్తారు లెట్రిన్‌కి" విసుక్కుంటూ భర్తవేపు చూచింది సుందరమ్మ.

మారు మాట్లాడక పద్మనాభం బట్టలు మార్చుకోసాగారు.

"అన్నట్లు నాన్నగారూ! నాయనమ్మ చెప్పమంది నీతో. నిన్నోమారు రమ్మంది. ఏదో మాట్లాడాలట..." పాపకి వుతికిన నాప్‌కిన్ కడుతూ అంది సుజాత.

"ఊం... సరే సరే. ఎప్పుడూ వుండే సోదేగా! ఒరేయ్... పద్మా నాకు మందులు మాత్రలు తెచ్చేవా నాయనా అంటూ..." భుజం మీద టవల్ వేసికొని బాత్‌రూముకేసి వెళ్తూ అన్నారు పద్మనాభంగారు.

డ్రాయింగ్ రూములోనే కూచుని ఫెమీనా తిరగేస్తున్న యశోధరకి ముసలమ్మని ఇంతకీ దొడ్లోకెవరైనా తీసికెళ్ళారా..... లేదా? అన్న శంక బాధిస్తూనే వుంది.

"యాందమ్మోవ్ నేను పనిమానేస్తాను....." రాకెట్టులా దూసుకవచ్చింది పనిమనిషి

"ముసలమ్మగారు గది అంతా ఖరాబు చేసారు. ఏంటమ్మా! అంటే నేనేం చేయనే- ఎవ్వరూ నన్ను తీసికెళ్ళలేదు.... అంటున్నారు. ఇదెక్కడి పీడ వచ్చింది నాకు" రుసరుస లాడుతోంది పనిమనిషి.

"రంగీ! ఏఁవిటే నీ దుముకుడు ? ఇంతకీ నువ్వెక్కడికి తగలడ్డావ్ ? అయినా - బిళ్ళ కుడుముల్లాగా ఎనభై రూపాయలు నీనెత్తిన పోస్తున్నది ఎందుకు అనుకున్నావ్?" సుందరమ్మ మాటలను మధ్యలోనే అందుకుంది రంగి. "యాందీ ! అమ్మో నానూ మనిషినే. అట్టా కాలు కదపకుండా ఆమె తానే కూచోమంటే నా వల్లకాదు. మీకిష్టం లేకపోతే సెప్పండి, నేనెళ్ళిపోతా."

అదిరిపోయింది సుందరమ్మ. రంగి పనిమానేస్తే యింకెలా....? ముసలమ్మను శాపనార్థాలు పెట్టూ , పనిమనిషిని బుజ్జగించి పనిలోకి పంపింది.

రాత్రి భోజనాలయ్యేక గెస్ట్‌రూములో మెత్తటి డన్‌లప్ మేట్రస్ మీద మేనువాల్చిన యశోధర, వుదయం తను సుజాత వాళ్ళింటికి వచ్చిన లగాయతు చూస్తున్న సంఘటనలు గుర్తుకు తెచ్చుకోసాగింది. పదినెలల క్రితం ఆ యింట వెలసిన పసికందుపై కుటుంబ సభ్యులందరికి గల ప్రేమాభిమానాలకి ముగ్ధురాలయింది యశోధర. చిన్నారి చిరుపుష్పమా పాపాయి. దాన్ని ప్రేమించకుండా ఎవరుండగలరు ? దాని బాగోగులకి పాటుపడనివారెవ్వరు ? కానీ, ఆ కుటుంబమంతటికి మూలవృక్షమయినటువంటి, ఆ ముదుసలి పట్ల ఇంటిల్లిపాదీ చూపే ఏవగింపు, నిరాదరణ, అలక్ష్యం, అసహ్యం యశోధరకి మిక్కిలి బాధ కల్గించాయి. సుజాత విషయం వేరు, తన అపురూప నోముల పంటపై తనకు అనురాగం హెచ్చుగా వుండటంలో ఆశ్చర్యం లేదు. కానీ, సుజాత తండ్రి పద్మనాభంగారి చేష్టలనే సమర్థించ లేకపోయింది యశోధర. కన్న తండ్రిగా తన

ప్రేమానురాగాలని తన కూతురుపట్ల, ఆ కూతురు కన్న బిడ్డపట్ల ప్రదర్శించాడే తప్ప తనకు జన్మనిచ్చిన మాతృదేవిపట్ల చూపలేక పోతున్నాడేం?

ఆలోచించేకొద్దీ అర్థమవని కఠిన సమస్యగా మిగిలిపోయింది యశోధరకి.

అప్పుడే మూడురోజులయింది ఆ యింటికివచ్చి యశోధర.

"సుజీ! నన్నూ నా కూతుర్నీ ఈ వేళయినా మా యింటికి డిస్పాచ్ చేయరాదటోయ్" అంది, యశోధర శోభ జడను గట్టిగా బిగిస్తూ.

"అలాగే ..... అలాగే, అయినా ఏమంత తొందర? మీవారు యింకా నాల్గురోజులకుగానీ కేంప్‌నుండి రారుగా."

"మావారు రారనుకో.. పిల్లలో!"

"వాళ్ళకేమోయ్ మీ అమ్మ దగ్గర గారాలు గుడుస్తూ వుంటారు."

ఇంతలోకి "అమ్మా... సుజా..!" అంటూ వచ్చింది సుందరమ్మ. పాపకేంటమ్మా పొట్ట గట్టిగా వుంది. ఒళ్ళు కూడా కొంచం వేడిగా వున్నట్లుంది" పాపని సుజాత కందిస్తూ అంది సుందరమ్మ.

"అవునమ్మా! యిందాక 'బాల అముల్' పడ్తున్నప్పుడే అనుకున్నాను. ఎందుకమ్మా వొళ్ళు వేడిగా వుంది?" అదుర్దాగా అంది సుజాత.

ఉన్నట్లుండి గుక్కపట్టి ఏడ్వసాగింది పాప. ఎవ్వరెత్తుకున్నా ఏడ్పు ఆగటం లేదు. గోలెత్తిపోతూంది. ఇంతట్లోకి, ఆఫీసు నుండి పద్మనాభంగారు రావడం, విషయమంతావిని, వచ్చిన కారులోనే పాపని తీసికొని ప్రక్కవీధిలో వున్న పీడియాట్రిషియన్ దగ్గరికి పోవటం - అదే కారులో సుందరమ్మ, సుజాతలు కూడా వెళ్ళడం- అంతా ఐదునిముషాల్లో జరిగిపోయింది.

ఏమీతోచని యశోధర, ఎప్పుడూ ఎవ్వరూ పలకరించని ముసలమ్మ దగ్గరికైనా వెళ్ళి వద్దామని వెనుకవైపున్న రేకుల షెడ్డుకేసి నడిచింది. అమ్మను అనుసరించింది శోభ.

శూన్యంలోకి చూస్తూ పడుకొని వుంది ముసలమ్మ.

"ఎవరూ! నాకు చూపు సరిగ్గా ఆనదమ్మా..." అంది ముసలమ్మ లేవటానికి ప్రయత్నిస్తూ.

"నేనండీ.. సుజాత స్నేహితురాల్ని, యశోధరని..." అంది యశోధర.

"నువ్వా అమ్మా... దా.. కూచో" అంటూ ఆహ్వానించింది, దగ్గరవున్న స్టూలు చూపుతూ.

"అలాగే" అంది యశోధర.

"నీ కూతురా అమ్మా!" శోభకేసి చూపు ఆనిస్తూ అంది ముసలమ్మ.

"ఔనండీ మామ్మగారూ...! శోభా- మామ్మగారు పిలుస్తున్నారు వెళ్లు" అంది యశోధర.

తల్లి చెప్పినట్లు చేసింది శోభ.

"నా తల్లే! నా బంగారే! ఎంత ముద్దుగా వచ్చావమ్మా నా చెంతకి..." శోభ బుగ్గల్ని చేత్తో తడిమి ముద్దు పెట్టుకుంది ముసలమ్మ.

అవీ - యివీ మాట్లాడేక, యశోధరని రెండురోజులుగా పట్టి పీడిస్తున్న ప్రశ్న గుర్తుకు వచ్చింది.

"మామ్మగారూ! మీరేం బాధపడనంటే- మిమ్మల్ని ఒకటడగాలని వుంది..!"

"అయ్యో! నాకెందుకమ్మా బాధ - అడుగమ్మా అడుగు."

"లంకంత పెద్ద ఇల్లుంది కదా! కాదని మీరీ రేకులషెడ్డులో వున్నారెందుకండీ!"

"అయ్యో! పిచ్చితల్లీ! కాలం చెల్లిన మాలాంటివాళ్ళు యింకెక్కడ వుంటారమ్మా! ఆ మారాజు కళ్ళు మూయటంతోటే నా సుఖసంతోషాలు అంతరించాయి. ఇప్పుడిక ఎలా బ్రతికితే ఏముంది? ఎక్కడుంటే ఏముంది? భగవంతునికి దయరాక నా ప్రాణంపోక.. యిలా మోడులా బ్రతుకు లాగిస్తున్నానమ్మా" పండిపోయిన కండ్లనుండి జారిపడుతున్న అశ్రుధారలు యశోధరని కలవరపెట్టాయి.

"మిగతావారి సంగతి సరే అనుకోండి. స్వయాన మీ అబ్బాయి వున్నారు కదండి. మీకెందుకండి బాధ!" వూరడించ ప్రయత్నించింది యశోధర.

"అయ్యో రాత! మా అబ్బాయా... ఎవరిని గురించమ్మా నీవు చెబుతున్నది? పద్మనాభాన్ని గురించేనా.. వాడిప్పుడు సుందరమ్మకి మొగుడమ్మా..!కాకుంటే సుజాత తండ్రి. అంతేకాని ఈ లక్ష్మమ్మ కొడుకు కాడమ్మా.. వాడు.." ఘొల్లుమంది ముసలమ్మ.

"అనవసరమైన విషయం ప్రస్తావించి మీ మనస్సును నొప్పించాను. క్షమించండి" ఓదార్పుగా అంది యశోధర.

"పరవాలేదమ్మా నా బిడ్డలాంటిదానివి. నీతోకాక ఇంకెవరితో చెప్పుకోను. ఆ మాటకొస్తే నన్ను పల్కరించే వాళ్ళు ఎవరున్నారమ్మా యిక్కడ. నా మనుమరాలు సుజాత కడుపు పండలేదని మా కోడలు ఆ మధ్య నామీద అభాండం వేసింది. ఏవిటో తెలుసా? ... మా వంశంలో మూడు తరాలు వుండే అదృష్టం లేదట.. అంటే నే బ్రతికుండగా తన కూతురు కడుపు పండించుకోలేదట. ఎలా వుందమ్మా.. చెప్పు? పండుటాకును నేను. ఏ క్షణాన్నయినా రాలిపోయేదాన్నేకాని బలవంతంగా చనిపోవడం నా చేతుల్లో లేదుకదా!

ఇంతెందుకు..? తను - నా మీద వేసిన అభాండం అర్థం పర్థంలేనిదంటూ దేవుడు నా మనుమరాలు కడుపు పండించాడు కదా. అయినా, ఆ పసికందుకు ఏ చిన్న జబ్బు చేసినా దానికి కారణం నేను బ్రతికుండడమే అన్నట్లు నన్నాడిపోసుకుంటారు. ఏవిటోలేమ్మా నువ్వింకా చిన్నదానివి.

నేను చెబుతున్న మాటల్లోని సత్యాన్ని ఆకళింపు చేసుకునే వయస్సు నీకింకా రాలేదనే నా భ
అయినా, నిన్ను ఆప్తురాలిగా తలచి నీకోమాట చెప్తున్నాను. పనికిరాని వస్తువేదైనా
పారేయవలసిందేనమ్మా. దూరంగా మనకి కన్పించనంత దూరంగా విసిరివేయాలి. అలాగే వయ
మళ్ళి- ఎముకలు కుళ్ళిన నాలాంటి ముసలాళ్లు కూడా పనికిరాని వస్తువుల క్రిందికే వస్తారవ
మాలాంటి వాళ్ళని ఇంటపెట్టుకుని మీరు బాధపడ్తూ - మమ్మల్ని బాధపెట్టేకన్నా ఏ కాసి
విషమో, మా నోటగొట్టి బయటకులాగి పారేస్తే మా పీడ విరగడైపోతుంది.."

ఆలోచనా కడలిలో తేలియాడుతున్న యశోధర వులిక్కిపడి లేచి బయటకు నడిచింది.

ఫెళ్ళుమని, మొదలంట నేలకొరిగి పడివుంది మామిడిచెట్టు. చెట్టుప్రక్కగా ఏడుస్తూ నిలబ
శోభ, మాలి సోమయ్యని తిట్టిపోస్తోంది.

మాలి నవ్వుతూ అంటున్నాడు "మీకు తెల్వదు శోభమ్మగారూ, ఇదిగో ఇటు చూడండి ఇప్పుడు ఎంత వెలుతురూ ఎండ వచ్చాయో ఈ కొత్తగా నాటిన గులాబీ అంట్లకి. ఇవిక చక్కగా ఎదుగుతాయి. ఈ ముసలిచెట్టు ఒట్టి పనికిరాని మొద్దు. దీనికాలం తీరింది. నరికిపారేయడమే న్యాయం.

"సోమయ్యా" గట్టిగా అరిచింది యశోధర.

ఎన్నడూ వినని అమ్మగారి గావు కేకకి అదిరిపోయాడు సోమయ్య.

"చూడు సోమయ్యా! ఎండిపోతున్న ఈ మోడు నిరుపయోగమని మొదలంటకొట్టి నేలమట్టం చేసాము. అలాగే పండి ఎండి చావలేక బ్రతకలేక తుదకు నికృష్టపు చావుచచ్చే ముసలివాళ్ళకి కూడా ఏ మందో- మాకో యిచ్చి చంపి బయటపారేస్తే పోలే...! చెట్టుకు మాత్రమేనటయ్యా ఈ న్యాయం...?"

"భలేవారేనండి! అమ్మగారూ? ఇంకా ఏఁవిటో అనుకొని అదలిపోయాను. మానూ - మడిసి ఒకటేనటమ్మా! మానూ మాకులు మనం - అంటే మనుషులం వేసి పెంచినవండమ్మగారూ... మరి మడిసో...? ఆ దేవుడి సృష్టి. మనమెవళ్ళం చంపడానికి. అయినా అలా చేస్తే నేరం కాదటమ్మగారూ? అయినా అమ్మగార్కి తెలవదా ఏంటి..?" మాట్లాడుతూనే నేలకొరిగి పడివున్న చెట్టుకొమ్మల్ని కొట్టనారంభించాడు సోమయ్య.

చదువురాని సోమయ్యలోని న్యాయాధికారిని కనుగొన్న చదువుకున్న యశోధర, ధరణికేసి చూస్తూ అనుకుంది తనలో- "నిజం. ఇదిన్యాయం, అదినేరం."

■

***(ఆంధ్రభూమి సచిత్ర మాసపత్రిక, డిసెంబరు 1982)***

# ఆ + అమ్మ = ఆయమ్మ

"అబ్బబ్బ! ఈ అమెరికాలో దేనితోనైనా సర్దుకు పోవచ్చుకానీ, ఈ తొడుగులతోటి కాదు. పచ్చిమిరపకాయలకి బయటికి వెళ్లాలన్నా ఈ తొడుగులు తప్పటంలేదు" కాళ్ళకి సాక్సూ, బూట్లూ తొడుక్కుంటూ విసుక్కుంది వినోదిని.

"సరే...సరే...! నీ సణుగుళ్ళు సరేకానీ ప్రతిమా - ప్రదీపులు ఏరీ? తయారయ్యారా లేదా?" చేతులకి గ్లవుజ్ వేసుకుంటూ అన్నాడు కిశోర్.

"ఏం...! మీరు కొంచెం చూసుకోవచ్చుగా! అన్నింటికీ నేనే చావాలా? ఇంతకు ముందే బట్టలేసి వదిలాను. బహుశా డెక్‌లో వున్నారేమో!" షాల్ కోసం బెడ్‌రూముకేసి నడుస్తూ అంది వినోదిని.

"ఏంగ్ ప్రీతూ...! దీపూ...!" కిశోర్ కేకలకి పరుగెత్తుకొచ్చారు ఆరేళ్ళ ప్రతిమ, నాలుగేళ్ళ ప్రదీప్. ఇద్దరూ ఎస్కిమో బేబీల్లాగ వున్నారు పూర్తిగా వులన్ బట్టలతో కవరయ్.

తయారై నిల్చున్న వినోదిన్ని చూసి,

"విన్నూ........! ప్రభాకర్ గారింట్లో కదా ఈ రోజు పాట్‌లక్ డిన్నర్. నువ్వేమేం చేస్తున్నావేంటి?" అన్నాడు. కిశోర్.

"ఇవాళ వాళ్ళమ్మాయి శృతి పుట్టినరోజు కదా... మరిచిపోయావా? మనమేం చేసి తీస్కెళ్ళక్కరలేదు" అంది వినోదిని.

"ఓకే.. ఓకే.. విజయగారి కెలాగయినా చాలా ఓపిక విన్నూ! మొన్నటికి మొన్న వాళ్ళ వెడ్డింగ్ ఆనివర్సరీకి ఎంత మంచి డిన్నరు ఇచ్చారు. ఎన్ని అయిటమ్స్ పెట్టారు. వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్ కూడా కదూ...!" అన్నాడు కిశోర్.

"ఔన్లెండి! మీ కెప్పుడూ పరాయివాళ్ళని మెచ్చుకోవడంతోటే సరిపోతుంది. నాకు కూడా విజయగారింట్లో వుంటున్న కేర్‌టేకర్-కం-కుక్ లాంటి ఆవిడ వుంటే నేను కూడా విజయ కన్నా బ్రహ్మాండంగా విందులిచ్చేదాన్ని. నాకూ బ్రహ్మరథం పట్టేవారందరూ..!" కార్లో ఎక్కి కూర్చునేవరకూ సాధిస్తూనే వుంది వినోదిని.

ఆవిడగారి వాగ్ధాటికి అలవాటుపడ్డ ప్రాణం కిశోర్‌ది. నవ్వుకుంటూ కారును ముందుకు పరుగెత్తించాడు.

ప్రభాకర్ గారింటికి వెళ్ళీ వెళ్ళడంతోటే ప్రతిమ, ప్రదీప్ పోర్టికోలో వెయిట్ చేస్తున్న విజయ పిల్లలతో కలిసి ఎటో మాయమయ్యారు.

"హలో... డాక్టర్.. రండి... మీ కోసమే వెయిట్ చేస్తున్నాను.." కిశోర్‌ని బేస్మెంట్ ఫ్లోర్‌కి లీడ్ చేస్తూ అన్నాడు ప్రభాకర్ - విజయ భర్త.

అప్పటికే, లివింగ్ రూములో చేరి విజయ, ప్రఫుల్ల, హారతి, కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళని సమీపించింది వినోదిని.

"ఏంటండీ వినోదినిగారూ...! అరగంట జర్నీ లేదు కదా మీ ఇంటి నుండి మా ఇంటికి... ఇంత లేటా? మిగతా వాళ్ళే నయం. దూరం నుండయినా తొందరగా వచ్చారు.." విజయ, వినోదిన్ని దెప్పింది.

"ఏం చెయ్యమంటారు చెప్పండి? అన్నిటికీ నే నొక్కదాన్నే కదా! మావారికి హాస్పిటల్ ఫస్ట్ వైఫ్. ఆవిడ అనుమతి లేనిదే ఇంటికి కూడా రారు ఈయనగారు." వినోదిని మాటలకు మిగిలినవారు ఫక్కున నవ్వారు.

"ఎంతయినా విజయ చాలా లక్కీ అండీ! ఎన్ని పార్టీలయినా ఇవ్వగలరు ఒళ్ళు అలవకుండా.

మనలాగా కాదు కదా! మనకయితే రెండే చేతులు. విజయగారి కయితే అదనంగా ఆయమ్మగారి చేతులు కూడా వున్నాయి కదా...!" ప్రఫుల్ల విసురు.

"నిజమేనండోయ్! దేనికయినా పెట్టిపుట్టాలి. విజయ ఎప్పుడు ఫోన్ చేసినా... ఆయమ్మగారి వంటల్ని... పద్ధతుల్ని పొగుడుతూనే వుంటారు" అందుకుంది హారతి.

డిన్నర్ టైం అవటంతో అందరూ డైనింగ్ హాలుకేసి నడిచారు.

భోజనాలయ్యి అందరూ వెళ్ళిపోయినా, ఆటల్లోపడ్డ ప్రదీప్, ప్రతిమలు ఇంకో అరగంటంటూ మొరాయించడంతో, కిశోర్- ప్రభాకర్లు టీవీ చూడ్డంలోను - వినోదిని, విజయలు మాటల్లోనూ పడ్డారు.

వినోదిని మెల్లగా విజయని కదిపింది, "విజయా! మిమ్మల్నెప్పటి నుండో అడగాలని అనుకుంటున్నాను. ఆయమ్మ... ఆయమ్మ... అంటారు కదా! ఆవిడ మీకేమౌతారు...? ఆవిడని పరిచయమే చెయ్యలేదు."

"ఓ .. కదూ... సాయంత్రం నుండి ఆమెకి కొద్దిగా ఫీవరిష్గా వుంది. అందుకే గెస్ట్ రూంలో రెస్ట్ తీసుకుంటున్నారు" అంది విజయ.

"ఉహు! కేర్-టేకర్ కయినా బాగానే సౌకర్యాలు కల్గించినట్లున్నారే!"

"అలా అనకండి వినోదినీ! పని చేయడానికి వచ్చిన మనిషిలా అన్పించడం లేదు మాకు. నా కన్నతల్లి అని నేనంటే - అదేంటి - నన్ను కన్నతల్లి కాదా! అంటారు మావారు. ఎంతో ఆప్యాయంగా వుంటారు మాతోటి."

"ఔనా! నిజంగా అంత మంచి మనిషి దొరకడం చాలా గ్రేటే! అసలు ఆవిడ మీకెలా పరిచయమయ్యారు..?"

"అదో పెద్ద గమ్మత్తండి! వరంగల్ ఇంజనీరింగ్ కాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్గా పనిచేస్తున్న మా మరిది రమేష్కి చెప్పి ఆంధ్రప్రదేశ్లోని అన్ని దినపత్రికల్లో అడ్వర్టైజ్మెంట్ ఇప్పించాం, ఓ తెలుగు వనిత కావాలంటూ...

అమెరికాలోని న్యూజెర్సీలో డాక్టరుగా పనిచేస్తున్న ఆంధ్రుల ఇంట్లో పిల్లల్ని చూసుకోడానికి- ఇల్లాలికి సాయపడేందుకు సాంప్రదాయమైన కుటుంబం నుంచి వచ్చి, నమ్మకమైన, ఏ బాదరాబందీ లేని మధ్యవయస్కురాలైన స్త్రీ కావాలంటూ...

అడ్వర్టైజ్మెంట్ ఆన్సర్ చేసిన అనేకమందిలో ఈమెను సెలెక్ట్ చేసి పంపాడు మా మరిది. పాపం! ఈవిడ చాలా మంచివారు. బాగా బ్రతికి చెడినట్లున్నారు. కాస్త దైవభక్తి ఎక్కువ. ఆవిడ ఆచారాలకి మనం అడ్డురానంత వరకు ఆవిడ హాపీ... మనం హాపీ."

"కండిషన్స్ పెట్టిందా.. ఏమిటి?" వినోదిని మాటల్లో కాసింత కోపం.

"అసలు ఆవిడని చూస్తేనే పూజ్యభావం కలుగుతుంది. మా అత్తగారో - మా అమ్మగారో ఇంట్లో తిరుగుతున్నట్లు వుంటుంది. ఇక కండిషన్స్ దేముంది? ఆమె మాటకి ఎదురేలేదనుకో.. ఔను... వినోదినీ! అన్నట్లు మీరు కూడా మనిషి కోసం చూస్తున్నారు కదా! మాలాగ అడ్వర్టైజ్ చేయవచ్చేమో..!"

"సరేలే! అందరూ మీ ఆయమ్మలాగా వుండొద్దూ..! ఇంతెందుకు మా అత్తగారు వున్నారు ఎరంగల్ దగ్గరున్న ఖాజీపేటలో. ఆవిడగార్ని రమ్మంటే ఇక్కడికి వస్తారా? వచ్చినా ఈ వాతావరణంలో ఇమడగలరా?" వినోదిని మాటలకు అడ్డు తగుల్తూ "విన్నూ..! ఇక పోదామా చాలా లేటయింది..." అంటూ వచ్చాడు కిశోర్.

"అలాగే పోదాం - కానీ - ఈ కబురు విన్నారా? విజయా వాళ్ళు పేపర్‌లో అడ్వర్టైజ్ చేస్తే - వాళ్ళకి మంచి పనిమనిషి దొరికిందట..." అంది వినోదిని.

"ఔను కిశోర్! మా ఆయమ్మ నిజంగా ఎక్సెప్షన్ అనుకో! ఆవిడ పని.. లేకుంటే పిల్లలతో కాలక్షేపం. చాలా క్వయట్ టైప్. ఆవిడ ఫ్యామిలీ విషయాలు కూడా డిస్కస్ చేయరు..." ప్రభాకర్ మాటలకి "ఇక ఈయన మొదలు కాబోలు ఆయమ్మను స్తుతించడానికి" - అయిష్టంగా ముఖం పెట్టింది వినోదిని.

"మీ ఇద్దరికీ ప్రేమపాత్రురాలయిన ఆ చల్లని తల్లిని ఓమారు చూడాలని వుంది ప్రభాకర్...." అన్నాడు కిశోర్.

"ఆయమ్మ జ్వరంగా వుందని పడుకున్నారండీ! లేకుంటే పరిచయం చేసేవాళ్ళం" విజయ మాటలు విజయనోట్లో వుండగానే పెద్ద పెట్టున ప్రదీప్ ఏడ్పు వినిపించింది.

"మేడ మీదికి ఎప్పుడెళ్ళాడు వీడు..?" అంటూ మెట్లపై పరుగుతీసాడు కిశోర్. అప్పటికే సగం మెట్లు దిగిన ఆయమ్మ చేతుల్లో ప్రదీప్!

ప్రదీప్‌ని ఆ అమ్మ చేతులలో చూసిన కిశోర్ అవాక్కయ్యాడు. భర్త వెనకే మెట్లు ఎక్కిన వినోదిన్ని చూసిన ఆయమ్మ పిల్లవాణ్ణి కిశోర్ దగ్గర వదలి గిరుక్కున వెనుదిరిగింది.

వెక్కిళ్ళు పెడుతున్న తనయుని ఎత్తుకోవాలని కూడా తోచని వినోదిని అప్రతిభురాలయి నిలబడిపోయింది!

తను ఇన్నేళ్ళుగా తలవని కన్నతల్లిని ఆయమ్మగా పరాయి ఇంట చూసిన కిశోర్ హృదయం లజ్జతో, అవమానభారంతో, దుఃఖంతో అతలాకుతలమై అంతులేని ఆవేదనతో అలమటించింది.

■

*(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 12-8-1994)*

# అమ్మకోసం

"అమ్మా ! అమ్మా ! చూడమ్మా, అత్తయ్య నన్నేడిపిస్తూంది!" శకుంతల భుజాల మీదికి వాలి గారాలు పోతూంది అర్చన. "ఏమంటుందేమిటి నా చిన్నారి తల్లిని" ముందుకు లాక్కుంది కూతుర్ని శకుంతల.

"మరేఁ ! నువ్వూ, నాన్నగారు మాత్రమేనట ఊరెళ్లేది. నేనేమో ఇక్కడే అత్తయ్య వాళ్ల దగ్గరే ఉండాలట !"

చక్రాల్లాంటి అర్చన కళ్ల నిండా అంతులేని అనుమానం. అయినా అమ్మ తనని వదిలెయ్యదులే అనే ధీమా !

కాసేపు ఏమీ మాట్లాడలేకపోయింది శకుంతల.

"అమ్మా ! చెప్పమ్మా, నా బట్టలు కూడా సర్దుతున్నావుకదూ!" రెట్టించింది అర్చన.

"అరూ! చూడమ్మా ! నీకిప్పుడు హాలీడేస్ కదా. అత్తయ్య పాపం ముచ్చట పడుతోంది నీతో ఆడుకోవడానికి."

"ఛీ ! ఎవరయినా పెద్దవాళ్లు పిల్లలతో ఆడుకుంటారేంటి... !"

"తప్పు ! అలా అనకూడదు. ఒక్క పది రోజులే కదా. తరువాత నాన్నగారొచ్చి నిన్ను తీసుకుని ఎస్తారులే. కల్పన కూడా లేదు. నువ్వన్నా ఇక్కడ కొద్ది రోజులుంటే అత్తయ్యకు బావుంటుంది" - బుజ్జగిస్తున్నా శకుంతల కళ్ళు వర్షించటానికి సిద్ధంగా ఉన్న శ్రావణ మేఘాల్లా ఉన్నాయి.

"ఊఁ...ఊఁ... నువ్వెప్పుడూ ఇంతే. పోయినసారి కూడా 'కల్పన లేదు కదా' ... అంటూ, నన్నిక్కడే ఉంచేసి వెళ్లావు. నాకిక్కడ ఒక్కటే బోర్ ! మరి నేను ఇక్కడ అత్తయ్యతో ఉంటే అక్కడ నువ్వు మాత్రం ఎవ్వరితో ఆడుకుంటావు ? ఒక్కదానివే ఎలా ఉంటావ్...?"

దీనికేం సమాధానం చెప్తావ్ ! - అన్నట్టు చూస్తూ, నిల్చున్న కూతురిని గుండెలకు అదుముకుంది సమాధానం చెప్పలేనిదయి శకుంతల.

"అరూ !" అంటూ వచ్చాడు రఘు.

"నాన్నా! అమ్మతో నువ్వయినా చెప్పు నాన్నా ! నేను కూడా మీతో వచ్చేస్తాను. నేనిక్కడ ఉండను కాక ఉండను. నాకు బోరంటే బోర్ !" శకుంతలను వదిలి రఘు చెంత చేరింది ఆరేళ్ల అర్చన.

"కొద్ది రోజులే కదా అరూ ! కిరణ్ బావ ఎలాగూ ఉంటాడు కదా."

"ఆఁ ! కిరణ్... ! ఎప్పుడూ కామిక్స్ చదువుతూ కూర్చుంటాడు. నాతో ఆడుకుంటానికి వస్తాడేంటి. అయినా, ఇక్కడ నేనుండను నాన్నా !" రఘు మెడను వాటేసుకుంది అర్చన.

శకుంతలను నిస్సహాయంగా చూస్తుండిపోయాడు రఘు !

"ఏమంటోంది మనుమరాలు ?" రంగప్రవేశం చేశారు రామారావు, రఘు చెల్లెలు - నిర్మల- మామగారు.

"ఏం లేదండీ ! అరూ ఇక్కడ ఉండనని పేచీ పెడుతూంది" అన్నాడు, రఘు.

"ఆఁ ........... నాలుగు రోజులు పేచీ పెడుతుంది; తర్వాత తనే సర్దుకుంటుంది అంతేగా..."

ఆయన మాటలను అడ్డగిస్తూ రఘు, "పాపా ! మొన్న నేను నీకు కొన్న ఫ్రాకు అత్తయ్యకు చూపించనే లేదు కదూ! తీసుకురా చూపిద్దాం" కూతుర్ని కిందికి దించాడు, రఘు.

తూనీగలా రివ్వున దూసుకుపోయింది, అరూ - శకుంతలను తన బుల్లి చేతులతో లాగుతూ!

"మామయ్యా ! పసిపిల్లని బెదిరించి ఆదిలిస్తే మరింత బెంబేలు ఎత్తిపోతుంది. కొద్దిరోజులు అటూ, ఇటూ తిప్పితే అలవాటు పడుతుంది."

"ఈ గొడవలూ - పేచీలు ఎప్పుడూ ఉండేవేలేవయ్యా. మీరు నాలుగు రోజులు కనిపించకపోతే పేచీ పెడుతుందేమో కాని, అసలు ఎప్పటికీ ఉండిపోవాలని చెప్పేస్తే తనే రాజీ పడుతుంది."

"ఏమోనండీ ! నేనూ, శకుంతల గుండె రాయి చేసుకున్నాము. కాని అర్చనదే పసి హృదయం...."

"నువ్వేమీ కంగారు పడకు. కొద్ది రోజులలో అదే సర్దుకుంటుంది. ఎంతయినా కన్నతల్లే గదా నిర్మల- ఆ మాత్రం కూతురుని మాలిమి చేసుకోలేదూ!"

అర్చనతో శకుంతల రావటం గమనించి మాటలు మింగేశాడు రామారావు.

ఎంత తేలికగా అన్నాడు- "నిర్మలే కదా కన్నతల్లి" అని. ప్రాణం చివుక్కుమంది శకుంతలకు. అవును! నిజం ఎప్పుడూ చేదుగానే ఉంటుంది. అర్చన కన్నతల్లి నిర్మల గాక తనా ? తనకంత భాగ్యమా ? అర్చన తన కూతురు కాదంటే నమ్మశక్యం కావటం లేదు. శకుంతల అంతరంగం ఆరేళ్ళ నాటి రోజులని స్మరించింది.

★ ★ ★

"అరే! నిర్మలా !! ఏమండోయ్ ! ఎవరొచ్చారో చూడండి" శకుంతల కేకకి షేవ్ చేసుకుంటున్న రఘు ఉన్నపళంగా బయటికి వచ్చాడు.

మూడ్నెళ్ళ పసికందులను - ఇద్దరిని - ఎత్తుకుని దిగుతున్నారు నిర్మలా, నిర్మల తల్లి- ఆటో లోంచి.

"అదేంటమ్మా! లెటర్ కూడా రాయకుండా ఇలా వచ్చారు. కనీసం టెలిగ్రామ్ అయినా ఇవ్వచ్చుగా" ముఖంమీది సోపు గబగబా టవల్‌తో తుడిచేసి సూట్‌కేసులు అందుకున్నాడు రఘు.

"ఏమిటోరా ! నిర్మల ఊపిరి ఆడనివ్వలేదు. వాళ్ళాయన, మామగారు పర్మిషన్ ఇచ్చారట. ఇక నాదే ఆలస్యం... అన్నట్టు ప్రయాణం చేయించింది."

ఒళ్ళో పాపను ఎక్కడ పడుకోపెట్టాలో తెలియక, అటూ ఇటూ చూస్తున్న అత్తగారి చేతిలోనుంచి అందుకుంది శకుంతల, మూడు నెలల పసికందుని - అదే అర్చనను.

"సరే! సరే! ఆవిషయాలు అన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు. ముందు మీరు లేచి కాళ్ళు చేతులు కడుక్కోండి. "శకూ! వాళ్ళకి కాఫీ అవీ చూడు" పురమాయించాడు భార్యను రఘు.

  

మంచం మీద పడుకున్న రఘు, ఆలోచనలో పడ్డాడు. తల్లి వచ్చిన దగ్గరనుంచి చెవిలో ఇల్లు కట్టుకుని పోరుతూంది, నిర్మల కవల పిల్లల్లో ఒక పాపను పెంచుకోమని. కాని తనకే ఏంటో అంత సబబుగా అనిపించటం లేదు. ఎంతయినా కన్నతల్లి చూస్తూ చూస్తూ పరాయి వాళ్ళ చేతికి- ఎంత అన్న అయినప్పటికీ - ఇస్తుందా? ఇచ్చి సంతోషంగా ఉండగలదా? వీళ్ళిప్పుడు ఇంత తొందరపడి ఇలా రావడానికి కారణం ఏమిటో తెలియని మూర్ఖుడు కాదు రఘు. పదేళ్లయినా పిల్లలు కలగని తను డాక్టర్ సలహా మేరకు అనాథ శరణాలయం నుంచి ఒక బిడ్డను తెచ్చి పెంచుకో తలచినట్టు అమ్మతో ప్రస్తావించడమే దీనికి నాంది !

గదిలో కొస్తున్న శకుంతల చేతిలో పసికందు. జాగ్రత్తగా మరింత అపురూపంగా పొత్తిళ్ళలోని పాపాయిని పక్కపై పడుకోబెడుతున్న శకుంతలని విస్మయంగా చూశాడు రఘు.

"అదేంటి శకూ ఆ పసిపాపని! ఇక్కడికి తెచ్చావేంటి ! అర్థరాత్రి పాలకోసం ఏడవదూ !"

"మరేం పర్లేదు లేండి. ఏడిస్తే నేను తీసుకెళ్ళి నిర్మలకు ఇచ్చి వస్తాను" అర్చన పక్క సర్దుకు కూర్చుంది శకుంతల.

"అయినా తల్లి దగ్గర ఉండాల్సిన పసికందు...."

"ఇక మీదట నేనే ఆ తల్లిని, ఈ అర్చనకు" సగర్వంగా పలికిన శకుంతలకేసి ఆశ్చర్యంగా చూశాడు రఘు.

"అయితే నిర్ణయాలన్నీ అయిపోయాయన్నమాట...!"

"అవునండీ.. వదినకెలాగూ కవలల్ని సాకటం కష్టం. కిరణ్ అల్లరితోనే తనకు సరిపోతుంది. అటువంటిది ఇప్పుడు మరో ఇద్దరు చంటి పిల్లలని... ఎంత కష్టం. అందునా వదినా వాళ్ళ అత్తగారయినా వుంటే అది వేరే విషయం."

"ఓపిక లేకపోతే, పెంచేవాళ్ళు లేకుంటే, పని వాళ్ళని పెట్టుకుంటారు... అంతేకానీ...."

"అదేంటండీ అలాగంటారు. మనమెలాగు పాపను పెంచుకోవాలనుకుంటున్నాం కదా! అనాథ శరణాలయం పాపకంటే నిర్మల వదిన పాపే అయితే మరింత మంచిది కదా ?" పాప బుగ్గలను సున్నితంగా సవరిస్తోంది శకుంతల.

"శకూ! నీకు ఎంత చెప్పినా అర్థం కాదేంటి. తల్లీ, తండ్రీలేని అనాథయితే వాడికి ఆసరా కల్పించిన వాళ్ళమయి తల్లీ-తండ్రీ లేని లోటు తీరుస్తాం. అంతే గానీ ఇలా నిర్మల కూతురుని పెంచటం... ఏంటో నాకు అంత బాగనిపించటం లేదు."

"సర్లెద్దురూ! పొద్దుట మాట్లాడుకుందాం. లైటు ఆర్పండి. పాపాయి నిద్రలేస్తుంది" పాప పక్కన చోటు చేసుకుంటూ అంది శకుంతల.

రఘు చెప్పిన సంశయాలన్నీ పటాపంచలు చేశారు వదినా ఆడపడచులు.

కవల పిల్లలను పెంచడమే కష్టమనుకుందో, అన్నయ్య దగ్గర తన పిల్ల పెరిగితే ఆస్తి కలుస్తుందనుకుందో, లేక పిల్లలు లేని వదిన బాధ తీర్చినట్టవుతుందనుకుందో, మొత్తానికి నిర్మల కవల పిల్లల్లో ఒక పాపని (అర్చనని) అన్నా వదినల ఒడిలో వేసే వెళ్ళింది. అంతే కాదు, "మీ కిష్టమయితే పాపను దత్తత తీసుకున్నా మాకేమీ అభ్యంతరం లేదు" అని కూడా చెప్పి వెళ్ళింది నిర్మల.

కానీ ఈనాడు...

శకుంతల హృదయం ఆక్రోశించింది.

కళ్లయినా తెరవని పసికందును కళ్ళలో పెట్టుకుని పెంచింది తను. ప్రాణంగా పెంచింది. పాప నవ్వితే తను నవ్వి, పాప ఏడిస్తే ఏడ్చి, అడుగు వేసిననాడో పండగ, అమ్మా అని పిలిచిననాడో సంబరం, పాపే తన జీవితం అన్నట్టు జీవించింది. రఘు కూడా క్రమేణా అర్చన ముద్దుమాటలకు, మురిపంపు చేష్టలకు మురిసిపోయేవాడు. అర్చన తమ కన్న పిల్ల కాదన్న విషయం మరిచారా దంపతులు.

కానీ విధి వైపరీత్యం...!

నాలుగు రోజుల జ్వరంతో కవల పిల్లల్లో పెద్దదయిన కల్పన జీవితం ముగిసింది. కూతురు పోయిన దుఃఖంతో నిర్మల పిచ్చిదే అయ్యింది. అన్నాహారాలు మాని నెల రోజులు ఏడ్చింది. కాని పోయిన పిల్ల తిరిగిరాదు కదా! నిర్మలను ఓదార్చడానికి వచ్చిన అన్నా - వదినలని, వారి వద్ద పెరుగుతున్న చిన్నారి అర్చనని చూచి మరింత కుంగిపోయింది నిర్మల. ఆ ఉన్న పది రోజులు అర్చనను దగ్గరికి తీస్తున్న నిర్మలను చూచి జాలిపడింది శకుంతల.

తాము ఊరు వచ్చేస్తుంటే అర్చనని కొదిరోజులు ఉంచమని ప్రాధేయపడింది నిర్మల.

మామయ్య కూడా బలవంత పెట్టడంతో కాదనలేక అర్చనను బుజ్జగించి నాలుగు రోజులు ఉండమని వదిలి వచ్చారు శకుంతల, రఘు.

కానీ, మూడోనాడే నిర్మల మామగారు అర్చనని తీసుకుని హైదరాబాద్ వచ్చేశారు, అర్చన పేచీ పెట్టి గొడవ చేస్తోందని. వెక్కి వెక్కి ఏడుస్తున్న అర్చనను ఆబగా గుండెల కదుముకుంది శకుంతల.

వారం రోజులు గడిచీ గడవక ముందే తల్లీ కూతుళ్ళ సంతోషాలకు అవరోధంగా, అశనిపాతంలా వచ్చిందా ఉత్తరం. కల్పన చనిపోయినప్పటి నుంచి బెంగతో నిర్మల నీరసించిపోయిందని, మీరు అందరూ కలిసి వచ్చి నెల రోజులు ఇక్కడ ఉంటే అర్చనను చూసి అయినా కొంత సేద తీరుతుందని. ఉత్తరం చదివి అవాక్కయింది, శకుంతల. రఘు ఆలోచనా రహితుడయ్యాడు. ఏం సమాధానం రాయాలో తోచలేదు. ఆఖరికి శకుంతలను, అర్చనని ప్రయాణం చేయించాడు రఘు. నెల రోజుల తరువాత తను వచ్చి తీసుకుని వస్తానని చెప్పాడు.

కాని పరిస్థితులు విషమించాయి. అర్చన లేకపోతే బ్రతుకలేనంటుంది నిర్మల. నిర్మలకు ఆసరాగా వున్న రఘు తల్లి కూడా నిర్మలనే బలపరిచింది. పిల్ల శకుంతలపై బెంగ పెట్టుకుంటుందన్న విషయం కొట్టి పారేశారు తల్లీ, చెల్లీ.

శకుంతల బాధ చెప్పనలవి కాదు. కాదు కూడదని అర్చనను ఉంచేసుకోవటానికి తనకేం అధికారం ఉంది? తను నవమాసాలు మోసిన కన్నతల్లి కాదుగా ! ఆరు సంవత్సరాలు ఆయాలాగా పోషించింది. అంతే... !

'తల్లీ బిడ్డలని ఏ జన్మలో విడదీశానో ఈనాడిలా గొడ్రాలిని అయ్యాను. మళ్ళీ ఈ పాపం నాకెందుకు? ఆ కన్నతల్లి తన ప్రాణంలో ప్రాణం, రక్తంలో రక్తాన్ని కోల్పోయి, అందుబాటులో ఉన్న తన ప్రాణం కోసం పరితపిస్తుంటే తానెవ్వరు అడ్డు నిలవడానికి ...?' శకుంతల గుండె దిటవు చేసుకుంది. రఘుకు నచ్చచెప్పింది.

పక్కలో ఆదమరిచి నిద్రిస్తున్న అర్చనను వదిలి భర్తతోపాటు రిక్షా ఎక్కుతున్న శకుంతల హృదయంలో అంతులేని అగాధం. నిర్లిప్తంగా ఎటో చూస్తున్న భర్తను పలకరించడానికి కూడా భయపడింది శకుంతల... భర్త వద్దన్నా పట్టుపట్టి పాపని పెంచి అతనికి ఆవేదనని మిగిలించిన అపరాధం తనదేనని ఆక్రోశించింది శకుంతల హృదయం.

ఇంటికి చేరిన ఆ ఇద్దరు ఆ ఇంట్లో ఉండలేకపోయారు. ఎక్కడ చూసినా అర్చన గుర్తులే. అర్చన కేరింతలే. కొద్దిరోజులు సెలవుపెట్టి అలా తిరిగి వద్దామని నిర్ణయించుకున్నారు. అనుకోకుండా రఘు ఆఫీసు పనిపై ఢిల్లీ వెళ్ళవలసి రావటంతో ఇద్దరూ బయలుదేరారు. ఢిల్లీ, ఆగ్రా, నాసిక్, ఋషీకేష్ యాత్రలు తిరుగుతున్నా శకుంతల - రఘు, అర్చనని మరిచిపోలేకపోయారు. పెంచిన మమకారానికే మనం ఇంత బాధపడుతుంటే కన్నతల్లి బిడ్డమీద ప్రేమనెలా చంపుకోగలదు?... అని తలపోశారు రఘు, శకుంతల.

పదిహేను రోజుల యాత్రానంతరం ఢిల్లీ చేరిన రఘుకు ఆఫీస్ టేబిల్‌పై అర్జంట్ మెసేజ్ కనిపించింది, హైదరాబాద్ ఆఫీసును వెంటనే కాంటాక్ట్ చేయమని. ఆదుర్దా పడుతూ ట్రంకాల్ చేసి నిరుత్తరుడయ్యాడు రఘు. వెంటనే శకుంతలను ప్రయాణం చేయించాడు హైదరాబాద్‌కు.

"ఏంటండీ ఇంత అర్జంటు ?" అంటే "చెప్తాను, చెప్తాను పద ! ప్లేనుకు టయిమ్ అవుతోంది" అని ప్లేను ఎక్కించి నెమ్మదిగా చెప్పాడు, "అర్చనకు సీరియస్‌గా వుంది. మనల్ని వెంటనే రమ్మని టెలిగ్రాం ఇచ్చారు" అంటూ.

"అయ్యో! అదేమిటండీ ఇంత నింపాదిగా చెప్పారు. ఎన్ని రోజులయ్యిందో టెలిగ్రాం వచ్చి" గట్టిగా ఏడ్వడం మొదలు పెట్టింది శకుంతల. "ఉష్ శకూ! నిన్నే ! నిన్ననే వచ్చింది టెలిగ్రాం. కంగారు పడకు. అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడు. మనమిప్పుడు ఏడ్చి చేసేదేమి లేదు. ట్రయిన్‌లో వెళితే ఆలస్యం అవుతుందనే కదా! ప్లేన్‌లో వెడుతున్నాం" అని, భార్యను అనునయించాడు రఘు. ఏడుస్తూనే ఉండిపోయింది శకుంతల ప్రయాణం అంతా . . . !

టాక్సీ దిగగానే పరుగు తీసింది శకుంతల. "వదినా !" అంటూ ఎదురొచ్చి కావలించుకుంది నిర్మల.

"నిర్మలా! ఏదీ నా అరూ? ఎక్కడుందీ?..." పిచ్చిదానిలా నిర్మలని పట్టుకుని కుదిపేసింది శకుంతల.

"ఉష్ ! నెమ్మది. ఏంటా అరుపులు. పద ! పద ! మేడ మీద గదిలో ఉంది. ఇద్దరు డాక్టర్లు చూస్తున్నారు." అత్తగారి మాటలకు శకుంతల ఒక్క ఉదుటున మేడమెట్లెక్కి గదిలోకి దూసుకుపోయింది.

తెల్లటి పక్కపై, తెల్లగా పాలిపోయిన ముఖంతో పడుకునుంది అర్చన. "అరూ! అంటూ ఒక్క ఉదుటున అర్చనని చేరింది శకుంతల. పక్కన ఉన్న డాక్టరు "నిశ్శబ్దం" అని సైగ చేశాడు. అర్చన పక్కపై కూర్చున్న శకుంతల అర్చన తలపై చేయివేసి తన్నుకువస్తున్న దుఃఖాన్ని ఆపుకోవటానికి విఫలయత్నం చేసింది. కానీ తన ప్రమేయం లేకుండా జారిపోతున్న అశ్రుధారలను ఆపలేకపోయింది. అర్చన ముఖాన్ని తడుపుతున్న కన్నీళ్ళను పమిట కొసతో తుడుస్తూ "అరూ! నా చిట్టి తల్లీ ....." అంటూ ముద్దుల వర్షం కురిపించింది. శకుంతల ముద్దుల ధాటికి కళ్ళు తెరిచింది అర్చన.

స్థిరం లేకుండా అటు ఇటు తిప్పిన చూపులను శకుంతల మీద క్షాసేపు ఉంచింది. వెంటనే ఆ పసిదాని ముఖంలో ఆనందం చోటు చేసుకుంది. "అమ్మా!" అంటూ చేతులెత్తి లేవబోయి, నీరసంతో చేతులు వాల్చేసింది.

"అరూ! నా బంగారు తల్లీ . . ." అంటూ అర్చనను ఎత్తి తన భుజంపై వేసుకుంది శకుంతల.

"ఎక్కడికెళ్ళారమ్మా నువ్వూ, నాన్న. . ?" అంటూ అర్చన తన ముఖాన్ని శకుంతల గుండెల్లో దాచేసుకుంది. కన్నీళ్ళను కలబోసుకుంటున్న ఆ తల్లీ కూతుళ్ళను అలా చూస్తూ నిలుచుండిపోయారు, మిగిలిన వాళ్ళంతా.

శకుంతల పరిచర్యలతో పది రోజులకే లేచి కూర్చుంది అర్చన. శకుంతల కొంగు వదలటంలేదు.

"అమ్మా ! నేను అత్తయ్య పాపనట . . . ! నానమ్మ చెప్తూంది. కిరణ్, కల్పనే కదా అత్తయ్య పిల్లలు. నేను నీ పాపనే కదూ ! నేను బుజ్జి పాపగ ఉన్నప్పుడు అమ్మ ఒళ్ళో కూర్చున్న ఫోటో ఉంది. కావాలంటే చూపిస్తాను రా. ........ . అని అన్నా కూడా, కాదులే అంటుంది నానమ్మ...!" అర్చన ఎడతెగని సంభాషణా ప్రవాహంలో తడిసి ముద్ద అవుతూంది శకుంతల.

'నిజమే. ఆ చిన్నారి హృదయంలో అమ్మను నేనే ! కళ్ళు విప్పి తొలిసారి చూసింది కూడ నన్నే !'

"అవునమ్మా నేనే మీ అమ్మను. నానమ్మ తమాషాగా అందిలే."

"ఇంకెప్పుడు నన్నొదిలి వెళ్ళద్దు" రాత్రిళ్ళు నిద్రపోయే ముందు కూడా ఇదే వరస. ఎన్ని వాగ్దానాలు తీసుకుంటుందో చిట్టి తల్లి అర్చన !

అర్చనతో ఊరికి ప్రయాణం అయిన శకుంతలకు పసుపు కుంకుమలిచ్చి తాంబూలం చేతిలో పెడుతూ అంది నిర్మల, "వదినా! నేనొకనాడు కోల్పోయిన పెన్నిధి, అయాచితంగా నీ వశం అయ్యింది. నేను మళ్ళీ అది కోరడం ఎంత తెలివి తక్కువో అర్థం అయ్యింది..."

"నిర్మలా! నువ్వు అలా బాధపడితే. . ."

"వద్దొదినా ! నన్నాపకు. నాకు ఇప్పుడు ఏ బాధా లేదు. నా బిడ్డ నా కళ్ళెదుటే ఉండాలని ఆశించానే కాని నా బిడ్డకో హృదయం ఉంది, ఆ హృదయం వేరొకరి సొంతం అయిందని అర్థం చేసుకోలేకపోయాను. నా మూర్ఖత్వంతో పిల్లనే పోగొట్టుకునేదాన్ని. అయ్యో ! కన్నతల్లి అని నువ్వు జాలిపడి, నీ పెంచిన ప్రేమను త్యాగం చేయగలిగావు గాని ఆ చిన్ని హృదయానికేం తెలుసు ఇవన్నీ. మనిద్దరం కలిసి పసిదాన్ని బాధపెట్టాం" అర్చనను దగ్గరికి లాక్కుని గట్టిగా ముద్దు పెట్టుకుంది నిర్మల.

నిర్మలను వదిలించుకుని శకుంతల వెనక దాక్కుంది అర్చన.

***(ఆదివారం ఆంధ్రప్రభ, 18-9-1994)***

# పట్టులంగా బుట్టబొమ్మ

ఆధునాతనంగా వున్న ఆ బంగళా ముందు ఆటో దిగిన ఆనందమూర్తి పాకెట్ డైరీ తెరచి అడ్రస్ కరక్టేనా అని మరొక్కమారు చెక్ చేసుకున్నాడు.

బంజారా హిల్స్‌లో రోడ్లు, వాటి నంబర్లు చాలా కంఫ్యూజింగ్‌గా వుంటాయ్. ఒకవేపు రోడ్డు నంబర్ వన్ అయితే మరోవేపు రోడ్డు నంబరు పది. అమల రూట్ మాప్ పంపబట్టి సరిపోయింది. అమ్మయ్య! బ్రతికిపోయాను - లేకుంటే నా బ్రతుకు 'బంజార' అయ్యేది. ఆటో దిగిన ఆనందమూర్తి సామాను దింపుకొని నిట్టూర్చాడు. తను ఆటోవాడికి డబ్బులిచ్చి పంపేలోగా గేటు తెరిచి 'ఆయి ఏ సాబ్' అంటూ ఆహ్వానించాడు ఘూర్ఖా.

అమల, అమెరికా నుండి వచ్చి అప్పుడే రెండు వారాలు దాటింది. "మీ అల్లుడుగారు చాలా బిజీగా వున్నారు. అందుచేత నన్నొచ్చి తీసికెళ్ళండి నాన్నగారు. తర్వాత మీ అల్లుడు గారు వస్తారు. నేనుండేది ఇంకో రెండువారాలే కదండీ" అన్న కూతురి ఉత్తరం చూసి ఆనందమూర్తి హైదరాబాదు ప్రయాణమయ్యాడు. కూతురి కన్నా, తన మనుమరాలు మనీషని చూడాలన్న ఆతురత ఆయనలో కొట్టొచ్చినట్లు కన్పిస్తూంది. మనీషకిప్పుడు నాలుగేళ్ళు. ఆనందమూర్తి నొక్కిన బజ్జరు చప్పుడుకి పనివాడు కాబోలు వచ్చి తలుపు తెరిచాడు. సూటుకేసు అందుకొని కూచోండి అని చెప్పి లోపలికి వెళ్ళాడు.

అమల ఆడబడుచు వాళ్ల ఇల్లది. సినిమా సెట్టింగులా వుంది డ్రాయింగు రూము. గ్రానైట్ వాల్ పానల్స్, వైట్ మార్బల్ ఫ్లోరింగ్, పెద్దపెద్ద సోఫాలు, సీలింగ్ నుండి వ్రేలాడుతున్న ఛాండిలియర్స్- డ్రాయింగ్ రూము అందాన్ని ఆస్వాదిస్తూ కూచున్న ఆనందమూర్తికి మంచినీళ్ళ గ్లాసు అందించి అక్కడి నుండి తప్పుకున్నాడు ఇందాకటి పనిపిల్లవాడు.

ఇంతలో బుట్ట బొమ్మలాగ పట్టు లంగా జడగంటలు వేసుకొని కాలిపట్టాలను గల్లుగల్లు మనిపిస్తూ రంగప్రవేశం చేసిందో చిన్నారి. సోఫాలో కూచుని వున్న ఆనంద మూర్తిని చూసి ఒక్క నిమిషం ఆగి రివ్వున ముందుకు పరుగెత్తింది. ఆ పాపని తరుముతూ వెనుకనే వచ్చిందో బార్బీడాల్‌ని పోలిన అమ్మాయి. క్లోజ్‌గ క్రాపు చేసిన తలకట్టు, ఫారెన్ మాక్సీతో పచ్చటి పసిమివర్ణంతో తళతళలు పోతూందా పాప. ఆనందమూర్తి లేచి బార్బీడాల్‌ని బాహువుల్లో బంధించపోయాడు. కాని అతని చేతికి అందకుండా తుర్రుమందా పాప. "అరే! నాన్నగారు!! అదేంటండి ఇక్కడే కూచున్నారు. వెంకట్ వచ్చి 'ఎవరో వచ్చారమ్మగారూ అనంటే' వదిన గారి చుట్టాలేమో అనుకున్నాను. మీరా. అమ్మని కూడా తీసుకొని వస్తే బాగుండేది కదండీ!" ఆప్యాయంగా ఆనందమూర్తి ప్రక్కన కూచుంది అమల.

"బాగున్నావా తల్లీ! మీ అమ్మ అంత తొందరగా కదుల్తుందా? నిన్నూ మనవరాల్ని ఎప్పుడెప్పుడు చూద్దామా అని కలవరిస్తూంది. అల్లుడుగారు లేరా?" తనివి తీరా తనయను చూసుకుంటూ అన్నాడు ఆనందమూర్తి.

"లేరండీ! వైజాగ్‌కి ఏదో పనిమీద వెళ్ళారు - వాళ్ళ బావగారితో కూడా ఎన్.ఆర్.ఐ. ఇన్వెస్ట్‌మెంట్స్, ఫ్యాక్టరీ వ్యవహారాల్లో బిజీగా తిరుగుతున్నారు. అందుకే మిమ్మల్ని రమ్మని ఉత్తరం వ్రాసాను. అమ్మ, తమ్ముడు - వినోద్, మరదలు - ప్రణవి కులాసాయే కదా!"

"ఆఁ అందరూ బాగున్నారమ్మా. నా ముద్దుల మనవరాలేంటి - నేను పిలుస్తున్నా విన్పించుకోకుండ పరుగెత్తింది!"

"క్రొత్త కదండీ! మిమ్మల్ని ఎప్పుడు చూడలేదు కదా నీష. ఇక్కడే ఆడుకుంటున్నట్లుంది కదా ఇంతసేపూ..." అంటూ అమల అటూ ఇటూ చూస్తుండగానే వెళ్ళినంత వేగంగా తిరిగొచ్చారు, పట్టులంగా బుట్ట బొమ్మ, బార్బీడాల్ మాక్సీ పాప.

"ఇదిగో ఇలా రండి.. ఎవరొచ్చారో చూడండి...!" అంటూ పిల్లలిద్దర్ని దగ్గరికి పిల్చింది అమల.

బార్బీడాల్‌ని - "ఇలా రా తల్లీ" అంటూ దగ్గరికి లాక్కున్నాడు ఆనందమూర్తి. జడకుచ్చుల జడని అటూ - ఇటూ ఆడిస్తూ, పట్టులంగా బుట్టబొమ్మ పరుగున వెళ్ళి అమల ప్రక్క నిలబడి పెద్దపెద్ద తన కళ్ళని మరింత పెద్దవి చేసి ఆనందమూర్తిని చూడసాగింది.

ఆనందమూర్తి చేతుల్లో నుండి విదిలించుకొని "మమ్మీ!" అంటూ, లోపలికి పరుగెత్తింది బార్బీడాల్.

తెల్లబోయి చూస్తున్న ఆనందమూర్తిని చూచి పక్కున నవ్వింది అమల. "నాన్నగారూ... మనీష ఇక్కడుందండి... నీషా... మీ తాతగారే! తాతగారికి నమస్తే చెప్పు...."

ముందుకు వచ్చి కాళ్ళకి దణ్ణం పెట్టబోతున్న మనవరాల్ని ఎత్తి ఒళ్లో కూచోపెట్టుకున్నాడు ఆనందమూర్తి.

"బాగుందమ్మా! కళ్ళ ముందే కన్పిస్తున్న నా ముద్దుల మనవరాల్ని చూచి గుర్తు పట్టలేకపోయాను. అన్నట్టు మీ ఆడబడుచుగారి అమ్మాయి కూడ మనీష ఈడుదే గదూ! ఏంటో ఇద్దర్నీ ప్రక్కప్రక్కనే చూచి పొరపడ్డాను. అమెరికాలో పుట్టి పెరిగిన పిల్ల కదా అన్న భ్రమలోనే వున్నానే కాని ఇండియాలోనే పుట్టి పెరిగిన పిల్లలు అధునాతన నాగరికతతో, అమెరికాలోని పిల్లలతో పోటీపడి వాళ్ళని మించిపోతున్నారన్న నిజాన్ని విస్మరించాను.

అమల నవ్వుతూ నాన్నగారికేసి చూచింది. మళ్ళీ అందుకున్నాడు ఆనందమూర్తి. "అమలా! నా మనవరాలు మనీష నాకు బాగా నచ్చిందమ్మా. 'నా మనవరాలు అచ్చం నాలాగ వుందని' మీ అమ్మ మురిసిపోతుంది. 'అమెరికాలో పుట్టి పెరిగింది కదా ఆ పిల్ల అసలు నాతో తెలుగులో మాట్లాడుతుందో మాట్లాడదో" అని బెంగపడ్తాంది మీ అమ్మ."

"తాతగారూ! మిమ్మల్ని గుర్తు పట్టాను. ఆల్బమ్‌లో చూసాను. - మిమ్మల్ని, అమ్మమ్మని, అందరినీ. అమ్మమ్మ దగ్గరికి ఎప్పుడు వెళ్దాం?" అంటూ తాతయ్య ఒళ్ళో సర్దుకు కూచుంది, మనీష.

మనుమరాలి ముద్దుముద్దు మాటలకు మురిసిపోతూ మెచ్చుకోలుగా కూతురికేసి చూసాడు ఆనందమూర్తి. ఇక్కడ ఇండియాలో కాన్వెంట్ స్కూళ్ళలో చదివే పిల్లలు తెలుగు మర్చిపోయినట్లు ప్రవర్తిస్తారు. ఆనందమూర్తి కది అనుభవైక వేద్యం. అటువంటిది అక్కడే పుట్టి పెరిగిన మనీష తెలుగెంత చక్కగ మాట్లాడుతూంది.!

నాన్నగారి భావాలను చదివినట్లు అమల అంది. "ఎందుకు నాన్నగారూ అంత ఆశ్చర్యపోతున్నారు. మనం ఎక్కడున్నాము అన్నది ప్రశ్న కాదు. మన ఉనికిని, మన సంప్రదాయాన్ని మనం మర్చిపోకూడదు కదా ! మన ప్రజ్ఞతో, ముఖ్యంగా చిన్న పిల్లలని తీర్చిదిద్దాలి. మనీష తోటి మేము ఇంట్లో తెలుగులోనే మాట్లాడుతాము. రామాయణ, మహాభారత కథలన్నీ చాలా ఆసక్తిగా వింటుంది మనీష కదురా నీషా ! అందుకే అదంత బాగా మాట్లాడకలదు. ఊం. మన కబుర్లకేంగాని తాతగార్ని లోపలికి తీసుకురా." అమల వెంట ఇంట్లోకి నడిచాడు ఆనందమూర్తి, ఆనందంగా మనీష చెయ్యి పట్టుకొని.

*(తెలుగు పలుకు 1995, దశమ ఉత్తర అమెరికా తెలుగు సమావేశం ప్రత్యేక సంచిక)*

# ప్రతిబింబం

"అసంభవం డాక్టర్, అసంభవం, మా అమ్మగారు మానసికంగా అప్‌సెట్ అయ్యారంటే నేను ఒప్పుకోలేను. ఇన్నేళ్ళకు అమ్మ మళ్ళీ సంతోషంగా, సుఖంగా ఉంటున్నది ఇప్పుడే డాక్టర్. ఆవిడకు ఇప్పుడు మనశ్శాంతి కరువయిందంటే నన్నెలా నమ్మమంటారు" ఉద్విగ్నతతో ఊగిపోతున్నాడు నరేంద్ర.

"మిస్టర్ నరేంద్రా! కామ్‌యువర్‌సెల్ఫ్. ఆవేశం తెచ్చుకున్నంత మాత్రాన మన సమస్యలు పరిష్కారమైపోతే, ఆవేశం ఈ ప్రపంచాన్ని రాజ్యమేలేది. నా మాట విని ప్రస్తుతానికీ విషయాన్ని మరచిపొండి. నో మోర్ డిస్కషన్స్ ఆన్ మై ఫైండింగ్స్. సైకియాట్రిస్ట్ దగ్గరికి మీ అమ్మగారిని తీసికెళ్ళడం తప్ప వేరే మార్గం లేదన్నదే నా సలహా. అంతమాత్రానికి ఉద్రేకపడితే ఎలా!"

"చూడండి సుమనగారూ, మిస్టర్ నరేంద్ర చాలా ఆవేశంలో ఉన్నారు. ప్రస్తుతం మీరిద్దరూ ఇంటికి వెళ్ళండి. సాయంత్రం నేనటువచ్చి మీ అత్తగారిని చూస్తాను. ఈలోపల గనుక మళ్ళీ ఫిట్స్ వస్తే నేనిచ్చిన ట్రాంక్విలైజర్ వేయండి. వెంటనే నిద్రపడుతుంది. ఓ.కే.!" ఇక మీరు వెళ్ళొచ్చు అన్నట్లు డాక్టర్ యతీంద్ర లేచి నిలబడ్డాడు. నరేంద్ర నెమ్మదిగా లేచి సుమన వెంటరాగా డిస్పెన్సరీ నుంచి బయటకి నడిచాడు.

పరధ్యానంగా స్టీరింగ్ తిప్పుతూ, అన్యమనస్కంగా డ్రైవ్ చేస్తున్న భర్తని చూస్తే సుమనకి జాలి కలిగింది.

"ఏమండీ" అంది సుమన స్మిస్మితంగా భర్త భుజాన్ని తాకుతూ. కుడి చేతిలోని సిగరెట్ కారు కిటికీలోంచి గిరాటు వేసి, "సుమా" అంటూ భార్య వేపు తిరిగాడు నరేంద్ర.

అతని ముఖంలో అంతులేని ఆవేదన.

"ఏమిటండీ, మరీ చిన్నపిల్లాడిలాగా!" సముదాయింపుగా అంది సుమన.

"కాదు సుమనా నీకు తెలీదు, అమ్మ ఎంత దుఃఖాన్ని అనుభవించిందో! పెళ్ళయ్యేవరకు ఏం సుఖపడిందో కానీ... ఈ దురదృష్టవంతుడు ఆమె కడుపులో పడ్డాక..."

"ఇప్పుడవన్నీ ఎందుకండీ."

"ఉష్, నన్నాపకు. నువ్వు కాదన్నంతమాత్రాన నేను దురదృష్టవంతుణ్ణి కాకపోతానా. నేనామె కడుపులో పడినప్పటినుంచి ఆమెకు కష్టాలే. నేను తీరా ఈ ప్రపంచంలోకి అడుగు పెట్టకముందే, ప్రపంచంనుంచి సెలవు పుచ్చుకున్నాడు నాకు జన్మనిచ్చిన తండ్రి. తల్లీ, తండ్రీ తానై సాకింది నన్ను మా అమ్మ. ప్రేమంటే ఏవిటో ఉగ్గుపాలతో కలిపి పట్టింది. మంచితనమంటే ఏవిటో ఆమెని చూసి నేర్చుకున్నాను. ఓర్పు, నేర్పుల రూపాన్ని అమ్మలో చూశాను. తన రక్తమాంసాలని నాకోసం వెచ్చించింది. నే పుట్టిన నాటికి పదిహేడేళ్ళయినా నిండని నా కన్నతల్లి నాకోసమే తన నిండు జీవితాన్ని పండించింది. మగదిక్కు లేక అన్ని కష్టాలు భరించిన ఆనాడు కూడా ఆమెలో ఇంతటి మనోఖేదాన్ని ఎరుగను. కష్టాలన్నీ గట్టెక్కి, నన్నో ప్రయోజకుణ్ణి, ఇంటివాణ్ణి చేసి ఆనందంగా నిశ్చింతగా గడపవలసిన ఈ సమయంలో అమ్మకి మనశ్శాంతి కరువయిందా? మానసిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతూందా ? ఎలా నమ్మను సుమనా... ఎలా నమ్మను. ఏ విధంగా, మరే విధంగా ఆమెకు మనశ్శాంతినివ్వగలను!" బాధగా స్టీరింగ్ వీల్ మీద తల రుద్దుకుంటున్న భర్తని చూసి చలించిపోయింది సుమన.

"చూడండి! కష్టాలు వచ్చినప్పుడే మనిషి నిలదొక్కుకోవాలి. డాక్టర్‌గారు అనుమానించినంత మాత్రాన అత్తగారికి మానసిక వ్యాధి అని ఎందుకనుకోవాలి? బహుశా ఆయన పొరపాటు పడి వుండొచ్చు. దేనికైనా యతీంద్రగారి సూచన మేరకు సైకియాట్రిస్ట్‌ని సంప్రదించడం మంచిదనే నా అభిప్రాయం కూడా."

"నిజమే. కానీ, అమ్మని సైకియాట్రిస్ట్ దగ్గరికి తీసికెళ్ళడం నాకెందుకో నేరం చేసినంత గిల్టీగా ఉంది సుమా."

"అదే! అదే నే వద్దన్నది. రోగ నిర్ణయం కాందే చికిత్స చేయలేం కదా. ఏమో ఎవరు చూడొచ్చారు. అసలామెకు ఏ జబ్బూ లేకపోవచ్చు. ఏమంటారు?" సుమన ధైర్య వచనాలతో నరేంద్ర కొంత ఊరట చెందాడు.

మంచం దగ్గరికి వచ్చిన సుమన, అత్తగారు నిద్రపోతుండడం గమనించి నెమ్మదిగా బెడ్‌రూం నుంచి బయటికి వచ్చి వరండాలో ఉన్న కుర్చీలో కూచుంది. సుమన బలవంతంమీద నరేంద్ర కాసింత అన్నం తిని అప్పుడే అలా పడుకున్నాడు. అత్తగారు నిద్రలేచాక పాలు ఇవ్వాలని సుమన అలాగే కుర్చీలో కూర్చుంది. సుమన మనసులో డాక్టర్ చెప్పిన మాటలే పదే పదే వినిపించసాగాయ్. "మీ అత్తగారికి మనసులో ఏదో చెప్పరాని బాధ, కల్లోలం ఉందమ్మా. ఆ బాధ నివారణ జరిగితే తప్ప ఆమెకి ఫిట్స్ రావటం తగ్గదు. ఇలా ఫిట్స్ వస్తుంటే క్రమేణా పిచ్చి కూడా పట్టే ప్రమాదం ఉంది. మీవారికీ విషయం ఇప్పుడే చెప్పకండి. అందుకే ఆమెను వెంటనే సైకియాట్రిస్ట్ దగ్గరికి తీసికెళ్ళడం చాలా అవసరం..."

అత్తగారి ప్రవర్తన మొదటినుంచి గుర్తు చేసుకోసాగింది సుమన. మొట్టమొదటగా ఫిట్స్ రావడం ఎప్పుడో, ఎందుకొచ్చిందో చెప్పమని డాక్టర్ యతీంద్ర పదే పదే అడిగారు. కానీ, సుమన అప్పట్లో అంత ఆలోచించలేకపోయింది. కానీ, ఇప్పుడిలా విశ్రాంతిగా కూచుంటే ఆమెకు గతం, గతంలో శాంతమ్మగారి ప్రవర్తన సినిమారీళ్ళలాగ తిరగసాగింది.

★ ★ ★

పెళ్ళి చూపులనాడు శాంతమ్మగారిని చూసి ఆమె నరేంద్ర అక్కగారేమో అనుకుంది సుమన. ఆమే తనకి కాబోయే అత్తగారని తెలిసి విస్తుపోయింది. అత్తగారి తలపై అక్కడక్కడ నెరసిన వెంట్రుకలకి రంగువేసి ఆవిడ వయసు ముప్ఫయ్ ఏళ్ళంటే ఎవరైనా ఇట్టే నమ్మేస్తారు. చక్కటి పొడవు, పసిమి వర్ణపు పల్చటి శరీరం- ఎంత చక్కటిది సుమన అత్తగారు అని అందరూ అనుకున్నారు తన పెళ్ళినాడు.

నరేంద్ర తల్లిలా పొడవుగా ఉన్నా, రంగు మాత్రం చామనఛాయ. తల్లి పోలికలు కూడా అట్టేలేవు అతగాడిలో. అందుకు కారణం తర్వాత తెలిసింది సుమనకి నరేంద్ర అచ్చు తండ్రి పోలికని. నరేంద్ర కడుపులో ఉన్నప్పుడు నరేంద్ర తల్లిదండ్రులు తీయించుకున్న ఫోటో చూసి

సుమన మరింత ఆశ్చర్యపోయింది. నరేంద్ర ఇప్పుడెలా ఉన్నాడో, అచ్చు అలాగే ఉన్నారు ఆ ఫోటోలోని నరేంద్ర నాన్నగారు.

పెళ్ళి మూడ్రోజులు నరేంద్రతోపాటు శాంతమ్మగారు కూడా సుమనని ఒక్కనిమిషం వదలకుండా అపురూపంగా చూసుకుంది. 'నా కోడలికి నేనే జడ వేస్తాను. నేనే ముస్తాబు చేస్తాను' అంటూ రకరకాల అలంకారాలు చేసి, అందాల భరణి నా కోడలంటూ అందరితో చెబుతూ ఆనందించింది. సుమన ఫైనల్ ఇయర్ బియ్యేలో ఉండడంతో కోడల్ని వెంటనే కాపురానికి తీసికెళ్ళడం వీలుపడలేదు శాంతమ్మగారికి. పక్క ఊరే అవడం చేత అప్పుడప్పుడూ వచ్చి కోడల్ని చూసి వెళ్ళేవారు శాంతమ్మగారు. 'పాడు పరీక్షలు అయిపోయేదెన్నడో. నా కోడలు నా ఇంట దీపం పెట్టేదెన్నడో' అంటూ అందరితో వాపోయేది. దీపావళి పండక్కి కోడలి పుట్టింటికి వచ్చి ఎన్నెన్ని సంబరాలుచేశారో. సెలవు దొరక్క రాలేకపోయిన నరేంద్రని తలచుకొని సుమన ఎక్కడ బాధపడ్తుందో అని "అమ్మాయ్.. సుమనా... సుమనా" అంటూ ఆ పిల్లని అంటుకుపోయి తనున్న రెండ్రోజులు అనురాగం, ఆప్యాయతలతో మరపించి మురిపించింది కోడల్ని. సుమన తన అదృష్టానికీ, అత్తగారి మంచితనానికీ పొంగిపోయింది.

★ ★ ★

అదే ఆ రోజే శాంతమ్మకు ప్రథమంగా ఫిట్స్ వచ్చిన రోజు. క్యాంపు నుంచి రాత్రికి కానీ రాడనుకున్న నరేంద్ర పని అయిపోవడం వల్ల ఆ సాయంత్రానికే తిరిగి వచ్చేశాడు. శాంతమ్మగారు బజారుకెళ్ళారు. డ్రాయింగ్ రూములో టీవీ ఆన్ చేస్తున్న సుమనని వెనుక వేపుగా వచ్చి చుట్టేశాడు నరేంద్ర. చేతిలోని బ్రీఫ్‌కేసుని నేలమీదకి జారవిడిచి, రెండు చేతులతో సుమనను తనవేపు తిప్పుకున్నాడు. పదిరోజుల వియోగం... కొంగ్రొత్త ప్రణయం. పరిసరాలని గురించిన ఆలోచన నశించింది. నరేంద్ర చేతుల్లో నలిగిపోతున్న సుమన అకస్మాత్తుగా ఏదో కిందపడ్డ చప్పుడవడంతో ఆవేపు తిరిగింది.

ఎప్పుడొచ్చారో అత్తగారు, కాయగూరల సంచి ఆమె పక్కన కిందపడి ఉంది. తలుపు కానుకుని నిల్చున్నారు. ముఖమంతా తెల్లగా పాలిపోయి ఉంది. వణకుతూ ఆసరాగా గోడను పట్టుకుని నిల్చున్న అత్తగారిని చూసిన సుమన భర్త చేతుల్లోంచి తప్పించుకుని పరుగుపెట్టింది తలుపుకేసి. కానీ, నేలపై వాలి పడబోతున్న అత్తగారిని ఆపలేకపోయింది. కిందపడి కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటున్న అమ్మని చూసి, "అమ్మా, అమ్మా, ఏమయిందమ్మా" అంటూ కేకలు పెడ్తూ తల్లి దగ్గరికి పరుగెత్తాడు నరేంద్ర. పరుగున లోపలికెళ్ళి నీళ్ళు తెచ్చి అత్తగారి ముఖంపై చల్లింది సుమన. అయిదు నిమిషాల తర్వాత కోలుకుంది శాంతమ్మ. శుశ్రూషలు చేస్తున్న కొడుకుని, కోడల్ని చూసి కాస్త సిగ్గుపడి లేచి కూచుంది.

"అరే ఏమయింది నాకు? ఇంద్రా నువ్వెప్పుడొచ్చావు నాయనా" అంది తన గదికేసి మెలమెల్లన అడుగులేస్తూ. తల్లిని అనుసరించాడునరేంద్ర.

కాస్సేపటికి బయటికి వచ్చాడు నరేంద్ర. అమ్మకి అకారణంగా ఎన్నడూ లేనిది ఏమిటీ ఫిట్స్? తను ఊర్లో లేని పది రోజులు కోడలుపిల్లని వెంటబెట్టుకొని నగరమంతా తెగ తిప్పి చూపించానంది. దానివల్ల కలిగిన ఆయాసమూ. అదే అన్నాడు నరేంద్ర సుమనతో.

భర్త చూపెడుతున్న కారణం అంత సంతృప్తినివ్వలేదు సుమనకు. అలాగని బయటకు వెలిబుచ్చనూ లేకపోయింది. ఏమైతేనేం, వెనువెంటనే అత్తగారు కోలుకోవడంవల్ల ఆ విషయాన్ని అంతటితో మరచిపోయారు. కానీ, కాలక్రమేణా అత్తగారిలో ఓ విధమైన అలజడిని, అసంతృప్తిని గుర్తించసాగింది సుమన. నరేంద్ర తనతో హాస్యమాడుతూ ముచ్చటిస్తున్నప్పుడు, ఆవిడ ముందే తనని వెక్కిరిస్తూ సరాగాలాడుతున్నప్పుడు - ఆవిడ ముఖంలో ఏదోచెప్పజాలని భావం- ఇదిమిత్థంగా నిర్వచించలేని సంక్షోభం తాను చూడసాగింది. అలా అని భర్తకెలా చెప్పగలదు?

కొడుకు కోడళ్ళిద్దర్నీ కులాసాగా బయట తిరిగి రమ్మని, ఏ సినిమాకో, షికారుకో వెళ్ళి రమ్మని ప్రోత్సహించి పంపేవారు. కానీ, ఇద్దరూ తిరిగి ఇల్లు చేరుకున్నాక మాత్రం కాస్సేపు ముభావంగా ఉండేవారు. అత్తగారు ఒంటరితనం ఫీల్ అవుతారేమోనని తమతో రమ్మని ఆహ్వానించేది సుమన. 'నేనెందుకర్రా, పానకంలో పుడకలా' అంటూ తప్పుకొనేవారు శాంతమ్మ.

ఆరోజు ఆదివారం. ముందురోజు రాత్రి చాలా పొద్దుపోయి వచ్చాడు నరేంద్ర. ఆదివారమేగా అంటూ ఎనిమిది గంటలైనా నిద్ర లేవని భర్తని పాపం పోనీలే అనుకుని పట్టించుకోక తనపనిలో తాను నిమగ్నురాలయింది సుమన. కానీ, లొమ్మిదవడంతో ఏమైందీయనకి అనుకుంటూ పడగ్గదిలోకి ప్రవేశించింది. కడిగిన ముత్యంలా, అరవిచ్చుకున్న గులాబీలా, అపర రతీదేవిలా "శ్రీవారికింకా సుప్రభాతం కాలేదా" అంటూ తనమీదికి వంగి ముఖంలోకి చూస్తున్న ప్రేయసిని చూసి నిగ్రహించుకోలేకపోయాడు నరేంద్ర.

తడి తడి జుట్టు, చంద్రబింబంలాంటి ముఖం, చెప్పకుండా వచ్చిన శృంగారావకాశం- భార్య ముఖాన్ని దగ్గరికి లాక్కుంటూ, ముద్దుల వర్షాన్ని కురిపించసాగాడు నరేంద్ర. "ఛీ.. ఛీ.. మీరు చెడింది కాక నన్ను కూడా చెడుపుతారా" అంటున్న సుమన మాటలు కంఠశోషగానే మిగిలిపోయాయి. వారిస్తున్న సుమన నివారింపజాలని తన్మయత్వానికి లోనైపోయింది. నరేంద్రలోని కోర్కెకి దాసోహమన్న సుమన, కొద్ది సేపటికి కాని బాహ్య ప్రపంచానికి రాలేకపోయింది. తెలివి తెచ్చుకున్న సుమన, కొంటెగా నవ్వుతున్న భర్తని ఆవలికి తోసి పరుగున బయటికి వచ్చింది.

తెరిచి ఉన్న తమ గది వాకిట గిలగిలా తన్నుకుంటున్న అత్తగారిని చూసి, "ఏమండీ" అంటూ ఒక పెద్ద కేక పెట్టింది. అస్తవ్యస్తంగా ఉన్న బట్టల్ని సరిచేసుకొని బయటకు పరుగెత్తిన నరేంద్ర, తల్లిని వెంటనే పక్కమీదికి చేర్చాడు. మునుపటిలా కాక ఉధృతంగా వచ్చింది తల్లికీమారు ఫిట్స్.

వెంటనే డాక్టర్ యతీంద్రకు ఫోన్ చేయడం, ఆయన వచ్చి నిద్రకు ఇంజక్షనివ్వడం నిమిషాల మీద జరిగిపోయాయి. కాళ్ళూ, చేతులు కొట్టుకోవడం మానేసి నిద్రకొరిగారు శాంతమ్మగారు.

"అమ్మాయ్ - సుమనా!" అన్న అత్తగారి పిలుపుతో ఉలిక్కిపడి లోపలికి వెళ్ళింది సుమన. "నాకేమయిందమ్మా, ఇంత నీరసంగా ఉంది" అంటూ లేవబోయారు శాంతమ్మగారు.

"అత్తయ్యగారూ, మీరు లేవకండి. ఇదిగో హార్లిక్స్" అంటూ గ్లాసు అందించింది సుమన. మాట్లాడకుండా తాగేసి గ్లాసు సుమన చేతికిచ్చారు శాంతమ్మ.

"ఔను. అబ్బాయ్ ఇంద్రుడేడీ" అన్నారు అటూ ఇటూ చూస్తూ.

"ఇప్పుడే పడుకున్నారు. లేపమంటారా" అంది సుమన.

"వొద్దొద్దు. అదేంటమ్మా నీ ముఖమలా వాడిపోయి ఉంది. అన్నం తిన్నావా లేదా." అత్తగారి ఆప్యాయతానురాగాలకు కళ్ళు చెమర్చాయి సుమనకు. ఇంత అనారోగ్యంలో కూడా తనపై ఎంత శ్రద్ధ చూపుతున్నారు.

అత్తగార్ని సమాధానపరచి పడుకోబెట్టింది సుమన. ఆ దెబ్బతో పది రోజులకు కాని మామూలు మనిషి కాలేకపోయారు శాంతమ్మగారు. రాత్రనక, పగలనక శుశ్రూషలు చేస్తున్న కోడల్ని, కొడుకుని చూసి సంబరపడిపోయారామె.

  

డాక్టర్ వినోద్ కుమార్ పేరుమోసిన మానసిక శాస్త్రవేత్త. నరేంద్రకి చిరకాల మిత్రుడు కూడా. అతని పలకరింపుకే సగం రోగం నివారణ అవుతుందంటారు ఆయన్ని ఎరిగినవారు. బంజారా హిల్స్‌లో వినోద్‌కుమార్ కొత్తగా కట్టుకున్న భవంతిలోకి దూసుకువచ్చిన కారు పోర్టికోలో ఆగింది. అందులోంచి దిగుతున్న శాంతమ్మగారిని, నరేంద్రా సుమనల్ని ఎదురేగి ఆహ్వానించాడు వినోద్‌కుమార్. చక్కటి కబుర్లతో పాటు చిక్కటి కాఫీ కూడా అందరికీ అందేలా చూసి శాంతమ్మగారిని లాబ్‌కి రమ్మన్నాడు వినోద్‌కుమార్. లాబ్ బయట నిరీక్షిస్తూ కూచున్నారు నరేంద్ర, సుమన. ఓ గంట తర్వాత బయటకు వచ్చిన వినోద్‌కుమార్ దంపతులిద్దర్నీ లోనికి తీసుకెళ్ళాడు. ఇండ్యూస్డ్ స్లీప్‌లో ప్రశాంతంగా పడుకొని ఉన్నారు శాంతమ్మ. సబ్‌కాన్షస్ స్టేట్‌లో ఆమె మానసిక స్థితికి సంబంధించిన అబ్జర్వేషన్స్ నోట్ చేసిన ఓ కాగితాన్ని నరేంద్రకి అందించాడు వినోద్‌కుమార్. అందులోనివన్నీ మెడికో - టెక్నికల్ టర్మ్స్. నరేంద్రకి అర్థం కాలేదు. ప్రశ్నార్థకంగా చూశాడు డాక్టరుకేసి.

"కమాన్ నరేంద్రా. సుమనా మీరూ రండి. మీ అమ్మగారికి ఇంకో అర్ధగంటకి కానీ పూర్తిగా తెలివి రాదు. మనమలా కూచుందాం రండి" కన్సల్టింగ్ రూమ్‌లోనికి నడుస్తూ అన్నాడు వినోద్‌కుమార్.

విశాలంగా ఉన్న గదిలో అర్ధవలయాకారంలో అమర్చబడిన సోఫాలు రెండింటిలో దంపతులిద్దరూ కూచున్నారు. వలయానికి కేంద్రబిందువు స్థానంలో ఉన్న కుర్చీలో కూర్చుంటూ, "చూడు నరేంద్రా, నథింగ్ టు వర్రీ, రిలాక్స్ యువర్‌సెల్ఫ్" అన్నాడు వినోద్‌కుమార్. "మంచికి

మారుపేరు మీ తల్లిగారు. అటువంటి ఆమెకు ఇటువంటి మానసిక సంక్షోభం ఎందుకని కదూ మీ సంశయం. తొందరపడకండి. ఆమె కొందరిలా చెడుభావాలు కలిగిన స్త్రీ అయినా, కోపతాపాలకి గురి అయ్యే స్త్రీ అయినా ఆమె నేడింత అలజడికి గురి అయ్యేది కాదు. ఆమె వయసు నలభై అని ఇందాక నువ్వే అన్నావు కదా. పెళ్ళయిన సంవత్సరానికంతా భర్తను పోగొట్టుకొని సాంసారిక సుఖానికి దూరమయిన మీ కన్నతల్లి నిజంగా చాలా దురదృష్టవంతురాలు. స్త్రీ సహజ గుణాలు ఆమెలోనూ ఉన్నాయ్. కోర్కెలూ ఉన్నాయ్. కానీ, చిన్ననాడే భర్తను పోగొట్టుకున్న ఆమె తన కోర్కెలను విస్మరించి, పోయిన తన భర్తను నీలో చూసుకొని జీవించింది. నిన్ను పెంచడమే ధ్యేయంగా పెట్టుకుంది. తన వ్యాపకమంతా నీ అభివృద్ధే. నిన్నే కేంద్రబిందువుగా చేసుకొని నీ చుట్టూ తన జీవితాన్ని మలచుకుంది. కానీ, నీవు పెద్దవాడివై, నీకో తోడు దొరికి, నీ కాళ్ళమీద నీవు నిలబడి ఆమెనుంచి దూరమవజొచ్చావ్. ఆమెతో పంచుకొనని, పంచుకోజాలని ఆంతరంగిక జీవితం నీకంటూ ఒకటి ఏర్పడింది. అది సహజమే! కానీ ఆమెకో? ఆమె జీవితం బయటకి నిండుగానే కనిపించినా, ఆమె అంతరంగం శూన్యమైపోయింది. ఆమెకి శారీరక విశ్రాంతి దొరికింది. తన గురించి ఆలోచించుకునే వ్యవధి ఇప్పుడిప్పుడే దొరికింది. ఆమెలో నిద్రాణమై ఉన్న కోర్కెలు ఈనాడు కోటికి పడగలెత్తి ఆమెను కాటేయజూస్తున్నాయ్. స్వతహాగా మంచి మనిషి, మంచి మనసుగల వ్యక్తి కావడంవల్ల దుష్ట కోర్కెల ప్రకల్పితాలకి దాసోహమనక, మానసిక సంఘర్షణకి లోనవుతోంది. తనలో మంచితనం ఏమాత్రం లోపించి ఉన్నా, ఆరళ్ళు పెట్టే అత్తగారి చందాన మీ ఇరువురి మధ్య పొరపొచ్చాలు పెట్టి, తాను కొంత శాంతిని పొంది ఉండేది. ఆవిడలోని మంచితనమే తీరని శాపమై ఈ అలజడికి, అశాంతికి కారణమైంది." డాక్టర్‌గారి మాటల్ని వింటున్న సుమన హృదయం అత్తగారి పట్ల జాలితో నిండిపోయింది. నరేంద్ర చేష్టలుడిగినవాడిలా డాక్టర్నే చూస్తూ ఉండిపోయాడు.

డాక్టర్ వినోద్‌కుమార్ మళ్ళీ అందుకున్నాడు.

"ఇక పరిష్కారం. ఇదే కదూ మీ సందేహం. అది కూడా కొంత క్లిష్టంగానే ఉంటుంది. కొంతకాలం మీ ఇద్దరి నీడలు సోకని ఏ నర్సింగ్‌హోమ్‌లోనో ఆమె గడపడం చాలా అవసరం."

"నో. ఇంపాజిబుల్, వినోద్, మా అమ్మని, నా మాతృమూర్తిని ఒంటరిగా, దిక్కులేనిదానిలా నర్సింగ్‌హోమ్‌లో ఉంచను. ఉంచలేను." ఉద్రేకంగా అన్నాడు నరేంద్ర.

"అయితే మీ ఇద్దరూ దాంపత్య జీవితాన్ని మానేసి ఆమెతో కలిసి జీవించండి. ఇంతకన్నా వేరే పరిష్కారం లేదు." జడ్జీ దోషిపై తీర్పు ఇచ్చినంత కటువుగా అంటూ లేచి వెళ్ళిపోయాడు వినోద్ కుమార్.

పుట్టింటికి ప్రయాణమవుతున్న సుమన కళ్ళు పదే పదే నీళ్ళతో నిండిపోసాగాయ్. 'తనంత అదృష్టవంతురాలు లేదని ఎంత మురిసిపోయింది! తల్లిని మించిన తన అత్తగారి లాంటి

అమృతహృదయులు నూటికి, కోటికి ఏ ఒక్కరోకానీ ఉండరని గర్వపడింది. కానీ, అది గర్వభంగమా! ఈనాడు తనకది తీరని శాపమా!'

ఎటూ చెప్పలేక సతమతమవుతూ అశాంతితో అలమటించే భర్తని చూస్తూ, ఆ బాధని భరించడంకన్నా కొద్దిరోజుల వియోగమే మేలనుకున్న సుమన, భర్త ఊళ్ళో లేని సమయం చూసి పుట్టింటికి పయనం పెట్టుకుంది.

"అత్తగారూ! కళ్ళు మూసినా, కళ్ళు తెరిచినా అమ్మానాన్నలు కనిపిస్తున్నారు. ఊరెళ్ళి మళ్ళీ వారం రోజులలో వచ్చేస్తా. మీ అబ్బాయిగారు కూడా ఒప్పుకున్నారు" అంటూ పుట్టింటికి పయనమవుతున్న కోడల్ని వారించలేకపోయారు శాంతమ్మగారు. అసలు విషయం అది కాదని తెలియని అమాయకపు అత్తగార్ని చూస్తే మరింత దుఃఖం ముంచుకొచ్చింది సుమనకి.

తన కాళ్ళకి దణ్ణం పెట్టి లేచి నిలబడ్డ సుమన నయనాలు అశ్రువులతో నిండుకున్నాయ్. "ఏంటమ్మా మరీను" గోముగా కసిరి, పోయిరమ్మని దీవించి పంపారు శాంతమ్మ కోడలిని.

పుట్టింటికి చేరిన సుమన ఒళ్ళు తెలియని అలసటతో పదిరోజులు మంచం పట్టింది. ఆ తర్వాత మనుషుల్లో పడ్డ సుమనకు మరొక ప్రాణి తనకడుపున పడిందని తెలిసింది.

నెల రోజులకి టూర్ నుంచి వచ్చిన నరేంద్రని చూసి కదిలిపోయింది సుమన.

ఆరోగ్యమే మూర్తీభవించినట్లుండే నరేంద్ర ఆర్నెల్లు లంఖణాలు చేసిన మనిషిలా తయారయ్యాడు. అత్తగారు తనని తీసుకురమ్మన్నారని నరేంద్ర అంటే, శుష్కహాసం చేసి ఊరకుంది. "అత్తగారి ఆరోగ్యం బాగుపడాలంటే మనకీ వియోగం ఇంకొన్నాళ్ళు తప్పదండీ" అంది భర్తతో.

"కానీ ఎన్నాళ్ళు? అమ్మకేం సమాధానం చెప్పను?" నరేంద్ర దీనంగా ప్రశ్నించాడు.

"ఏమో?" తనకేం తెలియనట్లు సుమన సమాధానం.

సుమనతో గడిపిన నాలుగురోజులలో తాను తండ్రి కానున్న విషయం తెలుసుకొని ఉబ్బితబ్బిబ్బయ్యాడు నరేంద్ర.

కానీ, తల్లికీ విషయం తెల్పడమెలా? 'పగవాడికి కూడా వద్దీ జీవితం' అంటూ ఆక్రోశించాడు నరేంద్ర. భర్తకి ధైర్యం చెప్పి, సైకియాట్రిస్ట్ వినోద్‌కా విషయం చెప్పి, ఆయన సలహాలను పాటించమంది సుమన.

డాక్టర్ వినోద్‌కుమార్‌కి సుమన ప్రెగ్నెన్సీ గురించి చెప్పాడు నరేంద్ర.

"గుడ్. ఇదీ ఒకందుకు మంచిదే. మీ అమ్మగార్కి కూడా ఈ శుభవార్త అందజేయి."

"కానీ, వినోద్..! అమ్మకి మళ్ళీ ఫిట్స్..."

"అదో, అక్కడే నువ్వు పొరబడ్తున్నావు. సుమన తల్లి కాబోతుందంటే ఆనందించే మొదటి వ్యక్తి మీ అమ్మగారు. ఆమె అనురాగమయి. కొడుకు, కోడళ్ళ క్షేమం కోరే ఉన్నత వ్యక్తి."

"కానీ, సుమన వచ్చాక.."

నరేంద్ర మాటలకు అడ్డు తగిలాడు డాక్టర్ వినోద్‌కుమార్. "ఇదొక మంచి మలుపుగానే నేను భావిస్తున్నాను నరేంద్రా. అయినా, తర్వాతి విషయాలు తర్వాత ఆలోచిద్దాం. ఏం!"

తాను నాయనమ్మ కాబోతున్న విషయం తెలియగానే శాంతమ్మగారి ఆనందానికి అవధులు లేకపోయాయి.

"అబ్బ, ఎంత తియ్యటి వార్తని అందజేశావురా ఇంద్రా, పద సుమనని చూసి వద్దాం" అంటూ ప్రయాణం పెట్టుకుంది శాంతమ్మగారు. కానీ, వినోద్, నరేంద్ర ఆమె ప్రయాణం చేసే స్థితిలో లేదంటూ ఆపేశారు.

"ఇంకెన్ని రోజులమ్మా! నీ కోడలు మనవణ్ణో, మనవరాల్నో ఎత్తుకొని త్వరలో వచ్చేయదూ" అంటూ అమ్మని సమాధాన పరిచాడు నరేంద్ర.

"ఒరే ఇంద్రా. బాబు పుడ్తే వాణ్ణి 'టింకూ' అని పిలుద్దాంరా. మీ నాన్నగారి పేరు కలిసి వచ్చేలా" అంది శాంతమ్మ నవ్వుతూ. తలూపాడు నరేంద్ర.

భార్యకు నవమాసాలు నిండి, పండంటి బాబును ప్రసవించిననాడు నరేంద్ర హృదయం చెప్పజాలని భావోద్రేకానికి గురి అయింది.

వినోద్‌కుమార్ చెప్పిన విషయాలు గుర్తు పెట్టుకొని బాలింతరాలు సుమనని, పది రోజులయినా నిండని పసికందుని వెంటబెట్టుకొని తల్లి వద్దకు వచ్చాడు నరేంద్ర.

కారులోనుంచి దిగుతున్న కోడల్ని చూసి సంతోషాతిశయంతో ఎదురేగి కౌగిలించుకుంది శాంతమ్మ. సుమన చేతిలోని పసిడిబొమ్మని-మూసపోసినట్లు నరేంద్ర పోలికలో ఉన్న ప్రతిబింబాన్ని ఆప్యాయంగా అందుకుంది.

కాన్పు కష్టమై, బాగా రక్తంపోయి పాలిపోయి ఉన్న సుమనని జాగ్రత్తగా ఇంట్లోకి నడిపించింది. తల్లిపాలకి కూడా నోచుకోని ఆ ముక్కుపచ్చలారని పసివాడికి తానే తల్లి అయింది శాంతమ్మ.

అహర్నిశలు మనుమడి పోషణలో, వాడి ఆటపాటలలో, ముద్దూ ముచ్చట్లలో మునిగి తేలుతున్న శాంతమ్మగారిలో కొడుకూ, కోడళ్ళ గురించిన చింతనే దూరమయింది. మునుపటి ఆరోగ్యంతో ఆనందంగా ఉన్న తల్లిని చూసి నరేంద్ర 'టింకూ' రూపంలో దేవుడే తనకొక దారి చూపించాడని నిశ్చింతగా నిట్టూర్చాడు.

■

***(ఇండియా టుడే, జూలై 6-20, 1995)***

# డాటర్ (ఇన్-లా)

"అమ్మా! ఎవరొచ్చారో ఇలా వచ్చి ఒక మాటు చూడు" సురేష్ కేకలకి అన్నపూర్ణమ్మ చేస్తున్న పని ఆపి వాకిట్లోకి వచ్చింది.

గుమ్మానికి అడ్డంగా నిలబడ్డాడు సురేష్ - ఆ వచ్చిందెవరో అన్నపూర్ణమ్మకి అగుపించకుండా!

"అదేంట్రా ! అడ్డులే! వచ్చిందెవరో చెప్పకపోతే మానె ! చూడనన్నా చూడనివ్వవా...." కొడుకును లాగినంత పని చేసిన అన్నపూర్ణమ్మకు నవ్వు ముఖంతో కనకలక్ష్మి దర్శనమిచ్చింది.

"కనకా ! నువ్వా!! సురేష్ ! పిన్ని వచ్చిందని చెప్పక ఏవిట్రా ఈ పరాచికాలు. అయినా కనకా, నువ్వేంటే చిన్నపిల్లలా వాడి వెనకాల దాక్కున్నావు?" అక్కాచెల్లెళ్లు నవ్వుకుంటూ లోపలికి నడిచారు. సురేష్ సూట్‌కేసు, ట్రావెలింగ్ బ్యాగు లోపలికి చేరవేసాడు.

"ఆంటీ ! బాగున్నారా?" అంటూ కాఫీ కప్పుతో హాల్లోకి వచ్చిన సంగీత పిన్నత్తను పల్కరించింది.

సంగీత ప్రశ్నకు సమాధానమా అన్నట్లు తలను అటూ-ఇటూ వూపి "అక్కా! బావగారేరి.... కన్పించరేం....?" అంటూ అన్నపూర్ణమ్మ కేసి చూసింది కనకలక్ష్మి.

"పిల్లల్ని స్కూల్లో దింపడానికి వెళ్లారు. ఈపాటికి వచ్చేస్తూంటారు. అదో స్కూటర్ చప్పుడు....."

రానే వచ్చారు రాఘవరావుగారు.

"అరరే ! బహుకాల దర్శనం. మా తమ్ముడుగారు పర్మిషన్ గ్రాంట్ చేసినట్లున్నారే! అయినా ఉత్తరం, రాస్తే సురేష్ స్టేషన్‌కి వచ్చేవాడు కదా ! శంకరం కూడా వచ్చి ఉంటే బాగుండేది... అన్నట్లు సురేష్! స్ఫూర్తికి రోజు స్కూల్లో ఏదో డ్రిల్ ప్రాక్టీస్ ఉందట. సాయంత్రం నువ్వు బ్యాంకు నుండి వస్తూ పికప్ చేయి. నేను మామూలు టైంకి అజయ్‌ని తీసుకొస్తాను. ఇక ఏంటమ్మా కబుర్లు? వివేక్, పద్మిని ఎలాగున్నారు ? పిల్లలు - శ్రుతి, సుమ స్కూలు కెళ్తున్నారు కదా ?" మరదల్ని కుశల ప్రశ్నల వర్షంలో ముంచెత్తారు రాఘవరావు.

"అందరూ బాగానే ఉన్నారు బావగారూ ! ఏంటో మిమ్మల్నందర్ని చూడాలనిపించి హఠాత్తుగా బయల్దేరాను. అయినా, మమ్మల్ని రాలేదని దెప్పిపొడుస్తున్నారు కాని మీరు మాత్రం ఎన్నిమార్లు అటువచ్చారు. పోయినేడు రాకరాక వచ్చిన మా అక్కని నాలుగు రోజులు స్థిమితంగా ఉండనిచ్చారా....?"

కనక వాగ్ధాటికి అడ్డుకట్ట వేస్తూ అన్నపూర్ణ, "కనకా! నీకు తెలీందేముంది ? నేను లేకుంటే ఒక్క క్షణం నడవదిక్కడ. సురేష్, సంగీత ఇద్దరూ ఉద్యోగస్తులు. పిల్లలు........... వాళ్ల స్కూళ్లు, బంద్‌లు, పనిమనుషుల నాగాలు - పట్టణంలో మా ప్రతిబంధకాలు నీకు అర్థంకావులే!" మాట్లాడుతూనే వంటింట్లోకి నడిచింది అన్నపూర్ణ. అక్కని అనుసరించిన కనక ఆమె బిజీగా టిఫిన్ డబ్బాలు సర్దడం చూచి ఆగిపోయింది.

"అత్తయ్యా ! నాకు టైం అయింది. ఈరోజు క్యాంటీన్ నుంచి టిఫిన్

తెప్పించుకుంటానులెండి....'' అంటూ, లోపలికొచ్చిన సంగీతకి రెండు డబ్బాలు అందిస్తూ, "ఎందుకమ్మా క్యాంటీన్ టిఫిన్లు - ఇదిగో - ఇది నీకు, ఇది సురేష్‌కు...'' అంది అన్నపూర్ణ.

"సాయంత్రం కొంచెం లేట్ అవుతుందేమో అత్తయ్యా! ఎగ్జామ్స్ దగ్గర పడ్డాయి కదా ! స్పెషల్ క్లాసులు తీసుకుంటున్నాను. మీ అబ్బాయిగారు కూడా స్ఫూర్తిని తీసుకువచ్చేటప్పటికి లేట్ అవ్వచ్చు. వెజిటబుల్స్ కూడా లేనట్లున్నాయి...'' అంది సంగీత.

"అవన్నీ నేను చూసుకుంటాను లేమ్మా... నువ్వు కాలేజీకి నడు....... ఇప్పటికే లేట్ అయింది...'' అన్నపూర్ణ తొందరపెట్టింది సంగీతని.

"వస్తానాంటి ! ఇక రాత్రికే మన కబుర్లు ....'' కనకలక్ష్మి కేసి చూస్తూ చకచకా చెప్పులేసుకుని. హాండ్‌బాగ్ భుజానికి తగిలించుకుని, సురేష్ వెనక స్కూటర్ మీద కూచుని 'బై' చెప్పింది సంగీత.

వెళుతున్న సంగీతని విస్తుపోయి చూస్తూ నిల్చున్న చెల్లెలుతో అంటోంది అన్నపూర్ణ. "కనకా ! నీకోసమని సంగీత మళ్లీ గీజర్ ఆన్ చేసినట్లుంది. స్నానం చేసిరా! నేను, మా ఇద్దరికీ, నీకూ కలిపి బియ్యం కుక్కరులో పడేసి వస్తాను. తీరుబడిగా కబుర్లు చెప్పుకుందాం...''

"అదేంటక్కా! కోడలుపిల్ల నీకు, బావగార్కి అన్నం వండదా....?'' ప్రశ్నించింది కనక.

"ఎందుకు వండదూ....! చల్లారిపోతుందని నేనే నిదానంగా పెడ్తాను. అయినా, కుక్కర్లో బియ్యం పడేయడం కూడా ఒక పనేనా....?''

ఇంకేం మాట్లాడలేక కనక తనకి కేటాయించిన గదిలోకి నడిచింది.

మధ్యాహ్నం భోజనాలయ్యాక రాఘవరావుగారు కాసేపు పడుకుంటానంటూ గదిలోకి వెళ్లారు. అక్కా-చెల్లెళ్లిద్దరూ, పిల్లల గదిలోని పక్కల మీదికి చేరారు.

"త్రీ బెడ్‌రూం ఫ్లాట్ అనుకుంటా అక్కా! బాగానే ఉందే...'' అంది మంచం మీద బాసింపట్టు వేసుక్కూర్చుంటూ.

"ఔనే కనకా ! మీ బావగారి పెన్షన్ డబ్బులు, సురేష్ బ్యాంక్ లోన్, ఇంకా తక్కువయితే ఊళ్లోని పొలం కొంత అమ్మితే ఈ ఇల్లు - అదే - ఫ్లాటు వచ్చిందనుకో...'' అన్నపూర్ణ కూడా కనక ప్రక్కనే కూర్చుంది.

"కనకా! వివేక్ అబ్రాడ్ వెళ్లే ఉద్దేశంలో ఉన్నట్టు రాశావు. ఎంత వరకొచ్చాయేంటి ప్లాన్లు?"

"ఆఁ వాడికి వెళ్లాలనున్నా, ఛాన్సెస్ రావద్దూ. వచ్చినా మేం వెళ్లనివ్వద్దూ. కానైతే మా కోడలుపిల్ల మాత్రం మా దుగ్ధ పడిపోతోంది, ఎప్పుడెప్పుడు విమానాల్లో ఊరేగుదామా అని....." ఈసడింపుగా అంటున్న కనక కేసి విస్మయంగా చూసింది అన్నపూర్ణ.

"చిన్నవాళ్లు కదా ! అవకాశాలు వస్తే మాత్రం వదలకూడదు కనకా ! ఈ వయసులోనే వెళ్లిరావాలి. మా సురేష్‌కి కూడా అదే చెప్తుంటాను. అది సరే సుమ డాన్సింగ్ ఎంతవరకు వచ్చింది....?" మాట మార్చింది అన్నపూర్ణ. అక్కయ్య తనతో మాట్లాడుతూనే ఉంది, నిద్రలోకి జారుకుంది కనక.

బూట్ల చప్పుడికి మెలకువ వచ్చింది కనకకి. గదిలోకి దూసుకువచ్చిన పదేళ్ల అజయ్, "నానమ్మా!" అంటూ లోనికి వచ్చి తన పడక మీద ఉన్నది తన నానమ్మ కాదని గ్రహించి రివ్వున వెనుదిరిగి వంటగది ప్రవేశం చేసాడు.

"ఒరే వెధవా! బూటుకాలితో వంటగదిలోనికి రావద్దన్నానా..." గోముగా మనవణ్ణి కసరి బూట్లు విప్పసాగింది అన్నపూర్ణ.

"ఏంటక్కయ్యా ! నీ మనవడు నన్ను గుర్తు పట్టినట్లు లేదు...!" డైనింగ్ టేబుల్ దగ్గర కుర్చీని లాక్కుని కూర్చుంటూ అంది కనక.

"ఔను మరి... అయిదేళ్లకో... ఆరేళ్లకో ఒక మాటు వస్తుంటే ఇలాగే ఏడుస్తాయి సంబంధాలు. అజూ ! కాళ్లూ చేతులు కడుక్కుని రా! టిఫిన్ తిందువు గాని...." ప్లేట్‌లో అటుకుల ఉప్మా, సున్నుండలు పెట్టి గ్లాసులో బోర్నవిటా రెడీ చేసింది అన్నపూర్ణ. అలాగే కనకకి ఒక ప్లేటు, తనకో ప్లేటు తెచ్చుకుంది.

"అబ్బ! మధ్యాహ్నం తిన్న అన్నమే అరగలేదు..." అంటూనే సున్నుండని సున్నితంగా కొరకసాగింది కనక.

"అజూ! టిఫిన్ అయ్యాక కాసేపు ఆడుకో! మీ తాతగారు వాకింగ్‌కి వెళ్లి తిరిగి వచ్చాక, నీ చేత హోంవర్క్ చేయిస్తారు."

"అలాగే నానమ్మా!" అంటూ టిఫిన్ తినసాగాడు అజయ్.

రేపటికి కావలసిన ఆకుకూర, చిక్కుడుకాయలు డైనింగ్ టేబిల్ మీద పెట్టి, భర్త తెచ్చిన మిగతా కూరగాయల్ని ఫ్రిజ్‌లో సర్దేసింది అన్నపూర్ణ. కనక నానుకుని కుర్చీలో కూర్చుంటూ "కనకా!

కలకత్తా అన్నయ్య దగ్గరనుంచి లెటర్ వచ్చింది. వాళ్ల గోల్డెన్ వెడ్డింగ్ ఆనివర్సరీ అట వచ్చే నెల. నువ్వు వస్తున్నావా....?"

"ఆఁ నాకూ రాసారు. పోదూ. కలకత్తా అంటే దగ్గరా దాపా ! బోలెడంత ఖర్చు. గ్రీటింగ్ కార్డు పంపిద్దామని అనుకుంటున్నాను. నువ్వు వెళ్తున్నావా ఏంటి ? అయినా, నీకెలా కుదురుతుందిలే! ఇంటి చాకిరీయే సరిపోతుంది పాపం!" కాస్త వెటకారంగా అంటున్న కనకని ఆశ్చర్యంగా చూసింది అన్నపూర్ణ.

"నేనూ, మీ బావగారూ కూడా వెళుతున్నాము. అంతేకాదు, సురేష్, సంగీతలని కూడా రమ్మంటున్నాము. పిల్లలకు ఎలాగూ సెలవులే ! డబ్బు ఖర్చు అంటూ చిన్న చిన్న సరదాలని చంపుకుంటే ఎట్లా....?" వలిచిన ఆకుకూరని కట్ చేసి, విరిచిన చిక్కుళ్లని కవర్లోకి సర్దింది అన్నపూర్ణ.

"అక్కా! నాకు తెలీకడుగుతాను. ఈ పనులన్నీ సంగీత చెయ్యదా? లేక ఆ పిల్ల మెప్పు కోసం నువ్వే ఇవన్నీ చేసి పెడుతున్నావా...?"

"కోడలి మెప్పా..." అంటూ నవ్వింది అన్నపూర్ణ. కనకకేమీ సమాధానమివ్వకుండా లోపలికి వెళ్లింది.

కనకలక్ష్మిది మొదటినుంచీ వింతయిన స్వభావం. అందరూ బాగుందనే చీరనో... వంటనో వంకలు పెట్టడం ఆమెకు అలవాటు. ఎదుటి వ్యక్తిలోని మంచితనాన్ని చేతకానితనం క్రింద కొట్టిపారేయడం ఆవిడ ప్రవృత్తి. చెల్లెలి స్వభావం చిన్ననాటి నుంచీ తెలిసిన అన్నపూర్ణ, కనకతో వాదనకి దిగక తన పనిలో తాను నిమగ్నురాలైంది.

కనక ఉన్న నాల్గు రోజులు అన్నపూర్ణకి చేతినిండా పని. రోజుకొక్కచోటికి ప్రోగ్రాం పెట్టేది. కాదు కూడదంటే ఎక్కడ నొచ్చుకుంటుందో అని తన దినసరి కార్యక్రమాన్ని కనకకి అనుగుణంగా మార్చుకుని, ఆవిడతోటి తిరుగుతుండేది. పోనీ సంగీత చేత సెలవు పెట్టిద్దామంటే ఎగ్జామ్స్ దగ్గర పడడంతో స్పెషల్ క్లాసెస్ మూలంగా వీలవలేదు. సంగీత ఉమెన్స్ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్. ఆంధ్రాబ్యాంకులో ఆఫీసర్గా ఉన్న సురేష్, బ్యాంకు ఇన్స్పెక్షన్ మూలంగా బిజీ అయిపోయాడు. రాఘవరావుగారే ఇంటిపట్టున ఉండి అక్కాచెల్లెళ్లని బయటికి పంపేవాడు.

ఏడు గంటలకి నిద్రలేచిన కనకకి ఇంట్లో ఏదో హడావిడి కనిపించింది. రోజూ ఆ పాటికి వంటింట్లో చురుకుగా పనిచేస్తూ కనిపించే అక్కయ్య అక్కడ లేకపోవడంతో వెనుదిరిగిన కనకకి సంగీత ఎదురుపడింది.

"అక్క ఎక్కడికెళ్లింది సంగీతా?"

"అత్తయ్యకి ప్రొద్దుటినుంచి జ్వరం ఆంటీ. డాక్టరుకి ఫోన్ చేసాను. టెంపరేచర్ తగ్గడానికి మాత్ర చెప్పి ఇమ్మన్నారు! అయినా జ్వరంలో కూడా లేచి కుక్కర్ పెట్టారు చూడండి ! నన్ను లేపొచ్చు కదా" బాధగా అంటూ వంటింట్లోకి వెళ్లింది సంగీత.

గబగబా అక్కయ్య దగ్గరికి వెళ్లింది కనక. కుర్చీలో చేరగిలబడి కూర్చుంది అన్నపూర్ణ. "అక్కా! నీది మరీ విపరీతం. జ్వరంలో కూడా నువ్వే వండి వార్చాలా...?" కోపంగా అంటూన్న కనకను చూస్తే అన్నపూర్ణకి నవ్వొచ్చింది.

'జ్వరం వచ్చిందా అక్కా ఎలా ఉంది ?' అన్న మాట లేదు కానీ 'ఎవరికో ఎందుకు చేస్తున్నావు?' అన్న ఫిర్యాదు.

"కనకా! జ్వరం ఈ రోజుల్లో సర్వసామాన్యం. అయినా, సంగీత ఏదో చిన్నపిల్ల. హడావిడి పడ్తూంటే, నువ్వు కూడా ఏంటలా హైరానా పడ్తున్నావు. జ్వరం మరీ ఎక్కువగా ఉండి లేవలేని పరిస్థితి ఏర్పడితే చూద్దాంలే..." సంగీత తెచ్చి ఇచ్చిన మాత్ర వేసుకుని వేడిపాలు త్రాగింది అన్నపూర్ణ.

"సంగీతా! కుక్కర్‌లో పప్పు, చిక్కుళ్లు, బియ్యం పెట్టాను. నిన్నటి పుదీనా పచ్చడి ఫ్రిజ్‌లో ఉంది. చారు పెట్టు. చిక్కుడు తాళింపు వెయ్యి. ఈరోజు టిఫిన్ కాంటిన్‌లో తినేయండి. పిల్లలకి బ్రెడ్ టోస్ట్ చేసిచ్చేయి. కనకా! నువ్వు బ్రేక్‌ఫాస్ట్ లంచ్ కలిపి ఏకంగా బ్రంచ్ చేసేయి."

"అత్తయ్యా ! మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి! మా తంటాలు మేము పడ్తాము. మీరు రండి ఆంటీ!" అంటూ కనకని బయటకు పిల్చింది సంగీత.

అన్నపూర్ణ ఫ్లూజ్వరంతో పడక వేసిన ఆ నాలుగురోజులు ఆ ఇంటిల్లిపాది పడిన ఆరాటం, ఆదుర్దా...... నిజం చెప్పాలంటే కనకకి కంటగింపు కలిగించింది. సురేష్ సరే కొడుకు. రక్తం పంచుకుపుట్టినవాడు 'అమ్మా! అమ్మా' అంటూ ఆవిడ చుట్టూ పదిసార్లు తిరిగి పరామర్శించా డంటే అర్థముంది. అది తల్లీకొడుకుల సంయమనం. ఇదేంటి ఈ కోడలుపిల్ల. అందునా పరాయిది. అంతలా ఆవిడని అంటిపెట్టుకుని ఉపచారాలు చేసింది. అక్కయ్య కోడలికి పనులు చేసి పెట్టడం మెప్పుకోసం అనుకుంటే మరీవిడ అత్తగారి మీద చూపించే ప్రేమానురాగాలని గురించి ఏమనుకోవాలో ఒక్క పట్టాన బోధపడలేదు కనకకి.

అన్నపూర్ణ లేచి కాస్త తిరుగాడడం మొదలుపెట్టగానే తిరుగు ప్రయాణానికి సిద్ధమయింది కనక.

"అదేంటే కనకా ! రాకరాక వచ్చావు. ఇంకో నాలుగు రోజులుండరాదూ! నాకూ కాస్త ఓపిక వచ్చిందిగా. చూడవలసిన మిగతా ప్రదేశాలు సరదాగా తిరిగి చూడొచ్చుగా..."

"ఒద్దులే అక్కా! ఇప్పటికి చూసిందే చాలు. నేనొచ్చి నీకు అనారోగ్యం తెచ్చి పెట్టాను ..."

"ఛా... అవేం మాటలే! నిన్నలా ఎవరైనా అన్నారా? ఎందుకట్లా అంటావు? ఇంకా నయం సంగీత, సురేష్ వినలేదు. లేకుంటే ఎంత నొచ్చుకునేవారో? మనిషన్నాక రోగం రాకుండా ఉంటుందా...?"

అక్క మాటలని తోసిరాజని ప్రయాణం కట్టింది కనక.

కాలేజీ నుండి వస్తూ సంగీత కనకకి వెంకటగిరి జరీ చీర, మాచింగ్ బ్లౌజ్ తెచ్చి అన్నపూర్ణ చేతికిచ్చింది. "ఆంటీకి ఈ కలర్ నచ్చిందేమో కనుక్కోండి అత్తయ్యా! లేకుంటే మార్పిస్తాను..." అంటూ.

చక్కటి ఆకాశం రంగు చీరది. సన్నటి జరీతీగలు హంసల బార్డరు 'బాగుంది' అంటూ కనక కూడా ఓకే చేసింది. కాకుంటే "అయినా ఈ చీరసారెలు నాకిప్పుడెందుకమ్మా!" అంది సంగీత వేపు చూస్తూ.

ఆ సాయంత్రం రైలుకే కనక ప్రయాణం. మధ్యాహ్నం భోజనాలయ్యాక అక్కాచెల్లెళ్లిద్దరూ కబుర్లలో పడ్డారు.

"అక్కా! ఈసారి నువ్వే రావాలి మా ఇంటికి. ఈ చాకిరీలు, బాదరబందీలు ఎప్పుడూ ఉండేవే! ఆడవాళ్లం, మనం పుట్టగానే మనతోటే పుట్టిన ఈ చాకిరీలు మనం చచ్చాక కానీ మనల్ని వదలవు. మా కోడలు పిల్ల చాకచక్యంగా ఇంటిపని, వంటపని నా మీదికి నెట్టాలని చూస్తుంది. నేను నీలాగా పొగడ్తలకి బోల్తాపడే అమాయకురాలిని, అల్పసంతోషిని కాను.

అయినా, నేను వచ్చినప్పటినుండి చూస్తున్నాను. 'వంటపుట్టి' లాగా వంటింటికి, ఆయాలాగా పిల్లలకి అంకితమయ్యావు. ఇక బావగారంటావా ప్యూన్‌లాగా పిల్లల స్కూళ్లకి, బజారుపనులకి ఇంకాస్త టైముంటే ట్యూషన్ టీచర్‌లాగా పిల్లల చదువులకి సరిపోయారు. పెద్దవారయ్యారు. కాస్త విశ్రాంతి, మీకంటూ ఒక వ్యాపకం ఏర్పరచుకోవాలి కదా! నేనూ మీ మరిది చూడు. మాకొచ్చే

పెన్షన్ డబ్బులతోనే చక్కగా టూర్లకి వెళ్తాం. ఇక ఇంట్లో ఉన్నా ఇటువంటి బాదరబందీల జోలికి పోము."

"కనకా! ఎంత తప్పుగా ఆలోచిస్తున్నావు నువ్వు! నేను ఈ ఇంట్లో ఓ పనిమనిషినా? నీకలా అన్పించిందా? అయినా కనకా నువ్వొచ్చినప్పటి నుంచి గమనిస్తున్నాను. సంగీతని కోడలుపిల్ల పరాయిపిల్ల అంటూ భేదభావంతో చూస్తున్నావు. తన పుట్టింటిని, కన్నవారిని వదలి మనతో కల్సి జీవితాన్ని పంచుకోవడానికి వచ్చిన పిల్ల పరాయిదెట్లా అవుతుంది ? అదే, సంగీత నా కూతురయితే నేనిలా చేస్తుంటే నువ్వు తప్పుపట్టగలవా?"

"ఆఁ ఎన్ని చెప్పినా కోడలు కూతురవుతుందా?" అంది కనక.

"అక్కడే పొరబడుతున్నావు కనకా నువ్వు. కోడల్ని ఇంగ్లీషులో డాటర్ ఇన్‌లా అంటారు. నీకు తెలుసు కదా! హక్కుతో మనింటికి వచ్చే కూతురన్న మాట. తనింటి పేరు మార్చుకుని మనింట ప్రవేశించే ఆ అమ్మాయిని కూతురిలాగే ఆహ్వానించాలి. నాకు సంగీతని చూస్తే స్వంత కూతురిలాగ్గే ఉంటుంది. అంతేగాదు. ఒక్కొక్క మాటు స్నేహితురాలిలాగా కూడా ఉంటుంది.

అయినా, కనకా! ఇది నా ఇల్లు. నా కొడుకు, కోడలు, మనవలు అందరూ నా వాళ్లు. వాళ్లకి చేయడం నాకు శ్రమ కాదమ్మా! అది... నా ఆనందం. మీ బావగారంటావా ఆయనకిష్టం లేని పని ఆయన చేత చేయించడం బ్రహ్మతరం కూడా కాదు. మేమిద్దరం ఈ ఇంటి మూలస్థంభాలలాంటి వాళ్లం. ఈ స్థంభాలకు అల్లుకున్న పొదరిల్లే మా ఈ పర్ణశాల. స్థంభాలు ధృడంగా, గట్టిగా ఉంటేనే అల్లుకుపోయే ఇల్లు ఆరోగ్యంగా, ఆనందంగా, వృద్ధి, అభివృద్ధి చెందుతుంది. ఈ సత్యాన్ని నువ్వేకాదు, ప్రతి ఒక్కరూ తెలుసుకుని తమ తమ పరిధిల్లో ఉండి చిన్నవాళ్ల లోటుపాట్లని సవరిస్తూ, తమ నడవడికను పెద్దవారు కూడా కాలానుగుణంగా మలుచుకుంటూ, గృహ సామ్రాజ్యాన్ని సుఖ సంతోషాలతో నింపుకోవాలి. నేనేదో ఉపన్యాసం దంచానని విసుక్కోకుండా నా మాటల్లోని ఔచిత్యాన్ని గురించి ఆలోచించు. చూసావా! మాటల్లో పడి టైమే మరిచిపోయాను. నీకు ప్రయాణానికి పులిహోర కలపాలి. పిల్లలకు కూడా అదే టిఫిన్. వాళ్లొచ్చేవేళ కూడా అయింది." లోపలికి వెళుతున్న అన్నపూర్ణకేసి విస్తుపోయి చూస్తూ కూచుంది, సగటు 'అత్తగారు' కనకలక్ష్మి.

*(వనిత సమగ్ర కుటుంబ మాసపత్రిక, ఉగాది విశేష సంచిక, ఏప్రిల్ 1996)*

# జీవన తీరం

అరుణ వచ్చిందే తడవుగా పుస్తకాన్ని టీపాయ్ మీద విసిరేసి వీక్లీ చదువుతున్న వదిన ప్రక్క కూర్చుంది విసురుగా. కథ మాంచి పట్టులో వుంది. అయినా, ఆడబిడ్డ విసుర్లకి జడిసి పుస్తకం మూసి అరుణకేసి తిరిగింది పద్మ.

"ఏమిటీవిడ ఆగ్రహానికి కారణం....?" బయటకు అనకపోయినా పద్మ ముఖ కవళికల్లో పొడచూపిన ప్రశ్న అది.

బుంగమూతిని పెట్టుకు కూచుంటున్న అరుణని చూస్తే ముద్దేసింది పద్మకి. ఇరవై ఏండ్లు వచ్చినా పద్మ కళ్ళకి అలిగి కూచున్న ఆడబడుచు అరుణ - అయిదేళ్ళ పాపాయిలాగే వుంది.

"ఏవింటే అన్నూ ......! అంత కోపంగా వున్నావ్ ? ఫస్టు ర్యాంక్ ఏమైనా అర్ధమార్కులో తప్పిందా .....?" లేవబోతూ అంది పద్మ.

కాలేజి నుండి ఆడబిడ్డ వచ్చిందంటే స్కూలు నుండి పిల్లలు కూడా వచ్చేసినట్లే. వాళ్ళ నోళ్ళకి కాస్త మేత పడేయకపోతే - ఇల్లు పీకి పందిరి పెడతారు.

లేవబోతున్న వదినకేసి చూస్తూ, "కూచో వదినా ..... ఒక్క నిమిషం, 'మా ఉష బంగారుతల్లి, చదువుల సరస్వతి, అపరంజిబొమ్మ' అంటూ అస్తమానం నెత్తినెక్కించుకుంటూ ఉండేదానివే..!"

"ఎవరు ..... నీ క్లాస్‌మేట్ ఉష సంగతేనా నీవు చెబుతుంట .....!"

"ఆఁ.ఆ ఉషాదేవి సంగతే. ఇప్పుడేం చేసిందో తెలుసావదినా !"

"ఏం చేసిందేమిటి? సినిమాకి నీతో రాకుండా తన బాయ్‌ఫ్రెండ్‌తో వెళ్తోందా.....?"

"వదినా వదినా నీకసలు సీరియస్‌నెస్ లేదు."

"సరి ...... సరి సీరియస్ గానే వింటానులే. చెప్పు. ఇంతకీ ఉష చేసిన అపరాధ మేమిటి...?" అపరాధం దగ్గర వొత్తి పల్కుతూ అంది పద్మ.

"అపరాధమే మరి. ప్రొఫసర్‌గారు అంతగా రికమెండ్ చేసారా....... మా ఇద్దరి పేర్లు - రిసెర్చికి..."

"అవునవును. ఎమ్.యస్సీ అయ్యాక మీ రిద్దరూ డాక్టరేటు కూడా కలిసే చేయబోతున్నట్లు ఉష మొన్న నాతో అందిగా..."

"అవి, అప్పటి మాటలు వదినా. ఇప్పుడేమో ఎమ్.యస్సీ కూడా పూర్తిచేసేటట్లు లేదు."

ఉలిక్కి పడింది పద్మ.

"అదేంటి ? అంత బ్రిలియంట్ స్టూడెంటు! ప్రతి క్లాసులో రాంకే! ఇంటర్ కలిజియేట్ డిబేట్సులో, స్పోర్ట్సులో, ఒక్కటేమిటి అన్ని రంగాల్లో అద్వితీయ ప్రతిభా సంపత్తులు కనబరచి ఎన్నో బహుమతులు గెల్చుకున్న ఉష ఇలా అర్ధాంతరంగా చదువు మానేస్తూందా.....? కారణం ఊహించలేకుండా వున్నానమ్మా" ఇంకేదో చెప్పబోతూ ఆడబిడ్డ అక్కడ కన్పించక పోయేసరికి మాటలు మధ్యలోనే ఆపేసింది పద్మ.

ఉషా - అరుణలు హైస్కూలు నుండే క్లాస్‌మేట్స్. అరుణ ఫస్ట్‌క్లాస్ స్టూడెంట్ అయితే, ఉష రాంక్ స్టూడెంట్. పద్మకి - అరుణ ఎంతో ఉష కూడా అంతే!

"కొంపదీసి కారణం ఆర్ధిక యిబ్బందులు కాదుగదా!" అనిపించిందో క్షణం, పద్మకి. ఉషా వాళ్ళు మధ్య తరగతి కుటుంబీకులే కానీ మరీ అంత పేదవారు కాదు. ఇన్నాళ్లు చదివించిన వారు-ఇంకో రెండేళ్ళు చదివించలేరూ? అయినా బంగారు భవిష్యత్తున్న ఉష ఇలా అర్ధాంతరంగా మానుకోవటం చాలా శోచనీయం."

పద్మ ఆలోచనల్ని అవరోధిస్తూ, బట్టలు మార్చుకొని వచ్చిన అరుణ, "ఎందుకొదినా అంతలా ఆశ్చర్యపోతున్నావు ? అంతా డబ్బు మహత్మ్యం. మనీ + షి = ఉష . గొప్పింటి సంబంధమని - అబ్బో ఎంత మురిసిపోతోందో తెలుసా..?"

సంగతంతా ఆడబిడ్డ అరుణ చెప్పగా విన్న తర్వాత పద్మకి మొట్టమొదట సంతోషమే కల్గింది. ఈ కన్నెపిల్లలు ఎన్నెన్ని చదువులు చదివినా, ఎన్ని డిగ్రీలు సంపాదించినా, ఎన్ని ఉద్యోగాలు చేసినా, ఏ పూళ్ళేలినా ఎప్పుడో ఒకప్పుడు విధిగా వైవాహిక జీవితంలోకి అడుగిడవలసిన వారే కదా! ఉషకూ సువర్ణావకాశం తరుముకొస్తూంది. అరుణ - పాపం చిన్నపిల్ల! తన నెచ్చెలి, సహాధ్యాయిని తనని వీడి వెళ్ళిపోతున్నదనీ, తనేకాకిగా మిగిలిపోతూందని వుడుకుమోత్తనంతో ఏదేదో వాగేస్తూంది.

"అరుణా ! ఇంతకీ పెండ్లికొడుకెవరో చెప్పావు కాదు...?" నెమ్మదిగా అక్కడి నుండి వంటింట్లోకి వెడుతూ అంది, పద్మ.

వంటింట్లోకి వదిన్ని వెంబడిస్తూ, "ఆఁ... ఎవరో పెద్ద బిజినెస్ మాగ్నట్ అట, అతగాని అనుంగు కుమారుడు. బోలెడన్ని కార్లూ, షేర్లు-ప్రతి సంతానానికి ఓ పెద్ద బంగళా - ఇలాంటివే... బోలెడన్ని చెప్పారు, ఉషా వాళ్ళ నాన్నగారు...." స్టూల్ లాక్కుని కూచుంటూ, ప్రక్కనే ఉన్న ఉల్లిపాయల బుట్టను అందుకుంది, అరుణ.

"అసలు విషయం చెప్పవేం అరుణా ....? పిల్లవాడు ఏం చదివాట్ట...?" సెనగపిండి డబ్బా అందుకుంటూ అంది, పద్మ.

"ఆఁ...... బి.కామ్ పాస్ అయ్యాట్ట ! అయినా, వదినా ఈ ఉష-నేడో రేపో సైన్సులో మాస్టర్స్ డిగ్రీ తీసుకోబొయ్యే ఉష - పెండ్లే చేసుకోదలచుకుంటే, ఏ రిసర్చి స్కాలర్నో చేసుకోకూడదూ...! తన తెలివి తేటలకు మెరుగుదిద్దినట్లూ అయ్యేది - చదివిన చదువుకు సార్ధకతా లభించేది. అయినా, పెద్ద వాళ్ళ ఛాదస్తం లేకుంటే, ఆ కామర్సు అబ్బాయికి, ఈ సైన్స్ జీనియస్‌ని అంటగడితే వాళ్ళ

మనువులు మన్ని ఛస్తాయా..?" అర్థం - పర్ధం లేని అరుణ వాగుడకి చిర్రెత్తుకొచ్చింది, పద్మకి. ఉష, శుభమా అని పెండ్లి చేసుకుంటూంటే మధ్య ఈ పిల్ల బాధ ఏఁవిటో... నూనెలో కాల్తున్న బజ్జీలను అట్లకాడతో తిప్పుతున్న పద్మ, అరుణ వునికిని మర్చిపోయి తన పనిలో లీనమైపోయింది.

సుమ ఫ్రాకును కత్తిరిస్తూ కూచున్న పద్మ, "వదినా!" అంటూ, లోపలికి దూసుకువస్తున్న ఉషని చూచి, "ఓహో ! పెండ్లికూతురా....! రా.... రా.... ఇలా వచ్చి కూచో. " అంటూ ఆహ్వానించింది.

"ఆహాఁ ......... అప్పుడే వార్తని అందించిందన్నమాట, అరుణ" అంటూ, పద్మ ప్రక్కనే నేలమీద చతికిలబడింది, ఉష.

"శుభవార్త కదూ ఉషా.. మరి ..." కత్తెర్ని చేతిలోకి తీసుకుంటూ, అంది పద్మ.

అందంగా - సిగ్గు సిగ్గుగా నవ్వింది ఉష. అలా సిగ్గు పడడంలో ఉష అందం మరికాస్త ఎక్కువయినట్లు అన్పించింది. చక్కటి తెలుపు కాకపోయినా, మంచి అంగసౌష్టవంతో, అందంగా వుంటుంది, ఉష. ముఖ్యంగా ఆ ముఖంలో ఆ పెద్ద కండ్లల్లోని ఏదో తీక్షణత, చురుకుతనం చూపరులను ఇట్టే ఆకర్షిస్తాయి.

ముడుచుకొని వున్న మొగ్గ వికసించి, పుష్పమవడం ఎంత సహజమో, బాలిక కాలం తెచ్చిన మార్పులకి కన్యగా రూపొంది వివాహ వాంఛను వెల్లడించడమూ అంత సహజమే. పద్మ కుతూహలంగా ఉష వేపు చూచి తనలో తానే నవ్వుకుంది.

"ఏంటొదినా నవ్వుకుంటూన్నారు మీలో మీరు.........!? అరుణకి నామీద చాలా కోపం వచ్చినట్లుంది - కాలేజీలో నాతో అసలు మట్లాడ్డం లేదు" పద్మ కత్తిరించి పెట్టిన రెండు భాగాలను సమానంగా పెట్టూ అంది, ఉష.

"అరుణ వట్టి పిచ్చిదమ్మా...! నువ్వేదో ఫైనల్ ఎగ్జామ్స్ ఈ యేడు ఇవ్వనన్నావట ..."

"ఛా...ఛా...నేను ఎగ్జామ్స్ ఎంత మాత్రం స్కిప్ చేయనొదినా. మా అమ్మగారేదో ఈ లోపలే వివాహం చేస్తున్నట్లు మాట్లాడుతారు కానీ, ఇన్నేళ్ళ శ్రమని వృధా చేసుకుంటానా."

"నేను చెప్పలేదామ్మా - అరుణ పిచ్చిదని. అనవసరంగా ఆవేశం తెచ్చుకుంది. ఉషా! నువ్వు పెండ్లి చేసుకోవడం తప్పకుండా మంచి పనే! కానీ, నీ ఎమ్. యస్సీ డిగ్రీ తీసుకున్నాకే..." కత్తిరించిన గుడ్డముక్కల్ని చుట్టచుట్టి సీవింగ్ మిషన్ దగ్గరకు నడిచింది పద్మ. కిందపడివున్న చిన్న చిన్న గుడ్డముక్కల్ని కత్తెరతో కత్తిరిస్తూ మౌనంగా వుండిపోయింది, ఉష.

"ఏయ్ ....! ఏఁవిటా మొండితనం ...? శుభ్రంగా ప్రాణ స్నేహితురాలి పెండ్లికెళ్ళక మధ్యలో నీ అంకమ్మ శివాలేంటి...?" అరుణ తల్లి, కూతుర్ని సన్నసన్నగా చీవాట్లు పెడుతున్నారు. అరుణ మాత్రం అలాగే మొండికెత్తి కూచుంది, ఉష పెళ్ళికి తాను వెళ్ళను గాక వెళ్ళనంటూ. ఇంతలో, పిల్లల్ని స్కూళ్ళకి పంపి అరుణ దగ్గిరికి వచ్చింది పద్మ.

"అరుణా ! అయినా నీ కెందుకింత మొండి పట్టుదల ? పెళ్ళికూతురని కూడా అనుకోక తానే స్వయంగా వచ్చి పిల్చివెళ్ళిందే.........! ఇదేనా నువ్వు నీ ప్రాణ స్నేహితురాలిపట్ల చూపే అనురాగం.....?" అటు వేపు తిరిగి నిల్చున్న అరుణని బలవంతంగా తిప్పింది పద్మ. కళ్ళకొలకుల నుండి జాలువారిన అశ్రువులు చెక్కిళ్ళపై ధారకడ్తున్నాయ్. గబగబా కొంగుతో తుడిచేసుకుంది, అరుణ.

అడబిడ్డనలా చూడగానే పద్మ హృదయం ఆర్ద్రమైంది. "తప్పు అరుణా! ఏఁవిటది...?" అంది, వారింపుగా:

"అదికాదొదినా ....! ఉష ఏ సైన్సు స్కాలర్నో, ప్రొఫెసర్నో, డాక్టరేట్నో చేసుకున్నా నాకంత బాధ కల్గేది కాదు."

"అంటే నీ ఉద్దేశం డాక్టరు డాక్టర్నే, లాయర్ లాయర్నే... అలాగే ఆ పిల్ల సైన్స్ పోస్ట్ గ్రాడ్యుయేట్నే చేసుకోవాలా...? ఏమో నాకయితే ఇలాగే బాగుంటుందనిపిస్తున్నది."

"నేను చెప్పేది నువ్వు అర్థం చేసుకోవటం లేదొదినా! ఉష అందరిలాంటి సామాన్య విద్యార్థినీ, సామాన్య యువతీ అయితే నేనింత బాధపడను. ఉష మనస్తత్వం - నాకే కాదు, నీకు కూడా బాగా తెలుసు కదా ! ఏ విషయాన్నయినా ఎంతో నిగూఢంగా ఆలోచించి, అనలైజ్ చేసి కరెక్ట్ కంక్లూషన్స్కి వచ్చేది. అదో జీనియస్ వదినా..! మేమందరం చదువుకోవాలని చదివితే తను అందులో లీనమై తన జీవితమే అదైనట్లు, అందులోనే తన ఆనందం వున్నట్లు చదివేది..."

"అబ్బో ... పెద్ద సైకాలజిస్టులాగ మాట్లాడుతున్నావే....?"

"హాస్యం కాదొదినా ! చిన్నప్పటి నుంచి ఇద్దరం కల్సి చదివాం - మెలిగాం. దాని మనస్సు నాకు తెలిసినంతగా తనకే తెలీదేమో అనిపిస్తుంది. కొన్ని కొన్ని క్లిష్టమైన సైంటిఫిక్ సమస్యలకి ఉష చూపించిన నిరూపణాత్మక సొల్యూషన్స్కి మా ప్రొఫసర్లే విస్తుపోతూ వుంటారు. అది రాసిన రెండు పేపర్లు ఫారిన్ జర్నల్స్లో పడ్డ సంగతి నీకు కూడా తెలుసుకదా. అటువంటి మేధావి, ప్రజ్ఞావంతురాలు, కేవలం ఓ సామాన్య వధువులాగా అతి సామాన్య విద్యావాసన గల ఇంట్లో అడుగుపెట్టున్నదంటే - ఏఁవిటో నాకు చెప్పలేని దుఃఖం ముంచుకొస్తోంది." మాటల్ని ఆవేశంగా అన్నా, అరుణ నయనాలు ఆర్ద్రములయ్యాయి.

"నువ్వెందుకలా అనుకోవాలి అరుణా...! తాను ప్రవేశించిన గృహాన్ని తానో విద్యాపీఠంగానో, విజ్ఞాన.ఖనిగానో మార్చగలదేమో...?" వదిన మాటలకు 'నీ మాటలసత్యాలు...!' అన్నట్లు తలనడ్డంగా వూపింది అరుణ.

"ఉష పెండ్లి చేసుకుంటున్నందుకు కాదు నా బాధ. పెండ్లిచేసుకోవాలని నిర్ణయించు కోవడంలోనూ, వరుణ్ణి ఎన్నుకోవడంలోనూ తప్పటడుగు వేస్తున్నదన్నదే నా బాధ. ఉష ఎప్పుడూ సంతోషంగా వుండాలన్నదే వొదినా నా ఆశ." అరుణకి ఉష పట్ల గల ప్రేమానురాగాలకి ముగ్ధురాలయింది, పద్మ. "ఉషకి సంతోషం కల్గించాలంటే ముందు మనం చేయవలసిందేమిటో తెలుసా...? ఉష పెళ్లికి వెళ్లటమే ..." అంది, పద్మ ఆడబిడ్డను లేవదీస్తూ. వదిన చేతిలో చిత్తుగా ఓడిపోయిన ఆర్ద్రహృదయ అరుణ అనునయంగా లోపలికి నడిచింది ముస్తాబవడానికి.

వివాహమంటపం చూడగానే అర్థమయింది పద్మకి ఉష అత్తింటి వారెంత భాగ్యవంతులో. శ్రీమంతుల తోటి వియ్యమందడం, ఉషా వాళ్ళ తల్లిదండ్రుల అంతస్తుకి కొంచెం కష్టమైన పనే! కానీ కూతురి అదృష్టానికి తమ ఆర్థిక పరిస్థితిని అడ్డువేయక వారి శక్తికి మించే ఖర్చుచేసి వివాహాన్ని జరుపుతున్నారన్నది పద్మ గ్రహించింది. వధూవరులు వచ్చిన అతిథుల్ని సాదరంగా ఆహ్వానిస్తూ నిలబడ్డారు. ఉష భర్త వీరేంద్రని చూసాక పద్మకి వెంటనే స్ఫురించింది, ఆ పిల్ల ఈ పెళ్ళికంత తొందరగా, ఎందుకు ఒప్పుకుందో! అమరికైన విగ్రహం - ఆరడుగుల అందగాడు వీరేంద్ర. శ్రీమంతుల ఇంట భోగభాగ్యాలు అనంతరం అందించిన శారీరక సౌందర్యం - అధునాతన వేషధారణ, అతనికి మరింత అందాన్ని చేకూర్చాయ్. ఉష నిర్ణయాన్ని మనస్సులోనే సమర్ధించుకుంటూ, వధూవరులు రతీ-మన్మధుల్లా వున్నారని సంతృప్తి పడింది పద్మ. అరుణ వేపు ఆమోదం కోసరమా అన్నట్లు చూసింది పద్మ. కానీ అప్పటికే అక్కడ చేరిన ఫ్రెండ్స్‌తో కబురలో పడింది అరుణ.

చుట్టూ చూసింది పద్మ. శ్రీమంతుల శ్రీమతీమణుల అలంకరణని ఆసక్తిగా గమనించింది. ఎవర్ని చూచినా లేటెస్ట్ మోడల్ జువలరీ సెట్స్‌తో, మెరిసిపోయే జరీవర్క్ నైలెక్స్ చీరలతో, సరిక్రొత్త హెయిర్ డ్రెస్సులతో వెలిగిపోతున్నారు. వారిలో అసలు కన్నా కృత్రిమ నాగరికతే ఎక్కువచోటు చేసుకున్నట్లు అనిపించింది పద్మకి. అయినా, డబ్బుతో బాటూ వచ్చే అధునాతన వేషధారణ, దాంతో వచ్చే ఆత్మసంభావనా తనబోటి అలనాటి ఆడవారికి కాస్త క్రొత్తేమోలే అని సరిపెట్టుకొని ఉషకేసి నడిచింది పద్మ - చేతిలో వున్న కానుకని అందిద్దామని.

"ఓ... రండొదినా......! నా డియరెస్ట్ ఫ్రెండ్ అరుణ సిస్టర్-ఇన్-లా, పద్మజా రామారావ్" ఇంట్రడ్యూజ్ చేసింది ఉష భర్తకి.

"అరుణేది వదినా ...? రాలేదా.....?" అంది, వెంటనే.

"రాకేం ఉషా, వచ్చింది. ఫ్రెండ్సుతో మాట్లాడుతున్నట్లుంది."

వీరేంద్రని మరొక్కమారు పరికించి చూచింది పద్మ. దూరాన్నుంచి చూచి తను పొరబడలేదు. వీరేంద్ర బహుచక్కటివాడు. ఉష నిజంగా అదృష్టవంతురాలు.

"హార్టీ కంగ్రాట్స్" చెప్పి ప్రజంట్ అందించింది పద్మ. ఇంతలోకి మిత్రబృందం వచ్చి పడ్డారు. ఉషకి ఇక వాళ్ళతోటే సరిపోయింది. పద్మ నెమ్మదిగా వచ్చేస్తూంటే "వదినా....! డిన్నర్ తీసుకొని వెళ్ళండి..." అంటూ కేకేసింది ఉష. "తప్పకుండా..." అంటూ ముందున్న కుర్చీవేపు నడిచింది పద్మ.

ఇంటికి వచ్చి బట్టలు మార్చుకుంటూ, ఇక వుండబట్టలేక పైకే అనేసింది పద్మ, "అరుణా! ఉష భర్త చాలా చక్కగా వున్నాడు కదూ ! ఇద్దరికీ ఈడూజోడూ చాలా బాగుంది కదూ...? అంటూ.

"ఆఁ బాగానే వున్నాడు - సినిమా స్టార్‌లాగా. అలంకరించి వుంచిన బొమ్మలాగ. సినిమాల్లో హీరోని ఓ మూడుగంటలు భరించగలం కానీ, జీవితాంతం ...." అరుణ వాదాన్ని సమర్ధించలేక పోయింది పద్మ.

"నీదంతా వితండవాదం అరుణా ...! వీరేంద్రని గురించి నువ్వెందుకెలా అంటున్నావో నాకర్థం కావటం లేదు. ఏ కన్య అయినా ఏం కోరుకుంటుంది ? చక్కటివాడు, చదువుకున్నవాడు, శ్రీమంతుడు, తన భర్త కావాలని. నీ అభ్యంతరము ఏఁవిటో నాకర్థం కావటం లేదు."

"ఎవ్వరైన అదే కోరుకుంటారేమో కానీ వదినా ఉష మాత్రం కాదు. ఉషని గురించి నీకు సరిగ్గా తెలియదు వదినా! తెలిస్తే నువ్వలా అనవు. ఉషని ప్రోత్సహించే వాళ్ళుంటే తనో 'మాడమ్ క్యూరీ' తప్పక అవుతుంది. అంత విజ్ఞానతృష్ణ వుంది తనలో. వీరేంద్ర బహు అందగాడు. కాదనటం లేదు నేను. కానీ అందంతో మాత్రమే ఉషని జయించలేడని - ఉషని సంతోషపెట్టలేడని నాకనిపిస్తుంది. ఉషలో అంతర్గతంగా వున్న విజ్ఞాన తృష్ణాధాటికి అతడు నిలపగలడా అన్నదే నా అనుమానం" మొండిగానే అయినా, తన భావాన్ని స్పష్టంగా వెలిబుచ్చి లోపలికి వెళ్ళిపోయింది అరుణ.

చీర మార్చుకోవటం పూర్తయినా అలాగే నిల్చుండిపోయింది పద్మ. అరుణ ఎంత బలంగా వాదిస్తున్నది! ఎంత విరుద్ధంగా ఆలోచిస్తున్నదీ! తన స్నేహితురాలి పట్ల అసూయతో - అరుణ, ఇలా మాట్లాడ్డం లేదుకదా ! ఛా........ ఛా...... అలా ఎన్నటికీ కాదు. ఉష జీవితం మూడు పువ్వులు - ఆరు కాయలుగా వెలుగొందాలి....!

★ ★ ★

రోజులు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా రివ్వున తిరిగిపోయాయి. పెండ్లయిన సంవత్సరం వరకు ఉషకి, అరుణా -పద్మా వాళ్లింటికి రావటం పడలేదు. హనీమూన్ అని కొన్నాళ్ళూ - బిజినెస్ పనులంటూ కొన్నాళ్ళూ ఉషా - వీరేంద్ర నార్త్ ఇండియా అంతా టూర్ చేసారు. టూర్ నుంచి తిరిగి వచ్చేక ఏ షాపింగ్ సెంటర్లో చూచినా కన్పించేవారు వారిద్దరూ. క్షణం తీరుబడి లేనట్లు తిరుగుతున్న ఆ నవజంటని చూచి తృప్తిగా నవ్వుకునేది పద్మ. ఉష మాటవస్తే ముందులా వాదనలోకి దిగక మౌనంగా వుండిపోవటం మొదలెట్టింది అరుణ.

అరుణ డాక్టరేట్ తీసికొనే సరికి ఉషకి పాప తర్వాత, బాబు కూడా పుట్టాడు. పద్మా, అరుణ ఇద్దరూ నర్సింగ్ హోమ్‌కి వెళ్ళారు ఉషని, బాబుని చూడ్డానికి.

"అరుణా ! నువ్వు డాక్టరయ్యావు. నేను ఇద్దరు పిల్లల తల్లినయ్యాను" అంది నవ్వుతూ, ఉష.

తొట్లోని బాబుని చూస్తూ వున్న అరుణ మవునంగా వుండిపోయింది.

"అదే కదమ్మా కావలసింది మరి" అంది పద్మ, ఉష మంచం పక్క ఉన్న కుర్చీలో కూచుంటూ.

"అరుణా! తర్వాత ఏం చేస్తావే...?" అంది ఉష

"ఏం చేస్తాను...? మన కాలేజి ప్రిన్సిపాల్ కొన్నాళ్ళు వర్క్ చేయమంటున్నారు. తర్వాత సంగతి తర్వాత ...." అంది అరుణ, నర్సింగ్ హోమ్ గదిని పరికించి చూస్తూ.

"ఏహో ఇన్నాళ్ళు సరదా పడి చదివింది. ఇక వరుణ్ణి వెదకద్దూ ...."అంది, పద్మ. "వద్దు వొదినా అరుణకి అప్పుడే పెండ్లి వొద్దు" అంది ఉష గబ గబా!

గబుక్కున ఇటు తిరిగి చూచింది అరుణ. "ఔను అరుణా! కొద్దిరోజులు జాబ్ చేయ్. ఇంకా-ఇంకా రిసర్చి చేయి. పెండ్లి అయితే చూడు, ఈ పిల్లలు మనల్ని పూర్తిగా వాళ్ళకే కట్టిపడేసుకుంటారు...." అంది ఉష. మామూలుగా చెప్తున్నట్లే వున్నా... ఉష కంఠంలో ఏదో కొంచెం అసంతృప్తి గోచరించింది. "అదేంటమ్మా...! పిల్లలు వరప్రసాదితులు..." అంది పద్మ వెంటనే.

"కాదన్నదెవరొదినా! నిజమే ! అందుకే ఆ వరప్రసాదితులను నిర్లక్ష్యం చెయ్యలేము కదా! పిల్లలు పుట్టేక మన సర్వశక్తులు వాళ్లకే వినియోగించాలి. అరుణనయినా కొంతకాలం ఈ బాదరబందీల నుండి, బాధ్యతల నుండి దూరంగా ఫ్రీగా వుండనివ్వండి" అంది నవ్వేస్తూ ఉష.

అలా స్నేహితురాలి వేపు, అంతరంగం చదువుతున్నంత దీక్షగా చూస్తున్న అరుణని ఈ లోకంలోకి తెచ్చి పడేసింది పద్మ, "పదమ్మా... పోదాం.. ! రెండు బస్సులు మారితే కాని మన కొంపరాదు" అంటూ.

"మా కారు వస్తుంది, వుండండి వదినా" అని అంటున్న ఉషని వారించి బయటికి నడిచారు పద్మా-అరుణలు.

ముచ్చటగా మూడేండ్లు కాలగర్భంలో కలిసిపోయాయ్. అరుణ కాలేజీలో వర్క్ చేస్తూనే ఫారిన్ ఛాన్స్ రావటంతో ఎగిరిపోయింది. వెళ్ళేముందు తన కో-స్కాలర్ వినయ్‌ని పెండ్లి చేసుకొని మరీ వెళ్ళింది. రెండేండ్ల క్రితమే ఫారిన్ ఛాన్స్ వచ్చినా, అరుణ కోసం వెయిట్ చేసాడు వినయ్. అరుణ దగ్గర నుండి ఉత్తరాలు వస్తూనే వున్నాయి. ఉష సంగతి అడుగుతూ వ్రాసేది. ఉషకి కూడా అరుణ దగ్గరి నుండి వుత్తరాలు వచ్చేవి.

ఆ వచ్చిన అరుణ వుత్తరం చదువుతూ కూచుంది పద్మ. అరుణ అమెరికా వెళ్ళి నాలుగేండ్లయినా నిన్న మొన్న వెళ్ళినట్లుంది. మళ్ళీ మళ్ళీ ఉత్తరం చదువుతూ కూచున్న పద్మ తలుపు చప్పుడవటంతో బాహ్యస్మృతిలోకి వచ్చి గబగబా లేచి తలుపు తీసింది. లోపలికి వచ్చిన ఉషని చూచి నివ్వెరపోయింది పద్మ. ఎప్పుడో కానీ తమింటికి రాని ఉష ఈ మిట్ట మధ్యాహ్నం... ఏవిఁటీరాక..?

ఉష కుర్చీ లాక్కుని కూచుంది.

'ఏంటొదినా, అంతలా ఆశ్చర్యబో తున్నారు...? మొన్న నీరజ కన్పించి చెప్పింది అరుణా వాళ్ళమ్మగారు పోయారని. విన్నప్పటి నుంచి నా ప్రాణం ఆగలేదు, మిమ్మల్ని చూసే వరకూ."

"ఔనమ్మా..! పెద్దవారు, కాలం చెల్లి వెళ్ళిపోయారు. కానీ, వున్న ఇద్దరిలో ఒకర్నిచూడలేకపోయానే అని మా అత్తగారు చాలా బాధపడిపోయారు. నీకు తెల్సుకదా! అరుణ రాలేకపోయింది. అంతా అయిపోయాక ఇంకెందుకని రాలేదు. ఏవిఁటో! ఈ పిల్లలు తమ భవిష్యత్తు, స్వార్థం చూసుకుంటారే కానీ, కన్న తల్లితండ్రుల పట్ల తమ బాధ్యతలని విస్మరిస్తారేమో అనిపిస్తుంది నామట్టుకు నాకు" పద్మ బాధపడ్తూంటే, ఉష సముదాయించింది.

"అదేంటొదినా...! అలాగంటారు...! ఒక్కోమారు ఒకే ఊర్లో వున్నా తీరా ప్రాణం పోయే సమయానికి దగ్గరలేని సందర్భాలు ఎన్ని లేవు! అంతే. అందుకే ప్రాప్తం అంటారు."

"అదీ నిజమే లేమ్మా. ఊఁ కల్పనా, సుధాకర్ బాగున్నారు కదూ.?"

"ఆఁ బాగున్నారొదినా! ఇద్దరూ కాన్వెంటుకి వెళుతున్నారు." సమాధానమిచ్చిన ఉషని అప్పటికి బాగా పరికించి చూచింది పద్మ. పెండ్లయిన కొత్తలో సరికొత్త దుస్తుల్లో మెరిసిపోయే ఉష కాదు అక్కడ కూచుంది. 'ఆఁ ఏ డ్రెస్సయితేనేం...ఎలా వుంటేనేం.' అన్న తత్వానికి పూర్తిగా అలవాటు పడిన గృహిణిలా వచ్చింది ఉష, అతి మామూలు చీర ధరించి.

"ఏంటి ఉషా...! ఇలాగున్నావు..?" అంది వుండబట్టలేక పద్మ.

"ఎలాగున్నానండీ, బాగానే వున్నానుగా! అన్నట్లు మర్చిపోయానొదినా,మేమూ ఈ వీధిలోకే వచ్చేస్తున్నాం. ఈ వీధిలో చివరి ఇల్లు లేదూ 'శ్రీనిలయం' అందులోకి.

"ఓహో! అది మీవారికి మీ మామగారు రాసిచ్చిన ఇల్లేమో కదూ!"

"ఔనండీ ! అదీ కాక పిల్లలకి 'గీతాంజలీ కాన్వెంటు' కూడా దగ్గర. అది సరే కానీ వదినా! ఏం రాసిందేమిటి అరుణ? ఆ మధ్య నాక్కూడా బోలెడు కబుర్లతో ఉత్తరం వ్రాసింది. కానీ ఏం విశేషాలు లేక నేనే జవాబు వ్రాయలేదు." ఉష ముఖంలో అదో రకమైన నిర్లిప్తత, స్తబ్దత చోటుచేసుకున్నాయ్. పద్మకి, ఉష ధోరణి అర్థం కాలేదు.

అరుణ ఉత్తరం నిండా తన రిసర్చి పేపర్స్‌ని గురించిన కబుర్లే. ఎందుకో ఉషతో ఆ విషయాలు ముచ్చటించగానికి ఇష్టపడలేదు, పద్మ.

"అరుణకి ఆరో నెలట! ఈ సంవత్సరాంతంలో రీసర్చ్ థీసిస్ సబ్మిట్ చేసేటప్పటికి పాపాయిని కూడా ఎత్తుకుంటానని రాసింది" క్లుప్తంగా జవాబిచ్చింది పద్మ.

తమ గృహప్రవేశానికి రమ్మని మరీ మరీ చెప్పి వెళ్ళింది ఉష. యాంత్రికంగా వెళ్తున్న ఉషనే చూస్తూకూచుంది పద్మ. చలాకీగా, చురుకుగా ఎప్పుడూ ఏదో వాగి వాగించే ఆ చైతన్య స్రవంతి ఏమయింది? శిశిరంలో గడ్డకట్టుకున్న మంచుముద్దలాగ నిర్జీవంగా నిశ్చలంగా కన్పిస్తున్నదెందుకీ ఉష..! తన ఆలోచనల్ని బలవంతంగా చెరిపేసుకుంటూ లేచింది పద్మ. అరుణే అయోమయంగా, అర్థరహితంగా ఆలోచనలు చేస్తుందంటే - తనేంటి ఇలాగయింది? అయినా, అందరూ అన్ని వేళలా ఒక్కలాగే వుంటారా...? పరిస్థితులని బట్టి, కాలాన్ని బట్టి, వయస్సును బట్టి మారుతూ వుంటారు. తనని తానే సమర్థించుకుంది పద్మ.

ఉష, ఇంటికి దగ్గరికి రావడంతో ఉష తోటి పరిచయం ఇంకాస్తా వృద్ధి అయింది పద్మకి. పద్మ ఇంటి పనిమనిషే వాళ్ళ ఇంట్లో కూడా. పాలవాడు కూడా ఒక్కడే. ప్రతి చిన్న విషయానికి ఉష, పద్మ సలహాను పాటించి, సహాయాన్ని కూడా పొందేది. ఉష తోటి సాహచర్యం పెరిగే కొద్దీ, ఉష అంతరంగం కొంత బోధపడసాగింది, పద్మకి. ఏదో నైరాశ్యం, అనాసక్తత గూడుకట్టుకున్నట్లు అన్పించేది ఉషలో. భర్తతో క్లబ్బులు, సినిమాలు, పిక్నిక్కులు అంటూ తిరిగే ఉష ఇప్పుడసలు బయటికి వెళ్ళడమే మానేసింది. పిల్లలు స్కూలుకి, భర్త ఫ్యాక్టరీకి వెళ్ళాక ఏవో పుస్తకాలు ముందేసుకు కూచునేది. చేతి నిండా పనిలేక కాబోలు ఇలా వున్నదేమోనని, ఉషని అడ్వాన్స్డ్ కంప్యూటర్ క్లాసుకెళ్ళమని, పెయింటింగ్ నేర్చుకోమని ప్రోత్సహించింది. మొదట్లో ఎంతో ఉత్సాహం చూపించినా, కొద్ది రోజులకే 'నాకేం నచ్చలేదు' అంటూ మానేసింది. మళ్లీ అదే నిర్లిప్తత - అదే నిశ్శబ్దత - అదే మౌనరాగం.

ఉష మనస్సులోని ఆంతరంగిక బాధను అర్థం చేసుకోవాలని, దాన్ని నివారించేందుకు ప్రయత్నించాలని పద్మ చాలామార్లు అనుకుంది. కానీ తనలోని భావాల్ని బయటకు వెలిబుచ్చక, "నాకేం ... వదినా ! చక్కగా వున్నాను. కాకుంటే ముందులాగ సరదాలు, షికార్లు అంటే ఇష్టముండడం లేదు. తీపి ఎక్కువ తిన్న వాడికి మొహం మొత్తినట్లయింది నా పరిస్థితి" అంటూ నవ్వేసేది. భాగ్యవంతుల ఇళ్ళల్లోని డ్రాయింగ్ రూముల్లో అమర్చిన షోకేస్‌ల్లోని బొమ్మలాగ తయారవుతున్నదే ఈ ఉష అని భయం వేసింది పద్మకి. ఏమడిగినా కప్పదాట్లు వేసేది, కానీ సరైన సమాధానం చెప్పేది కాదు.

కూతురు సుమ స్కూల్లో పేరెంట్సుడేకి సాయంగా ఉషని కూడా తీసికెళ్దాం అని పద్మ - ఉషా వాళ్లింటికి వెళ్ళింది. దుమ దుమ లాడ్తూ వాకిట్లోనే ఎదురయ్యాడు వీరేంద్ర. బిక్క ముఖం పెట్టుకొని కల్పన, సుధాకర్‌లు సోఫాలో చెరోమూలన కూచున్నారు. ఇవేం తనకు పట్టనట్లు మరో కుర్చీలో కూచుంది ఉష. పిల్లలు "ఆంటీ ...!" అంటూ, పరుగెత్తుకొచ్చారు, పద్మ దగ్గరికి.

"రండి - వదినా !" అంటూ ఆహ్వానించింది పద్మని, ఉష తాను వెళ్ళరాని టైమ్‌లో వెళ్ళినట్లు ఇట్టే గ్రహించేసింది పద్మ. ఏమనుకున్నాడో - వీరేంద్ర - మళ్ళీ లోపలకి వచ్చి పద్మకి విష్ చేసి

"కూచోండి వదినా ...! ఇప్పుడే వస్తాను" అంటూ, లోపలికెళ్ళి ట్రేలో రెండు కప్పులతో టీ, బిస్కట్లు తెచ్చి టీపాయ్ మీద పెట్టి, తానూ ఓ కుర్చీ లాక్కుని కూచుంది ఉష. ఏమీ జరగనట్లే మామూలుగా కబుర్లు చెప్పడం మొదలెట్టింది. కానీ పద్మే వూరకుండలేక, "ఉషా! వీరేంద్ర ఎక్కడికో రమ్మంటున్నాడు నువ్వెందుకని వెళ్ళలేదు... ?!" అంటూ ప్రశ్నించింది.

"అదా ...! ఆఁ .. ఏముంది... ? క్లబ్బు ఆనివర్సరీకి రమ్మన్నారు. నేను ప్రొద్దుటే చెప్పాను రానని. మళ్ళీ రమ్మని బలవంతం చేస్తే ఏమనాలి ...!" బిస్కట్ ఒకటి తీసి కొరుకుతూ, అంది ఉష.

"ఏం.. ఎందుకు వెళ్ళకూడదూ...?" అంటూ రెట్టించింది, పద్మ.

"ఏంవిటో వదినా ....! ఆ క్లబ్బు ఆనివర్సరీలు, ప్రోగ్రాములు, టీపార్టీలు, డిన్నర్లు నాకు వూపిరాడనట్లే వుంటుంది. యమ బోరుగా కూడా అనిపిస్తుంది. అక్కడికొచ్చే ప్రతి సోషల్ లేడీ తనలో లేని ప్రత్యేకత ఏదో తనకున్నట్లు ప్రవర్తించబోయి, తమ బలహీనతలను ప్రదర్శించుకుంటారు. వాళ్ళ ఫాల్స్ ప్రెస్టీజస్, అర్థంలేని ఆధిక్యతలు, డిగ్నిటీలు - ఏంవిటో వాళ్ళతో నేను కలవలేకపోతున్నాను వదినా ! ఆ కృత్రిమ వాతావరణం నాకు సరిపడడం లేదు. అది పోనీ కానీ...! ఏంటిలా సాయంత్రం బయలుదేరి వచ్చారు.." ఉష, ప్రసంగాన్ని దాటేయడం కనిపెట్టింది పద్మ.

సుమా వాళ్ళ స్కూల్లో పేరెంట్స్ డే విషయం చెప్పగానే వుషారుగా లేచి డ్రస్సయి వస్తున్న ఉషని విచిత్రంగా చూచింది పద్మ. భర్త రమ్మంటే ఏదో సాకులు చెప్పిన ఈ మహాతల్లి తనతో ఇంత ఆనందంగా వస్తున్నదే ...!

దారి పొడవునా ఈ ప్రశ్న పద్మ బుర్రని తొలుస్తూనే వుంది. కానీ, ఉష ఉక్కు తెరవెనక్కి వెళ్ళిపోయి మౌనంగా సంభాషణని మరొక ప్రక్కకి మళ్ళించడం గమనించి వూరకుండిపోయింది పద్మ, మరేం ప్రశ్నించకుండా.

భర్త ఆ ముక్క చెవిని వేసినప్పటి నుండి పద్మకి నవనాడులూ కృంగిపోయాయి. అరుణ దూరంగా వుండడంతో - ఉషలో అరుణని చూసుకొని తృప్తిపడింది. కానీ క్రమేణా ఉష తన స్వంత చెల్లెలులాగా ఆత్మీయురాలై కూచుంది. భర్త ఆఫీసుకి వెళ్ళగానే త్వర త్వరగా పనులు ముగించుకొని ఇంటికి తాళం వేసి ఉష ఇంటికేసి బయలుదేరింది పద్మ.

ఉష మామూలుగానే ఆహ్వానించింది పద్మని. ఉష కూచున్న సోఫా చుట్టూ విజ్ఞాన శాస్త్రానికి

సంబంధించిన పుస్తకాలు - జర్నల్స్ పడివున్నాయ్. ఒక జర్నల్ తెరిచి వుంది. ఉష ఏదో వ్రాస్తున్నట్లుందే అనుకుంటూ పద్మ కూడా సోఫాలో కూచుంది. వ్రాస్తున్నది ఆపి తనవేపు తిరిగిన ఉష నుద్దేశించి అంది పద్మ, "ఉషా ..! నువ్వు నన్నొక అక్కగా భావించి అభిమానిస్తున్న దానివయితే- నేనొక విషయం అడుగుతాను - నువ్వు సూటిగా జవాబు చెప్పాలి." ఉష ఒక్క క్షణం నిరుత్తర అయింది. కానీ, వెంటనే తేరుకుని, "అలాగే ... అడగండి వదినా ...! ప్రస్తుతం మీకన్నా ఆప్తులు నాకెవ్వరూ లేరీ ప్రపంచంలో " అంది.

"అదిగో ...! ఈ విధమైన మాటలేవద్దు. నీకేం తక్కువని. ప్రాణంగా ప్రేమించే భర్త - ముద్దులు మూటకట్టే ముత్యాల్లాంటి పిల్లలు."

"నా అదృష్టం గురించి గుర్తు చేయడానికే వచ్చారా వదినా మీరు పనికట్టుకొని!" ఉష మాటల్లో ఏదో తీవ్రత.

"కాదమ్మా ఉషా నీకో విషయం చెప్పాలని వచ్చాను. ప్రతి స్త్రీ అందులోనూ వివాహిత కొన్ని విషయాలు అతి జాగరూకతతో గమనించి ప్రవర్తించాలి. ముందుగా భర్త పట్ల... ఆ తర్వాత ఎదిగి ఎచ్చే పిల్లల పట్ల..." మధ్యలో ఉష అడ్డు తగుల్తుందని అనుకొంది పద్మ. కానీ, ఉష మౌనంగా వింటూ కూచుంది తను మాట్లాడ వల్సింది ఏదీ లేదన్నట్లు. "ఈ రోజు మీ అన్నయ్యగారు చెప్పిన కబురు విన్నప్పటి నుండి నా మనసు మనసులో లేదు. పురుషుడు తప్పు చేసినప్పుడే మ్మా స్త్రీ మేల్కొని అతని బలహీనతని గుర్తించి, క్షమించి, అతన్ని దారిలో పెట్టాలి."

"విషయమేంటో చెప్పండి వదినా !" అసహనంగా అంది ఉష.

"మీ అన్నయ్య, మీ వారిని ఇంకో యువతితో మొన్నటి రోజు సినిమా హాల్లో చూసారట ...!"

అంతేనా అన్నట్లు చూసింది ఉష.

"అదేదో చిన్న విషయం అన్నట్లు చూడకు.. ఇది మొదటిమారు కాదట. ఆ మధ్య ఎగ్జిబిషనులో కూడా ఇద్దరూ కలిసి తిరుగుతూంటే చూసి తానంతగా పట్టించుకోలేదట. ఆ అమ్మాయి ఎవ్వరో ...? ఏఁవిటో ..." మధ్యలోనే అందుకుంది ఉష, "ఎవరో కాదులే వదినా.....! వాళ్ళ టైపిస్టు జమున. ఒక విధంగా వాళ్ళకి బంధువులు కూడా. మావారే ఆ అమ్మాయికి వుద్యోగం ఇప్పించారు...." ఎంతో తాపీగా ఉష అంటూంటే దిమ్మెరపోయింది పద్మ.

ఏఁవిటీ పిల్లకి చీమకుట్టినట్లు కూడా లేదే..! దిగ్భ్రాంతితో తనవేపే చూస్తున్న పద్మ ప్రక్కకి వెళ్ళి కూచుంది ఉష.

"వదినా ! ఎందుకలా తెల్లబోతారు. ఔను! నా భర్త పరాయి స్త్రీతో తిరుగుతున్నారు. ఇంతెందుకు? సంబంధం కూడా పెట్టుకున్నారు. ఆ విషయం తెల్సికూడా నేనిలా నిశ్చింతగా వున్నాను. అదే కదూ మీ ఆశ్చర్యం ! వదినా, అరుణ చెప్పింది చాలా వరకు నిజం. నేను పెళ్ళి చేసుకోవడంలో చాలా పెద్ద పొరబాటు చేసాను" ఆవేశంతో మాట్లాడేస్తోంది ఉష.

ఇన్నాళ్ళు తనని తాను కప్పుకున్న తెరేదో తొలిగిపోయి నిజరూపం బయటికి వచ్చినట్లు కన్పించింది ఉష, పద్మ కళ్ళకి.

ఉషని మధ్యలో ఆపకుండా అలా వింటూ కూచుంది పద్మ.

"వదినా ! మీకు మా చిన్నతనం బాగా తెలుసు. మా ఇంట్లో వాళ్ళందరి కన్నా కూడా నాకు మీ దగ్గరే చాలా చనువు. నేనూ - అరుణ మీతో వాదించి మిమ్మల్ని చిత్తుగా ఓడించే వాళ్ళం. ఆషాఢమాసంలో అయిదుసార్లు గోరింటాకు పెట్టుకుంటే అయిదవతనం ఎక్కువవుతుందని మీరు గోరింటాకు రుబ్బి పెట్టుకొని మమ్మల్నికూడా పెట్టుకోమని అడిగితే, ఆషాఢమాసంలోనే ఎందుకు పెట్టుకోవాలి ...? మరో మాసంలో ఎందుకు పెట్టుకోకూడదని మిమ్మల్ని వేధించేవాళ్ళం .. ఏమోనమ్మా పెద్దలలా చెప్పారు అని అమాయకంగా మీరంటే పకపకా నవ్వేవాళ్ళం మేము. జ్యేష్ఠ, ఆషాఢ మాసాలలో కాచే విపరీతమైన ఎండకు తోడై వీచే గాలులు మనుషుల్ని ఎండిపోయేటట్లు చేస్తాయ్. ఆ వేడి వడగాల్పులు తగ్గడానికి గోరింటాకు ఉపకరిస్తుంది. వానాకాలం - చలికాలంలో ఐతే శరీరంలో వుండే చల్లదనానికి అది పనికి రాదు. మా లెక్చర్ విని - 'ఏమోనమ్మా - నాకవన్నీ అట్టే తెలియదు. మా అమ్మగారు చెప్పారు కాబట్టి నేనూ ఆచరిస్తున్నాను' అంటూ తప్పుకునేవారు.

ఇలాగే మీవి పాత ఆచారాలనీ అర్ధంలేని నమ్మకాలనీ, అన్నిటికీ ఏదో ఒక సైంటిఫిక్ ఎక్స్ప్లనేషన్ చూపించేవాళ్ళం. ప్రతి పండుగ వెనుక గల విజ్ఞాన శాస్త్ర కారణాలని మీకెత్తి చూపించి విజయగర్వంతో విర్రవీగే వాళ్ళం. అరుణ కంటే కూడా నాకే విజ్ఞాన శాస్త్ర అధ్యయనం పట్ల చెప్పలేని వ్యామోహం. సరికొత్త పరిశోధనలని దేశ విదేశ పత్రికల్లో చదువుతూ అందులోంచి బయట పడేదాన్ని కాదు. నేనూ ఒకరోజు పేరుమోసిన విజ్ఞాన శాస్త్రవేత్తనయి తీరుతానన్న నమ్మకం నాకుండేది. ప్రతి చిన్న విషయాన్ని నిగూఢంగా, లోతుగా ఆలోచించి అర్ధం చేసుకోవడంలో అనిర్వచనీయమైన ఆనందం, తృప్తి నాకు లభించేవి. నా విజ్ఞాన తృష్ణ నిరాటంకంగా సాగినంత వరకు, నా మేధస్సుకు తగినంత మేత దొరికినంత వరకు నా అంత సంతోషమైన జీవి మరొక్కరు లేరు.

అలా సాగిపోతున్న నా జీవిత సరళిలో అనుకోని అవాంతరం అడ్డుపడింది. అదే నా వివాహం.

ఉత్సాహం పురకలు వేస్తున్న నా వయస్సు - వయస్సులో విర్రవీగుతున్న నా కన్నె పరువం వీరేంద్ర పురుష సౌందర్యం ముందు దాసోహమంది. అదే ప్రేమ కాబోలు అనుకున్నాను. ఇంక జీవితంలో నే కోరతగ్గది నాకు కావలసింది ఏమీ లేదన్న మూఢ నిర్ణయానికి వచ్చి వెంటనే పెండ్లికి ఒప్పేసుకున్నాను. తర్వాత సంగతులన్నీ చాలా వరకు మీకు తెల్సినవే ! బాహ్య సౌందర్యానికి విలువనిచ్చింది నా శరీరం - అంతకన్నా ఎక్కువ అభిలషించింది నా మనస్సు. నా బుర్రలో వుండే మేధస్సు మరేదో తెలియని దానికోసం తపించింది. నన్ను మధ్యలో ఆపకు వదినా ...... ! నాలో ఇన్నాళ్ళూ నిద్రాణంగా వుండిపోయిన నా భావాలూ, బాధలు అన్నింటిని నీ ముందిలా పరవనివ్వు" ఝురిలా సాగిపోతోంది, ఉష వాగ్ధాటి.

"మొదట్లో నా ఆశయాలకీ, కోరికలకి, భావాలకి అనుగుణంగా మలుచుకుందామని

అనుకున్నాను. కానీ ఆయన ఓ సాధారణ మానవుడు. ఫ్యాక్టరీ, ఆఫీసు, టూర్లు, ఇల్లు, భార్య, పిల్లలు, సంసారం - అంతకన్నా అతనెక్కువ ఆలోచించలేరు. ఇక మా అత్తగారూ, మామగారు చెప్పనే అక్కర్లేదు. అంతా మూఢ మనస్కులు. వారితో వుంటే సరిపడడంలేదని వేరు కాపురం పెట్టాను. కానీ అక్కడ నలుగురిలో ఎంతటి ఒంటరితనం అనుభవించానో ఇక్కడ అంతకు రెండింతలు అశాంతి అనుభవిస్తున్నాను. చేతినిండా పని వుండి వుంటే నాబోటి దానికి కాస్త కాలక్షేపమయ్యేదేమో కానీ నా భర్త ఐశ్వర్యం అందుకు కూడా నాకు అడ్డుగా నిలిచింది. పిల్లలు పెద్దవారయ్యారు. నా అవసరం వాళ్ళకి లేదు. నా భర్తకి కూడా నాతోటి అవసరం లేకుండా పోతున్నది.''

పద్మ గబుక్కున అడ్డు తగిలింది.

"అదే నమ్మా నొద్దనేది ..! కాపురం కూలదోసుకోవడం చాలా సులభం. కానీ పునర్నిర్మించడం చాలా కష్టమమ్మా'' అనునయంగా అంది పద్మ.

"ఏం చేయనొదినా ..! నా మనస్సు నా శరీరంతో ఏకీభవించడంలేదు. ఒట్టి కట్టెలాటి నా శరీరంతో ఆయనకి తృప్తి కల్గడంలేదు. నాక్కూడా ఈ విధమైన జీవితం విరక్తి పుడుతూంది..''

"అందుకని...?'' భయంగా అంది పద్మ.

"ఏంటొదినా ! మీరు భయపడుతున్నారా ..? కానీ నేను పిల్లల భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, ఏ అఘాయిత్యం చెయ్యను. అది మాత్రం నిశ్చయం. ఈ మధ్య ఆయన కాపురం అంత ఇష్టంలేని దానివి - డైవోర్స్ తీసికుంటే పోలేదా ? అని అన్నారు. కానీ మేము విడిపోయి పిల్లల భవిష్యత్తును పాడుచెయ్యడం నాకిష్టం లేదు. అయినా, విడాకులు తీసుకొని నేనేం చెయ్యను ...? మళ్ళీ పెళ్ళి వాంఛ వున్నదాన్నయితే - ఈ జీవితంతోనే సరిపుచ్చుకొనేదాన్ని....'' ఉష మాటల్లో ఏదో ధృఢనిశ్చయం కన్పిస్తూంది. అంతా అయోమయంగా అన్పించసాగింది పద్మకి. ఏవిఁటీ కాలపు పిల్లలు! 'జీవితం' 'సంతృప్తి' 'సరిపుచ్చుకోవటం' - ఎందుకింత పిచ్చిపిచ్చి మాటలు ! ఇంతకీ ఈ పిల్ల బంగారం వంటి కాపురాన్ని కాదని చేయబొయ్యే ఘనకార్య మేమిటో ...?

పద్మ ఆలోచనల్ని చదివినట్లుగా ఉష అందుకుంది. "పద్మావతీ మహిళా కళాశాలకి అప్లైచేసాను వదినా, లెక్చరర్ పోస్టుకి. అది వచ్చాక వెళ్ళి జాయినవుతాను.''

"ఉషా .. ! ఉద్యోగమే ఈ సమస్యకి పరిష్కారమనుకుంటే - ఈ వూర్లోనే చేయవచ్చు కదమ్మా ..!'' ఆశగా అంది పద్మ.

"పిచ్చివదినా, ఉద్యోగం కాదొదినా నా ఆశయం ! ఉద్యోగం చేస్తూ రిసర్చి చేయాలన్నదే నా అభిమతం.''

"మరి మీవారు ఒప్పుకున్నారా ..?''

"హాఁ.. ఒప్పుకోవడమా ..! అసలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారా ...? అయినా, అది వారి తప్పుకూడా కాదు. ఏ భర్త తన సుఖాన్ని ధారపోసి భార్యలోని ఔన్నత్యాన్ని గుర్తించాడు...?! అహఁ.. అలాగని నేనో వున్నతురాలినని చెప్పుకోవడం లేదు. కానీ ఈ రకమైన వృధా జీవితాన్ని మాత్రం ఇక గడపలేను.

నాకు తెలుసు నేనిలా వెళ్ళిపోవడాన్ని అందరూ గర్హిస్తారు. కానీ, తప్పదు. కలిసి వుండి ఆయన జీవితాన్ని కూడా నరకం చేయదల్చుకోలేదు. వారు జమునతో తిరిగినా జలజతో కులికినా నా అభ్యంతరము ఏమీ లేదు" ఉష నిర్భయంగా, నిస్సంకోచంగా చెబుతూంటే ఆ పిల్లలో వెలిగే తీక్షణతను చూచి కొద్దిగా జంకింది పద్మ.

'ఉష లాంటి వారు సామాన్య గృహిణి జీవితానికి పనికిరారు వదినా! ఉష, ముందు జీవితంలో దెబ్బ తినకుండా వుండడమే నాక్కావల్సింది' అన్న అరుణ పద్మ కండ్ల ముందు ప్రత్యక్షమయింది.

ఆఖరి అస్త్రం ప్రయోగించింది పద్మ.

"పిల్లల్ని తల్లిలేని వాళ్ళని చేస్తావా ఉషా ...?"

"లేదొదినా .. కొద్దిరోజులు పిల్లల్ని మా అమ్మగారింట్లో వుంచుతాను. ఎంతమంది పిల్లలు చదువులకోసం వేరేవుండి చదువుకోవడం లేదు...! ఇక్కడ మాత్రం పరిస్థితి తారుమారనుకో ....! తల్లి పిల్లల్ని విడిచి వేరే వూరు వెడుతున్నది. నెమ్మదిగా పిల్లల్ని కూడా నా దగ్గరికి పిల్పించు కుంటాను."

"ఇవన్నీ నీవు చెప్పేమాటలు ! మరి, వీరేంద్ర పిల్లల్ని విడిచిపెట్టి వుండడానికి ఒప్పుకుంటాడంటావా ...?"

ఉష ముఖాన్ని విషాదచ్ఛాయలు ఆక్రమించడం గమనించింది పద్మ.

"అలా ఎన్నటికీ జరగదనే భావిస్తాను. కానీ అలా ఒప్పుకోని నాడు నా అంత దురదృష్టవంతురాలు ఇంకొకరుండరు." ఉష ఉదాసీనంగా అన్న ఆ మాటల్లో అంతులేని ఆవేదన

పువ్వువంటి ఉష జీవితం ఎందుకిలా కంటకావృతమయింది? ఆశకు చావులేదన్నది పద్మ అడిగిన ఆఖరి ప్రశ్నతో నిరూపించబడింది. "ఉషా ! పోనీ ఇంట్లోనే వుండి నీ ప్రయోగాలు, రిసెర్చీలు చేయవచ్చుగా ...! ఎంత మంది అలా చేయడం లేదు..!"

"అయ్యో! రామ ! మళ్ళీ మొదటికి వచ్చారే ...! నాకీ సంసారిక జీవితం సరిపడి రాదొదినా ! నా ధ్యాసలు, ఆలోచనలు మరోవేపుంటే ఈ యాంత్రిక జీవితం గడపగల నంటారా ...? ఇవన్నీ నేను ఆలోచించ లేదనుకున్నారా ? ఆలోచించి, ఆలోచించి నా బుర్ర వేడెక్కి పిచ్చిపడ్తుందేమో అన్నంత భయం వేసేది ఒక్కొక్క మారు. ఇంతెందుకు, ఇలాగే కొన్నాళ్ళుంటే నాకు తప్పక పిచ్చిపడ్తుంది. ఏ మాత్రం సామరస్యం లేని తల్లిదండ్రుల మధ్య పెరిగే కన్నా పిల్లలు ఎవరో ఒకర్ని పోగొట్టుకొని ప్రశాంతంగా బ్రతకడమే మేలు .."

ఉష మాటలు ఇంకాస్సేపు కూచుని వింటే తనకి ముందు పిచ్చి పడ్తుందని లేచిపోయింది

పద్మ, "వెళ్ళొస్తానమ్మా..." అంటూ. గేటు వరకు వచ్చిన ఉషతో "ఏ నిర్ణయం తొందరపడి తీసుకోకు ఉషా ? ఇక అంతకన్నా నేనేమి చెప్పలేను" అంటూ రోడ్డుమీదకి వచ్చింది.

★ ★ ★

"మైడియర్ వదినా !

ఆరు అరటావుపేజీల నీ ఉత్తరం చూచి ఎంతో సంబరపడ్డాను, ఎన్నెన్ని తీయటి కబుర్లు వినిపిస్తావోనని, తీరా చూద్దును కదా - ఉషా దేవి విషాద వృత్తాంతంతో నింపావు పేజీలని.

వదినా ! ఈ వార్త - దుర్వార్త - అందామా - నేను ఆరేళ్ళ క్రితమే వూహించాను. ఉష భవిష్యత్ జీవితాన్ని గురించి భయపడ్డాను కానీ, నేనూహించింది నిజమైందనీ, నా అంచనా తారుమారు కాలేదని నేనీ నాడు గర్వపడడం లేదు. పైగా విచారిస్తున్నాను. నేనోడిపోయివున్నా బాగుండేదని బాధ పడ్తున్నాను. కానీ, ఎవ్వరు విచారపడి, బాధపడి ఏం లాభం..? ఏ పనైనా దాన్ని చేసే ముందు ఆలోచించాలి. కానీ, కార్యానంతరం వాటి బాగోగుల గురించి, ఎంత చింతిస్తే ఏం లాభం ..?

వీరేంద్రగారు పిల్లల్ని దృష్టిలో పెట్టుకొని విడాకులకు ఒప్పుకోలేదని, పిల్లల్ని తన దగ్గరే వుంచేసుకున్నారని, ఉష బ్రతుకు రెంటికీ చెడ్డ రేవడి అయిందని బాధపడ్తూ వ్రాసావు. కానీ వదినా- నువ్వొకటి బాగా ఆలోచించు. ఉష జీవితం ఇలా అవడానికి ఉషే కారణం. తన స్వయం కృతాపరాధమే ఇది. తానేమిటో తన మనసేమిటో ఆలోచించకుండ త్వరపడి గృహిణిగా మారింది. నేడు తన తప్పులు తెలుసుకొని తన జీవిత గమనాన్ని మార్చుకుంది. తాత్కాలికంగా పిల్లల్ని వదిలి బాధపడినా, కొన్ని రోజులకి శాస్త్ర పరిశోధనలో తలమునకలవుతూ తన్ను తానే మరచి మానసిక సంతృప్తితో జీవించగలదు ఉష. భవిష్యత్తులో ఏదో సాధించగలనన్న ఆత్మస్థైర్యంతో కాలాన్ని సంతోషంగా వెళ్ళబుచ్చగలదు.

కానీ వీరేంద్ర మాటేమిటి ? అతడెవరికి అపకారం చేసాడని, ఏ అపరాధం చేసాడని అతని సంసార జీవితం ఇలా నాశనం అయింది ? సామాన్య మానవుడు వీరేంద్ర ! నిజమే కానీ అతని జీవితంలో సుఖసంతోషాలని కరువు చేసిన ఉష నిజంగా క్షమించదగినదేనా ? నోరూ వాయి లేని పసిపాపలే పిల్లలు. వాళ్ళకి తల్లి ప్రేమానురాగాలను దూరం చేసిన ఉష ఏ విధంగా మాననీయురాలు. ఇందరిని ఇన్నివిధాల వెతల పాల్జేసి తన మార్గాన్ని తానెన్నుకున్న ఉష నిర్ణయంలో ఔచిత్యమేమిటో బోధపడడంలేదు నాకు. పైపెచ్చు ఆ పిల్ల వెడలబాటులో మూర్తీభవించిన స్వార్థం కన్పిస్తుంది నాకు. ఏ విధంగా చూసినా - ఉష కాదు వదినా - వీరేంద్ర శాపగ్రస్థుడు. ఇక ఇంతకన్నా నేనేమని వ్రాయను.

మీకూ, అన్నయ్యకి నమస్కారాలందజేయమన్నారు వినయ్. సునీల్‌కి వీలు చూసుకొని లెటర్ వ్రాస్తాను. ఆ జాబు వెంట సంహిత పుట్టిన్రోజు ఫోటోలు పంపుతాను. ఇక వుండనా మరి.

ప్రేమతో - మీ **అరుణ.**"

■

***(అంజలి మాసపత్రిక, జూలై-ఆగస్టు 1996)***

# ఇచట నేవుండిపోనా !

"అమలా! కమాన్. రెడీయేనా ఆటోవచ్చింది" అంటూ వేగంగా లోపలికి వచ్చిన అరవింద్‌కి గుమ్మంలో భార్య జాడ కన్పించలేదు. ప్యాక్‌చేసిన సూటుకేసులు, షోల్డర్ బ్యాగులు, వాటర్ బాటిల్ దర్శనమిచ్చాయి.

ఎక్కడుందబ్బా ఈవిడగారు అనుకుంటూ, "రమ్యా! మీ అమ్మేది?" అని రమ్యని ప్రశ్నించాడు. టి.వి. ప్రోగ్రాం దీక్షగా చూస్తున్న పన్నెండేళ్ల రమ్య "కిచన్‌లో డాడీ" అంటూ ఓ క్షణం నాన్నవైపు చూసి మళ్లీ టి.వి.కి కళ్లప్పగించింది.

వంటింట్లోకి అడుగిడబోతున్న అరవింద్‌కి ఎదురొచ్చింది అమల.

"ఏంటమలా ఇంతాలస్యం?" అసహనంగా అన్నాడు అరవింద్.

"అబ్బ! ఏంలేదు మీరు పదండి. అత్తయ్యగార్కి వంటింట్లో ఏవేవి ఎక్కడెక్కడున్నాయో చూపించి చెప్పద్దా ఏంటి ? ఇప్పుడొద్దు వొద్దంటూంటే మీరేమో ఒక్క నెలరోజుల టూర్ వేసారు" దెప్పుతున్నట్లు మాట్లాడుతున్న భార్యకేసి ఆశ్చర్యంగా చూసాడు అరవింద్.

"మీరు నడవడంర్రా, బండికి టైం అవుతోంది..." తొందరించింది సావిత్రమ్మ.

"అత్తయ్యా!" అంటూ మళ్లీ ఏదో అప్పగింతలు పెట్టబోతున్న కోడల్ని అడ్డుకుంది సావిత్రమ్మ.

"చూడమ్మా! నువ్వు టూర్నుండి తిరిగొచ్చేసరికి నీ పిల్లల్ని, నీ ఇంటిని నీకు భద్రంగా అప్పచెప్తానులే; భయపడకు. ఆలస్యం ఎలాగూ అయింది నా తిరుగు ప్రయాణం మీరొచ్చాకనే సరేనా" అది హాసమో, పరిహాసమో అర్థంకాలేదు అమలకి. "పద-పద" మంటూ భర్త తొందరించడంతో ముందుకు నడిచింది అమల.

"రమ్యా, ఆదిత్యకి హోమ్‌వర్క్‌లో సాయం చెయ్యి. అన్నీ నానమ్మ చూస్కుంటుందిలే అని వాణ్ణి గాలికి వదిలేయకు" ఆటోలో ఎక్కి కూచుంటూ అంది అమల.

"మమ్మీ ఎన్నిమార్లు చెప్తావు నువ్వు నాకీ సంగతి....? బై.... హాపీ జర్నీ.... బై డాడీ" అంది రమ్య.

ఎనిమిదేళ్ల ఆదిత్య మాత్రం ఏక్కముఖం పెట్టాడు "అమ్మా" అంటూ.

'అమ్మ సావిత్రమ్మను చూసిన అరవింద్‌కి సమాధానమా అన్నట్లు ఆదిత్యని దగ్గరికి తీసుకున్న సావిత్రమ్మ, "మా బాబు గుడ్‌బాయ్, మమ్మీ డాడీలకు టాటా చెప్పు నాన్నా..." అంది.

ఆదిత్య టాటా చెప్పడం, అమల అరవింద్‌లు ఎక్కిన ఆటో బయల్దేరడం ఒక్కమారే జరిగాయ్.

"అమలా, నీ ఉద్దేశమేంటి? నేనేదో నిన్ను బలవంతంగా తీసికెళ్తున్నట్లు మాట్లాడు తున్నావ్...? ఎప్పటినుండో ప్లాన్ చేసిన ట్రిప్ ఇది" కాస్త కోపంగా అన్నాడు రైల్లో సర్దుకు కూచుంటున్న అరవింద్.

"అది నిజమే అనుకోండి...."

"మరేంటట! ఢిల్లీలో రామానందాన్ని, కిరణ్‌కుమార్‌ని కూడా ప్రయాణం చేయించాం. వాళ్లు కూడా భార్యలతో వస్తున్నారు. పైగా నెలకు ముందే అన్నీ రిజర్వ్ అయిపోయాయ్...." తనని దెప్పుతున్నట్లు గమనించిన అమల ఏమీ మాట్లాడక ముఖం తిప్పేసుకుంది.

"అయినా? అమ్మ ఉందిగా పిల్లల్ని, ఇంటిని చూస్కోడానికి."

"అదేనండీ నా బాధంతా!"

"ఏది....? అమ్మకి ఇల్లప్పగించి రావడమా? నీకు పిచ్చికానీ పట్టలేదు కదా?"

"అనవసరంగా కోపం తెచ్చుకోకండి. అత్తయ్యని ఇక్కడికి ఎలా ఎందుకు తీసుకొచ్చామో ఒక్కమారు గుర్తుకు తెచ్చుకోండి."

"గుర్తెందుకులేదు. నాన్నగారు పోయి రెండేళ్లయింది. ఇన్నాళ్లూ తమ్ముడు వెంకటేష్ తోటే ఉండిపోయింది అమ్మ. స్వంత ఊరు, పెరిగిన ప్రదేశం ప్రశాంతంగానే ఉందిలేరా అరవింద్ అని అమ్మ అన్నా ఆరు నెల్లక్రితం అమ్మను చూడడానికి వెళ్లిన నేను ఆమె దైన్య స్థితిని చూసి మనింటికి పిల్చుకు వచ్చాను. అయినా, నీకు తెలియనిదేముంధి - నీ తోడికోడలు సువర్ణ పరమ గయ్యాళి. వాళ్లమ్మే ఆ అమ్మాయి నోటికి జడుస్తుంది."

"కరెక్ట్... ఇప్పుడొచ్చారు అసలు విషయానికి. అత్తయ్య అక్కడ సంతోషంగా లేదని, పెద్దకొడుకుగా ఆమె నీ వయసులో సుఖపెట్టాలనే కదా మనింటికి తీసుకువచ్చారు? ఆగండాగండి. మధ్యలో సన్నాపకండి. కానీ జరిగిందేవిటి ? అత్తయ్యగారు ఇక్కడ సంతోషంగా లేదన్న విషయం పదిరోజులక్రితం 'నే వూరెళ్లి పోతానమ్మా! నాకేంటోగా ఉందిక్కడ' అని అత్తయ్య అన్నపుడు అర్థమయింది కదా."

"సరే. దానికేం చేస్తాం. ఆమెకి కావాల్సిన సదుపాయాలన్నీ సమకూర్చాం. కూర్చోపెట్టి కించిత్ కష్టం కల్గకుండా చూసుకుంటున్నాం. చిన్నమెత్తుపని చెప్తున్నామా! అయినా, ఊరెళ్లిపోతానంటే ఏమన్నమాట ! వెళితే వెళ్లనీ. బహుశా, పుట్టి పెరిగిన వూరు, మరిచిపోలేకుండా ఉంది. వెంకటేష్ దగ్గర ఉండదట. మన పాత ఇంటి వెనకున్న గది బాగుచేయించుకుని అందులో ఒంటరిగా ఉంటుందట."

"ఏవిటో! ఎందుకు చెప్పండి ఒంటరిగా ఆ పల్లెటూళ్లో ఉండడం ? ఇక్కడ మనతో పాటే ఉండచ్చుగా. మీరే చూస్తున్నారుగా, ప్రొద్దున ఆఫీసుకెళ్లే హడావిడిలో కూడా వంటపని, పిల్లలపని చూసుకొనే వెళుతున్నానా! బజారు పని కూడా నేనే చేస్తున్నానా! పిల్లలు ఆవిడని విసిగిస్తారేమోనని వాళ్లని కేకలేసి కూలేస్తున్నానా! అయినా అత్తయ్య వెళ్లిపోతానంటే ఆమెకిక్కడ నచ్చలేదనే కదా అర్థం. మనతో ఉండడమే ఇష్టం లేని అత్తయ్యకిపుడు అదనంగా ఈ బరువు బాధ్యతలని అప్పగించి జల్సాగా మనం ఊర్లు తిరగడం నాకేంటో బాగనిపించలేదు. పైగా గిల్టీగా కూడా ఉంది."

"సరేలే ! నువ్వేదో ఊహించుకుంటూ జాలీగా గడుపుదాం అనుకున్న సెలవుల్ని కాస్తా నీరు కార్చేటట్లున్నావ్..." బెర్త్ మీద జారగిలబడి ఇండియా టుడే తిరగేయడం మొదలెట్టాడు అరవింద్.

అలా అసంతృప్తిగా, అపరాధ భావంతో ఆరంభమైన నార్త్ ఇండియా టూర్‌ని అమల పూర్తిగా ఎంజాయ్ చెయ్యలేక పోయిందనే చెప్పాలి. ఢిల్లీలో షాపింగ్ చేస్తున్నా, ఆగ్రాలో తాజ్ అందాల్ని అవలోకిస్తున్నా, హరిద్వార్, ఋషీకేష్‌లో పర్యటిస్తున్నా, అమల మనసు హైదరాబాద్ వైపు పరుగు పెట్టేది. డెహరాడూన్, డార్జిలింగ్, నైనిటాల్, సిమ్లా ఇలా నెలరోజులు ఊర్లన్నీ తిరిగి తిరిగి తిరుగు ప్రయాణం కట్టారు అమల, అరవింద్‌లు. మధ్య మధ్య ఇంటికి ఫోన్ చేసినపుడు రమ్య, ఆదిత్యలు పురమాయిస్తున్న లిస్టు పెరిగిపోసాగేది. సావిత్రమ్మ కూడా ఉత్సాహంతో కొడుకు కోడళ్ల యాత్రావిశేషాలను అడిగి తెలుసుకొనేది.

ఎ.పి. ఎక్స్‌ప్రెస్ నాంపల్లి స్టేషన్ చేరేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. ఇక ఆటో పట్టి ఇల్లు చేరేసరికి తొమ్మిది గంటలయింది. ఆటో చప్పుడికి "అమ్మా" అంటూ పరుగున వచ్చి

అమలని వాటేసుకున్నాడు ఆదిత్య. చిరునవ్వుతో ఎదురొచ్చిన అత్తగార్ని చూసి నవ్వుతూ, "అమ్మయ్య! ఇంటికొచ్చేసాం. దేరీజ్ నో ప్లేస్ లైక్ హోం... రమ్యా! నానమ్మని మీరిద్దరూ సతాయించలేదుకదా" అంటూ కూతుర్ని దగ్గరికి తీసుకుంది అమల.

"పదండి... పదండి... కబుర్లన్నీ తర్వాత. గీజర్ ఆన్ చేశాను. వేడిగా స్నానం చేస్తేనే కానీ బడలిక తీరదు..." సావిత్రమ్మ కోడల్ని తొందరించింది.

"అమ్మా, ముందు నాకో కప్పు టీ" అరవింద్ సామాన్లు లోపలికి చేరేసి, సోఫాలో కూచుంటూ కేకేసాడు.

"మీరుండండి అత్తయ్యా! నేకలుపుతాను..." అంటున్న అమలని వారించింది సావిత్రమ్మ.

"ప్రయాణం చేసి వచ్చావు. కాస్త విశ్రాంతి తీస్కో. తర్వాత వంటింటి ప్రవేశం చేద్దువు కానీ..." నవ్వుతూ వెళ్తున్న అత్తయ్యకేసి నివ్వెరపోయి చూసింది అమల.

ఎప్పుడూ ముభావంగా, నిర్లిప్తంగా, ఉదాసీనంగా ఉండే అత్తయ్యేనా ఈవిడ....?

"అమ్మా! నా క్రికెట్ బాట్ ! నా చుడీదార్ డ్రస్సులు ! స్లిప్పర్స్, నా డాల్స్...." అంటూ వేధిస్తున్న పిల్లలిద్దర్నీ పదమంటూ సూట్‌కేస్ తెరిచే ప్రయత్నంలో బెడ్‌రూములోకి నడిచింది అమల.

"హమ్మయ్య! ఇన్నాళ్లకి హాయిగా భోంచేశాం. అవేం నార్త్ ఇండియన్ హోటల్లో ! పులుసుకి, పప్పుకి, రసానికి తేడా తెల్సేది కాదు. పైగా అన్నిట్లో గాడ్స్ గిఫ్ట్, అదే వెల్లుల్లి ! ఎంతయినా ఇంటి భోజనం - ఇంటి భోజనమే ! సంతృప్తిగా ఉంది..." అంటూ డైనింగ్ టేబిల్ దగ్గరి నుండి లేచాడు అరవింద్.

"ఆ మాట నిజమే" అన్నట్లు అత్తయ్య వేపు చూసి చిరునవ్వు నవ్వింది అమల.

"వీడింతేనమ్మా! చిన్నప్పుడు కూడా ఇంతే. ఊర్లన్నీ తిరిగొచ్చి, అమ్మా కమ్మగా చారు పెట్టి అన్నం పెట్టవా అనేవాడు" అంది సావిత్రమ్మ.

తిన్న కంచాలను ఎత్తబోతున్న అత్తగారి చేతుల్లోంచి వాటిని తీసికొని వంటింట్లోకి నడిచింది అమల. అప్పటికే వంటింటి గట్టును తుడిచి శుభ్రం చేసింది సావిత్రమ్మ.

నిలబడి, ఒక్కమారు వంటింటినంతా కలియచూస్తూ, "అదేంటండీ అత్తయ్యా! వంటింటి కాబినెట్స్ అన్నీ దులిపి, డబ్బాలన్నీ తోమినట్లున్నారు, మిలమిలా మెరుస్తున్నాయి. అసలే వంటపనీ పిల్లలపనీ పైగా ఈ చాకిరీ కూడానా..." నొచ్చుకుంటూ అంది అమల.

"అదేంటమ్మా ! నేనేదో కష్టపడిపోయినట్లు మాట్లాడుతున్నావ్? వచ్చాక ఆఫీసుపనితో నీకెక్కడ తీరుతుందమ్మా ఇవన్నీ సర్దేందుకూ ! డబ్బాల మీద లేబుల్స్ అతికించాను. నువ్వు మళ్లీ కన్‌ఫ్యూజ్ అవకుండా..."

"అబ్బే! అందుకు కాదండీ! మీకు అనవసరంగా శ్రమకదా అని" అక్కడినుండి తప్పుకుంది అమల.

ప్రొద్దుటే మెలకువ వచ్చిన అమల ఆదారాబాదరాగా ముఖం కడుక్కొని వంటింట్లోకి వచ్చింది. టైంచూస్తే ఎనిమిది. పిల్లల ఆటో ఎనిమిదిన్నరకి వస్తుంది.

"అమ్మో! ఇదేంటి ఇంత మొద్దు నిద్దురపోయాను" అనుకుంటూ 'రమ్యా' అంటూ ఒక్క కేకపెట్టింది అమల.

"పిలిచావా మమ్మీ" అంటూ పరుగున వచ్చింది రమ్య. కాళ్లకి షూస్ ఉన్నాయేమో వంటగది బయటే నిలబడింది రమ్య. చక్కగా ఇస్త్రీ చేసిన యూనిఫాం, నున్నగా దువ్వుకొని రెండు జడల్నీ, నల్లని రిబ్బన్లతో పైకి కట్టుకొని, తెల్లటి సాక్స్, మెరిసిపోతున్న షూస్, భుజానికి తగిలించుకొన్న బ్యాగ్‌తో చూడముచ్చటగా ఉంది రమ్య.

"నానమ్మా ! షూస్ వెయ్యవా?" అంటూ ఆదిత్య గారాలు పోతున్నాడు అక్క వెనక నిలబడి.

వాటర్ బాటిల్స్‌లో నీళ్లు నింపుతున్న సావిత్రమ్మ "ఇదో... ఒక్కనిముషం" అంటూ ఆదిత్య చెంతకి వచ్చింది.

"తెల్లవారింది కూడా తెలీకుండా ఏంటో మొద్దు నిద్రపోయాను. నేనొచ్చి కూడా మీకింకా చాకిరీ..."

"ఛా....ఛా.... ఎందుకలా అంటావ్? నేనున్నాను కాబట్టి చేశాను. ఇందులో నువ్వు బాధ పడేందుకేముందమ్మా! ఎలాగూ రేపటినుండీ తప్పవుకదా నీకీ తిప్పలు. అన్నట్లు అమలా ! పిల్లల్కి ఇడ్లీలు చేసి కారియర్‌లో సర్దాను. ప్రొద్దుటే బ్రెడ్‌జామ్ తిన్నారు. మళ్లీ అవే ఎందుకని ఇడ్లీలు వండాను. నేను స్నానానికి వెళ్తున్నానమ్మా" బాత్‌రూంకేసి నడిచింది సావిత్రమ్మ.

  

అట్లాస్, క్రేయాన్స్, నోట్‌బుక్స్ కావాలని గొడవ చేస్తుంటే పిల్లలిద్దరినీ దగ్గరలోనే ఉన్న సూపర్‌బజారుకు తీసికెళ్లింది సావిత్రమ్మ. అలాగే తిరిగివస్తూ మరుసటి రోజుకు కావాల్సిన కాయగూరలు కూడా తీసుకువద్దామని.

తీరుబడిగా కూచున్నారు అమలా అరవింద్‌లు. ఎప్పటిలాగే పేపర్ తిరగేస్తున్నాడు అరవింద్. ప్రొద్దుటే హెడ్‌లైన్స్ మాత్రం చూసి వెళ్తాడేమో సాయంత్రం ఓ గంటైనా దినపత్రిక చదవందే అతనికి తోచదు. కాస్సేపు వీక్లీని అటూ ఇటూ తిరగేసిన అమల, "ఏమండీ ఒక్కమాట" అంది భర్తకేసి చూస్తూ.

"అబ్బబ్బ! నేపేపరు చదువుతున్నప్పుడే నీకెక్కడలేని కబుర్లూ పుట్టుకొస్తాయ్. కాస్సేపు ఆగొచ్చుకదా" విసుక్కున్నాడు అరవింద్.

"అదికాదండీ! కాస్సేపయితే అత్తయ్య వచ్చేస్తారు, అందుకని."

"ఓహో! అత్తగారిమీద కోడలి ఫిర్యాదులూ, పితూరీలూ?" వెటకారంగా అన్నాడు అరవింద్.

"నేను మీ కంటికి ఎలా కన్పిస్తున్నాను...?" అమల కంఠం అప్పటికే గద్గదికం అవడం గమనించాడు అరవింద్.

"ఛా....ఛా.... తమాషాకి అన్నాను లేవోయ్. నీ గురించి నాకు తెలియదా ఏంటి ? నువ్వేగా అమ్మని ఇక్కడికి తీసుకురమ్మని పట్టుపట్టింది. అత్తయ్యలో మీ అమ్మలేని లోటు తీర్చుకుంటాననీ ఉబలాటపడ్డావ్. అమ్మను సంతోషపెట్టడానికి నువ్వు చేసిన, చేస్తున్న ప్రయత్నాలన్నీ నాకు బాగా తెలుసు. అమ్మకే మన దగ్గర ఉండడం ఇష్టం లేదులా ఉంది. ఇక్కడి ఫాస్ట్‌లైఫ్, వాతావరణం అమ్మకి నచ్చుతున్నట్లు లేదు."

"కాస్సేపు మీ ఉపన్యాసం ఆపి నా మాట వింటారా సార్."

"జీహుజూర్....." బుద్ధిగా చేతులు కట్టుకొని కూచున్నాడు అరవింద్.

"అత్తయ్య మనింటికి వచ్చాక ఇంత ఉత్సాహంగా, ఇంత సంతోషంగా ఉండడం నేనిప్పుడే చూస్తున్నాను. పిల్లలు కూడా వాళ్ల నానమ్మకి బాగా మాలిమి అయ్యారు. ఇంతకీ ఆమె తిరుగు ప్రయాణానికి టికెట్ రిజర్వు చేసానని అత్తయ్యతో చెప్పారా... లేదా?"

"ఆఁ ఎప్పుడో! టూర్ నుండి రాగానే చెప్పానుగా...."

"అయితే, ఆవిడ వెళ్లే ప్రయత్నంలోనే ఉన్నారన్నమాట. తమాషా చూశారా? ఎంతో ఆదరంగా, ప్రత్యేకంగా గది ఇచ్చి స్పెషల్ గెస్ట్‌లాగా చూసుకుంటున్నన్ని రోజులు ఆవిడలో ఈ సంతోషం నాకు మచ్చుకు కూడా కన్పించలేదు. ఇప్పుడిలా ఇంటెడు చాకిరీ ఆవిడ మీద వేసి మనం టూర్...."

"ఆగాగు... అమలా! మళ్లీ ఓసారి చెప్పు ! అమ్మని ఎలా చూసుకున్నావ్? ఒక అతిథి లాగ, అదే గెస్ట్‌లాగా కదూ."

"ఔను. మీరేంటి ఇంతాశ్చర్యపోతున్నారు....?"

"అక్కడే ఉన్నదోయ్ అసలు పాయింటు. అమ్మ ఇక్కడున్న ఈ మూడు నెలలు స్టాఫ్ గ్యాప్‌గా మనింటికి వచ్చి తిరిగి తనింటికి వెళ్లిపోయే అతిథిగానే ఫీల్ అయింది. కానీ, మనం ఇక్కడలేని ఈ నెలరోజులు తన స్వంత ఇంట్లో ఉన్నట్లే గడిపింది...."

ఇంకా అర్థంకానట్లు ముఖం పెట్టిన భార్య నెత్తిమీద ఒక మొట్టికాయ వేసాడు అరవింద్.

"నీ మొద్దు బుర్రకి ఇంకా అర్థంకాలేదా? నువ్వు చేసిన, పోనీ మనం చేసిన పెద్దతప్పేంటో తెలుసా? ఆమె ఎక్కడ బాధపడ్తుందో, అసౌకర్యం ఎక్కడ కల్గుతుందో అని అనవసరపు మర్యాదలు చేసాం. అమ్మ ఇన్నాళ్ళూ ఇది కొడుకు, కోడలు ఇల్లే అనుకుంది. తనిక్కడ ఎంతైనా పరాయిదే

అనుకుంది. తన శాశ్వత నివాసం పల్లెటూళ్ళోని పడిపోయిన పెంకుటిల్లే అనుకుంది. కానీ, మనం ఇక్కడలేని నెలరోజులు ఈ ఇంటిలో తనో మహారాజ్ఞి. ఈ ఇల్లు తనది. పిల్లలు తనవారు. అలుపెరుగని ఆపద్బాంధవిలా పిల్లలకు ప్రేమానురాగాలను పంచిపెట్టింది. పిల్లల అనురాగానుభూతులను చవిచూసింది. పిల్లలు ఆమెకు ఎంతో చేరువయ్యారు. ఇప్పుడామెకి తిరుగు ప్రయాణం సంగతి ప్రస్తావించాలంటే భయంగా ఉంది...."

మబ్బు తెర విడిపోయింది. అమల ఇంకేదో చెప్పబోతుండగా సావిత్రమ్మ రావడంతో మౌనంగా ఉండిపోయింది.

"అత్తయ్యా ! ఒక్కమారిలా వస్తారా....?" బాత్‌రూం బయట నిలబడి పిలిచింది అమల.

"ఏంటమ్మా" అంటూ గబగబా వచ్చిన సావిత్రమ్మకి లోపల నిలబడి ఉన్న రమ్య కనిపించింది.

కోడలు కేసి చూసి అర్థవంతంగా నవ్వింది "అదేనా..." అన్నట్లు.

"ఔనండి.... మీ ప్రయాణం రేపే! నాకేమో సెలవులన్నీ అయిపోయాయ్ ! ఏమిటో నాకేం తోచడం లేదు...."

"ఇంకెక్కడి ప్రయాణం.... అయినా, ఇప్పుడు నేను ఊరెళ్లి చేయాల్సిన ఘనకార్యం మాత్రం ఏముంది కనుక ! అదో చూడు నా మనవరాలు చిన్నారి రమ్యి ఎంత దీనంగా చూస్తోందో, నన్నిలా వదలి వెళ్తావా నానమ్మా అంటూ... పదపద... ఇంకా చేయాల్సిన పనులు చాలానే ఉన్నాయ్...." హడావిడిగా లోనికి వెళ్తున్న అత్తయ్యని సంతృప్తిగా చూసింది అమల.

'కాగలకార్యం గంధర్వులే తీర్చారు' అనుకుంటూ రమ్యకి ధన్యవాదాలు అర్పించుకుంది అమల.

అలా ఉండిపోయిన సావిత్రమ్మ మళ్లీ తన ఊరు ప్రయాణం తలపెట్టే అవకాశమే రాకుండా చేశారు అమలా అరవింద్‌లు. ఇంటి బాధ్యతలన్నీ అన్యాపదేశంగా ఆవిడ పరం చేశారు. ఇప్పుడా ఇంటి పరిపాలనా కేంద్రబిందువు సావిత్రమ్మ.

"నానమ్మా ! నువ్వు మీ ఇంటికి ఎప్పుడెళ్తున్నావ్ ?" అంటూ ఎగతాళి పట్టిస్తుంటాడు ఆదిత్య అప్పుడప్పుడూ.

"ఒరే గడుగ్గాయ్! ఇదేరా నా ఇల్లు. ఇంకెక్కడి కెళ్లమంటావ్?" అంటూ నవ్వేస్తుంటుంది సావిత్రమ్మ.

■

*(విపుల మాసపత్రిక, అక్టోబర్ 1997)*

# మా స్వర్గధామమిదే

"ఆశీష్... ఆశీష్.. వేరార్ యూ? ఇక్కడే ఉండి కూడా పలకవేమిట్రా...?" కామిక్స్ తిరగేస్తున్న ఆశీష్, అహల్య కేకలకి ఒక్కమారు తలెత్తి చూసి మళ్ళీ పుస్తకంలోకి తలదూర్చేశాడు.

చూయింగ్ గమ్ నములుతున్న దవడల కదలిక తప్ప మరే చలనం లేదు వాడిలో.

"ఖర్మ! ఈ కామిక్స్ కాదుకాని, ఇక ప్రపంచంతో పనుండదీ వెధవకి" విసుక్కుంటూ కొడుకు చేతిలోని పుస్తకాన్ని లాగి పడేసింది అహల్య.

"వాట్ మమ్మా! అసలే బోర్ కొట్టి చస్తున్నానిక్కడ. ఇక ఇవి కూడా వద్దంటే ఎలా?" ముఖం మీద పడుతున్న ముంగురులను ఎగరేసి చూశాడు అమ్మకేసి. ఏమనుకున్నాడో ఏమో వెళ్ళి అవంతి పక్కకూర్చున్నాడు సోఫాలో.

"ఎంత మొత్తుకున్నా వినక మీ డాడీ ఆ డర్టీ విలేజ్‌కి ప్రయాణం పెట్టారు కదా! ఇక మనకు తప్పుతుందా. సూట్‌కేస్ ప్యాక్ చేయాలి. నీ. బట్టలవీ తీసివ్వు వారానికి సరిపడా.. సర్దేస్తాను. ఏయ్ అవంతీ! అలాగే నీ డ్రెసెస్ కూడా" సోఫాలో కూచుని వీడియో వీక్షిస్తున్న కొడుకునూ, కూతుర్నీ చూస్తూ అంది అహల్య.

"ఏంటి మమ్మా, హైదరాబాద్‌లోని అంకుల్ ఇంట్లో ఉందాం అంటూ న్యూజెర్సీలో కబుర్లు చెప్పిన డాడీ, ఇప్పుడేమో 'నా నేటివ్ ప్లేస్ - అదేవిఁటి - నా జన్మభూమి నా పిల్లలైన మీరు చూడద్దూ' అంటూ ఆ రెచెడ్ విలేజ్‌కి ప్రయాణం పెట్టారు." పధ్నాలుగేళ్ళ అవంతికి, పదేళ్ళ తమ్ముడు ఆశీష్‌కన్నా అసహనం ఎక్కువలా ఉంది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పుట్టి పెరిగిన ఇద్దరు పిల్లలూ ఎప్పుడో వాళ్ళ చిన్నతనంలో ఇండియా వచ్చిన గుర్తు. పిల్లల చదువులంటూ భార్యాభర్తలు రెండేళ్ళకో, మూడేళ్ళకో ఓమారు

విడివిడిగా మాతృదేశం వచ్చి వెళ్ళడం వల్ల ఇక్కడి ప్రాంతాలతోటి, పరిసరాలతోటి, బంధువులతోటి పెద్దగా అనుబంధాలు ఏర్పడలేదు పిల్లలకు. వారు పూర్తిగా అమెరికనైజ్ అయిపోయారు. కరుణాకర్ పట్టుదలగా ఇంట్లో తెలుగులో మాట్లాడుతుండడంతో కనీసం తెలుగు వచ్చింది. లేకుంటే వ్యవహారమంతా 'వ్వావ్', 'రాయిట్', 'యా', 'హై'లలో ఉండేది.

ఆంధ్రదేశపు ధాన్యాగారంగా ప్రసిద్ధికెక్కిన కోనసీమ కరుణాకర్ పుట్టిన గడ్డ. ఇప్పటికీ తనవారందరూ - తల్లిదండ్రులు, అన్నయ్య, అన్నయ్య పిల్లలు ఉంటున్నదక్కడే. తను పుట్టిన గడ్డ సౌందర్యాలని, ఆ సీమ సిరిసంపదల్ని తన పిల్లలు చూసి ఆనందించాలని, తన మాతాపితల తోటి, ఇతర బంధువులతోటి పిల్లలకు పరిచయ భాగ్యం కలిగించాలని ప్రగాఢంగా వాంఛించాడు కరుణాకర్. అహల్యకానీ, పిల్లలుకానీ కరుణాకర్ ప్రతిపాదనకు అంత సుముఖత చూపకపోయినా, "ఎలాగూ రెండు నెలలు సెలవు మీద వచ్చాం కదా, కనీసం వారం రోజులు నాకోసం కేటాయించండని వాళ్ళని బలవంతంగా ఒప్పించాడు కరుణాకర్. అందుకే ఈ ప్రయాణమిప్పుడు.

రాజమండ్రి వరకు ప్రయాణం ఏ.సి. కోచ్‌లోనే అయినా, మహా చిరాకు పడిపోతున్నది అహల్య నాంపల్లిలో రైలెక్కినప్పటినుంచి.

"ఏంటో! ఇండియాలో రైళ్ళెప్పుడు బాగుపడతాయో మరి! పై క్లాసు టాయిలెట్సే ఇలా తగలెడితే సాధారణ కంపార్ట్‌మెంట్స్‌లోని వాటి మాటేమిటి?" రెండుపాదాలను టిష్యూ పేపరుతో శుభ్రం చేసుకొని, సాక్స్ వేసుకుంటూంది అహల్య.

అహల్యను చూస్తే నవ్వొచ్చింది కరుణాకర్‌కి. అక్కడ న్యూజెర్సీలో అయితే చచ్చే చలి. ఆ చలికి పాదాలకి సాక్సు వేసుకోవడం తప్పనిసరి. కానీ, ఇక్కడ ఇండియాలో కూడా అదేదో పెద్ద రిచువల్‌లాగ, ఇంట్లో కూడా సాక్స్ వేసుకొని తిరుగుతూంది. ఇక ట్రెయిన్‌లో వేసుకోవడం ఒక లెక్కా! బెర్త్ మీద అహల్య పక్కన కూచుని చదువుతున్న తన పుస్తకంలోకి చూపులు మరల్చాడు కరుణాకర్, భార్య చేష్టలకి నవ్వుకుంటూ.

"మమ్మా! హైదరాబాద్‌లో అంకుల్ వాళ్ళింటికి దగ్గరగా ఉన్న హోటల్ స్విమ్మింగ్‌పూల్‌లో చక్కగా స్విమ్ చేసేవాళ్ళం కదా నేనూ, ఆశీష్. ఇప్పుడేమో అదేదో - వాట్స్ ద నేమ్ ఆఫ్ దట్ విలేజ్...?"

"బేబీ. విలేజ్ కాదమ్మా మనం వెళుతున్నది. పెద్ద ఊరే. అక్కడ స్విమ్మింగ్ పూల్స్ ఉండవు. కానీ పెద్ద పెద్ద సాగునీటి కాల్వలుంటాయ్. నువ్వూ, తమ్ముడూ స్విమ్ చేయొచ్చు ఎంచక్కా."

"ఎందుకండీ ఈ మాటలు? ఆ కెనాల్స్‌లో వాటర్ అదీ ఎంత డర్టీగా ఉంటుందో ఏమో! లేనిపోని రోగాలు అంటుకుంటాయ్." మినరల్ వాటర్ బాటిల్లోంచి నీళ్ళు నోట్లోకి వంపుకుంటూ అంది అహల్య.

"మమ్మా! వెన్ ఆర్ వియ్ గోయింగ్ బ్యాక్ టు హైదరాబాద్?"

"ఇంకా ట్రెయిన్ సగం దూరం కూడా పోలేదురా చిన్ని కన్నా! ఎయిట్ ఫుల్ డేస్ మనం ఆ ఊళ్ళో ఉండాలి." బెర్త్ మీద నడుం వాలుస్తూ అంది అహల్య.

స్క్రాబిల్ ఆడుతున్న అవంతి, ఆశీష్‌ల బెర్త్ మీదికి వచ్చి కూచున్నాడు కరుణాకర్. తాను చదువుతున్న పుస్తకాన్ని మూసి, పిల్లల స్క్రాబిల్ ఆటలో నిమగ్నమయ్యాడు.

"అన్నట్లు మర్చేపోయాను మిమ్మల్నడగడం. మొన్న మామగార్కి ఫోన్ చేసినప్పుడు అన్నీ చెప్పారు కదా - అదేనండీ - పిల్లల ఫుడ్, వాళ్ళ అలవాట్లు అన్నీ వివరించి చెప్పారు కదా!"

"అహల్యా! మరీ టూ మచ్ చెయ్యకు. అన్నీ ప్రభూ అన్నయ్యతో చెప్పాన్లే" విసుక్కున్నాడు కరుణాకర్.

"అదికాదండి. ఉన్న నాల్గురోజులు - పిల్లలకి రోగాలుపట్టుకుంటే కష్టం కదండి."

"అహల్యా! వీళ్ళేం మరీ చంటిపాపలూ కాదు. మనం వెళ్ళేది అనాగరిక అటవీ ప్రాంతానికీ కాదు" కాస్త కోపంగా అన్నాడు కరుణాకర్.

"అనాగరికులని ఎవరన్నారు? వాళ్ళకేం, ధనం, ధాన్యం, మందీ మార్బలం అన్నీ ఉన్నాయ్. నేనంటున్నది అది పల్లె ప్రాంతం కదా - అందులోనూ వేసవిలో కరెంట్ కట్ ఒకటి. ఎలా ఉంటారో పిల్లలు ఏమో అని. హైదరాబాదే నయం. బోరు కొట్టినప్పుడు అలా అలా కార్లో తిరిగి వచ్చేవారు. ఏ వాల్డెన్‌కో వెళ్ళి కావాల్సిన బుక్కులు తెచ్చుకొని వాటిని చదువుతూ కాలం గడిపేవారు. అయినా, మీకెందుకంత కోపం?-మనం పెద్దవాళ్ళం. ఎలాగో అడ్జస్ట్ అవుతాం. పిల్లలు కాలేరు కదా! అక్కడ అమెరికాలో అన్ని ఫెసిలిటీస్‌కి అలవాటు పడ్డ పిల్లలు" అనునయంగా అంది అహల్య.

కాసేపు మౌనం రాజ్యమేలిందా కంపార్ట్‌మెంట్‌లో.

"అయినా, నాకు తెలీక అడుగుతాను..." ఏదో అనబోయింది అహల్య.

"తెలీక ఏం ఖర్మ! తెలిసినా అడుగుతావు."

"అబ్బ! మీకు నామీద కోపం ఇంకా పోయినట్లు లేదు."

"ఛా... ఏదో తమాషాకు అన్నానులే."

"ఆఁ.. మరేం లేదండి... మీ అన్నయ్యగారు ఇరవై ఏళ్ళ క్రితమే ఆంధ్ర యూనివర్సిటీ నుంచి ఫిజిక్స్‌లో డాక్టరేట్ చేసిన రాంకు హోల్డర్ కదా! రెండు, మూడు అమెరికన్ యూనివర్సిటీస్ నుంచి పోస్టు - డాక్టొరల్ స్టడీస్‌కి ఎయిడ్ ఆఫర్స్ వచ్చినా, వాటిని రిజక్ట్ చేసి ఇక్కడే ఉండిపోయారెందుకో..?"

"అహల్యా! ఆ రోజుల్లోనే ఎంతో అవకాశం ఉండి కూడా అన్నయ్య మాతృదేశాన్ని అంటిపెట్టుకొని ఉండిపోతాననడం నీకు చాలా విచిత్రంగా, వెర్రితనంగా అనిపిస్తోంది కదూ! అమెరికా ఓ భూతలస్వర్గం. అక్కడ ఉండేవాళ్ళే ప్రపంచంలో అందరికన్న అధికులు, అదృష్టవంతులు. అక్కడ ఉండిపోవడమే మా జీవిత లక్ష్యం - అంటూ అర్రులు చాచే నీలాంటి వాళ్ళున్నట్లే, 'జననీ జన్మభూమిశ్చ

స్వర్గాదపి గరీయసి' అంటూ మాతృభూమిని విడిచిపెట్టని మా అన్నయ్యలాంటి వాళ్ళు కూడా ఉంటారు- తెల్సా..."

"పే...ద్ద.. నాకే అమెరికా మీద మోజున్నట్లు - మీకేమీ ఇంట్రస్టు లేనట్లు!"

"ఆఫ్‌కోర్స్ - అదీ నిజమేననుకో. మంచి జాబ్, మరింత అట్రాక్టివ్ ఇన్‌కమ్ అంటూ నేను కూడా ప్రలోభపడ్డాను. అది వేరే విషయం. అయినా, అహల్యా! నాలాగ అన్నయ్య కూడా పరదేశాలు పట్టుకు పోయి ఉంటే పెరాలిటిక్ అటాక్ వచ్చిన మా నాన్నగారి గతేమయ్యేది? ఊళ్ళోని పొలాలు, ఆస్తులు ఎవరు చూస్తారు? మిగతా వాళ్ళ విషయమేమో కాని అన్నయ్యక్కాని, వదినక్కాని అమెరికా వ్యామోహం అసలు లేదు."

"సర్లెండి ఎవరిష్టం వాళ్ళది." భర్త సీరియస్ అయిపోవడం గమనించి వాతావరణాన్ని తేలికపరచే ఉద్దేశంతో అంది. "అన్నట్టు ఏమండి. అన్నపూర్ణ అక్కయ్యకి కూడా ఆల్మోస్ట్ నా వయసే ఉంటుందో లేక రెండు మూడు ఏళ్ళు పెదదో కదా."

"ఊఁ.. దాదాపు నలభై ఏళ్ళకు అటూ - ఇటూగా ఉండచ్చు" నవ్వుతూ అన్నాడు కరుణాకర్.

"సర్లెండి. నాకప్పుడే నలభై వచ్చాయని గుర్తు చెయ్యక్కర్లేదు." మూతి ముడిచింది అహల్య.

"మమ్మా! మరి నువ్వు యస్.జెలో పక్కింటి ఇటాలియన్ ఆంటీతో 'ఐయామ్ జస్ట్ థర్టీ ఫైవ్' అని చెప్పావు కదా!" స్క్రాబిల్ ఆడ్డం ఆపి అమ్మని ప్రశ్నించింది అవంతి.

అవంతికేసి ఉరిమి చూచి, "ఏమండీ............ మీరు చెప్పండి. నేను ఫార్టీ లుక్ చేస్తున్నానా......" అంది అహల్య.

"అబ్బే! నాకయితే నువ్వు స్వీట్ సిక్‌స్టీన్‌లాగ లుక్ చేస్తున్నావ్." కరుణాకర్ భార్యను ఖుషామత్ చేయడానికి ప్రయత్నించాడు. గర్వంగా తన యూత్‌ఫుల్ ఫిగర్ని ఓమారుచూసుకొని, భర్త టీజింగ్ మాటలకు 'మీరు మరీను' అంటూ సిగ్గుపడిపోయింది అహల్య.

రాజమండ్రి స్టేషన్‌లో రైలు దిగినప్పటినుంచీ అవినాష్‌తోటి ఒకటేకబుర్లు ఆశీష్‌కి. "వాట్ అన్నయ్యా? ఫుల్ ఆఫ్ డర్ట్! వాట్ హారిబుల్ జోల్ట్స్! ఇక్కడి రోడ్లన్నీ ఇలాగే ఉంటాయా?" కారు ముందు సీట్లో అవినాష్ పక్క కూచుని కబుర్లు చెబుతూ మధ్య మధ్య ఆంధ్రప్రదేశ్ రోడ్లని ఆడిపోసుకుంటూనే ఉన్నాడు ఆశీష్. కరుణాకర్‌కి కూడ బాధనిపించింది ఎగుడు దిగుడు రోడ్లని చూశాక.

ఏం ఇంజనీర్లో ఏం కాంట్రాక్టర్లో. ఇట్టే రోడ్లు వేశామనిపిస్తారు. కనీసమది నాల్గు రుతువులు కూడా మన్ని చావదు.

కారు ఇంటి గేటు సమీపిస్తుండగనే పనివాడు కాబోలు పరుగున వచ్చి గేటు తెరిచాడు. సుపరిచితమైన కారు హారన్ విని వరండాలో వెయిట్ చేస్తున్న సుందరమ్మగారు గేటుకేసి నడిచారు.

"నానమ్మా! వీడ్ని చూడు ఎంత పొడవయ్యాడో" ఆశీష్ భుజం మీద చెయ్యి వేసి ముందుకు నడిచివస్తున్న అవినాష్" "ఆశీ! గుర్తుపట్టావా? మన నానమ్మరా"అంటూ సుందరమ్మకేసి నడిచాడు.

"నా మనవరాలు అవంతి ఎక్కడ(రా? " ఆశ్చర్యంగా వెతుకుతున్న సుందరమ్మను సమీపించింది అవంతి కాదు - అహల్య.

"బాగున్నారా అత్తయ్యా!" అంది అహల్య.

"ఓ...... " అవంతి కోసం వెదుకుతూనే ఉన్నాయ్ సుందరమ్మ కళ్ళు. కరుణాకర్ వెనుక కన్పించకుండా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తోంది అవంతి. కరుణాకర్ నవ్వుకుంటూ సుందరమ్మని సమీపించాడు. ఛెంగున ముందుకు దుమికి అరచేతులు రెండింటినీ తలకిరువైపులా చేటల్లా అమర్చి "భవ్...భవ్" మంది అవంతి, నానమ్మకేసి నవ్వుతూ.

"ఓసి బడవా! ఎంత అల్లరి నేర్చావే" అంది సుందరమ్మ.

"ఎక్కడరా కరుణా!" రఘురామయ్యగారిని చూచి కరుణాకర్ ముందుకు వచ్చి నమస్కరించబోయాడు. కొడుకుని మధ్యలోనే అందుకొని, గుండెలకు హత్తుకున్నారు రఘురామయ్యగారు.

"నాన్నగారూ! మీ ఆరోగ్యం..." కొడుకు మాటల్ని మధ్యలోనే తుంచేశారు రఘురామయ్యగారు. "నాకేంరా పిడిరాయిలాగా ఉన్నాను. కన్పించడంలే! అరే ఆశీష్? ఎంత పెరిగిపోయావురా మనవడా! అవినాష్ భుజాల వరకు వచ్చావే! ఔన్లే... మిమ్మల్నందరిని చూచి ఎన్నేళ్ళయింది? పదండి... పదండి గోపీ! సూటుకేసులు ఒక్కొక్కటీ తీసికెళ్ళి మేడమీది గదుల్లో పెట్టు" అంటూ పనివాడికి పురమాయించారు. అత్తగారి వెంబడి లోనికి నడిచింది అహల్య.

మేడమీద గదిలోకి వెళ్ళిన అహల్య "ఏమో అనుకున్నాను. మామగారు చాలా చక్కగా - కళాత్మకంగా కట్టించారు ఇంటిని" అంది. "మమ్మా! కమ్ అండ్ లుక్ హియర్. బాత్‌రూమ్స్‌లో టబ్స్... హౌ నైస్...!" అవంతి గంతులేస్తుంటే, కరుణాకర్ భార్యకేసి గర్వంగా చూశాడు, మరేం అనుకున్నావ్ అన్నట్లు.

"ఆఁ... ఇప్పుడు పట్టణాల్లోని విలాసాలన్నీ విలేజస్‌కి కూడా వ్యాపించాయి లెండి. డబ్బుండాలే కానీ ఏదీ అసాధ్యం కాదు." ఇదేం గొప్పకాదులే అన్నట్లు నీళ్లు కార్చేస్తున్న అహల్యను చూచి నవ్వుకున్నాడు కరుణాకర్. ఎదుటివారిలోని గొప్పతనాన్ని ఏనాడూ హర్షించని అహల్య మనస్తత్వం కరుణాకర్‌కి కొత్తేం కాదు.

"అన్నట్లు మీ వదినగారెక్కడ, దర్శనమివ్వలేదు! మనం వస్తున్నట్లు తెలిసి వాళ్ళ పుట్టింటికి చెక్కెయ్యలేదు కదా!" అహల్య అనుమానానికి సమాధానమా అన్నట్లు గదిలోకి అడుగిడింది అన్నపూర్ణ.

వదిన చేతుల్లో కాఫీ కప్పులతో ఉన్న ట్రేని చూచి, "అదేంటొదినా! మేమే కిందికి వచ్చే వాళ్ళంగా." అపాలజిటిక్‌గా ట్రే అందుకున్నాడు కరుణాకర్. సూట్‌కేస్ తెరుస్తున్న అహల్య గబుక్కున తలెత్తి తోడికోడల్ని చూచింది.

"బాగున్నావా అహల్యా" అంటూ ఆప్యాయంగా దగ్గరికొచ్చింది అన్నపూర్ణ. అలా ఒక్క క్షణం అన్నపూర్ణనే చూస్తూ నిలబడిపోయింది అహల్య. మంచి పొడగరి. మునుపు తాను చూచినప్పటికి, ఇప్పటికి సన్నమైంది. ఇంటర్ చదువుతున్న కొడుకు అవినాష్, టెన్త్ చదువుతున్న కూతురు క్రాంతి ఉన్నారంటే ఎవ్వరూ నమ్మరన్నట్లుంది తన తోడికోడలు. తానే అన్నపూర్ణ కన్న పెద్దదానిలా ఉన్నట్లు ఫీలై, మళ్ళీ అనుకుంది అహల్య. ఔన్లే - అన్ని సౌకర్యాలతోపాటూ ఇక్కడ కూడా బాడీ షేపింగ్ క్లినిక్కులు, జిమ్స్ అవతరించి ఉంటాయ్.' తన ఆలోచనలను పక్కన పెట్టి తోడికోడల్ని పలకరించింది అహల్య.

బాత్‌రూమ్‌లోంచి బయటకు వస్తున్న అవంతిని, "నేను గుర్తున్నానా అవంతీ" అంటూ పలకరించింది అన్నపూర్ణ. అవంతి సిగ్గుగా నవ్వేసి, "ఆంటీ! క్రాంతి ఏదీ? కన్పించడం లేదు" అంది.

"అదేంటమ్మా ! పెద్దమ్మా అను. నువ్వు ఆంటీ అని అంటూంటే పరాయివాళ్ళెవరో పిలుస్తున్నట్లుంది. క్రాంతి కదూ... అది మీ పెదనాన్నగారితో కొబ్బరితోటకి వెళ్ళిందమ్మా. ఈ రోజు కొబ్బరికాయలు దింపుతున్నారు. క్రాంతి వాళ్ళకి కూడా సెలవులే. మీరిళ్ళు చేరేలోగా పని పూర్తిచేసుకొని రావాలంటూ నాన్నాకూతుళ్ళిద్దరూ ఆతురతగా వెళ్ళారు. అహల్యా! మీ స్నానాలు అవీ అయ్యాక కిందికి రండి. అత్తయ్యగారు మీకోసం ప్రత్యేకంగా టిఫిన్స్ చేయిస్తున్నారు" అంది అ

"వదినా! నా స్పెషల్ అమ్మ మర్చిపోయిందేమో గుర్తుచెయ్యి ఉప్మా - పెసరట్" అన్నాడు కరుణాకర్.

"అదేంటయ్యా! నీ కన్నతల్లి నీ రుచులెలా మర్చిపోతుంది ? దాంతోపాటూ మిగతావన్నీ. తొందరగా రండి" అంటూ వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

"లాస్ట్ టైమ్ మనం చూసినపుడెలాగుందో ఇప్పుడూ అలాగే ఉంది వదిన. కదూ! ఏమీ మారలేదు."

"ఔనౌను..." అంటూ అయిష్టంగానే అయినా భర్తతో ఏకీభవించింది అహల్య.

"పాపం నీలాగ డైటింగ్, జాగింగ్ అంటూ ఎన్ని తంటాలు పడ్తున్నదో వదిన...!" సగం హాస్యంగా, సగం నిజంగా అన్నాడు కరుణాకర్.

"మమ్మా! నాకాకలేస్తోంది..." రెడీ అయిన అవంతి గునిసింది.

"ఇదో... వన్మినిట్! నేను కూడా బాత్ చేసి రెడీ అయి వస్తాను. మీరు కిందికి పదండి.

అన్నట్లు ఆశీష్ ఏడీ కనిపించడు?" టవల్ భుజం మీద వేసుకొని బాత్‌రూమ్‌లోకి వెళ్తున్నదల్లా ఆగి భర్తని అడిగింది అహల్య.

"కింద నువ్వు చూడలేదా - లవ్ బర్డ్స్ హౌస్. అక్కడే ఆగిపోయాడు. అవినాష్ పెట్ హాబీ అట, ఆ పక్షుల్ని పెంచడం. మనవాడూ అక్కడే ఉన్నాడు. వాడి విషయం నాకు వదిలేయ్. నువ్వు తొందరగా కిందికి రా..." అవంతిని తీసికొని కిందికెళ్ళిపోయాడు కరుణాకర్.

బ్రేక్‌ఫాస్ట్‌లో పెసరట్టు, ఉప్మాయే కాకుండా బ్రెడ్, శాండ్‌విచెస్, బటర్, రకరకాల పండ్లు చోటు చేసుకున్నాయ్. నూడుల్స్ కూడా తయారుచేసింది అన్నపూర్ణ పిల్లలు తింటారని. టిఫిన్ కార్యక్రమం అయ్యాక పిల్లలూ, కరుణాకర్ తోట చూద్దామని బయలుదేరారు.

భర్త, పిల్లలు బయటకు వెళుతుంటే, గేటు వరకు వచ్చిన అహల్య కాంపౌండు లోపల పరిసరాల పర్యవేక్షణలో పడిపోయింది.

ఇంటి వెనగ్గా గోబర్ గ్యాస్ ప్లాంట్ - అమెరికాలో లాగ నిరంతరాయంగా గ్యాస్ సప్లై. మేడ మీద సోలార్ ప్లాంట్. కాబట్టి రోజల్లా కొరత లేని వేణ్ణీళ్ళు.

"అమ్మాయ్... అహల్యా" అన్న అత్తగారి కేకకి సర్వే ఆపి లోనికి వచ్చింది అహల్య. సుందరమ్మగారు వంట గదిలో ఉన్నారు. ఆ గదిలోని కడుగిడిన అహల్య ఆశ్చర్యపోయింది. అన్నీ అధునాతనమైన గాడ్జెట్స్. గ్రైండింగ్ మెషీన్ - మల్టిపుల్ మిక్సీ. మైక్రో ఓవన్, ఫోర్ బర్నర్ స్టవ్, నో ఫ్రాస్ట్ డబుల్ డోర్ ఫ్రిడ్జ్... ఇత్యాది వెన్నెన్నో. అన్నిటితో పాటు ఓ మూలగా రోలు, రుబ్బురోలు కూడా ఉండడం చూసి అహల్యకి నవ్వొచ్చింది. 'ఇక్కడి మనుషులు సుఖపడమన్నా సుఖపడలేరేమో! కాకుంటే గ్రైండర్, మిక్సీలు ఉండగా ఈ రోలెందుకో...?'

"అత్తయ్యా! ఇంకా రోలు భద్రంగా దాచారే! ఔన్లెండి - కరెంటు పోతే ఇక రోలేగా గతి. ఇక్కడ అస్తమానం కరెంటు కట్ ఒకటి ఏడ్చింది కదా..." అహల్య వెటకారపు మాటల్ని పట్టించుకోలేదు అన్నపూర్ణ. సుందరమ్మ కలుగజేసుకుంది. "కరెంటు పోయినా, జనరేటర్ సెట్ ఉంది కదమ్మా మనింట్లో! అంచేత ఆ బాధలేమీ లేవులే. రోలు అంటావా - అది ఏ ఇంట్లో తప్పక ఉండాలమ్మా. లక్ష్మీకళ. రోలుకు పూజ చేశాకనే పెళ్ళిపనులు ప్రారంభించాలి - తెలుసా? మరి పెళ్ళిళ్ళప్పుడు ఎక్కడికని పరుగెత్తాలి ఇంట్లో రోలు లేకుంటే.... నీకు తెలీదా.... అయినా, అన్ని పచ్చళ్ళు మిక్సీలో వేస్తే రుచేముంటుంది? రోటి పచ్చడి రుచే వేరు..."

సుందరమ్మ అటు పోగానే, "అమ్మో! అక్కయ్యా - అయితే, అత్తయ్య మీలోట పచ్చళ్ళు అవీ రుబ్బిస్తున్నారేంటి?" కాసింత భయాన్ని అభినయిస్తూ అడిగింది అహల్య.

"ఇందులో అంత భయపడేదేముంది అహల్యా! పొద్దుట మీరు తిన్న పెసరట్టు పిండి రోట్లో రుబ్బిందే!" అదేదో అతి సాధారణ విషయమన్నట్లు చెప్తున్న అన్నపూర్ణకేసి విస్మయంగా చూసింది అహల్య.

భోజనాల టైమ్‌కి పిల్లలందరూ డైనింగ్ టేబిల్ చుట్టూ చేరిపోయారు. వారితో పాటు బావగార్ని, భర్తని, తోడికోడలు కూతురు క్రాంతిని అప్పుడే చూసింది అహల్య.

"బాగున్నావా అమ్మా అహల్యా. కొబ్బరికాయలు దింపించి వద్దామనేసరికి తమ్ముడు కరుణాకర్ పిల్లల్ని తీసికొని తోటకు వచ్చాడు. ఆ పక్కనున్న పొలాలు కూడా చూసి వచ్చేసరికి ఈ వేళయింది. ఎలా ఉన్నారమ్మా అందరూ? హైదరాబాదులో నీ అన్నయ్య, వదిన, పిల్లలు అందరూ బాగున్నారు కదా!" మరదల్ని పలకరించాడు ప్రభాకర్.

నవ్వుతూ తలూపింది అహల్య.

"మమ్మా! క్రాంతి స్టడీరూమ్‌లో ఎన్ని బుక్స్ ఉన్నాయనుకున్నావ్? ఓ...మై. టైమ్ లైఫ్ సిరీస్, వరల్డ్ బుక్ సిరీస్ - అన్నీ లేటెస్ట్ బుక్స్ మమ్మా... పెద్ద లైబ్రరీ అనుకో." ఆశ్చర్యంగా చెప్తున్నాడు ఆశీష్.

"క్రాంతికి కూడా స్విమ్మింగ్ వచ్చట మమ్మా... డైవ్ కూడా చేస్తుందట." అవంతి చెప్తోంది అబ్బురంగా.

"అలాగా! ఈ ఊళ్ళో స్విమ్మింగ్ పూల్ ఎక్కడుంది? తెలిసిందిలే. పంట కాల్వలు పక్కనే ఉన్నాయిగా" అంది అహల్య.

"ఛా... ఛా... అదేం కాదోయ్. నాన్నగారికి పెరాలిటిక్ అటాక్ వచ్చాక స్విమ్ చేస్తే మంచి వ్యాయామమని ఫిజియో థెరపిస్ట్ చెప్పారట. అందుకని కాంపౌండ్‌లోనే ఓ చిన్న ఈతకొలను కట్టించారట. ఇందాక అన్నయ్య చెప్పాడు." అహల్య సందేహ నివృత్తి చేశాడు కరుణాకర్.

"ఇందాకటి సర్వేలో నీ కంటబడినట్లు లేదు ఈతకొలను. సాయంత్రం చూడొచ్చులే అహల్యా" అంది నవ్వుతూ అన్నపూర్ణ.

భోజనాలయ్యాక అన్నదమ్ములిద్దరూ కబుర్లలో పడ్డారు. మధ్యాహ్నం నిద్ర అలవాటున్న అహల్యకి ఆవులింతలు తరుముకొస్తున్నాయి. గదికెళ్ళి పడుకుందామని ఆలోచిస్తుండగానే అన్నపూర్ణ చీర మార్చుకొని, చేతిలో పుస్తకాలు పట్టుకొని అహల్యను సమీపించింది.

"ఎక్కడికక్కయ్యా! వయోజన విద్యాకేంద్రానికా" అంది అహల్య.

"ఊఁహూఁ. ఇక్కడ పదిమంది గృహిణులు ప్రైవేటుగా డిగ్రీకి కడ్తున్నారు. వాళ్ళకి కాస్సేపు ఇంగ్లీష్ టీచ్ చేద్దామని. అన్నట్లు నువ్వూ వస్తావా?" నవ్వుతూ అంది అన్నపూర్ణ.

"అదేంటి, వాళ్ళందరి ఇళ్ళకి వెళ్ళి ట్యూషన్లు చెప్తావా?" కంపరంగా చూసింది అహల్య. నవ్వొచ్చింది అన్నపూర్ణకి.

"అందరిళ్ళకి వెళ్ళడం ఎలా కుదురుతుంది? మన కొబ్బరి తోటలోనే రెండు పెద్ద గదులు కట్టించారు మామగారు, ఎండాకాలంలో కాస్సేపు నడుం వాల్చడానికి వీలుంటుందని. అక్కడికి వస్తారు ఆడవాళ్ళు. నీకూ ఇంటరెస్ట్ ఉంటే రా. అన్నట్టు అహల్యా, ఈ ఊరి అమ్మాయి ఎం.ఏ. ప్రైవేటుగా పాసై అయ్యేయస్‌కి సెలెక్ట్ అయింది" అంది అన్నపూర్ణ.

"దట్స్ గ్రేట్ అక్కయ్యా! అయితే, నీ గురుకులం తప్పక చూడాల్సిందే. రేపెప్పుడైనా వస్తాన్లే. ఈ రోజుకు నన్ను వదిలేయ్. కాస్త బడలికగా ఉంది."

అన్నపూర్ణ వెళ్ళాక మేడమీద పడగ్గదిలో పడుకున్న అహల్య, 'అమ్మ బాబోయ్ ఈవిడ గార్కి ఎంత ఓపిక! భోంచేశాక కాస్సేపు నడుమైనా వాల్చకుండా వెంటనే వెళ్ళిపోయింది బయటికి' అనుకుంది.

"మమ్మా! మమ్మా!" అవంతి బలవంతంగా లేపడంతో కళ్ళు విప్పింది అహల్య. "ఏంటే ఇంత పొద్దున్నే నీ గొడవ." విసుక్కుంది కూతుర్ని.

"పెద్దమ్మ నిన్ను కిందికి రమ్మంటుంది. అయినా, ఇప్పుడు టైమ్ ఆరయింది తెలుసా? నేను, క్రాంతి, పెద్దమ్మ వన్నవర్ స్విమ్ చేశాం. మమ్మా! పెద్దమ్మ భలేగా స్విమ్ చేస్తుంది." బాత్‌రూమ్‌లోకి దూరిపోయింది అవంతి.

బద్ధకం వదిలించుకొని కిందికి దిగివచ్చింది అహల్య. ఇంటి ముందు పనిమనిషి నీళ్ళు చల్లినట్లుంది అన్నపూర్ణ ముగ్గు పెడ్తొంది. ముందు రోజు వాకిట్లోని ముగ్గులు చూసి మెచ్చుకుందేకాని, అవి అన్నపూర్ణ పెట్టిందని ఊహించలేదు అహల్య.

"రా...రా... అహల్యా! నీకు ఇంటరెస్ట్ ఉందా ముగ్గులంటే." అలవోకగా చుక్కల్ని కలిపేస్తొంది అన్నపూర్ణ. వంచిన నడుము ఎత్తకుండానే అహల్యకేసి చూస్తూ అంది : "అయినా, నా పిచ్చి కానీ, అమెరికా వెళ్ళాక ముగ్గులు పెట్టే అవసరం, అవకాశం నీకెక్కడుంటుంది?"

"అక్కయ్యా! ఇంత పొద్దుటే లేచి ఇంతసేపు వంగి అలా ముగ్గులుపెట్టడానికి నిజంగా నీకెంత ఓపిక!"

"అదేంటహల్యా! జాగింగ్, వాకింగ్ అంటూ తెల్లారగట్ల లేచి పరుగులు, ఉరకలు పెట్టడంలేదా? అలాగే ఇదీను. అయినా, మగవాళ్ళు తిరిగే వాకిట్లో ముగ్గు తప్పనిసరి అని అత్తయ్య నమ్మకం. పెద్దవారి ఆచారాన్ని గౌరవించినట్లుంటుంది. నాకూ కొంత వ్యాయామం. ఏమంటావ్" అంది అ ఇ - ణ

అన్నపూర్ణ మాటల్లోని ఆంతర్యం, అందులోని నిజం అహల్యకి కొరుకుడు పడలేదు. అన్యమనస్కంగా లోపలికి నడిచింది. అత్తగారు అప్పటికే పూజా కార్యక్రమంలో ఉన్నట్లున్నారు. శ్రావ్యమైన అన్నమాచార్య కీర్తనలతో ప్రతిధ్వనిస్తొంది పూజా మందిరం.

నాలుగు రోజులు దొర్లిపోయాయి. అప్పటికి అర్థమైపోయింది అహల్యకి, అన్నపూర్ణ అటెండ్ అవుతున్న జిమ్ ఇంట్లోనే ఉందని. "ఇది నా హాబీ. ఆ పనంటే నాకు చాలా ఇష్టం. ఇందులోనే నాకు తృప్తి, ఆనందం" అంటూ గిలకలాగ తిరుగుతూ ఎంతో నిష్ఠతో ఇంటా-బయటా పనులు

చేసుకుపోతున్న అన్నపూర్ణ అందుకన్నమాట అంత స్లిమ్‌గా, చురుగ్గా ఉంది. ఒక్కమారు అమెరికాలో తన దినచర్య గుర్తుకొచ్చింది అహల్యకి. రాత్రి డిన్నర్‌కి మాత్రమే వండి పడేసి, పిల్లలూ భర్త పొద్దుటే వెళ్ళిపోతే చేసే పనేదీ కనిపించక, పగలస్తమానం టీవీ ముందు కూలబడి శరీరాన్ని పెంచేసి, మళ్ళీ దాన్ని తగ్గించడానికి ఎక్సర్‌సైజులు, ఏరోబిక్స్ అంటూ తంటాలు పడడం. ఆఁ... అక్కయ్య లాగా బిజీగా ఉండడానికి తనకి తగినంత పనేది? ఊర్లమ్మడి తిరగడానికి చచ్చే చలి న్యూజెర్సీలో. 'ఇక్కడిలా అక్కడ ఎలా కుదురుతుంది?' మనసుని జోకొట్టి సమాధానపరిచింది అహల్య.

డాబామీద కూచుని దొడ్లో పూసిన సన్నజాజుల మాలని అల్లుతున్న అన్నపూర్ణ పక్కకి చేరింది అహల్య. చకచక పువ్వులల్లుతూనే ఏవో శ్లోకాలు వల్లె వేస్తూంది అన్నపూర్ణ.

"అక్కయ్యా! మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం లేదు కదా?"

"ఛా... ఛా... ఈ రోజు శుక్రవారం. లలితా సహస్రనామం చెప్పుకుంటున్నాను."

"మీకు లలితా సహస్రనామం అంతా కంఠతావచ్చా!" ఆశ్చర్యంగా అడిగింది అహల్య.

"ఇరవై ఏళ్ళుగా చదువుతున్నానుగా అహల్యా! ఆమాత్రం నోటికి రాదా!"

"అక్కయ్యా! మిమ్మల్నొక మాట అడగనా...?"

"అదేంటి అహల్యా, అడుగు. సందేహం ఎందుకు?"

"బావగారు ఫిజిక్స్‌లో పిహెచ్.డి. మీరు ఇంగ్లీషు లిటరేచర్‌లో పి.జి. మంచి అవకాశాలు ఉండికూడా అమెరికా వెళ్ళక ఇలా ఈ పల్లెలో ఉండిపోవడం మీకు బాధగా లేదా?"

"అహల్యా! నీకెందుకొచ్చిందీ సందేహం? నేను కాని, మీ బావగారుకాని, పిల్లలు కాని ఆనందంగా, సంతృప్తిగా లేనట్లు నీకనిపించిందా?"

"ఊహుఁ... అలా అని కాదు. ఎంతయినా అమెరికా అమెరికానే అక్కయ్యా! 'నీ పాలిటి భూతలస్వర్గం' అంటూ అస్తమానం మీ మరిదిగారు నన్ను వెక్కిరిస్తూ ఉంటారు. నిజానికి ఇందులో అబద్ధమేముంది అక్కయ్యా! అమెరికాలోని సుఖసంతోషాలు ఒకమారు చవిచూసిన వాళ్ళు మళ్ళీ ఆ దేశాన్ని వదిలి రారు. అక్కడి జీవన ప్రమాణం... ఆ సంపన్న దేశంలోని అందచందాలు, భోగభాగ్యాలు..." అహల్య వాగ్ధాటి ఇలా సాగిపోతూంది.

"ఆగు... ఆగు... అహల్యా! నువ్వు అమెరికాని భూతల స్వర్గం అన్నావు. మరి నేనో, 'నాదు జన్మభూమికన్న నాక మెక్కడుంది' అంటాను. ఇక అందచందాలు, భోగభాగ్యాలు అన్నావు. మనదేశంలోని అందచందాలన్నీ భారతీయులైన మనం ఎందరం చూశాం చెప్పు. దూరపు కొండలు నునుపు అన్నట్లు ఎక్కడో సుదూర తీరాల్లోని విదేశాలను గురించి ముచ్చటించి మెచ్చుకుంటాం. భోగభాగ్యాలంటావా? ఐహిక సుఖాలకి కావలసిన సదుపాయాలన్నీ మాకూ ఇక్కడే ఉన్నాయి. నువ్వు ఈపాటికి ఈ విషయం గమనించే ఉంటావు. స్కూళ్ళు, కాలేజీలు, విశ్వవిద్యాలయాలు, ఆధునిక సౌకర్యాలతో వైద్యశాలలు, ఆధ్యాత్మిక చింతనకోసం ఆశ్రమవాసాలు - అన్నీ చేరువలోనే

ఉన్నాయి. ఇక్కడి సుఖశాంతుల్ని, ప్రశాంత వాతావరణాన్ని, ఆత్మీయులు ఒకరికొకరు అందించుకొనే అనురాగ అనుబంధాలని వదిలించుకొని ఎక్కడికో తరలివెళ్ళడం అన్నది నాకు కాని, మీ బావగారికి కాని ఊహకందని విషయం. ఇక సంపద అంటావా? చూస్తున్నావుగా - భగవంతుడు మాకేం లోటు చేయలేదు. ఎక్కడున్నా సంతోషంగా, సంతృప్తిగా బతకడమేగా కావాల్సింది.

ప్రతి ఒక్కరూ విదేశాలంటూ వెర్రి భ్రమలో పడి తల్లి రొమ్ములు గుద్దినట్లు, తమ దేశం అందించిన విజ్ఞానాన్ని డబ్బుకు, డాలర్లకు పరదేశాలకి అమ్ముకోవడం ఏమాత్రం సబబు! అందరూ అలాగే ఆలోచిస్తే మన దేశాభివృద్ధి ఎలా జరుగుతుంది? అహల్యా! ఇవన్నీ నా అభిప్రాయాలు. అలా అని అందరూ నాలాగే ఆలోచించాలని నేను భావించను. అమెరికాలో ఉంటూ భారతదేశంలో ఉండిపోయిన నాలాంటి వాళ్ళని గురించి నువ్వు పరితపించాల్సిన అవసరం లేదన్నది నీకు అర్థం కావాలనే ఇంత పెద్ద ఉపన్యాసం ఇచ్చాను. అంతకన్నా ఇంకేం లేదు. ఆఁ... చాలా పొద్దుపోయినట్లుంది. పద కిందికి వెళ్దాం. అత్తయ్య చూస్తూ ఉంటారు మన కోసం." పూల సజ్జను తీసికొని అన్నపూర్ణ కిందికి దిగిపోయింది.

అలా ఆ తదియనాటి వెన్నెట్లో ఆలోచనా తరంగాలలో తలమునకలవుతూ; అక్కయ్య మాటల్లోని ఔచిత్యాన్ని అన్వేషిస్తూ కూచుండిపోయింది అహల్య.

"బాగుందర్రా మీ వరస. 'వారం రోజులా - మై గాడ్' అన్నవాళ్ళేనా మీరు. డాడీ వన్మోర్ వీక్ అంటూ నన్ను వేధిస్తున్నారు!" ముద్దుగా పిల్లల్ని విసుక్కున్నాడు కరుణాకర్. అప్పుడే గదిలోకి వచ్చిన అహల్యను చూసి, "మరి నువ్వేమంటావ్" అన్నట్లు చూశాడు.

"సర్లెండి, వాళ్ళ మాటలకేముచ్చె! ఒక్క వారమే కాబట్టి పిల్లల ఆరోగ్యం ఏమీ ఎఫెక్టవలేదు. తోటల వెంబడి, పొలాల గట్లపైన పరుగులు పెడ్తూ కొబ్బరి నీళ్ళు, తాటి ముంజలు, తేగలు అంటూ నానా చెత్తా తింటూ లేనిపోని రోగాలు తెచ్చుకుంటే ఇహ నేను చావాలి మళ్ళీ. న్యూజెర్సీ వెళ్ళగానే స్కూల్స్ కూడా స్టార్ట్ అవుతాయ్. మీకేమీ, పిల్లలతో ఇక్కడే ఉండిపొమ్మన్నా ఉండి పోతారు." అసహనంగా పిల్లల బట్టలు తీసి సర్దడం మొదలెట్టింది అహల్య.

భార్యకేసి ఆశ్చర్యంగా చూశాడు కరుణాకర్. పిల్లల్లాగ అహల్య కూడా మరోవారం రోజులు ఉండవాలికి ఉత్సుకత చూపిస్తుందని భావించాడు కరుణాకర్. అయినా, తన పిచ్చికానీ పదిహేనేళ్ళుగా తానెరిగిన అహల్య అంతలో మారిపోతుందనుకోవడం ఎంత అవివేకం!

"కమాన్ చిల్డ్రన్, అవర్ వెకేషన్ ఈజ్ ఓవర్. బాక్ టు హైదరాబాద్ అండ్ ఫ్రమ్ దేర్ టు అమెరికా. అయినా, ఇక్కడేమున్నది బోర్!" కోపంగా తనకేసి చూస్తున్న భార్యకేసి చూస్తూ నవ్వాడు కరుణాకర్.

■

***(ఇండియా టుడే, 14 అక్టోబర్ 1997)***

# రానీ... ఆ రాస్కెలు

ఆనందంగా ఈలల వేసుకుంటూ బజ్జర్ నొక్కిన రమేష్‌కి డోర్ తెరచుకోవడానికి కొంత టైము పట్టడం ఆశ్చర్యం కలిగించింది. కారు రివర్స్ చప్పుడుకే పరుగు పరుగున వచ్చి తలుపు చెంత తచ్చాడే మూడేళ్ళ ముద్దుల కుమారుడు అనూప్ జాడ కన్పించలేదు. తలుపు తెరిచిన భార్య సునంద అత్యవసరమైన పనేదో వున్నట్టు అంతర్ధానమవడం రమేష్ దృష్టిని దాటిపోలేదు.

బ్రీఫ్‌కేసుని టీపాయ్ మీదికి గిరాటు వేసి, చుట్టూ చూసాడు రమేష్. ఇల్లంతా ప్రశాంతంగా, నిశ్శబ్దంగా వుంది. సోఫాలో కూచుని టి.వి.ని చూస్తూనో, పేపరు తిరగేస్తూనో కన్పించే తండ్రి రామారావు జాడ లేదు. సరికదా "నాయనా రమేష్! ఈ రోజైనా ఉసిరికాయలు మర్చిపోకుండా పట్టుకొచ్చావా పచ్చడికి, మళ్ళీ సీజన్ అయిపోతుంది" అంటూ వెంటబడే తల్లి సరస్వతమ్మ కూడా కన్పించలేదు.

"ఏమయ్యారబ్బా మాతాపితలు? ఒకవేళ మనవణ్ణి వెంటబెట్టుకుని ఏ చుట్టాలింటికో వెళ్ళలేదు కదా..." అన్న సందేహం జనియించి, వెంటనే 'ఆహా! ఏమి నా భాగ్యం. ఈ సాయం సంధ్యా సమయాన నా సహధర్మచారిణితో ఏకాంతవాసం........' అనుకొని మహదానందపడబోయిన రమేష్, బెడ్‌రూములో నుండి సరస్వతమ్మ దగ్గు వినిపించడంతో నీరసపడిపోయాడు.

బూట్లు విప్పి, పాదాలను ఉపశమనంకోసమా అన్నట్లు స్ట్రెచ్ చేసి సోఫాలో సోలిపోతున్న రమేష్‌ను సమీపించింది సునంద - టీ కప్పుతో.

"ఏంటోయ్! అమ్మ ఈ టైములో పడుకున్నారు. పైగా దగ్గుతున్నారు..." అంటూ సునంద చేతిలోని కప్పు అందుకోబోయి ఆగిపోయాడు.

"సునందా! ఏంటీ రోజూ అన్నీ కొత్తగా వున్నాయ్? నేనెప్పుడైనా టీ ఈ కప్పులో తాగానా? రోజూ తాగే కప్పేమయింది."

"అబ్బ! ఏ కప్పు లో తాగితే ఏమయిందండీ..." అంటూ కప్పుని టీపాయ్‌మీద పెట్టింది సునంద.

"నా ప్రశ్నకి అది సమాధానం కాదనుకుంటాను..." కొంచెం విసుగ్గా భార్యకేసి చూశాడు రమేష్

నిస్సహాయంగా చూస్తున్న కోడల్ని ఆదుకోవడానికే అన్నట్లు సరస్వతమ్మ రంగప్రవేశం చేసింది.

"నీదంతా మరీ చోద్యంరా!... టీ - ముఖ్యం కానీ, అది పోసిన కప్పుదేముంది..." కోడల్ని వెనకేసుకొచ్చింది సరస్వతమ్మ.

"అసలు నాదు తెలీకడుగుతాను. నా కప్పు ఏమయిందంటే జవాబు చెప్పరేం...?" మళ్ళీ రెట్టించాడు రమేష్ సునంద తటపటాయించడం చూసి సరస్వతమ్మ అంది, "రమేష్! కప్పు అన్నాక పగలకుండా వుంటుందా నాయనా!"

"ఏవిటి! నా కప్పు పగిలిపోయిందా...?" ఇంతెత్తున ఎగిరిపడ్డాడు రమేష్

"ఏవిట్రా మహా! అసెంబ్లీ భవనం మీద బాంబు పడ్డట్టు అంత ఇదవుతావేంటి?"

"అమ్మా! అసెంబ్లీ బిల్డింగ్ సంగతి నా కనవసరం. ఆ కప్పులో తప్ప నేను టీ తాగనని సునందకి బాగా తెలుసు. అటువంటిది..."

"ఔన్రా! నాకు తెలుసు. సునందకి తెలుసు. తెలీందల్లా నాని గాడికే. నానిగాడు ఎత్తేసాడు. అది పగిలిపోయింది. ఇప్పుడేం చేస్తాం చెప్పు."

అత్తగారి ధైర్యాన్ని అభినందించకుండా (మనస్సులోనే) వుండలేకపోయింది సునంద. 'అమ్మయ్య! ఓ గండం గడిచింది' అని సంతోషపడిపోయింది.

"అహా! ఇది నానిగాడి పనా! ఏడి ఆ వెధవ? అయినా ఈ వెధవ అల్లరి మరీ ఎక్కువై పోయింది..." అంటూ ఏ కళనున్నాడో, కప్పునందుకొని టీ చప్పరించడం మొదలు పెట్టాడు రమేష్

స్నానం చేసి గదిలోకి వస్తున్న రమేష్‌కి వాయువ్య మూల నున్న కార్నర్ టేబుల్ ఖాళీగా వుండడం ఆశ్చర్యాన్ని కలిగించింది. పాలరాతి బుద్ధ విగ్రహం ఆ టేబిల్ మీద వుండాలి. ఏమయింది...? "సునందా!" అంటూ ఈ తడవ కొంత పెద్దగానే పిలిచాడు. కాదు, కాదు - అరిచాడు రమేష్ ఇప్పుడో - ఇంకాస్సేపటికో పిడుగు పడబోతోందని గ్రహించిన సునంద రానున్న ఆపదని ముందు గానే ఊహించినదై తన రక్షణ కవచం అయిన అత్తగార్ని వెంటపెట్టుకుని మరీ అడుగిడింది 'యుద్ధ' రంగంలోకి - అదే భర్త వున్న బెడ్‌రూములోకి.

ఈలోగా దువ్వెన కోసరం అలమరా తెరిచిన రమేష్‌కి ప్రొద్దుటే తను అసంపూర్తిగా పెయింట్ చేసి వదిలేసిన చిత్రపటం పూర్తిగా పంచరంగులు పులుముకొని సరికొత్త ఆధునిక చిత్రంలా సాక్షాత్కరించింది. చేతిలో పెయింటింగ్ పట్టుకొని ఇటు తిరిగిన రమేష్ ఈమారు ఉగ్ర నరసింహుడే అయ్యాడు.

"అదీ! అదీ!" అంటూ నసుగుతున్న సునందని 'నువ్వూరుకో' అన్నట్లు సైగ చేసి, "ఏం లేదురా రమేష్! నానిగాడు..." అంటూ ఏదో చెప్పబోయింది సరస్వతమ్మ.

"నానిగాడు... నానిగాడు... అన్నిటికీ నానిగాడు. ఇంతకీ ఎక్కడ వాడు...?" రంకె పెట్టాడు రమేష్.

అత్తా కోడళ్ళు వూరకుండడంచూసి, "ఎంతసేపూ నానిగాడు నానిగాడు అంటూ మూడేళ్ళ ఆ పసివాడిమీద నేరాలు నెట్టకపోతే ముప్పై ఏళ్ళొచ్చిన నువ్వేమయ్యావ్? కప్పు పగలగొట్టడం ఆ వెధవ పనే. బంగారం లాంటి బుద్ధ విగ్రహం బుగ్గికావడం కూడా వాడి చలవే. మరి అలమారాలోవున్న ఈ పెయింటింగ్‌ని కూడా రక్షించలేకపోయారా పెద్దవాళ్ళు మీరిద్దరుండి...?" అక్షింతల వర్షం కురిపించాడు రమేష్.

"అది కాదండీ...! మామయ్యగారు..."

"ఆ... నాన్నగారు! నాన్నగారే చెప్పారా ఇవన్నీ నాశనం చెయ్యమని?"

"అలా అని ఆయన మాత్రం ఎందుకు చెప్తార్రా. కప్పు చేతిలోకి తీసుకోగానే బలవంతంగా లాక్కోబోయిన సునందని వారిస్తూ, వాడికి ఏది కింద పడేస్తే పగులుతుందో, ఏది పగలదో మీ నాన్నగారు సోదాహరణగా వివరిస్తూ వుండగానే వాడు తన చేతిలోని కప్పును నేలకేసి కొట్టి 'ఇది పగిలేదే తాతగారూ...!' అంటూ నిరూపించాడురా" అంది సరస్వతమ్మ నవ్వును పెదిమల వెనుక దాచుకుంటూ. తను నవ్వితే కొడుక్కి కోపం వస్తుందేమోనన్న భయం ఆమెది.

"ఓ...కే... మరి బుద్ధ విగ్రహం?"

"ఇది పగలదేమో అనుకున్నాను నాన్నమ్మా! కానీ ఇది కూడా పగిలేదే అన్నాడు అది కాస్త కింద ఎత్తేసి..." అంది సరస్వతమ్మ.

"వాడు విలువైన వస్తువులనలా పాడుచేస్తుంటే మీరంతా చోద్యం చూస్తూ నిల్చున్నారన్నమాట!" అన్నాడు కోపంగా రమేష్.

"పిల్లలకి ఇది చేయకూడదు అని చెప్పరాదట. వాళ్ళని అసలే కొట్టరాదట. మొన్న బుక్ ఎగ్జిబిషన్‌లో కొని తెచ్చిన కొత్త పుస్తకం - అదే - పిల్లల పెంపకాన్ని గురించిన పుస్తకం చదువుతున్నారుగా మామగారు" అంది సునంద కొంచెం ధైర్యం తెచ్చుకొని.

"ఓహో! ఈ మధ్య రోజూ ఔపోసన పడుతున్నారు. 'చైల్డ్ డెవలప్‌మెంట్ - ఎ రిసర్చ్ ప్రాజెక్ట్' ఆ పుస్తకమేనా? ఇంకా ఆ పుస్తకంలో వున్న అమూల్య సందేశాలేంటో...?" వెటకారంగా అన్నాడు రమేష్.

"వ్యతిరేకార్థక భావాలు కలుగచేసే విధంగా పిల్లల్తో ప్రవర్తించరాదట. ఏదైనా చేయి అంటే చేస్తారట. చేయొద్దు అంటే ఏం... ఎందుకు... చేస్తే ఏమౌతుంది అన్న అనవసర కుతూహలం వాళ్ళల్లో రేకెత్తి ఆ పనిచేసే దాకా వూరుకోరట. ఏదో పాజిటివ్ ిజమ్ అట కదా- అదే సరైన పద్ధతి అట. అత్యధిక తెలివితేటలు గల పిల్లలే అల్లరెక్కువ చేస్తారట. మరో విషయం - పిల్లలు పెద్దవాళ్ళని అనుకరిస్తుంటే పెద్దలు హర్షించి వాళ్ళని ప్రోత్సహించాలట. నీలాగా పెయింటింగ్ వేస్తున్నాడంటూ మీ నాన్నగారు ఎంత మురిసిపోయారో... పదిహేను రోజులుగా కష్టపడి వేస్తున్న చిత్రపటంపై రంగులెలా పులిమి పాడుచేశాడో చూడండి అని నేనంటే - పోనీలేవే - పోయిందల్లా కాసింత కాన్వాసు గుడ్డా, రెండు మూడు రంగుల ట్యూబులేగా అంటూ నానిగాడ్ని వెనకేసుకొచ్చారు..." కొడుకును సాంత్వన పరుస్తూ అంది సరస్వతమ్మ.

"అమ్మా! ఇంతకీ ఆ అల్లరి వెధవ ఏడీ? నాలుగు తగిలిస్తే కాని బుద్ధిరాదు."

"నువ్వలా కోప్పడి కొడ్తావేమోనని భయపడే వాణ్ణి తీసుకుని బజారుకెళ్ళార్రా మీ నాన్న" చల్లగా కబురందించింది సరస్వతమ్మ.

"కోప్పడకుండా ముద్దెట్టుకోవాలా, రానీ ఆ రాస్కెల్‌ని. నాన్నగారు కొని తెచ్చిన ఆ మాయదారి పుస్తకం వల్ల వచ్చిపడ్డాయ్ ఈ తిప్పలన్నీ. సునందా! ఆ పుస్తకం పట్టుకురా. ముందు దాన్ని చింపి పోగులు పెడ్తేకానీ నాకు శాంతి వుండదు."

రమేష్ మాటలకి ఎంత ఆపుకుందామన్నా నవ్వాగలేదు సునందా - సరస్వతమ్మలకి. అత్తాకోడళ్ళు నవ్వుతుంటే, ఇంకా చిర్రెత్తుకొచ్చింది.

"ఇప్పుడు తాతా మనవడు బజారుకెళ్ళింది ఎందుకనుకున్నావ్? నీ పుత్రరత్నం చింపి పోగులు పెట్టిన ఆ అపురూప పుస్తకాన్ని వీలైతే బైండ్ చేయించడానికి నీ కోపతాపాలని తాత్కాలికంగా తప్పించడానికి కూడా అనుకో. అల్లరి చేసాడని కొడుకునైతే తండ్రిగా దండించగలవు కానీ, ఆ అల్లరే ఐ.క్యూ. అంటూ మురిసిపోతూ వాణ్ణి ఎంకరేజ్ చేసిన మీ తండ్రినేమనగలవురా...?" గదిలోంచి వెళ్ళిపోతూ అంది సరస్వతమ్మ.

అమ్మ మాటలను తలపోస్తూ మంచంమీదికి వాలిపోయాడు, తాతా మనవల అఘాయిత్యానికి బలైన అభాగ్యజీవి రమేష్.

■

***(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 24-7-1998)***

# హాయ్ మమ్మీ!

"అందరూ వచ్చినట్లేనా..?" చకచకా పేకముక్కలు కలుపుతూ, అసహనంగా అంది కుముదిని. ఆవిడ కళావతి ఇంటికి వచ్చి అప్పుడే అర్థగంట దాటిపోయింది. ఇంకా చతుర్ముఖ పారాయణం మొదలెట్టలేదు. కుముదిని మరి వచ్చేదే అందుకు!

"ఉండవమ్మా తల్లీ! మరీ అంత తొందరైతే ఎలా? కౌసల్య రావాలి- కళావతి తెమలాలి. పాపం, కళావతినొకమారు అటుచూడు - వంటింట్లో ఎలా సతమతమౌతోందో! విమల సరేసరి- న్యూస్‌పేపర్ని పట్టుకు కూచుంది. ఇంట్లో పేపర్ని ఆవిడ భర్త కానీ, పిల్లలు కానీ అంటనివ్వరట కదా ! పైపెచ్చు- చదవడం పూర్తి కాలేదంటూ ఆవిడ భర్త ఆఫీసుకి పట్టుకెళ్తారట పేపర్ని" కాత్యాయని కుముదిని హడావిడికి అడ్డుకట్టవేసింది.

"ఇంతకీ కౌసల్యగారు వేంచేస్తారటనా..?" టేబిల్‌మీద వేళ్ళతో టకటకలాడిస్తూ అంది కుముదిని.

"ఇందాకా ఆవిడే ఫోన్ చేసారు. వాళ్ళ మనవరాల్ని స్కూలుకి పంపి వస్తారట..." చెప్పింది కాత్యాయిని.

"ఊ.... అదొక సాకు మాత్రమేలే! కౌసల్యకి పేకాడడం అసలు ఇష్టముండదు. నేను గమనిస్తూనే వున్నాను. మనమిలా ప్రోగ్రాం ఫిక్స్ చేసినప్పుడల్లా, ఏదో కారణం చెప్పి తప్పించుకో చూస్తారు."

"పోన్లెద్దురూ! ఎవరి ఇష్టాలు వాళ్ళవి. నల్గురం ఒకచోట చేరి టైమ్ స్పెండ్ చేయటం ప్రధానం కానీ, అందరికీ అన్నీ నచ్చాలని లేదుగా!" కళావతి కూడా టేబిల్ దగ్గర చేరిపోయింది.

"ఇంక ఆలస్యం ఎందుకు? మనం నల్గురం వున్నాం. ఆట మొదలెడితే సరి" అంటూ కుముదిని పేకముక్కలు నలుగురికీ పంచింది.

ఆట మొదలయ్యింది. మధ్యలో మాటల జోరు కూడా కల్సింది. ఎక్కడెక్కడి కబుర్లు, ఎప్పటెప్పటి కబుర్లు వాస్తవ, అవాస్తవిక రంగులద్దుకొని పోటీపడ్తూ ముందుకురుకుతున్నాయి.

"ప్యూ-సీక్వెన్స్ రాలేదు సరికదా-జోకర్ కూడా లేదు. డ్రాప్!" అంటూ మొదట్లోనే డ్రాప్‌చేసింది కుముదిని. చేసేదిలేక, పక్కవారి చేతుల్లోని ముక్కల్ని ఆసక్తిగా చూడ్డం మొదలెట్టింది.

"కుముదినీ! వాట్స్ దిస్! నువ్విలా అందరి ముక్కల్లోకి చూస్తే నేనూరుకోను. కావాలంటే విమలకి హెల్ప్ చెయ్యి" అంది కాత్యాయని తన ముక్కల్ని దాచేస్తూ.

మరో రెండు రౌండ్లకి మిడిల్ డ్రాప్ చేసిన కాత్యాయిని కుముదినితో కబుర్లలో పడింది. ఇద్దరికీ దాదాపు ఒకే వయస్సు. యాభైకి-అరవైకి మధ్యలో వుంటారు వాళ్ళు. జుట్టుకు రంగులేసుకొని, రూపలావణ్యాలు మెరుగు పర్చుకోవడానికి కొంత సమయం, మరింత డబ్బు వెచ్చించి, వృద్ధాప్యం ఛాయలు కన్పించకుండా జాగ్రత్త పడతారు.

ఇద్దరికీ మనవలున్నారు. కాస్తో కూస్తో కీళ్ళ నొప్పులున్నాయి. అలంకారప్రాయంగా చెప్పుకోవడానికి బ్లడ్‌ప్రెషర్లు, డయాబటీస్‌లు వున్నాయి.

వాళ్ళిద్దరే అన్నమాటేమిటి! అక్కడ సమావేశమైన స్త్రీలందరూ ఆ కోవకు చెందినవారే!

కుముదిని, కాత్యాయిని క్లాస్‌మేట్స్. ఇద్దరి భర్తలు పని చేసింది ఒకే డిపార్ట్‌మెంట్ కావడం, ఒకే ఊర్లో సెటిల్ అవడంతో, వారిద్దరి మధ్యా స్నేహం బలపడింది. విమల, కళావతి ఒకే అపార్టుమెంట్‌లో వుంటారు. కూతురు పెళ్లిలో కుముదినితో కొంత బాంధవ్యం కలవడంతో ఆవిడతోటి పరిచయం పెరిగింది కళావతికి. ఇక కౌసల్య విమలకి దూరపు చుట్టం. ఢిల్లీ, కాన్పూర్, కలకత్తా అంటూ నార్త్ ఇండియా అంతా ఉద్యోగరీత్యా తిరిగిన కౌసల్య భర్త ఫైనల్‌గా హైదరాబాద్‌లో సెటిల్ అయ్యారు. విమలతోటి సాన్నిహిత్యం పెరిగిన కౌసల్య వీరితో కల్సింది. అంతమంది మహిళలు ఒక్కచోట కల్సినా భిన్న భిన్న ప్రవృత్తులు వారివి. భిన్నత్వంలో ఏకత్వంలా వాళ్ళ మైత్రి నిరాఘాటంగా సాగిపోతూ వుంది, పేకాటల మాటున.

పిల్లల పెంపకం, చదువులు, ఆ తర్వాత వాళ్ళ పెళ్ళిళ్ళు అయి, భర్తల రిటైర్‌మెంట్లతో

తమకంటూ కొంత సమయం కేటాయించుకొని వారానికో, పక్షానికో ఓమారు ఒక్కొక్కరింట్లో కలిసే కార్యక్రమాన్ని ఏర్పాటుచేసుకున్నారు వాళ్ళు. ఆడవారు కలిసే ఇటువంటి కిట్టీ పార్టీల్లో సహజంగా పేకాట ప్రథమ స్థానం ఆక్రమించుకుంటుంది.

విమలతో కాలక్షేపం కోసం అంటూ వచ్చే కౌసల్యకి ఇలా స్త్రీలందరూ పూసుపోని కబుర్లు చెప్పుకుంటూ పేకాడడం నచ్చేది కాదు. కానీ విమలని నొప్పించలేక కొద్దివారాలు వచ్చిన తర్వాత నెమ్మదిగా వాళ్ళకి తన అభిప్రాయం చెప్పింది.

"ప్రతివారం పేకాడడం కాకుండా, ఒక్కొక్క వారం ఒక్కొక్క కార్యక్రమం పెట్టుకుందాం. ఒకరోజు సరదాగా అందరం ఏ మూవీకో వెళ్దాం. ఒకవారం పిక్‌నిక్‌లాగా ఏ మ్యూజియంకో, జూపార్క్‌కో వెళ్దాం. సిటీలో ఎన్నో అనాథాశ్రమాలు, వృద్ధుల వసతి గృహాలున్నాయ్. ఒకవారం అక్కడికి వెళ్ళి వాళ్ళతో గడుపుదాం."

కౌసల్య అభిప్రాయం విని అందరూ తలలైతే వూపారుకానీ సీరియస్‌గా అమలు చేసేందుకు మాత్రం ముందుకు రాలేదు.

మరో అర్ధగంటకి వచ్చి చేరింది కౌసల్య.

"ఏంటండీ కౌసల్యగారూ! ఈ ఒక్కరోజు కూడా మీది కాదా? పనులంటూ ఎవరికి వుండవండీ! మాకు మాత్రం పనులు లేవంటారా? ఎలాగో తెమల్చుకొనో, తప్పించుకొనో రావాలి కానీ.." కౌసల్యని దాదాపు నిలదీస్తున్నంత గట్టిగా అడిగింది కుముదిని.

"ఎలా రానండీ! నా కూతురు కిన్నెర మెడికల్ కాన్ఫరెన్స్‌కి పాండిచ్చేరి వెళ్ళింది. ఈ టైంలోనే నా మనవరాలు శ్వేతకి ఎగ్జామ్స్. లెసన్స్ అన్నీ నాకు అప్పజెప్తే తప్ప దానికి తృప్తి వుండదు..." ఆట మధ్యలో చేయి కల్పడమెందుకన్నట్లు - అక్కడే వున్న ఫెమినా అందుకుంది కౌసల్య.

"మన పిల్లల చదువు బాధ్యత సరే- మనకు తప్పలేదు. ఇక వాళ్ళ పిల్లల బాధ్యత కూడా నెత్తినేసుకోవడం ఎందుకండీ! ఓహ్. ఎప్పుడండీ మనం బయటపడేది ఈ జంజాటం నుండి..." రెట్టించింది కుముదిని.

ఆవిడ తలని అటు-ఇటూ తిప్పి మాట్లాడుతూంటే ఆవిడ భుజం మీద నాట్యం చేస్తున్న షార్ట్‌హేర్ కూడా గమ్మత్తుగా కదులుతూంది. కుముదిని మాటలకి సమాధానం లేదన్నట్లు మౌనంగా ఊరుకుంది కౌసల్య.

"మీకో తమాషా ఇన్సిడెంట్ చెప్పనా?" అంది కళావతి పేకముక్కలు టేబిల్ మీద పడేసి.

అందరూ ఆసక్తిగా చూశారు కళావతికేసి.

"మొన్నటిరోజు ఏమైందో తెల్సా! నేను బ్యూటీపార్లర్‌లో ఫేస్ మీది రింకిల్స్ ట్రీట్ చేయించుకొని, పనిలో పనిగా హెయిర్ సెట్టింగ్ కూడా చేయించుకొని బయల్దేరేందుకు సిద్ధమవుతుండగా పార్లర్‌లో పనిచేసే అమ్మాయి వచ్చి, మేడమ్! మీకోసం మీ బ్రదర్ వచ్చారు;

బయట కార్లో వెయిట్ చేస్తున్నారంటూ చెప్పింది. యు.ఎస్.లో వున్న నా ఒక్కగానొక్క తమ్ముడు ఇప్పుడిలా ఎలా వూడిపడ్డాడా అనుకుంటూ బయటకు వచ్చి చూద్దును కదా, కార్లో వున్నది మా సుపుత్రుడు కిశోర్!" చెప్పి పకపకానవ్వింది కళావతి.

"ఇంకా నయం! బ్రదర్ అన్నదా అమ్మాయి" అంటూ మరికొంత కలర్‌ని జోడించి అర్థవంతంగా నవ్వింది కాత్యాయని. అదేదో పెద్దజోక్ అయినట్లు అందరూ కూడబలుక్కుని విరగబడి నవ్వడం కౌసల్యకి కంపరం పుట్టించింది.

వృద్ధాప్యంలోకి అడుగుపెడ్తున్న స్త్రీలు ముసలితనాన్ని ముందే ఆహ్వానించి అందులో మునిగిపోవడం తప్పే. బాల, కౌమార, యవ్వన దశలని దాటి వృద్ధాప్యంలోకి అడుగుపెట్టడం అన్నది అతి సాధారణంగా జరిగే ప్రకృతి చర్య. ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సుది. ప్రస్తుత కాలానుగుణంగా సంఘంలో, కుటుంబంలో చాలా మార్పులు చోటు చేసుకున్నాయి. ఇదివరకటి ఉమ్మడి కుటుంబాల స్థానే వేరింటి కాపురాలు, ఒంటరి బ్రతుకులు కూడా తప్పనిసరి అవుతున్నాయి. న్యూక్లియర్ ఫామిలీస్‌లో చాలావరకు తల్లిదండ్రులకు చోటు కరువైపోతున్నది. వయస్సు పైబడ్డ పెద్దవారు పిల్లలమీద ఆధారపడి బ్రతకడం అన్నది ఇప్పుడు దాదాపు మృగ్యమనే చెప్పాలి. శరీర సౌష్టవానికి, ఆర్యోగానికి కావాల్సిన ఆరోగ్యసూత్రాలను పాటించడం మంచిదే. అనారోగ్య పరిస్థితులు తమని చుట్టుముట్టకుండా జాగ్రత్త వహించడం సబబే. కానీ, అలా ఆరోగ్యం పేర హార్మోన్ రీప్లేస్‌మెంట్ చికిత్సలు, ఎక్సర్‌సైజులు, ఏరోబిక్స్, జిమ్ములు, జాగింగులు, ఫాషన్లూ, పార్లర్లూ అంటూ వాటి వెంటబడి సమయాన్ని, డబ్బును ఖర్చుపెట్టడం తనకు కొరుకుడు పడలేదు. పరధ్యానంగా ఆలోచిస్తోంది కౌసల్య.

"ఏంటండీ! మా జోక్ మీకు నచ్చినట్లు లేదే?" అంది కుముదిని.

"ఇది హాస్యం కాదండీ! అపహాస్యం! మన పిల్లలు మనల్ని చూచి గర్వపడేటట్లు వుండాలి కానీ, సిగ్గుపడేటట్లు కాదు. కళావతిగారబ్బాయి ఈ జోక్‌ని ఎలా రిసీవ్ చేసుకుంటాడన్న విషయాన్ని ఒక్కమారు ఆలోచించి చూడండి. అప్పుడు మీకు అర్థమౌతుంది" కొంచెం ఘాటుగానే అంది కౌసల్య.

చిన్నబోయిన కళావతిని చూచి, "ఊర్కో కౌసల్యా!" అంటూ వారించింది విమల.

"సారీ కళావతిగారూ! మిమ్మల్ని కించపర్చాలని నేనీ మాటలు అనడం లేదు. ఒక్కమారు మనమందరం వివేకంతో ఆలోచించాల్సిన విషయమిది. మన ముందుతరాల వారికి వాళ్ళని గూర్చి ఆలోచించే సమయం, వివేచనాశక్తి వుండేది కాదు. కాబట్టి అలా బ్రతికేసారు. సంతోషంగానా, విచారంగానా అన్నది మనకిక్కడ అప్రస్తుతం. కానీ ఈ తరంలో మనం, ముఖ్యంగా ఇక్కడున్న మనమందరం విద్యావంతులం, గ్రాడ్యుయేట్లం, సొసైటీలో ఒక ముఖ్య వర్గానికి చెందినవాళ్ళం. మన పిల్లల్ని పెంచి, ప్రయోజకుల్ని చేసి, వాళ్ళ కాళ్ళమీద వాళ్ళని నిలబెట్టాం. మన కర్తవ్యాలు పూర్తయ్యాయి. ఇక మన జీవితాలు నిజంగా మనవే! కాని మన ముందున్న ఈ ఫ్రీ టైమ్‌ని మన ఇష్టమొచ్చినట్లు యూజ్ చేసుకోవచ్చునని భావించడం సబబేనంటారా? ఒకప్పుడు అరవై ఏళ్ళు

వచ్చేసరికి మన తల్లిదండ్రులు దాదాపు అనారోగ్య పరిస్థితుల్లో వుండేవారు. మొబిలిటీ లేక ఎక్కడికీ కదిలి వెళ్ళేవారు కాదు. కానీ మనమో! ఆధునిక విజ్ఞానం అందించిన వివిధ సౌకర్యాలతో, వైద్య సదుపాయాలతో చురుగ్గా ఆరోగ్యంగా ఒకరిమీద ఆధారపడకుండా స్వతంత్రంగా జీవించగల స్థితిలో వున్నాం. అందుకు మనమందరం గర్వించాలి. ఆనందించాలి. ఇలా మనకు సమకూరిన మన జీవితాలని ఎంతో కొంత మన సాటివారికి ఉపయోగపడేందుకు వినియోగిస్తే బాగుంటుంది కదా! ఇన్ని రోజులూ స్వార్థంగా మన కుటుంబాలకే పరిమితమైన మన శక్తియుక్తులను, సంఘంలో మన సహాయాన్ని అర్థించే దురదృష్టవంతులకు, అసహాయులకు ఎంతో కొంత వెచ్చించి సహాయపడాలి. ఇదేనండి నేను మిమ్మల్ని కోరేది'' కౌసల్య మాటల్ని పూర్తి కానివ్వకుండానే అందుకుంది కుముదిని.

"అంటే మీరనేదేంటండీ? మన సరదాలని, సంతోషాలని పక్కకునెట్టి సంఘసేవ అంటూ మురికివాడల వెంబడి పరుగులెత్తాలా? మొన్నటి ఆ అనుభవం ఇంకా మరిచిపోలేదు కౌసల్యగారూ! సాయంత్రం వరకూ అనాథాశ్రమంలో గడిపి ఇంటికి వచ్చాక ఏమైంది! మైగాడ్! అన్నం సహించక, నిద్రపట్టక ఆ రాత్రంతా ఎంత కలవరపడ్డానో మీకేం తెల్సు! నేనసలే సెన్సిటివ్... చూడండి, ఏదో ఇలా కులాసాగా కాలక్షేపం చెయ్యక మనకెందుకండీ లేనిపోని తద్దినాలూ...?'' కుముదిని మాటలు విని నివ్వెరపోయింది కౌసల్య.

నిజమే! ఒక్క కుముదినే కాదు- ఆ మాటకొస్తే చాలామంది, వారికి ఆనందం, ఆహ్లాదం కల్గించే విషయాల పట్ల, పనుల పట్ల ఆసక్తి చూపిస్తారు. అవే ఆచరిస్తారు. తనుమాత్రం ఏమన్నదని...? తనుకు అందుబాటులో వున్న సమయాన్ని, విజ్ఞానాన్ని సద్వినియోగపరుద్దామనే కదా! ఏమో - సద్వినియోగానికి తనిచ్చిన నిర్వచనం, కుముదినికి కొరుకుడు పడినట్లు లేదు.. మౌనంగా వుండిపోయింది కౌసల్య.

తన భావాలతో సారూప్యం కుదరని మనుషులతో కల్సి, కలతపడడంకన్నా వారికి దూరంగా వుండడమే మంచిదన్న నిర్ణయానికి వచ్చిన కౌసల్య,కుముదిని వాళ్ళతో కలవడం క్రమేణా తగ్గించుకుంది. తన వ్యాపకాలు తనవి. తన జీవితాన్ని తన అభిరుచుల మేరకు దిద్దుకోవడమే తన అభిమతంగా భావించి ముందుకు వెళ్ళిపోయింది. తన తీరిక సమయాన్ని మరింత సంఘసేవలో వినియోగించడం మొదలెట్టింది.

"కౌసల్యా! నువ్వా మధ్య టీ.వీ.లో కన్పించావటగా- మెంటల్లీ రిటార్డెడ్ చిల్డ్రన్ హోమ్‌లోని పిల్లలతో గడుపుతూ-కుముదిని చెప్పిందిలే! నువ్వు చేసే సోషల్ సర్వీస్‌కి మెచ్చి ఏ పద్మశ్రీ బిరుదో ప్రదానం చేస్తుందిలే ప్రభుత్వం- అని కూడా ఎద్దేవా చేస్తుంటుంది తను'' అంటూ విమల చెప్పే మాటలను సైతం పట్టించుకోవడం మానేసింది కౌసల్య.

తనేమీ బిరుదులు, పొగడ్తలు, సన్మానాలు ఆశించి చేయడం లేదీ పనులు. అనాథలకి, అసహాయులకి తన వంతు సాయం అందించడమే తన కర్తవ్యంగా భావించి చేస్తోంది.

  

ప్రొద్దుటే హడావిడిగా బయల్దేరుతున్న కౌసల్యను అడ్డుకుంది కోడలు కుసుమ.

"అత్తయ్యా! ఉగాది పండుగంటూ ప్రొద్దున్నే లేచి పూజాక్రమం పూర్తి చేసారుకదా! మళ్ళీ ఎక్కడికండి బయల్దేరుతున్నారు...? ఇన్నాళ్ళు ఓపిక వుండి ఎక్కడికెళ్ళినా, ఎవ్వరం పట్టించుకోలేదు. కానీ అత్తయ్యా! ఇప్పుడు మీకు హై బి.పీ. డాక్టర్ రెస్ట్ అవసరం అంటున్నారు. ఇలా ఈ పండుగ పూట కూడా బయటకు వెళ్ళకపోతే కాస్త రెస్ట్ తీసుకోవచ్చు కదండీ!"

"చూడమ్మా కుసుమ్! డాక్టర్లు ఇంతుంటే అంతంటారు. ఈ హోమ్ ఫర్ ది ఏజ్డ్ విజిట్ నెలరోజుల ముందే ఫిక్స్ చేసుకున్న ప్రోగ్రాం కదమ్మా! అందర్నీ ప్రోత్సహించి నేనే వెళ్ళకపోతే ఏం బాగుంటుంది చెప్పు? అయినా కుసుమ్- మహా అయితే రెండుమూడు గంటల్లో ఇంట్లో వుండనూ? అదిగో.. అప్పుడే మీ మామయ్య కారు హారన్ ఇస్తున్నారు. నన్నక్కడ డ్రాప్ చేసి తన ఫ్రెండ్ ఇంటికి వెళ్తానన్నారు..."

కారు దగ్గరికి నడిచి వెళ్తున్న అత్తయ్యకేసి చూస్తూ అనుకుంది కుసుమ. "అత్తగారి వ్యాపకమే ఆవిడకి రెస్ట్- కొండంత బలం!"

డబ్బున్నవారికి ప్రత్యేక రూములు, లేనివారికి డార్మటీలు- వారి వారి ఆర్థిక స్థోమతలను బట్టి సౌకర్యాలు లభ్యమయ్యే హోమ్ ఫర్ ది ఏజ్డ్ అది. ఆ హోమ్‌లోని వృద్ధుల్ని చూస్తుంటే ఒకవేపు బాధ, మరొకవేపు వూరట కల్గింది కౌసల్యకి.

భర్తలను పోగొట్టుకున్న భార్యలు, భార్యలు మరణించిన భర్తలు- పిల్లలు లేని వృద్ధ దంపతులు- అనాథలై హోంని ఆశ్రయించిన ఒంటరి అభాగ్యులు, కారణాంతరాల వల్ల వివాహం వాయిదా పడి తుదకు నా అన్నవారు కరువై హోంలో చేరినవారు- ఇలా రకరకాల వృద్ధులు ఆ ఆశ్రమంలో తారసపడ్డారు కౌసల్యకి.

ఇంటినుండి తెచ్చిన స్వీట్స్, ఉగాది పచ్చడి ఇన్‌మేట్స్‌కి అందిస్తూ అందర్నీ స్నేహపూర్వకంగా పలకరిస్తూ ముందుకు సాగింది కౌసల్య. అలా వెళుతూ, ఒక గది బయట బాల్కనీలో ఎటో చూస్తూ కూచుని వున్న వృద్ధురాలి దగ్గర ఓ క్షణం ఆగిపోయింది. కౌసల్య అడుగుల చప్పుడికి, ఇటు తిరిగిన వృద్ధురాలు క్షణంలో క్షణం కలవరపడిపోయింది.

"అరే! కుముదినిగారూ! మీరిక్కడా!" అంటూ దగ్గరికి వస్తున్న కౌసల్యని చూచి, మరింత కుంచించుకు పోయింది కుముదిని. ఆప్యాయంగా భుజం మీద చెయ్యివేసిన కౌసల్యను చూచి కుముదిని నోట మాట రానట్లు వుండిపోయింది.

"కుముదినిగారూ! ఈ మధ్య మీ కబుర్లేమీ తెలియవు నాకు. విమల అయినా వుంటే కొంత తెలిసేది. తను న్యూజిలాండ్ వెళ్ళింది కొడుకు దగ్గరికి. అయినా, మీరు అమెరికాలో మీ అబ్బాయి దగ్గర వున్నట్లు విమల చెప్పిందే, ఆ మధ్య కల్సినప్పుడు. ఎప్పుడొచ్చారండి స్టేట్స్ నుండి...?" అంటూ పలకరించింది కౌసల్య.

ఆనాటి కుముదినేనా ఈ కుముదిని! ఎంత మారిపోయింది? ఈ పదేళ్ళలో రెట్టింపు ముదిమిని పులుముకొని నిస్తేజంగా వున్న ఆవిణ్ణి చూచి ఆశ్చర్యపోయింది. కుముదిని భర్తపోయాడని తెల్సుకొని బాధపడింది కౌసల్య. కన్నబిడ్డల వద్ద ఎడ్జెస్ట్ కాలేక మాతృదేశం వచ్చి వృద్ధాశ్రమంలో చేరిపోయిందని కుముదిని చెప్పగా విని నమ్మలేకపోయింది కౌసల్య.

"ఏం చెప్పమంటారు కౌసల్యగారూ? ఒకనాడీ వాతావరణాన్ని అసహ్యించుకున్న నాకు భగవంతుడు ఆఖరికి ఇటువంటి శిక్ష వేసి ఇక్కడే నీ శేషజీవితం అంటూ శాసించాడు. నాకీ శిక్ష కావాల్సిందే! నా లైఫ్ స్టైయిల్ నాది, నా జీవిత పంథాని శాసించే హక్కు ఎవరికీ లేదన్నట్లు ఆనాడు విర్రవీగాను. అచ్చు- నా అడుగుజాడల్లోనే నా సంతానం నడుస్తున్నదిప్పుడు. వారి ఆనందమయ జీవితాలకు నేను నిజంగా అవరోధాన్ని అయ్యాను" బాధపడ్తున్న కుముదినిని మరిన్ని ప్రశ్నలు వేసి బాధపెట్టే ఇష్టం లేక మౌనంగా వుండిపోయింది కౌసల్య.

"భలేవారే! ఈ హోంలో వుండడం మీరు శిక్షగా భావిస్తున్నారా? ఎందరు లేరండి మీ సమ వయస్కులిక్కడ! వారితోటి జీవితాన్ని ఆనందంగా గడపవచ్చు కదా! చూడండి కుముదినిగారూ! మనం ఓ విషయం మర్చిపోకూడదు. భగవంతుడు మనకు ఏ జీవితం ప్రసాదిస్తే దాన్ని సంతోషంగా స్వీకరించడంలోనే వున్నదండీ మన ఆనందం.. తృప్తి.." ఇంతకన్నా ఎలా సాంత్వన పరచాలో తెలియలేదు కౌసల్యకి. కుముదినితో కాస్సేపు గడిపి, మళ్ళీ ఇంకొకమారు వస్తానంటూ అక్కడి నుండి నడిచింది కౌసల్య.

ఠీవిగా పోతున్న కౌసల్యనే చూస్తూ కుర్చీలో కూలబడ్డ కుముదినిని పలకరించాయి- ఎదుటి టీపాయ్ మీదున్న గ్రీటింగ్ కార్డులు.

ఆరోజు కుముదిని పుట్టినరోజు.

కెనడా నుండి కూతురు, కాలిఫోర్నియా నుండి కొడుకు- అమ్మకు పుట్టినరోజు శుభాకాంక్షలు తెల్పుతూ పంపిన అమూల్యమైన గ్రీటింగ్ కార్డ్స్ అవి!

తన గదిలోంచి ట్రింగ్ ట్రింగ్‌మంటూ ఫోన్ మోగడంతో ఉలిక్కిపడింది, కుముదిని. పలకరింపులకై పరితపించే కుముదిని లాంటి అభాగ్యుల పాలిటి కల్పతరువు ఆ ప్రాణంలేని యంత్రం.

కానీ ఎందుకో ఫోన్ రిసీవ్ చేసుకోబుద్ధవలేదు కుముదినికి.. ఏముంటాయ్ విశేషాలు?

ఎప్పుడూ వినే తన పిల్లల నాలుక చివరి శుభాకాంక్షలే!

అలా మోగుతున్న ఫోన్‌కేసి చూస్తూనే వుండిపోయింది కుముదిని.



*(ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక, 30-7-1998)*

# ఒంటరి తల్లి

"అన్నయ్యా, మళ్ళీ మొదలెట్టావా? ఏదో వీకెండుకి నన్ను చూడ్డానికి వచ్చావనుకున్నాను. కానీ, పెళ్ళిళ్ళ పేరయ్య అవతారం ఇంకా చాలించలేదన్నమాట." కటింగ్ ప్లేట్‌లోని క్యారెట్స్‌ని చిన్న చిన్న ముక్కలు చేస్తూ అంది రుక్మిణి.

"అది కాదమ్మా! ఇలా ఎన్నాళ్ళు? ఎన్ని రోజులు మ్యారేజ్ పోస్టుపోన్ చేస్తావ్?"

"అన్నయ్యా, నేనేమైనా టీనేజర్నా? పోనీ ట్వంటీస్‌లో ఉన్నానా? ఐయామ్ నౌ ఇన్ ఫార్టీస్. పెళ్ళి కూతుర్ల జాబితాలో నుండి వైదొలగిన వృద్ధ కన్యను తెలుసా!" నవ్వుతూ అంది రుక్మిణి.

"సరే లేవమ్మా. పెళ్ళికి ఒక ఏజ్ అంటూ ఉంటుందా ఏంటి? ఎప్పుడు అవసరం అనిపిస్తే అప్పుడు చేసుకోవడమే. 'నా కెరీర్ నాకు ముఖ్యం' అంటూ ఇన్నాళ్ళూ పెళ్ళి వాయిదా వేశావ్. అమ్మా, నాన్న నిన్ను ఓ ఇంటిదాన్ని చేయాలని ఎంత తాపత్రయపడ్డారో నీకేం తెల్సు! పాపం వాళ్ళ కోర్కె తీరకుండానే పోయారు. 'ఇదో, అదో' అంటూ కాలయాపన చేస్తూ కూర్చో, నీ మేనకోడలు శ్రుతి కూడా పెళ్ళికెదిగి వస్తుంది."

"దట్స్ రైట్ అన్నయ్యా. ఇప్పటికైనా నమ్ముతావా నేనెంత ఏనిషియంట్ అయిపోయానో!"

"సరేలే బడాయి. ఇంతకీ నేనిప్పుడు ఇక్కడికొచ్చిందెందుకో తెల్సా?"

"భలేవాడివన్నయ్యా నువ్వు చెప్పందే నాకెలా తెలుస్తుంది?"

"అదేనమ్మా. మా కంపెనీలో డి.జి.ఎం.గా పని చేస్తున్న ఆదిత్యను గురించి ఆ మధ్య చెప్పాను గుర్తుందా? ఆదిత్య బిజినెస్ మేనేజ్‌మెంట్‌లో పిహెచ్.డి. చేశాడు, ఐ.ఐ.ఎం. అహ్మదాబాద్ నుంచి. ఆధునిక భావాలు కలవాడు."

"అయితే ఏంటట? నన్ను పెళ్ళి చేసుకోవడానికి ఇన్ని అర్హతలు ఉన్నవాడే కావాల్నా అన్నయ్యా?"

"నన్ను పూర్తిగా చెప్పనివ్వవా రుక్కూ! చదువే నీ ఆశయం అంటూ పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసి ఆపైన పిహెచ్.డి. పట్టా కూడా పుచ్చుకున్నావ్. యూనివర్సిటీలో ఉన్నత పదవైన రిజిస్ట్రార్ పదవికి చేరుకున్నావ్. ఉద్యోగోన్నతితో పాటు జీవితోన్నతి కూడా సాధించాలి కదమ్మా."

"జీవితోన్నతి అంటే ఏమిటన్నయ్యా? పెళ్ళి చేసుకోవడం, ఆపైన పిల్లల్ని కనడమేనా? నిన్ను చూస్తే నాకు నాయనమ్మే గుర్తుకొస్తోంది. అచ్చు నాయనమ్మే ప్యాంటూ, షర్టూ వేసుకొని నా ముందు కూర్చున్నట్లుంది."

ప్రసంగాన్ని హాస్యంలోకి దింపడానికి రుక్మిణి ప్రయత్నించడం శంకరానికి కొంత కోపాన్ని తెప్పించింది.

"చూడమ్మా, ఇంతవరకూ నీ ఇష్టారాజ్యంగా జరుగుతోంది కదాని ఈ అన్నయ్యను మరీ అంత చులకనగా తీసి పారేయకు."

"ఛా, ఛా. అలా ఎందుకనుకుంటావ్" అంది రుక్మిణి తరిగిన కాయకూరల ప్లేట్‌ని కిచెన్‌లో పెట్టడానికి లేచి వెళ్తూ.

డ్రాయింగ్ రూంలో చేతులు తుడుచుకొని శంకరం ముందు కూర్చున్న రుక్మిణి, "చూడన్నయ్యా, ప్రస్తుతం నాకు వైవాహిక వయసు దాటిపోయింది. పెళ్ళి కాకుండా తల్లిని కాలేని నేను మాతృత్వపు మధురిమలను ఆస్వాదించడానికి ఈ చిన్నారి అమూల్యను తెచ్చి పెంచుకుంటున్నాను. అనాథాశ్రమం నుండి తెచ్చుకున్నప్పుడీ బిడ్డ ఆర్నెల్ల పసిగుడ్డన్న విషయమేమర్చిపోయాను. కన్న కూతురుకిది ఏ విధంగా తీసిపోతుంది అన్నయ్యా? కంటేనే మాతృత్వం అని ఎవరైనా అంటే నేనొప్పుకోను."

"రుక్కూ, ఈ విషయంలో నేను నీతో వాదించదల్చుకోలేదు. నీ వ్యక్తిత్వం మీద నాకు గౌరవం ఉంది. నీ నిర్ణయాలను ఏనాడైనా నేను నిరసించానా, నిరోధించానా- ఒక్క ఈ వివాహం విషయంలో తప్ప. అమ్మా రుక్కూ, నువ్వు ఒక్క విషయం మర్చిపోతున్నావ్. అమూల్యకు తల్లే కాదమ్మా, తండ్రి అవసరం ముందు ముందు ఎంతో ఉంది."

"ఏమో, తల్లీ, తండ్రీ నేనే అయి పెంచుదామన్న ఉద్దేశంతోనే తెచ్చుకున్నాను ఆనాడు."

"రుక్కూ! నేనిందాక చెప్పానే ఆదిత్య - ఆయనకు కూడా ఒక పాప ఉంది."

"ఏంటీ! ఆయన కూడా నాలాగా అనాథ పిల్లను దత్తత తీసుకున్నారా?" సంభ్రమంగా అంది రుక్మిణి.

"ఛా, ఛా.. మగవాడు. అందునా ఆడ తోడు లేకుండా అంత ధైర్యం చెయ్యగలడా?"

"ఓహ్! ఆ విషయంలో ఆడవాళ్ళే గ్రేట్ అని ఒప్పుకుంటావన్నమాట."

"రుక్కూ... ఇంతకీ నువ్వు నన్ను అసలు విషయాన్ని చెప్పనిస్తావా లేదా? ఆదిత్య భార్యపోయి రెండేళ్ళయింది. పాప సమీరకిప్పుడు ఆరేళ్ళు."

"అర్థమయ్యిందిలే అన్నయ్యా. ఆదిత్య పాపని పెంచడానికిప్పుడు ఆయా అవసరం వచ్చిందన్నమాట."

"ఛా. అలా ఎందుకనుకుంటావ్ నువ్వు? తనకీ వయసులో తోడూ, పాపకో తల్లీ కావాలని కోరుకుంటున్నాడని అనుకోవచ్చు కదా!"

"ఓ.కే అన్నయ్యా. ఈ మాటలన్నీ ఎందుకు? నీ మాటలకు విలువనిచ్చి ఆదిత్యగారిని త్వరలో కలుస్తాను. ఇద్దరం ఒకే నావ ప్రయాణికులం కదా, కలిసి పయనిస్తే బాగుంటుందేమోనన్న నీ ఆలోచనని మాత్రం ఎందుకు కాదనాలి?"

చెల్లెలు ఒప్పుకున్నందుకు సంబరపడిపోయాడు శంకరం.

ఓ ఆదివారం ఉదయం అనుకున్న ప్రకారం ఆదిత్యను, ఆదిత్య కూతురు సమీరను వెంటబెట్టుకొని రుక్మిణి ఇంటికి వచ్చాడు శంకరం. పరస్పర పరిచయాలయ్యాక పని ఉందంటూ బయట పడ్డాడు శంకరం. ఆరేళ్ళ సమీర, అయిదేళ్ళ అమూల్య ఆటపాటల్లో మునిగిపోయారు. బాల్కనీలో వాళ్ళ ఆటల జోరు, మాటల హోరూ డ్రాయింగ్ రూములోకి వినవస్తున్నాయి.

"సమీరా!" అంటూ వారించబోయాడు ఆదిత్య.

"ఇట్స్ ఓ.కే ఆదిత్యగారూ! లీవ్ దెమ్ ఫర్ దెమ్‌సెల్వ్స్" అని రుక్మిణి అనడంతో డ్రాయింగ్ రూంలో సెటిల్ అయిపోయారు రుక్మిణీ ఆదిత్యలు.

రెండు గంటల కాలం ఎలా గడిచిందో పిల్లలకే కాదు,పెద్దలకూ తెలియలేదు. అమూల్యను గురించి రుక్మిణి, ఆదిత్యతో చెప్పబోయింది. కానీ, తనకా విషయం శంకరం ద్వారా ముందే తెలుసనీ, తనకటువంటి సంకుచిత అభిప్రాయాలు లేవని చెప్పడంతో వాళ్ళ ప్రసంగాలు తమ తమ ఉద్యోగాలలోని సాధక బాధకాలతో మొదలై జాతీయ, అంతర్జాతీయ రాజకీయాల వరకూ వెళ్ళి వెనక్కి వచ్చి జన్మభూమిలోని పరిశుభ్రత, పచ్చదనం మీద నిల్చాయి.

"మమ్మీ! ఆకలి" అంటూ అమూల్య, "డాడీ! మనం ఈ రోజు ఇక్కడే ఉందామా" అంటూ సమీర రావడంతో ఈ ప్రపంచంలోకి వచ్చిపడ్డారు రుక్మిణీ ఆదిత్యలు.

"అన్నట్లు ఆదిత్యగారూ! సమీర ఐడియా బాగానే ఉంది. ఈ రోజు మీ లంచ్ ఇక్కడే" అంటూ లేచింది రుక్మిణి.

"ఎందుకండీ మీకా శ్రమ! అయినా, నేను ఇంట్లో చెప్పలేదు. అమ్మ వెయిట్ చేస్తుంటారు మాకోసం" అన్నాడు ఆదిత్య.

"నాకు శ్రమేముందండీ! ఆఫెనవర్‌లో వంట పూర్తి చేయడం నాకు వెన్నతో పెట్టిన విద్య. మీరు ఫోన్ చేసి అమ్మగారికీ విషయం చెప్పండి." చకచకా వంటింట్లోకి వెళుతున్న రుక్మిణిని ఆపే ప్రయత్నం చేయక, ఫోన్ అందుకున్నాడు ఆదిత్య.

ఒకరినొకరు అర్థం చేసుకోవడానికా అన్నట్లు రుక్మిణి, ఆదిత్యలు రోజూ సాయంత్రాలు ఒకరి ఇంటిలో మరొకరు కలిసి గడిపేవారు. ఇరువురి దృక్పథాలలో తేడాలు లేకపోవడం, వారి

అభిరుచులు, అభిమాన విషయాలు ఒక్కటే అవడం వల్ల ఓ నెల రోజుల సాన్నిహిత్యంతో వారిరువురూ భార్యాభర్తలమైతే బావుంటుందన్న అభిప్రాయాకి వచ్చేశారు. వాళ్ళ నిర్ణయానికి ఆదిత్య తల్లి కస్తూరి ఆమోద ముద్ర పడింది.

సింపుల్‌గా రిజిస్టర్డ్ మ్యారేజికి ఇద్దరూ అంగీకరించి, మ్యారేజికి ముందు ముఖ్యులైన బంధువులకు, స్నేహితులకు ఆ విషయం తెలియచేయడానికా అన్నట్లు ఓ ఆదివారం సాయంత్రం, ఆదిత్య గృహంలో ఓ చిన్న పార్టీ అరేంజ్ చేశారు.

పార్టీకి అమూల్యని తయారు చేసి, తనూ తయారై ఆదిత్యకోసం నిరీక్షిస్తూ వరండాలో నిల్చుంది రుక్మిణి. కారు హారన్ వినిపించగానే "అంకుల్.. అంకుల్" అంటూ బయటకు పరుగెత్తింది అమూల్య. కారులోంచి దిగుతున్న అన్నయ్య శంకరాన్ని, వదిన వినీతను చూసి నివ్వెరపోయింది రుక్మిణి.

"అదేంటన్నయ్యా? ఆదిత్య రాలేదా" అంటున్న రుక్మిణితో, "రుక్కూ! ఈనాటి ప్రోగ్రామ్‌లో చిన్న డీవియేషన్. మీ వదిన అమూల్యకు తోడుగా ఇక్కడే ఉంటుంది. మనిద్దరం పార్టీకి వెళుతున్నాం" అంటున్న శంకరం మాటల్లో ధ్వనించిన తొట్రుపాటు గమనించి కళవళపడిపోయింది రుక్మిణి.

"ఏం! ఏమైంది? ఏమైంది ఆదిత్యకి. ఆదిత్య అంకుల్ వస్తారంటూ ఉదయం నుండి కలవరిస్తోంది అమూల్య. అయినా, అమూల్యను ఇక్కడ ఉంచేసి ఫంక్షన్‌కు వెళ్ళడం ఏంటి?"

"అమూల్యను చూపించి, అక్కడ అందరూ 'ఎవరూ, ఎవరూ' అని ప్రశ్నిస్తే బాగుండదేమో అన్న సంశయంతో ఆదిత్య...." నసిగాడు శంకరం.

తనే వచ్చి తీసికెళతానన్న ఆదిత్య రాకపోవడంలోని పలాయనత్వం అర్థమవసాగింది రుక్మిణికి.

"అన్నయ్యా! నువ్వు ముందీ సంగతి చెప్పు. 'అమూల్య ఎవరు' అని అక్కడ అడిగేది ఎవరు? ఆదిత్య దగ్గరగానీ, కస్తూరి ఆంటీ దగ్గర కానీ ఎన్నడూ నేనీ విషయం దాచిపెట్టలేదే!"

"వాళ్ళకన్నీ తెలుసునమ్మా! కానీ, వచ్చిన చుట్టాలందరి దగ్గర ఈ విషయం, మరీ అంత బహిరంగంగా చెప్పడం ఏం బాగుంటుంది చెప్పు. నమ్మిన వాళ్ళు నమ్మి, నమ్మనివాళ్ళు నమ్మక గుసగుసలాడడం..."

"ఓహో. ఇదా వాళ్ళ సంశయం. వాళ్ళ అసలు రంగేమిటో ఇంత తొందరగా బయటపడడం ఒకందుకు మంచిదయింది."

"రుక్కూ, లోకులు పలుకాకులమ్మా!"

"అన్నయ్యా, లోకుల సంగతి నాకనవసరం. ఇప్పుడు కాకులెవరో తెల్సా అన్నయ్యా! ఆదిత్య, వాళ్ళ అమ్మగారు ఇన్ని రోజులు నాతో కలిసి తిరుగుతూ నన్ను అర్థం చేసుకున్నారని అనుకన్నాను. కానీ, నన్నిలా ఇన్‌సల్ట్ చేస్తారని అనుకోలేదు."

"అది కాదమ్మా! నువ్వు కొంచెం స్థిమితంగా ఆలోచించు. ఈరోజు ఒక్క రోజు వాళ్ళ ఇష్టప్రకారం కానీ. ఈ ఏర్పాటు వాళ్ళ బంధువుల పుల్లవిరుపు మాటలకు భయపడే..."

"అన్నయ్యా, పిచ్చి అన్నయ్యా! బంధువులకు సంఘానికి భయపడి ఎక్కడో దూరంగా ఉంచమంటారా నా అమూల్యని. పొద్దుట నుండి సరదాపడుతున్న ఆ చిన్న మనసు ఎంత గాయపడుతుందో నువ్వేమైనా ఊహించావా? ఇంతకీ తన కూతురు సమీరని ఎక్కడ దాచిపెడతాడట ఆదిత్య?" కోపంగా అంది రుక్మిణి.

శంకరానికి భయం వేసింది చెల్లెలి కోపం చూసి.

"రుక్కూ, ప్లీజ్ నువ్విలా అపార్థం చేసుకోకు. అందరికీ ఆదిత్యలాగా, కస్తూరి ఆంటీలాగా విశాల భావాలు ఉండవుకదమ్మా!"

"ఎక్స్‌క్యూజ్ మీ అన్నయ్యా! అమూల్యని దాచేసి నేను పెళ్ళిచేసుకోవడం అంటూ జరగదు. పెళ్ళికాని తల్లిగా నన్ను సంఘం యాక్సెప్ట్ చేయకపోయినా నేను బాధపడను. యాక్సెప్ట్ చేసి సన్మానం చేయాలని నేనేమీ ఆశించడం లేదు కూడా! ఆదిత్యని వివాహమాడడంలో నా ప్రధాన ఉద్దేశం నాకు భర్తే కాక అమూల్యకు తండ్రిని కూడా ఇవ్వడమే. ఆ లక్ష్యమిప్పుడు నెరవేరనప్పుడు ఈ వివాహం అర్థరహితమే అవుతుంది."

"రుక్కూ! అంత తొందరగా నిర్ణయానికి వచ్చేయకమ్మా! ఆదిత్య అటువంటివాడు కాదనే నేననుకుంటున్నాను. ఏదో బంధువులకు జడిసి..."

"అన్నయ్యా! ఆదిత్యనింక నిర్భయంగా ఉండమని చెప్పు. ఆదిలోనే హంసపాదు అన్నట్లు మొదలే సంశయాలతో ప్రారంభం కానున్న ఈనాటి ఈ చిన్న సమావేశం ఉత్తరోత్తరా ఏ ఘోర పరిణామాలకు దారి తీస్తుందో ఊహించుకోలేకపోతున్నాను!

మాతృత్వపు మమకారపు తీపిని అనుభవించాలన్న కోర్కెతో అనాధ అయిన ఈ అమాయక ప్రాణిని తెచ్చి ప్రాణానికి ప్రాణంగా పెంచుతున్నాను. అది ఈ ఒంటరి తల్లి చేతుల్లో హాయిగా పెరిగి పెద్దదవుతుంది. సంకుచిత భావాలు గల ఓ మగాణ్ణి పెళ్ళి చేసుకొని మళ్ళీ దాన్ని ఓ అనాథని చేయడం అవివేకం, అమానుషం. ఒంటరి జీవితం కూడా ఓ విధంగా పోరాటమే అన్నయ్యా! అది నాకు నచ్చిన, నేను ఎన్నుకున్న పోరాటం. నన్నిలాగే సాగిపోనీ..." అంటూ అమూల్య చెంతకు నడిచింది రుక్మిణి.

"అమూల్యా, మన ప్రోగ్రాం కాన్సెల్ అయింది. పద, గ్యారేజి నుండి కారు తెస్తాను. ఇద్దరం ఇందిరా పార్క్‌కెళ్ళి ఈ సాయంత్రం స్పెండ్‌చేద్దాం" అంటూ శంకరానికేసి దృఢంగా చూసింది రుక్మిణి.



***(ఇండియా టుడే 9 మార్చి 1999)***

# అమ్మ వ్యక్తిత్వ

"అమ్మా, మీ అల్లుడుగారు ఉత్తరం రాశారు 'రేఖ పరీక్షల టైమ్‌కైనా వైజాగ్ రావడానికి ట్రై చెయ్యి' అంటూ. నేను వచ్చి కూడా అప్పుడే రెండు నెలలు అయింది కదా !"

కూతురు మనోరమ మాటలకు అడ్డొస్తూ, "అదేంటమ్మా, నిన్ను మీ ఇంటికి వెళ్ళవద్దని ఎలా శాసిస్తాను ? నువ్విన్నాళ్ళు ఇక్కడ ఉండడమే ఎక్కువ. పాపం, సురేష్ ఎన్నాళ్ళు పిల్లలతో అవస్థపడతాడు" అంది విమల.

"ఓకే మమ్మీ. నేను మా ఊరు వెళ్ళిపోతాను. నువ్వు ఒక్కదానివి ఇంత పెద్ద ఇంట్లో ఎలా ఉంటావ్ ? నాతో మా ఊరు వస్తే నీకు పోయేదేమిటి మమ్మీ ?"

"రమా, నువ్వు మీ ఊరు రమ్మంటూ నన్నడగడం, రమ్మన్న ప్రతిమారూ నేను రాలేనంటూ చెప్పడం ఏం బాగుంటుంది చెప్పు! ఈ ఇంటిని విడిచి నేనెక్కడికీ రాను, రాలేను. మీ నాన్నగారు పోయారని మీరందరూ అంటున్నా నాకెందుకో ఆయన ఇక్కడే తిరుగాడుతున్నట్లు ఉంటుంది.

ఆయన స్మృతులు నన్నింకా వెంటాడుతూనే ఉన్నాయి ....” మాటలు రానిదై మౌనముద్ర దాల్చింది విమల.

గాఢంగా నిట్టూర్చింది మనోరమ.

అమ్మ మౌఢ్యం అర్థం కాదు.

ఆరోగ్యం దెబ్బతిని, అరవై ఏళ్ళు పైబడ్డ ఈ చరమ దశలో ఎందుకీవిడ ఏకాకిగా ఇక్కడే ‘ఉండిపోతా’నంటోందో మనోరమకు అంతుచిక్కడం లేదు.

అన్నయ్యల గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది.

పెద్దన్నయ్య వినోద్ అమెరికా నుండి నాన్న చనిపోయిన పదవ రోజుకు రానీ రాలేకపోయాడు.

చిన్నన్నయ్య ప్రమోద్ రావడం అయితే వచ్చాడు కానీ, ‘నా భార్య నిండు గర్భిణి’ అంటూ ఉన్న పది రోజులూ ఆవిడ సేవలకే పరిమితం అయ్యాడు.

అమ్మకి కొంతకి కొంత సాంత్వన కలిగించింది తానూ, తన భర్త సురేష్, తన పిల్లలు ప్రణవ్, సురేఖలే.

‘ఎలాగూ అమ్మ తనతో రాదు’ అన్నట్లు బిహేవ్ చేసి, వచ్చిన వారానికే అమెరికా చెక్కేశాడు వినోద్.

‘లక్నోలో ఎముకలు కొరికే చలి. అంత చలి అమ్మ భరించలేదు ....’ అంటూ ప్రమోద్ ఇచ్చిన వాతావరణ సూచనకి అమ్మకు చీకాకు వేసి, ‘ఒరేయ్, నువ్వు బెంగెట్టుకోకురా. నేను రాను కాక రాను మీ లక్నోకి. అయినా, ఇక్కడ నాకు అలవాటైన డాక్టరుండగా అక్కడికి వచ్చి అవస్థ పడడమెందుకు’ అంటూ కొట్టిపడేసింది.

‘సరే, నీ ఇష్టం. ఒక్కదానివి ఎలా ఉంటావిక్కడ ? నలుగురూ ఏమనుకుంటారు? నీ ఆరోగ్యం గురించి మాకు బెంగ ఉండదా ? ఈ ఊర్లో మా స్నేహితుడొకడు ఒక మంచి ఓల్డ్ ఏజ్ హోమ్ నిర్వహిస్తున్నాడు. అందులో చేరిపో. అన్ని సౌకర్యాలూ ఉంటాయి. మాకూ నిశ్చింతగా ఉంటుంది’ అంటూ ప్రమోద్ ప్రపోజల్ ఇచ్చినప్పుడు మాత్రం చెప్పరాని కోపం వచ్చింది అమ్మకు.

తెగేసి చెప్పింది అమ్మ, తాను ‘ఇల్లు వదిలి ఏ వృద్ధాశ్రమాలకూ వెళ్ళను’ అంటూ.

తానున్నది వైజాగ్‌లోనే కదా, తన దగ్గరికి రావచ్చు అమ్మ. అమ్మంటే ఎంతో గౌరవమిచ్చే తన భర్త సురేష్ ఎంతో సంతోషిస్తాడు. ప్చ్ ..... కొందర్ని ఈ జన్మలో మార్చలేం.

‘నాకీ ఇల్లూ, పరిసరాలు అలవాటయ్యాయి. నేను ఈ ఊరు వదిలి ఎక్కడికీ రాలేను. నన్ను బలవంతపెట్టకండి ప్లీజ్’ అంటూ పదేపదే చెబుతున్న అమ్మను ఒప్పించి వైజాగ్‌కి తరలించడం ఎలాగో అర్థం గాక లేచి వెళుతున్న కూతుర్ని సమీపించింది విమల.

"రమా, నువ్వొస్తున్నట్లు సురేష్‌కి వెంటనే ఉత్తరం రాయి. విశ్వానికి చెప్పి టికెట్ రిజర్వ్ చేయించుకో. నన్ను గురించి దిగులు పెట్టుకోకు. నాకేం కాదు. నేను చెప్పానుగా పి.జిలు కావాలంటూ పేపరులో ప్రకటన ఇప్పించానని. ఇవ్వాళో, రేపో ఎవరో ఒకరు రాకపోరు. నాకు నచ్చిన వాళ్ళని సెలెక్ట్ చేసుకుంటాను."

"ఎందుకమ్మా నీకీ వయసులో పేయింగ్ గెస్టులు ?"

"ఆగు రమా. ఏదో నా వెసులుబాటు కోసం పేయింగ్ గెస్టుల్ని తీసుకుంటున్నా ననుకుంటున్నావా ? ఊహూఁ. నా కాలక్షేపం కోసం, నా తోడు కోసం, నా భద్రత కోసం నేనీ నిర్ణయానికొచ్చాను. 'మూడు పడగ్గదుల ఫ్లాట్ - అబ్బాయిలకిద్దరికీ రెండు, మనకొకటి' అంటూ మురిసిపోయి ఈ త్రీ బెడ్ రూమ్ ఫ్లాట్ కొన్నారా రోజు మీ నాన్నగారు. చూశావామ్మా, ఇప్పుడీ అదనపు పడగ్గదులు రెండూ ఈ విధంగా నాకు ఉపయోగపడబోతున్నాయి."

"పేయింగ్ గెస్టులంటే మాటలనుకుంటున్నావా ? ఆ వచ్చే వాళ్ళకి అన్ని సౌకర్యాలూ కలిగించాలి. బ్రేక్‌ఫాస్ట్, లంచ్, డిన్నర్ అంటూ డిమాండ్ చేస్తారు. అపవేళా, అర్ధరాత్రి ఎవరెవర్నో తీసుకొస్తారు. ఎందుకమ్మా తలనొప్పి కొనితెచ్చుకుంటావ్ ?"

"ఎవరినంటే వాళ్ళని ఎందుకు చేర్చుకుంటాను ? వాళ్ళ పూర్వాపరాలన్నీ తెలుసుకునే ఎన్నుకుంటాను. పాతికేళ్ళుగా పనిచేస్తున్న జయమ్మ తన కోడలు కాంతాన్ని వంటకి పెడతానంది. జయమ్మ కొడుకు విశ్వం ఎలాగూ ఉండనే ఉన్నాడు. 'అయ్యగారు ఆనాడు నాలుగు ముక్కలు నేర్పించి బళ్ళో వేసి చదివించిన ఫలితంగానే నాకీ అటెండర్ ఉద్యోగం వచ్చింది అమ్మగారూ. ఇదంతా అయ్యగారి చలవే' అంటూ నమ్మిన బంటులా ఇంటి చుట్టూ తిరుగుతూ ఉంటాడు. నీకు తెల్సుగా, మీ నాన్న మంచాన పడినప్పుడు అన్నీ వాడేగా చేసేవాడు అహోరాత్రులూ ......"

"అది నిజమే అనుకో ......"

"అమ్మాయ్, నువ్వింకేమీ ఆలోచించకు. నీ ప్రయాణం ఏర్పాట్లు చేసుకో. అదో, ఫోను మోగుతోంది. అల్లుడుగారు కాబోలు. త్వరగా వైజాగ్ వస్తున్నానని చెప్పు." ప్రసంగాన్ని అక్కడితో ఆపేసిందీ విమల.

అమ్మని చూసి అప్పుడే ఆరు నెలలయింది. ఆమె దగ్గరికి అదో వెళ్దాం, ఇదో వెళ్దాం అనుకుంటూనే ఇంతకాలం గడిచిపోయింది. టెలిఫోన్ సౌకర్యం ఉండబట్టి సరిపోయింది. లేకుంటే తానిన్నాళ్ళు అమ్మ దగ్గరికి వెళ్ళకుండా ఉండేదా ?

వేసవి సెలవుల్లో ఏకంగా పిల్లలతో వద్దామనుకుంది. కానీ, అన్నయ్య ప్రమోద్ ఘాటుగా ఉత్తరం రాయడంతో ఇలా బయలుదేరింది ఉన్నట్లుండి.

అయినా, అమ్మ ఎందుకిలా చేసిందో ! మనోరమ ఆలోచనలు ఆటోతో పోటీ పడి పరుగులు వేస్తున్నాయి.

ఆటో దిగిన మనోరమను చూచి, పరుగెత్తుకుంటూ వచ్చిన వాచ్‌మన్ చేతికి సూట్‌కేసు అందించి లిఫ్ట్‌కేసి నడిచింది మనోరమ.

బజర్ నొక్కగానే తలుపు తెరిచిన విమల, "రా రమా, ఇప్పుడే రైల్వేస్టేషన్‌కి ఫోన్ చేశాను. ట్రెయిన్ కరెక్ట్ టైమ్‌కే వచ్చిందన్నారు. అల్లుడుగారూ, పిల్లలూ బాగున్నారు కదా !" ఆప్యాయంగా పలకరించింది కూతుర్ని.

నవ్వుతూ అడుగుపెట్టిన మనోరమకి ఆ ఇంటి వాతావరణమంతా ఏంటో కొత్తకొత్తగా, ఎవరింటికో వచ్చినట్లు అనిపించింది.

కుర్చీలు, సోఫాలు కొత్తని చోటుచేసుకున్నాయి. విమలతోపాటు లోపలికి వెళుతున్న మనోరమ పక్క బెడ్‌రూమ్‌లో నుంచి బయటకు వస్తున్న పెద్దావిడని చూసి ఆగిపోయింది.

"అదేమిటి రమా, ఎవర్నో కొత్తవాళ్ళని చూసినట్లు చూస్తున్నావ్. ముంతాజ్ ఆంటీ కదూ. చిన్నప్పటి నా బెస్ట్ ఫ్రెండ్ అండ్ క్లాస్‌మేట్. మనం ఆగ్రా వెళ్ళినప్పుడు ఈ ఆంటీ వాళ్ళింటికి వెళ్ళాం గుర్తు లేదా ?"

"ఔనౌను ... గుర్తుకొస్తున్నారు .... ఎలా ఉన్నారు ఆంటీ ?" మొక్కుబడిగా, ముక్తసరిగా పలకరించి లోనికి నడిచింది మనోరమ.

డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని కాఫీ తాగుతున్న కూతురు [illegible] [illegible]ంది విమల.

"రమా, నువ్వు కాఫీ తాగాక స్నానం ముగించేయ్. నేను దేవు[illegible] [illegible]పం పెట్టుకొని వస్తాను. తర్వాత తీరుబడిగా కబుర్లు చెప్పుకుందాం. అయినా అమ్మాయ్, [illegible] దా[illegible] పిల్లల్ని కూడా తీసుకురావచ్చుగా. అదేమంటే, పరీక్షలంటావ్." నవ్వుతూ పూజగది కేసి నడిచింది విమల.

కొంతం వంట చేసి వెళ్ళాక కబుర్లకి కూర్చున్నారు తల్లీకూతుళ్ళు.

"అమ్మా, నాకు తెలీక అడుగుతాను - నువ్వు చేస్తున్న ఈ పని ఏమైనా బాగుందా చెప్పు" అంది మనోరమ ఉరుము లేని పిడుగులా.

"ఏ పని రమా నువ్వనేది ?"

"అదే నీ పేయింగ్ గెస్టుల గురించే. నువ్వా మధ్య ప్రస్తావిస్తే మన ఆచార సంప్రదాయాలకీ, మన అలవాట్లకీ, పద్ధతులకీ సరిపడేవాళ్ళని తీసుకుంటావనుకున్నాను. కానీ, ఇలా .... నీ కన్నా పెద్దవాళ్ళని - అన్నట్లు మరో పేయింగ్ గెస్ట్ ఎవరన్నావ్ - ఎలిజబెత్ ఆంటీ. ఆవిడే పబ్లిక్ స్కూల్లో నీ కొలీగ్, వైస్ ప్రిన్సిపాల్‌గా పనిచేసి రిటైర్ అయ్యారే. ఆ ఆంటీయే కదూ. ప్రమోద్ అన్నయ్య ఎంతో నొచ్చుకుంటూ రాశాడు - మన ఇల్లు నానా జాతి సమితి అయిందంటూ. వాళ్ళ అత్తగారు

నిన్ను చూడ్డానికని వస్తే ముంతాజ్ ఆంటీ నమాజ్ చేసుకుంటూ, ఎలిజబెత్ ఆంటీ బైబిల్ చదువుకుంటూ దర్శనమిచ్చారట."

"రమా, ఇక ఆపు. ఏమిటా వెటకారం ? వాడు రాయడం, నువ్వు నన్ను సంజాయిషీ అడగడం. బాగుంది. అయినా, నువ్వు నన్ను చూసిపోదామని వచ్చావా, దండించి పోదామని వచ్చావా ? వాడు, నీకే కాదు, నాకూ రాశాడు పెద్ద ఉత్తరం. చూడమ్మా, మీకెవరికీ సమాధానాలు, వివరణలు ఇచ్చుకోవలసిన అవసరం నాకు లేదు." కోపంగా అంది విమల.

"అది కాదమ్మా

"ఏది కాదు ? అమెరికాలో ఉన్న వినోద్‌కి ఈ అమ్మని గురించిన ఆలోచన కానీ, అవసరం కానీ ఏనాడూ రాలేదు. మన దేశంలోనే ఉంటున్న ప్రమోద్ - విన్నావుగా ఆనాడు వాడేమన్నాడో - ఓల్డ్ ఏజ్ హోమ్‌లో చేరిపొమ్మని ఓ ఉచిత సలహా పడేశాడు. కాదన్నందుకు 'గుడ్ రిడన్స్' అన్నట్లు చేతులు దులిపేసుకున్నాడు. ఎంతయినా ఆడపిల్లని - నీ దగ్గరికి రమ్మంటూ బతిమాలావు, బామాలావు. కన్న పిల్లల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి జీవించకూడదనే ఈ పేయింగ్ గెస్టులను చేర్చుకునేందుకు నిర్ణయం తీసుకున్నాను. ముంతాజ్‌ని, ఎలిజబెత్‌ని నేనేమీ కావాలని ఎంపిక చేసుకోలేదు. అదలా కాకతాళీయంగా జరిగిపోయింది. పిల్లలు ఇద్దరున్నా, ముగ్గురున్నా వృద్ధాప్యంలో భార్యాభర్తలలో ఏ ఒక్కరు ముందుగా మరణించినా మిగిలినవారు ఏకాకిగా మిగిలిపోవడం అన్నది సర్వసాధారణం అయిపోతున్న ఈ రోజుల్లో, ఆ ఒంటరి జీవితాలకు పిల్లల నిరాదరణ కూడా తోడైతే ఇక అంతకన్నా దురదృష్టమేముంటుంది చెప్పు."

"అలా అని ఎందుకనుకుంటావమ్మా ......"

"చూడు రమా, మధ్యలో నన్నాపకు. నేను మిమ్మల్ని తప్పు పట్టడం లేదు. ఎవరి జీవిత సరళి వాళ్ళే నిర్ణయించుకొని తమకు అనుగుణమైన రీతిలో నడవడం ఈనాటి సామాజిక న్యాయం. నలుగురు కొడుకులుండీ తానో వృద్ధాశ్రమంలో చేరిపోతున్నట్లు ముంతాజ్ చెప్పగా విని ఆశ్చర్యపోయాను. ఎలిజబెత్ పరిస్థితి కూడా ఏమంత భిన్నంగా లేదు. కంప్యూటర్ ఉద్యోగాల మాయాజాలంలో కన్నకొడుకులిద్దరూ డాలర్ల కోసం పరుగులు తీసి క్యాలిఫోర్నియా వెళ్ళిపోతే, ఆ పరుగు పందెంలో వెనుకబడి, ఒంటరిదై, తోడు, ఆదరణ, ఓదార్పు కోసం తపించిపోతూ, ఓ రోజు నన్ను కలిసింది.

వాళ్ళిద్దర్నీ చూసి, వాళ్ళ బాధలను అర్థం చేసుకొని, అభ్యంతరం లేకపోతే పేయింగ్ గెస్టులుగా ఈ లోగిలిలోకి రమ్మంటూ వాళ్ళని ఆహ్వానించాను. ఆనాడు నువ్విచ్చిన సలహా నా మెదడులో మెదలుతూనే ఉంది. ముక్కూ మొహం తెలియనివాళ్ళని చేర్చుకొని అవస్థపడేకన్నా నాకిదే మేలనిపించింది. మేమంతా దాదాపు సమ వయస్కులం. స్నేహితులం. ఒకరి కష్టసుఖాలు మరొకరు అర్థం చేసుకొని పంచుకొనే పరిణతికి ఎదిగినవాళ్ళం ..."

"బాగానే ఉంది కానమ్మా, నువ్వు చేస్తున్న పనికి మన బంధువులు ఏమనుకుంటున్నారో ఆలోచించావా ?"

"రమా, నువ్వేనా ఇలా మాట్లాడేది. నీ మాటలు నన్ను ఆశ్చర్యపరచడమే కాదు, బాధను కూడా కలిగిస్తున్నాయి. నాకన్నా ముప్పై ఏళ్ళు చిన్నదానివి. 'మేరా భారత్ మహాన్' అనే నాట్యరూపకంలో మతసామరస్యాన్ని గురించి ఎలుగెత్తి చాటిన దానివి. 'మనదంతా వసుధైక కుటుంబం' అంటూ కాలేజీలో ఉపన్యాసం దంచి బహుమతి గెలుచుకున్న దానివి. చూడమ్మా, నేనేదో సమైక్యత, సంఘోద్ధరణ అంటూ ఈ పనికి పూనుకోలేదు. ఒకే బాటలో పయనిస్తున్న ఒంటరి బాటసారులం మేం. ఏదో వయోవృద్ధుల గృహంలో చేరి మాకున్న కొద్దిపాటి ఉనికిని కోల్పోయి బతకడం ఇష్టం లేని ఆత్మాభిమానం కలవాళ్ళం. స్వతంత్రంగానే అయినా ఒకరికొకరం అండగా బతకడానికి నిశ్చయించుకున్నవాళ్ళం.

మహానుభావుడు మీ నాన్న. ఈ ఇంటిని నా పేర రాసి నాకింత స్వేచ్ఛను ప్రసాదించారు.

లేకుంటే పరిస్థితి ఎలా ఉండేదో. రమా, నా బతుకును నన్నిలా కడతేర్చనీ.

ఎప్పుడైనా చూడాలనిపిస్తే తప్పకుండా రా. ప్రమోద్‌తో కూడా అదే చెప్పు.

మీరు నా పిల్లలు. నన్ను చూడ్డానికి మీకు అనుమతి అవసరం లేదు. మీకై ఈ ఇంటి తలుపులు తెరిచే ఉంచుతాను. అంతేకానీ, నా జీవితాన్ని, నా జీవనశైలిని శాసించే హక్కు మాత్రం మీకు లేదు."

ఎంతో స్థిరంగా మాట్లాడుతున్న తల్లికేసి విస్తుపోయి చూస్తూ ఉండిపోయింది మనోరమ. కాసేపు మౌనం వహించిన మనోరమ ఏమనుకుందో, "సరేమ్మా. ఇప్పటికీ పద్ధతి బాగానే ఉన్నట్లు అనిపిస్తోంది. ఇంకా వయసు పైబడి, కాళ్ళూ చేతులు ఆడక వేరొకరి మీద ఆధారపడే పరిస్థితి అంటూ వస్తే ....." అర్ధోక్తిగా ఆపేసింది.

"ఓహో, అదా నీ అనుమానం. చూడు రమా, మనం ఎప్పుడో నిస్సహాయులమవుతామని ఇప్పటి నుండి పరాయివాళ్ళ మీద ఆధారపడి బతకడం నాకిష్టం లేదు. రాబోయే రోజులను గురించి నేను ఆలోచించను. ముగ్గురు స్నేహితులం - అందరం ఒకేమారు కట్టకట్టుకొని మంచాన పడ్తామని నేననుకోవడం లేదు. ఒకవేళ ఆ పరిస్థితి వస్తే బోలెడన్ని నర్సింగ్‌హోమ్‌లు, ఓల్డేజ్ హోమ్‌లు ఉన్నాయి చూసుకోవడానికి."

"ఛ....ఛ.... ఏంటమ్మా, నువ్వు మరీ విడ్డూరంగా మాట్లాడుతున్నావు. ముగ్గురు బిడ్డల తల్లివై ఉండి అనాథలా ఎందుకాలోచిస్తున్నావ్ ?" కినుకగా అంది మనోరమ.

"లేదు. నేను ప్రాక్టికల్‌గానే ఆలోచిస్తున్నాను. ఈనాటి ఈ నవసమాజంలో ఏ ఒక్కరూ ఏ ఒక్కరి కోసమో బతుకుతాడనో, బతుకుతుందనో, బతకాలనో భావిస్తే అది అవివేకమే కాదు, వెర్రితనం కూడా. మన జీవితాలు పూర్తిగా మనవే. వాటిని నిర్దేశించుకోవడంలో మనకు ఏది

ఆనందాన్ని, సంతృప్తిని కలిగిస్తుందో దాన్ని ఆచరించడంలో తప్పు లేదు. అందునా వేరే వాళ్ళకి కష్టం కలిగించకుండా జీవించడం కూడా ఎంతో అవసరం."

నిర్దిష్టంగా, దృఢంగా తెగేసి మాట్లాడుతున్న తల్లికేమని సమాధానం చెప్పాలో స్ఫురించక మ్రాన్పడిపోయింది మనోరమ.

మొదటి నుంచి అమ్మ పంథా అమ్మదే. తనకేది ధర్మమని తోస్తే అది ఎంత కష్టమైన పనైనా అక్షరాలా చేసి తీరేది అమ్మ.

అమ్మ తీసుకొన్న నిర్ణయంలో తప్పేమిటో తెలుసుకోలేకపోయిన మనోరమ తల్లి వద్ద కొద్ది రోజులు గడిపి కొంత అసంతృప్తితో వైజాగ్ వెళ్ళిపోయింది.

అలా పేయింగ్ గెస్టులంటూ తన స్నేహితురాండ్రని తన చల్లని లోగిలిలోకి చేర్చుకొని శాంతియుత సహజీవనం చేస్తూ, క్రమేణా తన వ్యాపకాన్ని కొంత విస్తృత పరచుకుంది విమల.

అనాధాశ్రమంలోని పిల్లల బాగోగులు, వాళ్ళకి ఫీజులు, యూనిఫామ్‌లు, పుట్టినరోజులు అంటూ తన సంపాదన పరిధిలోనుంచి సహాయసహకారాలు అందించ సాగింది.

వృద్ధుల హోమ్‌లోని నిస్సహాయులైన పేదలకు బట్టలు, కళ్ళజోళ్ళు, పండుగలకు పబ్బాలకు స్వీట్సు పంచిపెడుతూ, అనాథలైన వృద్ధులను ఆదరంగా, ప్రేమగా పలకరిస్తూ వారితో చెలిమి చేస్తూ వారి అభిమాన అనురాగాలను చూరగొంది.

'అమ్మకు తమ అవసరం, ఆసరా ఏనాటికైనా కలగకుండా పోతుందా' అని ఎదురు చూసిన విమల సంతానానికి చివరకు నిరాశ మిగిలింది.

ఓనాటి రాత్రి ఉన్నట్లుండి చిన్నపాటి గుండె నొప్పితో అనాయాసంగా నిద్రలోనే ఈ లోకాన్ని ఎడిలివెళ్ళిపోయింది విమల.

ఫోన్ ద్వారా అమ్మ మరణవార్త విన్న కొడుకు ప్రమోద్, కూతురు మనోరమ హుటాహుటిన వచ్చారు అంత్యక్రియలకు.

విమల ఆఖరి కోర్కేమిటో విశ్వం చెప్పగా విన్న అన్నా, చెల్లెలు నిశ్చేష్టులయ్యారు.

"నీ కళ్ళని ఐ బ్యాంక్‌కి, నీ శరీరాన్ని స్థానిక మెడికల్ కాలేజీకి దానం చేసి మరణంలో కూడా నీ విశిష్ట వ్యక్తిత్వాన్ని నిలుపుకున్న స్థితప్రజ్ఞురాలివమ్మా నువ్వు" అంటూ అశ్రునయనాలతో అమ్మకు నివాళులర్పిస్తూ అమ్మ (అ)మృతదేహం చెంత నిలుచుండిపోయింది మనోరమ.

■

***(ఇండియా టుడే, 15-6-1999)***